శారదావహార్తికవి

# వసు చరిత్ర-ప్రబంధ దర్శనం

## పారదర్శక విమర్శ

కర్త : జొన్నవిత్తుల రామకృష్ణశర్మ



ప్రతులకు :

జొన్నవిత్తుల లక్ష్మీనరసమ్మగారు

తెలకోవెల ; బలుసుమూడి

భీమవరం _ 2

ప॥ గో॥ జిల్లా (ఆంధ్ర ప్రదేశ్)

# పుటదర్పణము

# వినతి

పరిశోధకపట్టా బిరుద సన్మానాల కయ్యే వ్యయప్రయాసలకు తట్టుకోలేనివాడి నైనా విషయజిజ్ఞాస వదులుకోలేక-ఏదో ఒంటబట్టకపోయినా కంటబట్టిన దిందులో నప్పినంతవరకు చెప్పాను. కావ్య విమర్శనలో ఒకసారి ఈదారికూడా ఎలాఉంటుందో చూడండి.

ఇందులో ఉటంకించిన గ్రంథాల, ఉపన్యాసాల కర్తలందరికీ నా కృతజ్ఞతాభి వందనాలు. వారి తెలివిగనులను లోతుగా తవ్వటానికి నాకు ఓపిక చాలలేను. పై పొరలు మాత్రమె కెలికి గిట్టించటంలో వికారాలేమైనా తోస్తె అవి నా వంకవేగాని ఆ మేధానిధుల కొరత కాకపోవచ్చు ననుకుంటున్నాను.

మిత్రులు శ్రీ రాయప్రోలు సూర్యనారాయణ శర్మగారు భారతంలో ఉన్న చిట్టిపొట్టి కతలకేమైనా విశేషార్థాలుంటే వినాలని ఉందన్నారోసారి. అలాగే శ్రీభారతం శ్రీమన్నారాయణగారు (సంస్కృత కళాశాల ప్రిన్సిపాలు) వసుచరిత్ర మీద మాట్లాడించాలని ఒకసారి చూసారు. ఈ రెండూ జరగలేదుగాని ఆ రెండింటికో సామరస్యం ఇలా బయటపడినది. వారిద్దరికీ కృతజ్ఞుణ్ణి.

నా సహచర మిత్రులు శ్రీ శివరామరాజుగారు, శ్రీ వెంకట్రాపురాజుగారు, శ్రీ సత్యనారాయణరాజుగారు శ్రీమతి నరసమ్మగారు, శ్రీమాన్ శేషాచార్యులుగారూ విషయవిచారణలతో చక్కని అభిప్రాయాలిచ్చి అభిమానం చూపించారు. ఆనందంతో కృతజ్ఞత లందించుకొంటున్నాను.

నాకు ఏ గ్రంథం కావాలన్నా ఒక్కొక్కప్పుడు చెయ్యిచేసికొని తానె వెదికి తీసియివ్వటమూ, కళాసాంస్కృతిక గ్రంథాలు తెప్పించటం జరిగితే పిల్చిమరీ తెలియ జెయ్యటం అంటే ఎంతటి ఉదారహృదయం ఉండాలండీ! మా గ్రంథాలయాధ్యక్షుడిది అలాంటి సహృదయం ఆ మా శ్రీ A.P.S.V V.S.N.L. నరసింహరాజుగారికి ఎంతో కృతజ్ఞుడిని.

ఇంక ముచ్చటగా పుస్తకం అచ్చువేసిన "శ్రీ జ్ఞానేశ్వరీ పవర్ ప్రెస్" అధినేత చి. దర్బా సర్వేశ్వరరావుగారికి కృతజ్ఞతతోపాటు ఆశీస్సునీ అందిస్తున్నాను. నా అశకత తెలిసి ప్రూఫులుదిద్దే భారం కూడా మీదవేసుకుని అతడు చూపిన శ్రద్ధ నేను మరచిపోలేను. ఈ ప్రయత్నమే అతనకీ నాకూకూడా ఆరంభం. ఇంకా మెరుగులు దిద్దుకోవాలంటే సహృదయుల ప్రోత్సాహం అవసరం. అందుకాహ్వానిస్తూ....

సెలవు

మార్గశిర శు. విదియ
శుక్రవారం
13-12-1985

జొన్నవిత్తుల రామకృష్ణశర్మ
తెలకోవెల : బలుసుమూడి : భీమవరం-2.

# ధన్యవాదాలు

శ్రీ జొన్నవిత్తుల రామకృష్ణశర్మగారూ నేనూ విశాఖపట్నం స్పాట్‌వాల్యుయేషన్ సెంటర్‌లో ఒకేబోర్డు ఎగ్జామినర్స్‌గా కలియటంవల్ల పరచయస్తులం అయ్యాము. ఆ స్వల్పకాలంలోనే మధ్య మధ్య ఆయన మన ప్రబంధాలమీద ప్రచారంలో ఉన్న పండితాభిప్రాయాలను సహేతుకంగానే త్రోసిరాజు అంటూండేవారు. నేనూ ఏదో వాదం పెట్టుకొని వారి అభిప్రాయాల నంగీకరిస్తూనే సరదాగా ఆయన్ని కౌంటర్ శర్మగారంటూండేవాణ్ని ఆయనా నవ్వుకొనేవారు. ఆ చనువుతోనే రెండు ముక్కలు వ్రాయమని నన్నడగటం నేనూ ధైర్యం చెయ్యటమూ దీనికి మూలం.

బ్రహ్మశ్రీ వజ్ఝల చినసీతారామస్వామి శాస్త్రులవారివంటి ఉద్దండపండితులు సైతం తమ 'వసుచరిత్ర విమర్శనము' 23వ పుటలో "ఇచ్చట నదీరూప శుక్తిమతిని పర్వతరూప కోలాహలుఁడు బలాత్కరించి యుపభోగించెనను నర్థమే ముఖ్యార్థము. ఈ యర్థమున నశ్లీలమంతగాఁ గానరాదు." అన్నారు. విమర్శకులంతా ఆ విషయాన్నే గొంతెత్తి చాటారు. ఇంతెందుకు! ప్రబంధం ద్వితీయాశ్వాసం 140వ వచనంలో మంజువాణి మాటగా "కందర్పబలసంబాధ బాధావధీరణంబునుంగాగ.... ....పెద్దయుం బ్రొద్దు నిరోధించు" అనీ 141వ పద్యంలో స్వయంగా శుక్తిమతి వాక్కు "ఈ తరవేల ప్రోవరావే వసుధాప" అన్నది "అంచు నెలుగెత్తి వెసన్ మొఱవెట్టు చాడ్పునన్ శైవలినీ రవంబెసఁగె" అనీ చెప్పించాఁడుగా రామరాజభూషణుడు!

దాన్ని రామకృష్ణశర్మగారు "వారిద్దరూ ఒకరికొకరు మనసిచ్చి పుచ్చుకొన్న ప్రణయమూర్తులె" అనీ "భూమిధరేశ్వరోదమునఁ బొంగు నభంగ సరిజ్ఝరంబు"ను చూపించి "భంగపడని శుక్తిమతి పొంగిపోయింది. అంతవరకు సాగిన ప్రణయభావ క్రమపరిణామ చిత్రణం అంతా" అని వివరించింది చూస్తే శుక్తిమతి మొఱవెట్టిన చాడ్పులోని కిటుకు వెల్లడి ఔతుంది. కోలాహలుడు "ఏలు నన్నని సతి కమలాలి పట్టి ప్రబలతర దీర్ఘభుజశాఖఁబట్టు"ట సహజలజ్జావతియైన ప్రియురాలిని అక్కున జేర్చుకోటమేగాని బలవంతం జెయ్యటం కాదనే అనిపిస్తుంది. ఆమె వారించటం అతడు ఉత్సహించటం ఓ ముఖ్య ప్రణయఘట్టంగదా!

గిరికా వివాహానంతరం వసురాజు శయనమందిరంలో ఆ నవవధువుకూడా "తొగచుట్టపుఱామొగరంబు మాటుగా నచ్చపలాక్షి నిల్వ" వసురాజు ఉత్సహించి "రమణుండు దివియ" ఆ ప్రియురాలు "అహార్యతనయ విధుమణిస్తంభమున నర వెడలి బయలుపడి పెనఁగుచు మరలి కంబ మొక కేల నూని యూతయుఁ దక్క" పడినపాట్లు లెక్కించీ, అలాగే వసురాజు "రాజకర లీలాలంబ సంచారమున్"గా మన్మథుడాశించిన సంచారంలో "నరపతికెంగేల నచలకన్యకా త్రపాఘుర గూఢాంగములు దడవె నొయ్య" అనటం పరికించీ జరిగిందంతా బలవంతపు బ్రాహ్మణార్థం అనుకోవచ్చా! అలా అనుకోక అది సరసం అనిపించటానికి మూలం ఏమిటి? వీరు పెద్దల ఆశీర్వాదంతో దంపతులయ్యారనే దేకదా! అటువంటిది లేనంతమాత్రాన శుక్తిమతీ కోలాహలుల ప్రణయం విరసంకావాలా!

యోచిస్తే శుక్తిమతికిగల సంప్రదాయపరమైన ధార్మికాసక్తిని ప్రతిఫలింప జేయటమే మంజువాణి కథనంలో "వెసన్ మొఱవెట్టు చాడ్పునన్ శైవలినీరవం బెసఁగె" అనిపించటంలో రామరాజభూషణుని అభిప్రాయమై ఉంటుంది. పేరెత్తి "వసుభూప" అనిపించటంలో వసురాజుయొక్క ధర్మరక్షణాదీక్ష - తత్ప్రఖ్యాతిని ధ్వనింపజేయటమూ అనిపిస్తుంది. సహృదయులు గమనింపగలరు. ఇలా ఎన్నో రీతుల రామరాజభూషణకవి హృదయాన్నావిష్కరిస్తూ "వసుచరిత్ర-ప్రబంధదర్శనం" చేయించిన శ్రీ రామకృష్ణశర్మగారికి ఒక సాహిత్యాభిమానిగా నా ధన్యవాదాలు.

శ్రీమతి కె. వి. నరసమ్మ
డా. ఎస్. ఆ. కె. ప్రభుత్వ ఆర్ట్సు కళాశాల
యానాం-533 464.

# ప్రత్యేకత

"వసుచరిత్ర-ప్రబంధ దర్శనం" మనముందుంచినవారు శ్రీ జొన్నవిత్తుల రామకృష్ణశర్మగారు. ఆయన దొక విలక్షణమైన పద్ధతి. మాకుండే చనువుకొద్దీ చెప్తున్నాను ఎలాంటివారికైనా కొంచెం ఎడంగా మసిలే స్వభావం ఆయనది. భారతీయ సంస్కృతి అంటే నిర్మాణాత్మక కృషి లేకపోయినా భావం ఉన్నా చాలు. అలాంటి వాళ్ళని హత్తుకుపోతారు. ఆ విషయం ఈ గ్రంథం చదివితే మీకేతెలుస్తుంది.

'వసు' శబ్దం వినేటప్పటికి హిరణ్యగర్భభావం కలగటం దాన్తో సూర్యపరంగా శ్లేషాత్మకకల్పనం ఉంటుందని చాలామంది పండితు లా క్రమాన్వయం చూపిస్తుంటారు. అదీ కుదురుతుంది. ఇంక సామాన్య సాహిత్య పాఠక్రమంలో పండితమార్గం అలంకారాలూ, అష్టాదశ వర్ణనలూ (వాటి సంఖ్య ఇరవైరెండూకూడా చేసారు) శ్లేష భేదాలూ, సమాసకల్పనలూ, భాషావిశేషాలూ, సామెతలూ, లోకోక్తులు వంటివి నిరూపించి చూపించటం ఉంది. సుప్రసిద్ధ పండితకవి శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారి "వసుచరిత్రలోని కబ్బపు తెలుఁగు" వ్యాసంలో ఈ మాట గమనించండి. "అసలు ప్రబంధ మనినంతనే వర్ణనాప్రధానమైనది. ఇందులో నిన్ని వర్ణనలుండి తీరవలయునన్న నిబంధనమున్నది. ఆధునికు లీవిషయమును మఱచిపోయి కథ, కథచెప్పెడి తీరు పాత్రపోషణము, కవికాలమునందలి విషయముల కీగ్రంథ మెంత వఱకు ప్రతిబింబము, ఈ గ్రంథము మనకు జేసెడి హితోపదేశమేమి? మొదలైన బహువిషయములను తెచ్చి ఎంతెంతటి పూర్వకవులను 'టుప్' మని ఎగరగొట్టుచున్నారు."

అటు పండితుల ముడిసరకుల మూటాకాకుండా ఇటు ఆధునికుల తత్కాల సాంఘికార్థిక రాజకీయమత స్థితిగతుల కుప్పకాకుండా భారతీయ శాశ్వతసంస్కృతి అన్న మేరువును చిన్న ప్రబంధపుటద్దంలో పట్టి చూపటంలోని కవి ప్రతిభని గుర్తింపజేయటమే వసుచరిత్ర-ప్రబంధ దర్శనం ప్రత్యేకత. వివరాలందులోనే దర్శించాలి అనే ఇక్కడ నేనేమీ ప్రస్తావించటంలేదు. చదువరు లా సంస్కృతిని గ్రహించగలిగితే అటు రామరాజభూషణుడూ ఇటు రామకృష్ణ శర్మగారూకూడా కృతార్థులు కాగలరు.

**U.V.G.N.V.S.S. Siva Rama Raju.** M. A.
**LECTURER**
*Dept. of Telugu, D.N R. College*
**BHIMAVARAM-534 202**

# అంతరంగ ప్రతిఫలనం

రామరాజభూషణుడూ-వసుచరిత్రా అనగానే శ్లేషార్థాలూ, శబ్ద చిత్రాలూ, కొన్ని సంగీత విశేషాలూ నాటకీయత అని ప్రసంగిస్తాం కొంతులు. శ్రీ జొన్నవిత్తుల రామకృష్ణశర్మగారు "వసుచరిత్ర-ప్రబంధ దర్శనం"లో నిర్మాణాత్మకమైన విద్యావివేకాన్ని వెలికితీసి చూపించారనీ అది అచ్చుతా, పావనతా, గభీరతల త్రివర్ణ రంజితం అని నేననటంకాదు గ్రంథం చదివినవారెవ్వరైనా అంటారని నా నమ్మకం. ఇలాంటి అంతరంగ పరిశీలన ప్రబంధాలకి చాలా అవసరం. వసుచరిత్రనుగూర్చి ఇలాంటి ఊహ నామమాత్రంగా ప్రసక్తం అయి ఉంది. కానీ అది అంత సమగ్రమూ సమర్థనీయమూ అనిపించదు. శ్రీ సముద్రాల నాగయ్యగారి "సాహితీ సుధా లహరి"లో "రామరాజభూషణుడు" వ్యాసంలో

"సాధారణ వర్షాగమ వృత్తాంతమే ఋగ్వేదమున వృత్రాసురకథయైయుండును. మేఘరూపమును ధరించి ఆ రాక్షసుడు ఆకాశము నాచ్ఛాదించి, అధోలోకములకు జలము లేకుండజేసెను. త్రిలోకాధిపతియగు దేవేంద్రుడు విద్యుద్రూపమగు తన వజ్రాయుధముతో ఆతని సంహరించెను. ఈ కథయే వ్యాసభారతమున వసురాజా వృత్తాంతమైనది. రాజే ఇంద్రస్థానీయుడు; కోలాహలుడే వృత్రాసురుడు; శుక్తిమతియే నిరుద్ధజలము; గిరికయె ఇంద్రుడు లోకముల కనుగ్రహించిన నీరు. ఈ భారతకథనే రామరాజభూషణుడు తన కావ్యమున కితివృత్తముగా స్వీకరించి, తగు రీతిని రూపొందించుకొనినాడు. వసుశబ్దమునకు జలమనియు అర్థము కలదు గాన "వసుచరిత్ర"మని నామకరణము చేయుటతో రామరాజభూషణుడు, ప్రాచీన జల వృత్తాంతమును, దానిరూపాంతరమగు వృత్రాసుర వృత్తాంతమును, దానికే మారు రూపమగు వసురాజా వృత్తాంతమునుకూడ సూచించియున్నాడని 'ప్రసన్న'గారూహించుచున్నారు. ఇది యుక్తియుక్తముగా తోచును" (పుట 195).

భారతాభిహితార్థ సాధనం అయిన ఏ సంప్రదాయం "శ్రీ ప్రసన్న"గారి ఊహకు మూలమో తెలియదు. వసురాజును ఇంద్రస్థానీయుడన్నారు. ఆ ఇంద్రస్థానీయుడికి (తపోధర్మాలకి మెచ్చి) ఆ ఇంద్రుడే వరమూ బహుమతులూ ప్రసాదించటం ఏమిటి? కోలాహలుడు వృత్రాసురుడైతే సంహరింపబడాలి. కాని భారతం అలా చెప్పలేదు. శుక్తిమతీ నది విహార దీర్ఘికగా కదా మారింది! ఇంక

లోకాల కనుగ్రహించిన మీరు అన్న గిరిక ఒక పిల్లకాలువగా అయినాకాక మానవా కృతిగా రూపొందిందికదా! ఇంద్రప్రస్థానీయమహామేను తానె చేపట్టెనుగాని లోకాల కనుగ్రహించలేదే! ఇలా స్థూలంగా అయినా భారతకథే వస్త్ర వృత్తాంత ప్రతిరూపంగా నిలవటంలేదు. ఇంక సూక్ష్మ వివరాలకు పోయిన భూషణకవి కృతి కెలా నప్పగలం! ఏమైనప్పటికీ శ్రీ ప్రసన్నగారు వసుచరిత్ర అంతరంగ పరిశీలనకే ప్రయత్నించారన్నది నిజం.

శ్రీ జొన్నవిత్తుల రామకృష్ణశర్మగారి పారదర్శక విమర్శ వావిరిపుట్టు రత్నం భారతంలోని ఆద్యసత్కథ 'ఉపరిచరవసు మహారాజు వృత్తాంతము' అవారిత సత్కవి-కల్పనా విశేషావహం 'వసుచరిత్ర' సానబట్టిన జాతిరత్నంగా విరజిమ్మే కాంతిపుంజంలో దర్శించాల్సిన అంతరంగం పంచమవేద ప్రసిద్ధినిబట్టి భారత-వేద బద్ధ నిరూపితార్థ వివేకంగా సాగించి వసుచరిత్ర-ప్రబంధ దర్శనం చేయించారు. భారతారణ్యపర్వ పంచమాశ్వాసంలో దేవసేనా కుమారస్వాముల పెండ్లి మహేంద్రుడు జరిపించిన దానికి ప్రతిఫలంగా వసుచరిత్రలో నిర్వహింపబడినట్లు రామకృష్ణశర్మగారు వెలుగులోకి తెచ్చారంటే ఆయన సాహిత్య పరిశ్రమ ఎలాంటిదో తెలుసుకోవచ్చు. ఎవరికివారే ఆ మధురిమ నందుకోవాలి. అందుకే నేనింతటితో తప్పుకుంటాను.

సాగి వెంకట్రామరాజు

S. Ch. B. R. M. హైస్కూలు

భీమవరం-2.

# పూర్వప్రబంధ భావభానూదయం

"మహాభారతే శాంతిపర్వణి ౩౩౮ అధ్యాయే భీష్మః। శ్లో. దేవానాంచ ఋషీణాంచ పశ్వాలంభే మతం శ్రుణు అజేన యష్టవ్య మితి ప్రాహుర్దేవా ద్విజోత్తమాన్ స చ ఛాగో హ్యజో జ్ఞేయో నాన్యః పశు రితి స్థితిః। ఋషయ ఊచుః। బీజైర్యజ్ఞేషు యష్టవ్య మితి వై వైదికీ శ్రుతిః। అజసంజ్ఞాని బీజాని ఛాగం నో హన్తుమర్హథ। దేవానాం హి మతం జ్ఞాత్వా వసునా పక్ష సంశ్రితమ్। ఛాగే నాజేన యష్టవ్య మేవ ముక్తం వచస్తదా। ఋషిశాపాచ్చ వై జాతః రాజోపరిచర స్తదా। తస్మై చేంద్రో దదౌ యానం తేనో పరిచరో హ్యభూత్।"

"మహాభారమున శాంతిపర్వమునందు 338వ అధ్యాయమున ఇట్లు గలదు. భీష్ముడు చెప్పుచున్నాడు: యజ్ఞమున పశ్వాలంభన విషయమున దేవతలయొక్కయు, ఋషుల యొక్కయు అభిప్రాయములను వినుము. దేవతలు మేకను హోమము చేయవలసినదని బ్రాహ్మణులనుగూర్చి చెప్పిరి. అజమనగా చాగమే [అనగా మేకయే] మరియొక పశువుగాదు. అని వారి సిద్ధాంతము. ఋషులీవిధముగా జెప్పిరి. ధాన్యములచే యజ్ఞములయందు హోమము చేయదగినది. అను వేదశ్రుతి గలదు. అందువలన అజా అను పేరుగల బీజములే హోమము చేయదగినవి. ఛాగమును చంపుట తగదు. ఈ విధముగా ఉభయుల అభిప్రాయములను విని వసు వనువాడు దేవతల మతమును ఆశ్రయించి పక్షపాతముచే మేకయే హోమము చేయదగినదని సిద్ధాంతీకరించెను. అందుచే ఋషి శాపమున ఉపరిచరవసువు అను పేరుతో భూలోకమున పుట్టెను. వానికి ఇంద్రుడు ఒక విమానము నొసంగెను. దానిచే నా రాజు ఆకాశమున సంచరించుటచే ఉపరిచరవసువు అను నామము కలవాడాయెను." (శ్రీ మహాభారత సారోద్ధారము: బ్రహ్మశ్రీ ములుకుట్ల నరసింహావధానీ పాకయాజీగారు: పుట 46 & 47)

ఇట్లు పూర్వరూపంలో ఋషి దేవతాగతం అయిన ధర్మవివాదంలో తీర్పరిగా ఉభయవర్గాలచేత అంగీకరింపబడిన వేదార్థ విజ్ఞానఖని అయిన వసునామకుడే నిజ మెరిగికూడా దేవపక్షముగా తీర్పుచేయుటవలన ఋషి శాపమునంది ఉపరిచరవసు మహారాజై భూలోకంలో చేదిరాజ్యప్రభువై నట్లుంది. ఆ విజ్ఞాననిధి వృత్తాంతం భారతంనుంచి తీసుకుని రామరాజభూషణుడు వసుచరిత్రను సంగీతసాహిత్య శాఖా

ద్వయముచే నొప్పి వేదార్థామలచ్ఛాయమై సుమహావర్గ చతుష్క పుష్పవితతిన్ శోభిల్లు పారిజాతముగా సహృదయ వేద్యం చేసినట్లు శ్రీ రామకృష్ణశర్మగారు వసు చరిత్ర-ప్రబంధ దర్శనంలో దాని అనుబంధాలలో వివరించారన్నది వాటిని చదివిన వాళ్ళు గ్రహించగలరు. వారి కృషి అభినందనీయం. ప్రబంధాలన్నింటికీ ఇలా ధర్మానుగతమైన వివరణలు రావాలి. విజ్ఞులు ప్రసాదింతురుగాక!

కలిదిండి సత్యనారాయణరాజు
చరిత్ర విభాగ-ఆచార్య
History & Civics Lecturer
Goyanka Govt. College,
Pentapadu.

# ఒక చిన్న మాట

"వసుచరిత్ర"మీద ఏదో వ్రాస్తున్నానని శ్రీ జొన్నవిత్తుల రామకృష్ణశర్మ గారన్నప్పుడు- ఎందరెందరో మహాపండితుల చేతుల్లో వివిధ విశేషాల్నీ ప్రకటించుకొన్న దానిమీద ఈయన వ్రాసేందుకేం మిగిలిందనిపించింది. Ph.D. ల వ్యవసాయంలా ఏదో కృతికర్తా కృతిభర్తల స్థలకాలనిర్ణయాలూ, రసనాయకాది నిర్ధారణలూ, వర్ణనాకల్పనలూ వాటిలో అందచందాలూ శ్లేషార్థవిశేషాలూతో ఆహా ఓహో అపురూపాద్వితీయాది శబ్దాల హోరెత్తించటాలూ వంటి వేటితోనో కాయితాల జొత్తి పెడతారనుకున్నాను. తీరాచూస్తే వాటికిందులో చోటేలేదు. "వివాహవ్యవస్థ" ప్రాముఖ్యాన్నీ తత్సాఫల్యాన్నీ రామరాజభూషణుడు కల్పనా రమణీయం చెయ్యటానికి భారతంలోని ఒక చిన్న ఆద్య (ఉపరిచరవసు మహారాజు వృత్తాంతము) సత్కథ కిచ్చిన అమృతరూపం మన కళ్ళముందు ప్రదర్శించారు. ఎవరికివారె చూసి ఆనందించాలిసిందది.

"వసుచరిత్ర" ధ్వనిప్రధానమైన ప్రబంధం అని పెద్దలంటూంటారు. ఏ ధ్వని విశేషాన్ని పలికిస్తోందీ సమగ్రప్రబంధం అన్నది ఎవరూ ప్రస్తావించినట్లు లేదు. అక్కడక్కడ కొన్నికొన్ని సభల్లో చలన్నిఘంటుమూర్తులైన పండిత ప్రవరులు ఇందులోని ఏ కొన్ని పద్యాలకో పది పదహారేసి అర్థాలు చెప్పేవారని వింటూంటాం. వారి సామర్థ్యానికి జోహార్లర్పింపవలసిందేకాని అందులో ఏ తాత్పర్యమైనా ప్రబంధ వ్యాప్తిగా ప్రకాశిస్తూందా అన్న పరిశీలనకు స్వీకరించింది ఎక్కడా వినపడదు. కనపడదు. ఇంకొందరు "సంగీతకళారహస్యనిధి" అన్నది అందుకొని ఏవో కొన్ని పద్యాల్లో రామరాజభూషణుడు ప్రస్తావించిన రాగాలపేర్లను వెలికితీసి చూపిస్తారు. మరీ శ్రద్ధాసంగీత పరిచయమూ ఉన్నవాళ్ళు ఆ రాగాల స్వరాలూ ఎత్తిచూపుతారు. ప్రత్యేకం హిందోళమూ-వసంతమూ తలంచకుండా ఎవ్వరూ వదలరు. అయితే ప్రబంధంలో సంగీతప్రమేయం ఏమిటో వెదికి ఆ రహస్యనిధి మన ముందుంచిన వాళ్ళులేరు. కాగా మరోరకం వాళ్ళున్నారు. నాటకీయత అంటూ తెరదించటాలూ సారంగ రాగారంభాలూ వంటివి వెతికితీసి చూపిస్తారు. రామరాజభూషణుడు నాటకంమాట తలపెట్టాడంటె అదికూడా ప్రబంధాన్వయ విధాయకం అయ్యేఉండాలి. ఆ సంబంధంగాకూడా రామకృష్ణశర్మగారు మరో అనుబంధం కలపవలసి ఉందను

కుంటాను. వీలై నంత త్వరలో అదికూడా అంతుబట్టి మన కళ్ళముందాడిస్తారని ఆశిస్తున్నాను.

తన అభిప్రాయాలకి Ph.D. ప్రదాతల ఆమోదం దుర్లభమని శర్మగారి కో జంకు. పైగా అందుకు డబ్బు సర్దుబాటుకూడా లేనివాడు. ఇప్పుడిది ఐనా ఆయన శ్రీమతి లక్ష్మీనరసమ్మగారు తనగొలుసు తాకట్టుపెట్టించి ప్రోత్సహిస్తే దీన్ని అచ్చు కిచ్చారు. దైవానుగ్రహంవల్ల ఈ "వసుచరిత్ర-ప్రబంధ దర్శనం" గండం గడచి పిండం బయటపడింది 'శ్రీ జ్ఞానేశ్వరీ పవర్ ప్రెస్' ఆపరేషనువల్ల. ఇంత బ్రతికి బట్టకట్టటం సహృదయలోకంమీద ఆధారపడిఉంది. జీవంగల "పారదర్శక విమర్శ" ఆటుపోటులకు తట్టుకొని నిలబడగలదనే నమ్ముతున్నాను. ఈ ప్రసవాన్ని ఆంధ్ర సాహితీప్రపంచాని కందించిన ఆ దంపతుల నభినందిస్తూ దాని పరిమళాలు గాలి పారినంత మేర గుబాళించాలని ఆశిస్తున్నాను.

భీమవరం
13-12-1985

ఇట్లు
కె. వి. శేషాచార్యులు
హిందీ లెక్చరరు
డి.యన్.ఆర్. కళాశాల, భీమవరం.

# రామరాజభూషణ కవి



శ్రీ రామరాజభూషణ సాహిత్యపరిషత్తు
భీమవరము వారి సౌజన్యంతో

# శారదామూర్తి రామరాజభూషణ కవికి

## అంకితం

ఉ. శ్రీ సుమనోఽబ్ధి వాసకుల - సింధుజ నాద రసామృతాంధసుం
డై సదసద్వివేక హృద - యాంబుజహారి, వికల్పనా దుర
ధ్యాన నిరోధదండి, సమ - యాంబరచారియునౌ ధరేంద్రు గా
థాసుధఁబంచె మూర్తి కవి - తా వసునామ చరిత్ర పాత్రతన్ 1

మ. చదువుల్ ద్రాపెడునమ్మ పాల్నెలవు లా - సంగీత సాహిత్యముల్
పదిలంబొక్కటఁబట్టి త్రావుటకె య - బ్బా యుక్కిరింబిక్కిరౌ
నది యెట్లోమఱి మూర్తి సత్కవి కరం - బాస్వాద యోగ్యంబుగాఁ
బిదికెన్ రెండిటి నీ ప్రబంధమున విం - పెం బ్రీతి పాత్రించినన్ 2

మ. తరణింబట్టిన వృత్తమయ్యది పసూ - ద్యద్వారతామ్నాయగ
ర్భరహః పాత్రిపితరత్న మీమెఱుఁగు ప - ర్వంబా ప్రబంధాంక వి
ద్వర సన్మూర్తి సజ్ఞ పోషణము, స - ర్వత్రామృతో త్పాదన
త్వరణం బక్షర రమ్యతావణ మ - ద్వైతజ్ఞ సుజ్ఞేయమున్ 3

ఉ. కల్పనమన్నయే మొదలు - కాన్పును లేని య సంప్రదాయపున్
మల్పులువెట్టి రూపులను - మార్చుచు నల్లినజాల శాఖలే
మెల్పునఁగాదటంచుఁ దగ - మేలగు భారతబద్ధ వైదికా
నల్పవిశేష మూలముగ - నల్లిన లక్ష్యమె మూర్తి కావ్యమౌ 4

సీ. కలనాద కులశృంగ - కోలాహల విభంగ కలనాద సరసాంగ - ఫలమనంగ
ఫణిభుక్స్వరనితాంత-పరభృత్స్వరనియంతశ్రుతిహృద్స్వరస్వాంత-సుతనుకాంత
సన్నుత కవిపాత్ర - కిన్నెర స్వరచిత్ర వన్నెచిన్నెల గాత్రి - వాక్పవిత్ర
సహృదయ వసుధార - సుహృద మృతవిచార విహృతకళాసార - విద్గకీర

తే. గీ. అభినవ కళాప్రపంచ స - మ్యక్ప్రబంధ
మార్గమన్యదురాసద - మహిమ నగన
దీ కుమారికా కళ్యాణ - దీర్తి వెలయు
'వసుచరిత్ర' మూర్తి కవితా - వసుచరిత్ర. 5

తే. గీ. కేతన గురు 'కవిబ్రహ్మ' - కుఁ - గేలుమోడ్చి
'దశకుమారచరిత' జెప్పి - ధన్యుఁడయ్యె
'వసుచరిత' మూర్తికవి చెప్పి - వాసిగ గురు
'నాంధ్రకవితా పితామ' హు - నట్లచేసె 6

మ. వసువృత్తంబగు సత్ప్రబంధమునకున్ - వ్యాఖ్యానముల్ ప్రౌఢులా
రసవిజ్ఞాన గుణ ప్రలుబ్ధులటు ని - ర్వక్ర ప్రసాదోన్నతిం
బస చూపించిన 'దర్శనం' బనఁగ నీ - పాలైయికే ముండె నా
క సరింజూడుఁడ వెంత చేదినను విం - కంబోనె పెళ్ళంబుధిన్ 7

శా. మేలెన్నందగుచోటఁ గీర్తివరుసన్ - మేకోలుగావించి ప్రి
జ్ఞాలాభంబునఁ గీర్త్యమాయఁ గవులే - గాన్పింత్రు మేల్గాయెడన్
వాలాయంబుగ రామభూషణకవే - వాల్లభ్యమా సూటిదే
మేలౌచిత్యపుఁ జిక్కులందణఁగె సు - మ్మీ! చూచి యోచింపుఁడీ

తే. గీ. రామరాడ్భూషణ సుకవిఁ - బ్రస్తుతించి
తత్కృతి వసుచరిత్రపున్ - 'దర్శన' మిది
యంకితం బంటి రొసఁగుల - వన్ని నావె
గావ దీనికతన వావి - నవఁగఁదగదు. 9

తే. గీ పాలమున్నీటఁ దరచిన - చాలపుట్టె
విషముగూడ నందునొకటి - కృషియె నాది
ఫలముమీకి యందుకొనుఁడు - భాగ్యవంతు
లెవరికేమిదక్కిన దాని - నేరుకొనుచు. 10

ఉ. సఖ్యత జొన్నవిత్తుల వి - శాల కుటుంబపు రామకృష్ణ శ
ర్మాఖ్యుఁడ నొంటిజొత్తుకొన - రాదని పూని 'ప్రబంధదర్శనా
ముఖ్యము నా వస్తూత్తకుభ - మూర్తి కృతిన్వివరింప నా సుధా
లేఖ్యము లన్నపాయసము - లెస్సగఁబంచితి, ద్రావుఁడెల్లరున్. 11

30—5—1985
సోమవారం
క్రోధన, జ్యేష్ఠ శు ౧.

జొన్నవిత్తుల రామకృష్ణశర్మ
తెలకోవెల: బలిసుమూడి: భీమవరం.

# ఉపయుక్తులు

| కృతి కర్తలు : | కృతులు : |
|---|---|
| 1. శ్రీ నిడదవోలు వెంకటరావు, యం. ఏ. | ....శ్రీ శేషాద్రి రమణకవుల వ్యాఖ్యా గ్రంథములోని వ్యాసము |
| 2. " సోమనాథకవి | " ఉదాహ్రృద పద్యము |
| 3. " వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి | .... వసుచరిత్ర విమర్శనము |
| 4. " నేలటూరి వేంకటరమణయ్యగారు | .... వ్యాఙ్మయ వ్యాసమంజరి |
| 5. " శతావధానులు శ్రీ శేషాద్రిరమణ కవులు | .... వసుచరిత్ర ( ప్రతిపదార్థ తాత్పర్య వ్యాఖ్యానము ) |
| 6. " తంజనగరం తేవప్పెరుమాళ్ళయ్య | .... " |
| 7. " వెంపరాల సూర్యనారాయణశాస్త్రి | .... 1) రామరాజ భూషణుని సాహితీ శక్తులవ్యాసం(భూషణకిరణావళిలో) 2) మనుచరిత్ర వ్యాఖ్యానము |
| 8. " చర్ల గణపతిశాస్త్రి | .... ఉపనయన వివాహవిధి, తాత్పర్య సహితము. |
| 9. " రేమెళ్ళ సూర్యప్రకాశశాస్త్రి | .... వేదార్థోపన్యాసములు |
| 10. " పింగళి లక్ష్మీకాంతము | .... సాహిత్య శిల్పసమీక్ష |
| 11. " హరిసోదరులు | .... భారతీ నిరుక్తి |
| 12. " సారంగు తమ్మయ్య | .... వైజయంతీ విలాసము |
| 13. " కె. వెంకటనారాయణరావు, బి. ఏ; ఎల్. టి. | .... ఆంధ్రవాఙ్మయ చరిత్రసంగ్రహము |
| 14. " నన్నయ భట్టారకుడు | .... శ్రీమదాంధ్ర మహాభారతము |
| 15. " నాచన సోమనాథుడు | .... ఉత్తర హరివంశము |
| 16. " నన్నెచోడ కవిరాజ శిఖామణి | .... కుమార సంభవము |

| కృతి కర్తలు : | | కృతులు : |
| --- | --- | --- |
| 17. శ్రీ బమ్మెర పోతనామాత్యుడు | .... | గజేంద్రమోక్షము (శ్రీ మదాంధ్ర మహాభాగవతము) |
| 18. " అల్లసాని పెద్దనార్యుడు | .... | స్వారోచిషమనుసంభవము |
| 19. " నందితిమ్మనామాత్యుడు | .... | పారిజాతాపహరణము |
| 20. " పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి | .... | సంగీత కళా రహస్య నిధి వ్యాసం (భూషణ కిరణావళిలో) |
| 21. " శ్రీనాథకవి సార్వభౌముడు | .... | శృంగార నైషధము |
| 22. " వాసిలి వేంకటలక్ష్మీనరసింహారావు | .... | వసుచరిత్ర తత్త్వము వ్యాసం (భూషణ కిరణావళిలో) |
| 23. " కడియాల జగన్నాథశర్మ | .... | భారతదేశంలో పెళ్ళిళ్ల (వి. సత్యనారాయణరాజు M. A; M. Ed. గారి సౌజన్యం) |
| 24. " గంటి జోగిసోమయాజి | .... | డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారి "సారస్వత వ్యాసములు" లో రామరాజ భూషణుడు వ్యాసం |
| 25. " సముద్రాల నాగయ్య | .... | సాహితీ సుధాలహరి |
| 26. " భాగవతుల శంకరశాస్త్రి (ఆరుద్ర) | ... | సమగ్రాంధ్ర సాహిత్యం |
| 27. " కాళ్ళకూరి నారాయణరావు | .... | వరవిక్రయము (నాటకము) |
| 28. " చదలువాడ ఎఱ్ఱన్న (ప్రబంధ పరమేశ్వరుడు) | .... | శ్రీ మదాంధ్రమహా భారతారణ్య పర్వము |
| 29. " భవభూతి మహాకవి | .... | ఉత్తర రామచరిత నాటకమ్ |
| 30. " కవికులగురువు కాళిదాసు | .... | 1) కుమార సంభవమ్ 2) అభిజ్ఞాన శాకుంతల నాటకమ్ |

| కృతి కర్తలు : | | కృతులు : |
|---|---|---|
| 31. శ్రీ బాలాంత్రపురజనీ కాంతరావు | .... | ఆంధ్రవాగ్గేయకార చరిత్రము |
| 32. " ఉమ్మడిశెట్టి వెంకటస్వామినాయ్డు | .... | సంగీత విద్యాదర్పణము |
| 33. " తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు | .... | శ్రీచక్రవిలసనము |
| 34. " అనుభవానందస్వాములవారు | .... | సర్వసిద్ధాన్త సౌరభము 10 |
| 35. " సౌభాగ్య భాస్కరరాయలువారు | .... | శ్రీ లలితా సహస్రనామ భాష్యమ్ |
| 36. " పరవస్తు చిన్నయ్యసూరి | .... | మిత్రలాభము |
| 37. " వేమూరి శ్రీనివాసరావు B A; B. L. | .... | పూర్వగాథాలహరి |
| 38. " చింతలపాటి వేంకటయాజిగారి వ్యాఖ్యతోటి | — | ఉత్తర కాలామృతమ్ |
| 39. " తిరువేంకటార్యబుధ ! శ్రీలింగయసూరి | .... | గురుబాలప్రబోధిక(అమరకోశవ్యాఖ్య) |
| 40. " | .... | విశ్వకోశము (నిఘంటువు) |
| 41. " ఆర్షము | .... | నాదబిన్దూపనిషత్ |
| 42. " డిటో | .... | యోగశిఖోపనిషత్ |
| 43. " డిటో | .... | యోగకుండల్యుపనిషత్ |
| 44. " డిటో | .... | పంచబ్రహ్మోపనిషత్ |
| 45. " డిటో | — | త్రిపురాతాపిన్యుపనిషత్ |
| 46. బ్రహ్మశ్రీ ములుకుట్ల నరసింహావధానీ పాకయాజీ | .... | శ్రీ మహాభారత సారోద్ధారము (శ్రీ కె. సత్యనారాయణరాజుగారి అభిప్రాయములో ఉపయుక్తము) |
| 47. " విశ్వనాథ సత్యనారాయణ | — | వసుచరిత్రలోని కల్పపు తెలుగు (శ్రీ శివరామరాజు అభిప్రాయంలో ఉపయుక్తము) |

ఎందరో మహాత్ములు - వారి యాత్మజ్యోతులకు నా జోతలు.

జొన్నవిత్తుల రామకృష్ణశర్మ
తెలకోవెల : బలుసుమూడి - భీమవరం.

ఓం శ్రీ మత్పరదేవతాయైనమః

# వసుచరిత్ర - ప్రబంధ దర్శనం

"మనువు గట్టిపడిన తరువాతగదా వసువుపై భ్రాంతి" అని శ్రీ నిడుదవోలు వేంకటరావు ఎం. ఏ., గారు "వసుచరిత్ర అవతరించిన నాఁటినుండి ప్రసిద్ధికెక్కిన గ్రంథము గావున నాంధ్రవాఙ్మయమున నే రెండు మూడు గ్రంథములకో కలిగిన యాంధ్రేతర భాషాంతరీకరణభాగ్య మీ గ్రంథమునకు గలిగినది" అని ప్రశంసించారు.

ఉ. కారణజన్ముఁడైకవిని - కాయము మెచ్చఁగఁ గావ్యకర్తయై
భూరికళాకలాపుఁడయి - పొల్పువహించిన భట్టుమూర్తిచే
సీరితమై సుశార్ద సద - హీనపదాస్పదమైన యా వసు
క్ష్మారమణ ప్రవృత్తము సు - సాధ్యముగాదు తలంచి చూడఁగన్.

అని వసుచరిత్రకు విద్వజ్జనరంజనీవ్యాఖ్య రచించిన సోమనాథకవి మెచ్చుకున్నారు.

ఉ. తేనియలొల్కు మాటలను - దీసిన తీగెఁలు పోని కూర్పులన్
వీనుల విందుచేసెడు న - వీన మృణాళ మృదూక్తి పై ఖరుల్
తో నరుదెంచు వ్యంగ్యముల - తో నలరారెడు సైజభూషణల్
పూనక కూర్చు రామనృప - భూషణ నైపుణ మెన్న శక్యమే ?

అని శ్రీ వజ్ఝల చినసీతారామస్వామి శాస్త్రిగారు తమ "వసుచరిత్ర విమర్శనము" 144వ పుటలో ప్రస్తుతించారు. అంతటి విలువైన "వసుచరిత్ర" అవతార విశేషాలకై ప్రయత్నించటం ఆంధ్ర సాహితీపరుల ధర్మం.

వసుచరిత్ర వ్రాసినవాడు భట్టుమూర్తి. "వసుచరిత్రాది కావ్య కృతి బహునృపప్రాపితానేక రత్నపల్లవుండ" హరిశ్చంద్ర నలోపాఖ్యానమనే ద్వ్యర్థి కావ్యంలో "రామనృపభూషణాఖ్యసుకవిని" అని చేసుకున్న స్వీయ పరిచయాన్నిబట్టి రామరాజభూషణుడనే ఒక్కడే ఆ రెండు గ్రంథాలూ వ్రాసాడని తెలుస్తోంది. (కంఠోక్తిగదా) అది అన్నాడు గనుక కనీసం ఇంకొక్క గ్రంథమైనా అతడు వ్రాసింది ఉండాలి. పై పద్యంలోనే వారి ఇంటిపేరు ప్రబంధాంకంవారనీ ఉంది. అదే ఇంటి పేరున శుభమూర్తి, శారదామూర్తి అంటూ మూర్తి నామ ప్రాముఖ్యంగల కవి నరసభూపాలీయం అని వ్యవహారంలో ఉన్న "కావ్యాలంకారసంగ్రహము" అనే అలంకార గ్రంథమే అలా పేర్కొనబడిందనిపిస్తుంది. అయినా శ్రీ వేలటూరి

వేంకటరమణయ్యగారు తమ వాఙ్మయవ్యాసమంజరి అధోజ్ఞాపికలో 146వ పుట "కాని వ్యాఖ్యాతలు చెప్పినట్లు నరసభూపాలీయకర్తయే వసుచరిత్రను రచించెనని యంగీకరించుటకు వీలుగాదు. వసుచరిత్రను రచించిన మూర్తి (ఈ పేరు వసుచరిత్రలో ఉన్నట్లు లేదు) వేఱు నరసభూపాలీయకర్త వేఱు. ఆ కాలమున "మూర్తి" సర్వ సామాన్యమైన నామధేయముగ వాడఁబడుచుండెను. ఒక కుటుంబముననే యేక కాలమున నిద్దఱు "మూర్తు" లుండి రనుటకుదాహరణములు లేకపోలేదు. కావున వసుచరిత్రకారుని వాస్తవ నామధేయము "మూర్తి" యనుటయందే వైపరీత్యమును లేదు. ఇట్లు ప్రబంధాంకము వారింట సమకాలికులగు మూర్తు లిరువురు గ్రంథకర్త లుండుటచేతనే తరువాతి కాలమువారు పురుషద్వయభేదము నెఱుఁగక యొక్క మూర్తియే వసుచరిత్ర నరసభూపాలీయములను రచించెనని వ్రాసియుందురు." అని ఆఊహని కాదన్నారు. అటు చరిత్రనీ ఇటు సాహిత్యాన్నీ కూడా పరిశోధించి వారన్నమాటని అధికారికంగా గ్రహించాలిసిందే. భావి పరిశోధకుల కా ఊహ ఉపాదేయమే.

"వసుచరిత్ర రచనాకాలము క్రీ.శ. 1570వ సంవత్సరమని ఇంతకు పూర్వ మొకచోట వ్రాసియున్నాను. (భారతి సం 7, పుటలు 828-831) దీని కృతిపతియగు రామరాజు-శ్రీరంగరాజు-తిరుమలరాజు క్రీ. శ. 1565వ సంవత్సరమున రాక్షసి-తంగడి యుద్ధమున సీతని జ్యేష్ఠ భ్రాతయగు అళియ రామరాజు గతించిన పిమ్మట ఇతడు సదాశివరాయలకడ కార్యదక్షుఁడై నిలిచి జీర్ణమైన కర్ణాటక రాజ్య పునరుద్ధారణము గావించి స్వయము రాజ్యాభిషేకము గావించుకొని 1570వ సంవత్సరమున గద్దెయెక్కెను. వసుచరిత్ర పీఠికయందు కర్ణాటకరాజ్య పునరుద్ధారణమును, దిరుమల రాజ రాజ్యాభిషేకమును వర్ణింపఁబడి యుండుటచేతను, మఱియు నతడు రాజ్యపాలన 11 మాసములే చేసియుండుటచేతను, 1570వ సంవత్సరముననే వసుచరిత్ర రచయింపఁబడెనని తలఁచి యట్లు వ్రాసితిని. కాని 1570వ సంవత్సరము వసుచరిత్ర రచనాకాలమనుటకంటె తత్కృతి సమర్పణకాలమని చెప్పుటయే యుచితముగఁ దోచుచున్నది" పుటలు 147 & 148 లో వారన్నదికూడ గమనింపవలసిన అంశమే.

కాగా ఈ ప్రబంధకర్త అది అన్నవి వసుచరిత్రలో చెప్పుకున్న పేర్లులేని "బహు సంస్కృతాంధ్ర కృతులం బల్మారు మెప్పించి"నవి కావచ్చు. మెప్పించిన

అళియ రామరాయలని. ఆయనవల్ల "తత్కారుణ్యంబున రత్నహార హయవేదండా గ్రహారాది సత్కారంబంది" "రామరాజభూషణ" స్థిరనాముడయ్యాడు. (1-18) ఆ రామరాయల తమ్ముడు తిరుమలరాయలే ప్రబంధ కృతిభర్త.

ఆ జయాభిరామహారి తిరుమలరాయశౌరి, ఏకైక దినప్రబంధాలనీ, ఘటికా సద్యశ్శత గ్రంథాలనీ కల్పనచేయగల సామర్థ్యం ఉన్న సంగీతకళా రహస్యనిధి అయిన రామరాజ భూషణుని పిల్పించి "కృతియె సంతతివతంస మది మాకు సంఘటింపు", "అవారిత సత్కవి కల్పనా విశేషావహ పూర్వవృత్తములు సానలందీరిన జాతిరత్నముల్గావున నట్టి మిశ్రకథా నొనరింపుము నేర్పు పెంపునన్" అవి సబహుమానంబుగాఁ దాంబూల జాంబూనదాంబరాగ్రహారాది ప్రదానంబులజేయగా రామరాజభూషణుడు (మూర్తి సుకవి) రచించి ఇచ్చాడు ఈ మహాప్రబంధాన్ని.

"భారతములో.... లోనగు కథాంశము లీప్రబంధమునందుఁ దొలఁగింపఁ బడెను. ఇవి యన్నియుఁ గథాకల్పనమునకు రామరాజభూషణుఁడు పెట్టిన మెఱుంగులు. ఇన్ని మెఱుంగులు పెట్టినను వసుచరిత్రమునందుఁ గథాకల్పన మున్నటులఁ దోఁచదు. "(శేషాద్రిరమణకవుల వ్యాఖ్యాన ప్రథమ ముద్రణ పీఠిక x) అని ప్రౌఢ పండితవరేణ్యులచే "వారిత" మయ్యేటట్లు కవి చేసుకున్నాడా అన్న సందేహం ప్రధానంగా పెట్టుకొని ప్రబంధంలో ఆ మహాకవి చూపించిన నేర్పు పెంపుని అవగాహనకు తెచ్చుకొనే ప్రయత్నమే ఇది. ఒకరకంగా తెలుగులో చాలా అరుదైన సమగ్ర గ్రంథావబోధక దర్శనం వసుచరిత్ర ప్రబంధపరంగా కలిగించటమే ఆశయం. ఎంత వరకు నెరవేరుతుందో మరి! పెద్దల ఆశీర్వాదం.

వసుచరిత్ర ప్రబంధంలో నాయకుడు ఆర్యసత్కృత అయినటువంటి శ్రీ మహాభారతంలోంచి గ్రహించిన "ఉపరిచర వసుమహారాజు" "శ్రీ మహాభారతంబునకుం గర్తయయిన శ్రీ వేదవ్యాసుని"కి మాతామహస్థానంలో ఉన్నవాడు. నైమిశారణ్యంలో సూతజుడా రాజునుగురించి శక్రోపాదిత దివ్యచిహ్నధరుఁడనీ, చంచద్విమానాధి రాజక్రీడాపరుఁడనీ అమానుష మహాసత్త్వాఢ్యుడనీ శుక శౌనకాది ముని రాజులు అంతకుముందే అడగ్గా చెప్పాడు. వాళ్ళేమని అడిగారంటే మహీమండలాన్ని దివ్యచిహ్నధరుఁడై ఏలిన మహారాజెవ్వరో తెల్పు మాకని అడిగారు. వాళ్ల కొంత సూచించి అడగటంలో వాళ్ల ఉత్సాహాన్ని సూతపౌరాణికుడు గుర్తించి దానికి తగ్గట్లె

ఆ చరిత్రము నిర్వక్రప్రౌఢిమ విన్నవింతు అన్నాడు. ఆ విన్నవించేదాన్లో వాగ్వైచిత్రి అత్యంతం ఉంటుందని రామరాజ భూషణుని యోగ్యతాపత్రం ఉంది. చూడండి :

ఇక్కడ గమనించవలసిన విషయాలు రెండు ఉన్నాయి. మొదటిది తత్ (వసు) చరిత్రము అనే గ్రంథనామం చరిత్రపరం చెయటం. "నాయొనర్పంబూనిన వసుచరిత్రం బను మహాప్రబంధము" (1-91) అని రామరాజభూషణుడు స్వయంగా ప్రకటించుకొన్న ప్రబంధనామానుకూల్యానికి పట్టు ఇచ్చిన కథకుని ఒడుపు "తచ్చరిత్రంబు నిర్వక్రప్రౌఢిమ విన్నవింతు" ననటం. కాని ప్రబంధం చదివిచూస్తే వసురాజుకు గిరికతో జరిగిన పెళ్ళికతే ఉంది. కాదంటే ఆయన కోలాహల పర్వతాన్ని గోటమీటి ఇంద్ర మైత్రిసి, దాని ఫలితంగా 1 విమానం, 2 అమరత్వంతో పాటు పద్మహారం, 3 వేణుదండం పొందినట్లున్నా ఆయన చరిత్రాంశం చాలా తక్కువ. ఏ తక్కువైనా ఆయన చరిత్రేకదా అనీ, నాగ్నజితీ పరిణయము, చంద్రికా పరిణయము అంటూ పెళ్లి పేరుమీదుగా పేర్లుంచి ప్రబంధాలు వ్రాసిన వాళ్ళకీపాటి ఆలోచన లేకపోయిందనీ వాదించదలచుకొన్నవారికో నమస్కారం. దశకుమార చరిత్ర, షోడశకుమార చరిత్ర, విక్రమార్క చరిత్ర భోజరాజీయాలకి మళ్ళే తత్సంబంధమైన చరిత్ర లేదని నా అభిప్రాయం. ఇలాకానట్లయితే ఈ పేరు ఇలా చరిత్రగా పెట్టటమూ, సూతపౌరాణికునికి ఆ మాటల్లో ఒడుపు చూపించటమూ చేసిన రామరాజ భూషణుని అంతర్యం ఏమిటై ఉంటుంది! సాహిత్యసిద్ధి పొందిన పెద్దలయెడ గౌరవం చూపించటమే ఎట్టఎదుట కొట్టవచ్చినట్లు కనిపించేది సారూప్యసాధనం. మనుచరిత్రకు దగ్గరగా వసుచరిత్ర చేర్చటం. ఈ నామమోహవిధానం రామరాజ భూషణుడు స్వయంగా ప్రస్తావించుకున్నదే. "భజియించు నయ్యుడుపశేఖన్నామ మోహంబునన్." (1-52) ఉడుపశబ్దం చంద్రపరమైంది గనక పడవనిహాదా మహమ్మదీయ సుల్తాను భజించునట. కాబట్టి నామమోహంతో అల్లసాని పెద్దనయెడ గౌరవం చాటుకున్నాడు.

నిజానికి ప్రబంధంలో గిరికా చరిత్రమే ఆమె జన్మవృత్తాంతంతో కలసి (ఆమె తలిదండ్రుల వివాహంసైతం) ఉండటంవల్ల అది వసురాజు చరిత్రను మింగేసి ఉంది అనిపించటంతో ఈ ఆలోచన వచ్చింది. పెద్దనగారి మనుచరిత్రకూడా ఆ పేర చెల్లుబాటౌతోందేకాని ఆయన ప్రకటించుకొన్నది "స్వారోచిష మనుసంభవం

బను మహాప్రబంధంబు" అనియె. ఆ ప్రబంధానికి కలిగిన వాడుక రామరాజభూష ణుడు తన ప్రబంధానికి తానే ఉంచి ప్రకటించి వాగ్వైచిత్రిగల సూతపౌరాణికుని మాటబడుపుని దానికి ఆసరా చేసుకున్నాడు. అటా పెద్దనగారి ఇటీ రామరాజభూష ణుని ప్రబంధాలు రెండింటిలోనూ నాయకచరిత్ర అంతంతమాత్రమె. అట్లా పెద్దన సరసన పీటవేసుకోటమే రామరాజభూషణుని అంతర్యం అనిపించకపోదు.

దీనికి వ్యతిరేకమైన మరో ఆలోచనకూడా అవకాశం ఉంది. షష్ఠాశ్వా సంలో 94వ పద్యం "సతి సాహిత్యరహస్య మీశువలనన్-సాధించి తోడ్తోనత, త్ప్రతికిన్ బ్రత్యుపదేశ మిచ్చె నతుల-ప్రౌఢిన్ ధ్వనివ్యక్తిన్" అన్నది చూడండి. ఇక్కడ గురుశిష్యాధ్యయన విషయప్రస్తావన కనపడుతుంది. రామరాజభూషణుడు స్వయంగా చెప్పకపోయినా సాహిత్యరహస్యాలని అల్లసాని పెద్దనకడ శిష్యుడై సాధించినట్లు మూర్తికవి కించుమించు సమకాలికుడు మండ లక్ష్మీనరసింహాచార్యుడు ("రామరాజభూషణుని కాలములోనే యుండి మనుమలనెత్తిన వేంకటపతిరాయల విద్యాగురువగు మండ రామానుజాచార్యుని ముమ్మనుమని మనుమడు" ఈ మండ లక్ష్మీనరసింహాచార్యుడని వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారి వసుచరిత్ర పీఠిక నము పుట 56.) తన ఆంధ్ర కౌముదిలో "ముప్రత్యయాభావస్య అల్లసాని పెద్దనార్య శిష్యేణభట్టుమూర్తి కవినావిరచితే వసుచరిత్రే" అని స్పష్టంగా ఉంచి. ఆ గురు శిష్యుల నడుమసాగిన అధ్యయనంలో ఆంధ్ర కవితాపితామహుడైన అల్లసాని పెద్దన ఈశుడుగా శారదామూర్తి అయిన రామరాజభూషణుడు సతిగా ధ్వనిస్తోంది. కాగా తోడ్తోన ప్రత్యుపదేశమిచ్చుట మనుచరిత్రను క్రిందుచేయగల అతులప్రౌఢిన్ ధ్వని వ్యక్తిన్ వసుచరిత్రను తాను రచించుటగాతోచు ధ్వనిని స్పర్ధ అనుకోవచ్చు. 'స్పర్ధయా వర్ధతే విద్యా' అని ఆర్యోక్తి కదా!

ఈ స్పర్ధమూలాన్నే గురువంచనంచేస్తూ పద్యం చెప్పలేదు సరికదా "బహు కాంత్రోక్తిమయ ప్రపంచమునఁ దద్రాపగల్భ్యమూహించెదన్" అన్న పద్యంలో వాగనుశాసనాదుల కడబంతినైనా పెద్దనకు (ఆంధ్ర కవితాపితామహునకు) చోటీయ లేదు. పైగా కుకవినిందలో తన అతులప్రౌఢి ధ్వనివ్యక్తులతో ఆ అల్లసాని పెద్దననే ధ్వనింపచేసినట్లుకూడా అనిపిస్తుంది. ఆ పద్యం చూడండి.

భావం బెక్కడలేక వృత్తనియమా-పాయంబుఁజింతింప కెం
దే వర్తించి పరార్థవంచనలచే-దీపించి మూర్ధాళి సం
భావింపం గుకవిప్రణీత కృతి సా-మాన్యాకృతింబూని పై
పై వన్నెల్పచరింప దానిఁ దిలకిం-పంబోరు ధీరోత్తముల్.

1) రసభావ మేపట్టులను కనిపింపదనీ మనుచరిత్ర రసాభాస ప్రబంధమనీ తలపింప చెయ్యటమే "భావంబెక్కడలేక" అనటం, 2) స్వారోచిష మనుసంభవకథకన్నా స్వరోచి సంభవకథ ప్రసిద్ధికెక్కేటట్లు రచిస్తూ ఇతివృత్తపరిధి దాటించేశాడనే "వృత్తనియమాపాయంబుఁ జింతింపకెందే వర్తించి అనటం, 3) భువనవిజయ ప్రవేశాన్నాశించిన కవిపండితుల కంతతేలిగ్గా శ్రీకృష్ణదేవరాయల దర్శనం లభించేది కాదట. అందుకు అల్లసాని పెద్దన కారణం అయ్యేవాడని నింద ఉంది. కవికర్ణ రసాయనం అనే మాంధాత చరిత్ర వ్రాసిన సంకుసాల నృసింహకవి కిలా పెద్దన దర్శనం కలగనీయ లేదంటారు. దాన్ని ధ్వనింప చెయ్యటానికే "పరార్థ వంచనలచే దీపించి అనటం, 4) ఇంతవరకు పద్యంలో ధ్వనిగా వినిపించిన విషయం అంత బాధాకరంగా లేదుగాని భువనవిజయ సాహితీ సభాంగణ పరిషత్తు మన్నించిన గండ పెండేరాదుల గౌరవాన్ని "మూర్ధాళి సంభావింపన్" అనటం బాధగానే ఉంది. ఆ పైని 5) "కుకవిప్రణీతకృతి" అని మనుచరిత్రను ధ్వనింపజెయ్యటం మరీ బాధగా ఉంది. అబ్బే అదేంకాదు అనుకుందామంటే, 6) మారనకవి మార్కండేయ పురాణంలో 147 పద్యాలలో చెప్పిన కథనే నాలుగున్నరరెట్ల (662) పద్యాల్లో పెంచి చెప్పినా రాణించిన అతులప్రౌఢీ ధ్వనివ్యక్తి లోపించాయి అని చెప్పటానికి "సామాన్యకృతింబూని పైపై వన్నెల్పచరింప" అనటం వల్ల వీలుకావటంలేదు. చివరికి "దానిఁ దిలకింపంబోరు ధీరోత్తముల్" అని వారించి మనుచరిత్రను కాదనటమే ధ్వనిస్తోంది. సారాంశంగా ప్రబంధంగా చరిత్ర అంటే మనుచరిత్రకాదు వసుచరిత్రే అని స్పర్ధతో అయినా రామరాజభూషణుడు తన ప్రబంధాని కీపేరు ఎన్నుకొని ఉండవచ్చు. సాటికైనా పోటీకైనా అల్లసాని పెద్దనగారూ ఆయన మనుచరిత్రా దృష్టిలో తారాడటం రామరాజభూషణుని ఆంతర్యమే. కాదనటానికి లేదు.

మరోరకంగా చూస్తే మూలాన్ని ధ్వనింపజెయ్యటంకూడా రామరాజభూషణుని ఆంతర్యం అయ్యింటుంది. కథామూలం భారతంలోది అనుకున్నాంగదా। అది

తృతీయాశ్వాసం (ఆదిపర్వం) లో ఉంది. అక్కడ అది "ఉపరిచర వసుమహారాజు వృత్తాంతము" అని ఉంది. "వృత్తాన్తస్స్యాత్ ప్రకరణే ప్రకారే కార్త్స్న్యవార్తయోః" గా అమరం (3 కాండ 220 శ్లో) లో ఉంది. అక్కడ గురుబాల ప్రబోధిక "వృత్తః అన్తో నిశ్చయోయస్య వృత్తాన్తః । అయిన నిశ్చయము గలది" అని వివరించింది మళ్ళీ "వృత్తం పద్యే చరిత్రే"గా అమరం (3-235) అంటే అప్పుడు గురుబాల ప్రబోధిక "వర్తతే స్మవృత్తమ్" అని వివరణ ఇచ్చింది. పైన ఉన్న అయిన నిశ్చయం ఇప్పటి వర్తించినది తో కలిపితే ప్రవర్తించిన నిశ్చయం కలదిగా చరిత్రే ఔతుంది. వృత్తం పద్యే చరిత్రేగా అమరకోశం చెప్పనే చెప్పిందిగా! దీన్నిబట్టి ఉపరిచర వసుమహారాజు వృత్తాంతము సూక్ష్మరూపంలో ప్రబంధ నామకరణాను కూలంగానూ, గిరికావృత్తాంతం మింగేసిన "ఉపరిచర-మహారాజు" లోపంలో సూచకంగానూ చేసి రామరాజభూషణుడు "వసుచరిత్ర"గా దిద్దుకున్నాడు. భారతంలో ప్రవర్తించిన కథ ప్రబంధంలో విస్తరింపబడి వివరాలందిస్తూ చరిత్ర అయింది. ఇలా కావ్యంలో నామసార్థక్యం సిద్ధించింది. ఒకవేళ గిరికాకళ్యాణం పేరు పెట్టాలను కున్నా ఆ గిరికా వృత్తాంతం భారత మూలకథలో గుర్తించటానికి వీలుకానంత సూక్ష్మం అయివుంది. వసుప్రసక్తి లేకపోతే అంతభారతంలో ఎక్కడని వెతుకోగలం! రామరాజభూషణుని తాత్పర్యం అద్యసత్కథ (పూర్వం ఒకప్పుడు లోకంలో జరగటం అయిన భారతకథ) కనుగుణంగా అన్వయం చేసుకుని సాహిత్యబుధులు తన ప్రబంధాన్ని గ్రహించాలి. ఆపైన కల్పనా విశేషావహమైన తన కవిత్వం నేర్పు పెంపువల్ల తాను అవారిత సత్కవిగా నిలిచిపోవాలన్నదె కనుక లోకప్రసిద్ధి కల భారత ఉపరిచరవసు మహారాజు వృత్తాంతంగా పండితుల్లో పరిచయమైఉన్న నామాన్నెన్నుకోటం రామరాజభూషణుని విజ్ఞతకు నిదర్శనంగా ఉంది. గౌరవానికి గౌరవం! విజ్ఞతకు విజ్ఞతాను! సాహిత్యరసపోషణుడుగదా!

పైన చెప్పుకున్నట్లు గమనించవలసిన విషయాలు రెండింటిలో ఒకటయ్యింది. రెండోది "నిర్విక్రప్రౌఢిమ పిన్నవింత" అని సూతుడు ప్రకటించటం. ఇందులో ప్రౌఢిమీద ఇమనిచ్ ప్రత్యయాగమనం విచార్యమంటూ శబ్దసాధుత్వాన్ని శంకించటం ముఖ్యంగాదు. రామరాజభూషణునికి పూర్వమే శ్రీనాథుడు "గంభీర వాక్ప్రౌఢిమన్" అనీ నంది తిమ్మన పాటలీచంపకోత్పల ప్రౌఢిమములు అని వాడిన ప్రయోగాల్ని స్వీకరించి ఆ మహాకవులయందు తన అభిమానాన్ని చూపుకున్నాడు భూషణుడు.

పోతే వక్రశబ్దం వక్రోక్తిని తలపిస్తుంది. ఆ వక్రోక్తికిని పరిహరిస్తాననియా నిర్వక్ర అనటం: కానేకాదు. వక్రోక్తి కావ్యానికి జీవం అనేదొకమతం. దాన్నెలా వదులుకుంటాడు: ఇలాంటి తలపు కలుగుతుందేమోననే తానైకవి వచనంగా "వాగ్వైచిత్రితో నిష్టమన్" అని ఆ జీవాన్ని బలపరచుకున్నాడు. మరి ఆ నిర్వక్రప్రౌఢిమ ఏమిటీ అంటే తన ప్రబంధంలో వాగ్వైచిత్రి ప్రౌఢమైంది. సత్కవికల్పనా విశేషావహమైంది. దానివల్ల నాయకచరిత్రకేమీ వక్రత ఏర్పడదు. అది స్పష్టం గావాలనే నిర్వక్రప్రౌఢిమ అని సూతపౌరాణికుడు కవిమూర్తి యొక్క కల్పనావిశేషావహమైన ప్రౌఢిని ప్రకటిస్తే, ఆ పౌరాణికుని కథనం కావ్యజీవపరమైన వాగ్వైచిత్రితో కూడినదని మూర్తి కవి ప్రకటిస్తాడు. అన్యోన్యంగా ఇలా ప్రకటించిన విషయ సారాంశం సత్కవి కల్పనా విశేషావహమన్న సానబట్టడంతో వావిరిపుట్టిన ఆద్య సత్కథారత్నం తేజోవంతం అవటమే గాని అరగటం తరగటం విరగటం వంటి ఏ లోపవక్రతా ఉండదని స్పష్టం చెయ్యటమే. దీనివల్ల ఓ రకంగా రామరాజభూషణుని వసుచరిత్ర భావాన్నవగాహన చేసుకునే సాహితీప్రియుల కోదారి దొరికినట్లయింది. అంటే ఆదువుకొనేటప్పుడు భారతంనించి స్వీకరించిన ఉపరిచర వసుమహారాజుకు చెందిన ఆద్యసత్కథగా మన్నింపదగిన అన్వయాన్నే చదువరులు స్వీకరించాలన్న మాట. ఆ అన్వయానుకూలంగా రామరాజభూషణుడు చేసిన కల్పనావిశేషావహ నైపుణ్యాన్ని గుర్తించాలి. దనివల్ల అతడెంతటి సత్కవియో సాహితీ ప్రపంచంలో స్థాపించబడాలి. ఇదీ అతని ఆంతర్యం. కవి అన్న వాడెవడైనా కోరుకోవగించే అది. ఇంతటి ఆలోచనామృతమైన సాహిత్యాన్నందించి రామరాజభూషణుడు "అచ్ఛామృతత్వమును, ఆత్మ ప్రతిపాదకత్వమును వర్ణాళియందెల్లఁ బూర్ణముగావించిన వాణి (సరస్వతీ ప్రార్థన పద్యంలో) "నిజబింబ" మై నిలిచియున్నాడా శారదామూర్తే దన్నాడు.

తెల్పు మాకని అడిగిన శుక శౌనకాదులకు వసురాజును గూర్చి తెలియక పోలేదు. అయినా అడగటం ఎందుకంటె? సూతుని వాగ్వైచిత్రిమీది మక్కువే అది. వారు భాగవతాను లుపన్యసించిన పౌరాణికుడె కనక రాజు పేరెత్తక "మున్నె రాజేంద్రుఁడు దివ్యచిహ్నధరుఁడై యేలెన్మహీమండలం బారాజేంద్రుని దెల్పుమాకు" అన్నారు. వారి ఔత్సుక్యాన్ని గుర్తించి "అత్యంత హర్షంబుతో" సూతిడిలా అన్నాడని తరువాతి పద్యంలో ఆ రాజు పేరూ అతడేలిన దేశమూ ప్రకటించి ఆ మునిరాజు

లడిగిన ప్రశ్నలోని ప్రౌఢిమకాని "నిర్వక్రప్రౌఢిమ విన్నవింతు" అన్నాడనీ ఆ విన్నవించేది "అత్యంత వాగ్వైచిత్రితో నింపి ఉంటు"దనీ కవి తన సాహిత్య రహస్యాన్ని తెలుసుకొనే దారి తెరిచాడని ఇంతకుముందే దర్శించుకొన్నాం గదా!

ఇంకమీదటిదే కథారంభం అన్నమాట. అంత గొప్పది ఇంత గొప్పదీ అంటూ ఒక సీసపద్యంలో పాదానికి రెండేసి గొప్పలూ మళ్ళీ శబ్ద- అర్థశ్లేషలతో ఆ గొప్పలని రెట్టింపు చేస్తూ సాగదీసి అంతటిది "అధిష్ఠానపురవరంబు" అన్నాడు. అల్పాక్షరాల్లో అనల్పార్థ కల్పనం కవిత్వంలో ప్రౌఢిమకదామరి! సూతుని శ్రోత లకు తగ్గుండాలమ్మో! అయితే ఆ కల్పించే అనల్పార్థ సాధనలో, ఛందోబద్ధమే అయినా వాక్సృతులకు బాధాకరంగా పరిణమించకుండా, సంగీతవిహితమై రమణీ యంగా నిలపగలగటం నిర్వక్రప్రౌఢిమ అనుకున్నా ఒప్పుతుంది.

మరోరకంగా చేదిభూవక్రాన్ని వసురాజేలుతున్నాడని ఆ రాజు చరిత్ర చెప్తా ననీ ఉపోద్ఘాతంచెప్పి కథారంభంగా రమణీయ వర్ణనలతో స్ఫూర్తిపేయంగా అధిష్ఠాన పురవరాన్ని పేర్కొనటం-అది చేదిభూచక్రానికి రాజధాని అని ధ్వనింపజేసి వాచ్యం చెయ్యకపోవటమే కవిత్వంలో ప్రౌఢిమ. ఈ సీసంతో సహా ఆ పురవర్ణనఇరవై పద్యాల సాగింది. ఇలా అధిష్ఠాన పురాన్ని ఎందుకు పొగిడి పొగిడి చంపుతున్నాడో గ్రహించటానికి పాఠకులంతా సూతుని శ్రోతలంతటి ప్రౌఢులు కారుకదా! రమణీ యార్థ-గీత పరిపోషకంగా సాగిన ఈ ఇరవై పద్యాలూ విసుగనిపించక పోయినా కథానుబంధం తెలియరాకపోవటంతో "సాహిత్యపీఠికను బాలించు భారతికి రత్న సమూహము నొసంగెనేకాని కథాసూత్రమున శ్రీ నందచందముగ గుచ్చి యొసంగఁ జాలంబోయెను." అని శతావధానులైన శ్రీ శేషాద్రిరమణ కవుల వంటివారే అనటం చూస్తే ధ్వనిగా నిలిపి వాచ్యం చెయ్యని ప్రౌఢిమ వక్రప్రౌఢిమగా పరిగణనకి రావచ్చు, కనుక ఆ పురవర్ణనాంతంలో ఉన్న చిన్నకందంలో (ప్రబంధపద్య సంఖ్య 115) ఒక్క క్షణంలో తప్పుగా పరిగణించే వక్రప్రౌఢిమను చెల్లబెడుతూ "ఆ రాజధాని కధిపతియై రాజిలు వసునృపాలుఁడు" అని (మళ్ళీ ఆయనొక్క యిరవై మూడై పద్యాల నలుగుపెట్టి ఆఖరున పేరుచెప్పకుండా) కమమరుగైన కథా సూత్రాన్ని ఇరవై కల్పనావిశేషసహ పద్యరత్నాల కెక్కించి తోరణంగా ప్రదర్శించి సూతుడన్న నిర్వక్రప్రౌఢిమను ప్రత్యక్షీకరించాడు. ఇరవై పద్యరత్నాలలో వింత

కాంతులీలిన అధిష్ఠానపురవరం రాజధానీనగరం అనీ దాన్నే లేవాడు వసునృపాలుడని ఈ కొలికిని తగిలించాడు. ఆ వసునృపాలుడు చేదిభూచక్రేశుడని (ఈ నగరం రాజధానిగా ఉన్న రాజ్యం చేదిరాజ్యమని "ఆ రాజధాని.... పద్యంలో లేదు) ఆ కొలికిని తగిలించాడు. ఇలా ప్రబంధంలోని 93వ పద్యమూ 115వ పద్యమూ కథాసూత్రపు టీవలి ఆవలి రెండు కొలుకులుగా నడుమ మొదటి పద్యాంతంలోనే అదిష్ఠానపురవరాన్ని ప్రకటిస్తూండగా మొత్తం ఇరవై పద్యరత్నాలు ప్రకాశిస్తున్నాయి. హారంలో అయినా తోరణంలో అయినా సూత్రం అంతర్గతంకదా: రత్నాలు రాలిపోకుండా ఉన్నాయంటే అంతర్గతసూత్రం ఉందన్నమాటే. పైగా రామరాజభూషణుడు ప్రత్యాహారశుద్ధిగా "ఆదిరన్త్యేన సహితా" చేసి దాన్ని ప్రస్ఫుటంచేసి ఉన్నాడయ్యె. ("అన్త్యే నేతాసహిత ఆదిర్మధ్యగానాం స్వస్యచ సంజ్ఞాస్యాత్ యథాఅణ్ ఇతి" అంటే "అ ఇఉణ్" అని వర్ణసంజ్ఞాసూత్రం ఉంది అందులో మొదటి "అ"కారమూ చివరి "ణ్" కలిపి అణ్ అనటమే ప్రత్యాహారము. అది ఆ మొత్తం వర్ణాలనే బోధిస్తుంది. రామరాజభూషణుడు 93వ పద్యంలో "చేదిభూచక్రేశుడు ధరిత్రినేలె వసుసంజ్ఞన్ అనీ 94వ పద్యంలో "భూరివరణం బధిష్ఠాన పురవరంబు" అని దాన్ని 114వ పద్యం వరకూ వర్ణించీ ఆ చివర అంటే 115వ పద్యంలో "ఆ రాజధాని కధిపతియై రాజిలు వసునృపాలుడు" అని ఒక చక్కని గొలుసుకట్టుగా ఎంతో నేర్పుతో కథాసూత్రాన్ని అల్లి ఉన్నాడు. వర్ణనా ప్రౌఢిమనందుకోలేనివారు 93, 94, 115 పద్యాలు చదువుకొని కథ నవగాహన చేసికోవచ్చు. అయితే తక్కిన పద్యాలుకూడా చదివి ఆ వర్ణనామధువానిమెమరచిపోయే ప్రౌఢపండితుల కీ అల్లిక దృష్టికి రాకపోవటం ఏమీ వింత కాదు. ఏ దృష్టిని పోవువారి కాదృష్టియేకాని ఇతరములంతగా పట్టవుగదా: అదే ప్రమాదో ధీమతామపి అన్న ఆర్యసూచన.

ఉదాహరణకి "అత్యలఘుకలాపాలికలరుభరణి" అని ఉన్న 94వ దైవపీసం మొదటిపాదం ద్వితీయభాగం తీసుకొని దానికి ప్రౌఢపండితులిచ్చిన ప్రతిపదార్థం చూడవచ్చు:ముందు శ్రీ శేషాద్రిరమణ కవుల:

అత్యలఘు=అత్యధికములైన: కలా=విద్యలయొక్క: పాలికలు(చివరి "లు"ఏమైపోవాలో)=సమూహము లనెడు, అత్యలఘు=అత్యంత ఘనమైన, కలాప=భూషణములయొక్క: ఆలికలకున్ (చివర ఉండవలసిన "రు" ఏమైపోయిందో దానిచోట "కున్" ఎలావచ్చిందో)=సమూహములకు భరణి=సొమ్ములుంచెడు రణియైనదియు అన్నారు.

ఇప్పుడు శ్రీతంజనగరం తేవప్పెరుమాళ్ళయగారు :

అతి+అలఘు=మిక్కిలి గొప్పలయిన; కలా = విద్యలయొక్క, పాలికలు (చివరి 'అరు' ఏమైపోయిందో తెలియదు)=సమూహములనెడు; అత్యలఘు=మిక్కిలి గొప్పవయిన; కలాప = భూషణములయొక్క; ఆలికలకున్ (చివర ఉండవలసిన 'రు' ఎటుపోయినదో, దానికి బదులు 'కున్' ఎటునుండి వచ్చినదో ఏమైనా వ్యాకరణ కార్యం ఉందేమో ప్రస్తావించలేదు) = సమూహములకు; భరణీ = సొమ్ములుంచెడి భరిణీయైనది అన్నారు.

వీరిలా విశేషార్థాలను సాధించాలనే దృష్టితో "కలాపాలికలరు"లో చివర ఒక "రు" వర్ణం ఉందనే సత్యాన్ని గమనించారు కారన్నది స్పష్టమేకదా! మరి ఆ వర్ణంతోకూడిన పదం ఒకటి కవిరచనలో ఉండగా దాన్ని త్రోసిరాజని ఏవో విశేషార్థాలకంటూ వింతవిరుపులతో క్రొత్తరూపులు కల్పించే ప్రౌఢపాండిత్యం ఎవరు ఎంతటి ఉత్కర్ష ప్రకటించినప్పటికీ మూలచ్ఛేదకమై కవి నిర్దిష్టభావానికి దూరం అయిపోతుంది. కవి భావాన్వేషించేవాళ్ళు ఇలాంటి చీకటితెరల్ని చీల్చుకొని ముందుకుసాగేటప్పుడు తప్పనిసరి అయిన సాహసాన్ని దుడుకుతనంగా భావించ కూడదు.

ఇప్పుడు చూడండి : కలాపాలికి+అలరు-భరణిగా విరిచామనుకోండి 'అలరు' అనేమాట ఒకటి కవివాడినది ఉన్నట్లు స్పష్టం ఔతుంది. దానివల్ల కళలకైనా కల్పాలకైనా ఒప్పి ఉన్న భరణి (దాపుడుపెట్టె) అని భావం సూచిస్తుంది. కలా+పాలి అని ఒకసారీ కలాప+ఆలి అని ఒకసారి విరిస్తే ఉత్తరపదాలు పాలి, ఆలి రెండూ కూడా "వరుస" అని ఒకే అర్థాన్నిస్తాయి. "పాలిః కర్ణలతాగ్రేఽశ్రౌ పంక్తౌ వంక ప్రదేశయోః" అనీ "ఆలిఃపంక్తౌ చ సంఖ్యాంచ" అని విశ్వకోశం అర్థాలిచ్చింది. సమూహార్థంకోసం తాపత్రయం వదిలేస్తే విద్యాపంక్తి, భూషణ పంక్తులను నిలుపుకోటానికి ఒప్పిఉన్న భరణి అని చక్కని భావం సిద్ధిస్తుంది. ఈమాత్రం సద్దుకుంటే పై ప్రతిపదార్థ సాధకులెవ్వరూ తాము ప్రతిపాదించిన అర్థవిశేషాలేమాత్రమూ మూలచ్ఛేదకాలు కావని విన్నవించుకొంటున్నాను. కాకపోయినా "అలరు" అనే కవి ప్రయోగించిన శబ్దాన్ని గుర్తించకపోటం అనేది మాత్రం పరమసత్యం. ఇలా ప్రాగ్దృష్టి కొంచెం దాటుకొస్తేసే అవకాశం ఉందని చూపించటమే ఈ ఉదాహరణ

ప్రధానోద్దేశం. మరి అసలుసంగతి అది. అంతేగాని రామరాజభూషణుడు భారతికి రత్నసమూహమును ఆద్యసత్కథా సూత్రమున గ్రుచ్చియొసంగుటేకాదు అవారిత సత్కవికల్పనా విశేషావహమగు నేర్పు పెంపున హారమేఅల్లి ఆ తల్లి మెడలో అలంకరించాడన్న విషయం ప్రబంధం అంతటా ఎక్కడచూసినా కనిపిస్తుంది. క్రమ క్రమంగా దర్శిద్దాం.

తర్వాత 116వ పద్యం మొదలుగా వసురాజు వైభవశ్రీ వర్ణనతో తొమ్మిది పద్యరత్నాలున్నాయి. ఆ మొదటి సీసంతో వసురాజు ఘనకీర్తినీ శౌర్యాన్నీ సైన్య సమృద్ధినీ దానగుణాన్నీ సుగుణ విశేషాన్నీ ప్రస్తావించడం జరిగింది. వాటి సద్విని యోగంవల్ల జగద్బంధుపై బ్రహ్మ ఇచ్చిన వసునామాన్ని సార్థకం చేసుకున్నాడని మరో సీసంలో ఉంది. ఆమధ్య ఒక చంపకమాలలో భూదేవి కొండల్లో గాలిమేసి తపస్సుచేసి వసురాజును ప్రభువుగా పొంది వసుమతిగానూ ఆయన సుగుణ గంధా న్నలముకొని గంధవతిగానూ సార్థక నామధేయాలు సాధించుకుందిట. అంటే వసు రాజు తన ప్రభుధర్మంవల్ల జనకుని తలపించి వానిని రాజర్షిగా ధ్వనింపజేసాడు రామరాజభూషణుడు. కనుకనే వసురాజు వేరే తపస్సు చెయ్యవలసిన అవసరం లేకుండానే ఇంద్రప్రసన్నత పొందగలిగాడు. "మండలముదాల్ప హరిదైనమైత్రి నిలువ" అని కొద్దిగా కవి ఆ సంగతిని ప్రస్తావించాడు. కాబట్టే భారతంలో "చేది భూనాథుండు శిష్టలోకనుతకీర్తి మృగయావినోదార్థ మడవికిఁజని యొక్క మునిజ నాశ్రమమునందు నిర్వేదమున మహానిష్ఠతో సన్న్యస్త శస్త్రుఁడై తపమొప్పఁ జలుపుచున్న" అని ఉన్న వసురాజు తపోవిషయాన్ని రామరాజభూషణుడు ప్రస్తా వింపలేదు న్యాయమే మరి ! ఒకరకంగా మృగయావినోదం వ్యసనాల్లోది కనక అది వసురాజు కీర్తికి కళంకంకావచ్చు. మరో విషయం ఏమిటంటే ఆయన తపస్సు చేసుకునేకాలంలో రాజ్యభారం ఎవరికప్పగించినట్లు ? ఇలా ప్రభుధర్మాన్నతిక్ర మించిన కళంకం అంటవచ్చు. పైగా అసలు వసురాజు తపం ఏదైనా వాన్ని గూర్చి చేసినట్లో భారతంలో లేదు. సాధారణంగా ఇంద్రుడు తపోభంగం చెయ్యటానికే చూస్తుంటాడు, వస్తుంటాడు. ఇక్కడ ఇంద్రదర్శనంకూడా అలాంటిదే అనిపించి వసురాజు తపోనిష్ఠకు కళంకాన్నాపాదిస్తుంది. ఇన్నిరకాల కళంకావకాశం ఉన్నట్లు తోచటంవల్లే ఆ మునిజనాశ్రమ తపఃప్రసక్తి వదిలెయ్యటం చాలా సమంజసంగా ఉంది. అంతమాత్రంచేత ఆద్యసత్కథగ భారతార్థావగాహనతో అన్వయించుకోవా

లన్న రామరాజభూషణుని అంతర్యవిధానానికేమీ లోపంరాదు. "ధరణీ ప్రజాగరంబు దయతోడ వర్ణధర్మాభిరక్షఁజేవ యమల చరితనేలి" అన్నంతవరకున్న ఇంద్రప్రశంస వసురాజు చేసిన తపఃప్రకారంగా తీసుకోవచ్చు. "తపశ్చాంద్రాయణాదౌస్యాద్ధర్మే లోకాన్త రేపిచ" అని విశ్వకోశం. కాబట్టి పక్రిమ ప్రభుధర్మాచరణమే వసురాజు చేసిన తపస్సు. ఇంద్రుడుకూడా తన వచనంగా భారతంలోనే "నీ వర్ణధర్మ ప్రతి పాలనంబునకుఁ దపంబునకు మెచ్చితి" అన్నదాన్లో "తపంబు" అన్నది అక్షర రమ్యతను మాత్రమే ఆదరించే ఇతరులందిగా విడిచిపెట్టి ప్రసన్న కథాకపితాన యుక్తిలోనారసిన సారమతియైన కవీంద్రునిగా రామరాజభూషణుడు ధర్మాన్ని గ్రహించి ప్రకాశింపచేసాడని గురించటం న్యాయం. అది నన్నయభట్టారకు డంగీక రించిన భారతార్థావగాహన విధానమేగాని ఏమీ వ్యతిరేకంకాదు. ముఖ్యంగా "భారత ములో నింద్రుఁడు వసురాజు తపమునకు మెచ్చి విమానాదిక మొసంగినటులుండ" అన్న శ్రీ శేషాద్రిరమణకవుల వచనము సగమె నిజము. ఇంద్రుని మాటలలోనె భారతమున "నీ వర్ణధర్మ ప్రతిపాలనంబునకు" అని కూడా ఉన్నది. వారు పట్టిం చుకోలేదంతె.

తక్కిన అయిదు పద్యాల్లో అంటె 119-123ంటిలో వసురాజు కోలాహల పర్వతాన్ని గోటమీటి ఇంద్రసఖుడై వాని సరిగద్దియనుండి గౌరవింపబడటం, కోలాహలం ప్రాణాచారం పడితే కేళీశైలంగా మన్నించటం అంతా చకచకా కథ నడిచింది. ఇక్కడిలా పరిచయంచేసి శ్రోతలలో ఆవివరాలకోసం ఆత్రుత కలిగించే సూతపౌరాణికుని నిర్వక్ర ప్రౌఢిమ అది. కాగా అంతటి వసురాజు ఏలుబడి గన్న పుడిమిచేడియ ఇంద్రభూమిని అంటే స్వర్గాన్నిచూసి తనకు సాటిరాదని హుందాగా నవ్విందట. అంతటి సర్వసమృద్ధిగల వసుభూమికి చైత్రలక్ష్మి పైరంద్రిగా పత్ర లతానవకళికా సౌగంధ్యములను సమర్పించుకొన్నదట. ఈసంగతి 125 వ పద్యం లోది. "ఆ రాజధాని కధిపతి" అన్న 115 నో పద్యం ఆ కొలికిని "ఆ గతి నభిమత భోగశ్రీగల భువి "అన్న 125 దో పద్యం ఈ కొలికినీ చేర్చి వసురాజు యశోవిభవ సామర్థ్యముల వెలుగొందు తొమ్మిది పద్యరత్నములను కథాసూత్రానికి గ్రుచ్చిన మణితోరణం సమకూడింది. రెండు కొలకుల పద్యాలూ కందాలే అవటం గుర్తించ తగింది. వెనుకటి తోరణాన్ని పొడిగించిందేకాని ఇది వేఱే తోరణం కాదు. కథా సూత్రస్థితిని ప్రకటిస్తూ అక్కడక్కడ ఇలాంటి ప్రత్యేక మౌక్తికాల్ని కూరుస్తూ

రామరాజభూషణుడు అల్లి ఇచ్చిన ఒకే రత్నహారం వసుప్రబంధం. కథమాత్రమే కోరుకునేవారు 115వ పద్యంనించి 125వ పద్యానికి దాటిపోవచ్చు. కోలాహలాన్ని మీటిన కథ తర్వాత మళ్ళీ సవివరంగా ఎలాగూ వస్తుంది.

ఆ పైన 126-141 పద్యాలు వసంత వర్ణనతో 16 ఉన్నాయి. ప్రౌఢ పండితుల కవి అమృతఝరులు, గాంధర్వ విద్యారహస్య నిధులు, అచేతనాలకి సచేతనత్వం కలిగించిన పరుసవేదులు లేదా సంజీవకరణులు. జరగబోయే నదీపర్వత ప్రణయగాథ కుపశ్రుతులు. కాగా కథానునోదకులకి యథాప్రకారం ఆవల కొలికిముత్యం" అని వనపాలురు తెలిపిన "అన్న 142వ కందపద్యం కథాసూత్రాన్నందిస్తూనే ఉంది. వెనుకటి కొలికిముత్తెం "ఆగతి నభిమత భోగశ్రీగల భువి...." అన్న కందపద్యం గదా! ఎక్కడికక్కడిలా ఉంటుంటే కథాసూత్రంతో పద్యరత్నాలు గుచ్చి యీయ లేదనుకోటం న్యాయమా!

ప్రథమాశ్వాసం చివరికి వస్తూ 143-162 పద్యాల్లో వసురాజు రథాన్ని తెమ్మని మహావైభవంతో ఆనందనోద్యానవనం చేరగా ఆ వనం సకల రాజమర్యాదలను నెరపిన విశేషాల వర్ణనలతో ఇరవై పద్యరత్నాలున్నాయి. నన్నయభట్టారకుడు దుష్యంతునికి "అతిరుచిరాగతుండయిన-యాతనికిన్ హృదయప్రమోదమా, తత ముగ" అని ఒకేఒక చంపకమాలలో జరిపించిన రాజమర్యాదలని రామరాజభూషణుడు 149-158 వరకున్న పది పద్యాల్లో జరిపించటమే కాకుండా కంకేళి తన దీనావస్థకు తేనె కన్నీరు విడవటంకూడా సప్రకరణక్రమంగా చేర్చాడు. తేనెవాకలో ప్రతిఫలించిన ఫలవృక్షము శుక్తిమతీనదిలో ఒరగిన కోలాహల పర్వతాన్ని గుర్తు చేసిందట. ఆ చెట్టుమీదఉన్న కిన్నెరపక్షులు అనితరసాధ్యమైన శుభమేదో రాజుకి సంప్రాప్తమౌతుందని పలికి కోలాహల పర్వతాని కెగిరిపోయాయట. ఇదంతా వసురాజు చేసిన కేళికావనదర్శనం. పద్యం పద్యంలోనూ ఏదోఒక కల్పనా విశేష చాతుర్యం ఒకానొక హొందాతనాన్ని ప్రదర్శిస్తుంది పండితులకి. తక్కినవారు 163వ కందపద్యానికి ఉరిగి వెయ్యవచ్చు. అది "ఆలోకాద్భుత విహగయు, గాలోకి ప్రీతివలన-నతిలోక వయః, కొలాహల కోలాహల, లీలాహాళిక చెంగ-లించెం బతికిన్" అన్న దాన్తో రాజు కోలాహల పర్వతాన్ని చూడాలనుకున్నాడనే తాత్పర్యంతో ప్రథమాశ్వాసకథ పూర్తి అయింది. ఇలా కథాసూత్రాన్నెక్కడా పురి విడకుండా బింకంగా అల్లి చక్కని వర్ణనల పద్యరత్నాల్ని గుచ్చి హారం తయారు

చేస్తున్నాడన్నది ఈ ప్రథమాశ్వాసంలో గమనించి ఒక సమ్యక్కథాభాగాన్ని దర్శించాము. పద్యప్రతిపదార్థాది ఇతర విషయాలకి పూర్వ పండిత ప్రకాండుల వ్యాఖ్యాన గ్రంథాల్లో దేన్నైనా చూడవచ్చు. మళ్ళీ ఇక్కడ ఉటంకించటం కాలవ్యయం. కనుక ఇంతటితో సరిపెట్టుకొని పై విషయాలకోసం ప్రయత్నిద్దాం.

## 2

వసుచరిత్ర ప్రబంధంలో ద్వితీయాశ్వాసం అచేతనాలకి చైతన్యాన్ని వ్యక్తిత్వాన్నీ ప్రసాదించి వాటిని సుమనోహరమైన పాత్రలుగా మలచి జీవన వ్యాపార దక్షమైన సమ్మోహన సన్నివేశాలేర్పరచి సత్కవి కల్పనా విశేషావహ దృక్ శ్రవణ పేయమైనట్టి అద్భుత కళామందిరం. ప్రథమాశ్వాస వసంత వర్ణనలతోనే ఈ కళా ప్రాంగణంలో అడుగుపెట్టించి శ్రోతల దృష్టి యిటుమళ్ళించి ఉన్ముఖులుగా చేసుకొని ఇప్పుడీ కళావైభవాన్ని ఆస్వాదించటానికి తగిన అర్హత అధికారం కలిగించి మందిర ప్రవేశానికి అనుమతి పత్రం చేతబెడుతున్నాడు రామరాజభూషణుడు. "సాశనానశనే అభిసస్మాద్విరాడజాయత" (పురుషసూక్తమ్)

ప్రథమాశ్వాసాంతంలో "ఒకానొక కిన్నరద్వయంబన్ని ఖిలోక్తి వేదికపు దన్యదురాసదమైన యొక్క యాసన్నశుభంబు(దన్నది ప్రసన్న నిజోక్తుల(దెల్పి"న అది అన్ని జీవుల భాషలూ తెలిపిన వసురాజు తన కపూర్వ శుభమేదో జరుగనున్నట్లు ఆ పక్షుల మాటల్లో తెలుసుకుని ఉన్నాడు గనుక ద్వితీయాస్వాసం "అమ్మహేజాని నిజవిహారాచలేంద్ర దివ్యసౌభాగ్యములు చూడ(బురుటయును" అని తన కేళికాద్రియైన కోలాహల పర్వత శోభను తిలకించాలని తొందరపడుతుంటే "ఆయెడ నొక్క నర్మసచివాగ్రణి యిట్లను" తో ప్రారంభం అయింది.

ఇక్కడ నర్మసచివుడు హఠాత్సంభవుడైన సద్యోజాతవ్యక్తి అనుకోనక్కర లేదు. ప్రథమాశ్వాసం 148 వచనం చివర "ఉన్నత రాజరాజభజన కౌతూహలంబులు నుగ్రసేనాగణ కలకలంబులు నవధరించుచు నానందనోద్యాన రాజంబు(జేరంజను సమయంబున" అన్నట్లు కొందరు వెంటవస్తుంటే వారి కలకలం వింటూనే రాజు వనాన్ని చేరుకుని తేరుడిగి మహీతుల ననిపి, బలము నచటనె నిలిపియు పవనంబునొచ్చి నిజహితయుతుడై (151) యున్నాడు కదా! ఆ "ఒక నర్మసచి

వాగ్రణి" రాజువెంట ఉండి ఇలాగంటున్నాడని గ్రహించవచ్చు. ఇక్కడినుంచే కళాచిత్రవైభవం చిత్తవిభ్రమం కలిగించటం మొదలౌతుంది. (తనకేదో ఆసన్న ఫలప్రాప్తి ఉందని తెలిసి అందరినీ వెంటవేసుకు వచ్చేంత తెలివితక్కువవాడు కాదు వసురాజు. అన్నిటా వెంటఉండే ఒక నర్మసచివాగ్రణిని మాత్రం కూడా తెచ్చుకున్నాడని గ్రహించాలి) వర్ణనాక్రమానికి తట్టుకోలేనివారు కథాగమనంకోసం 57వ పద్యానికీ అక్కడినుంచి 60వ పద్యానికి ఉరుకులు పెట్టవచ్చు. "కిన్నెర విహంగయుగళిచే......మేదినీపతి హితాగ్రణిని డ్రోవసూపు మనుడు" అన్న తేటగీతి 57వది. కుతుకమున.... .. హితచూచిత సరణిఁగొనకేతెంచు నెడన్" అన్న కందపద్యం 60వది. అంటే మళ్ళీ కథాసూత్రానికీవలి కొలికిముత్యాలు రామరాజభూషణుడు సమకూరుస్తూనే ఉన్నాడని గుర్తుచెయ్యటమేగాని అంతవరకూఉన్న కళాఖండాన్ని దాటవెయ్యాలనికాదు. అయినా వివరాలన్నిటికీకూడా ఇక్కడ వీలుపడదని మనవిచేస్తూ (పూర్వపండితుల ప్రతిపదార్థవ్యాఖ్య లెలాగూ ఉన్నాయికదా!) ముఖ్యవిషయాలని ప్రస్తావిస్తాను.

రామరాజభూషణుడు తన కళామందిరాన్ని నర్మసచివాగ్రణిమాటల్లో "చూపెద నీకు నాదు చేవాయనె చూడుము" అని చూపించి ఆ సచివుని భ్రాంతిలో ముంచి "అవుఁజుమ్మ వినాకభూజముల్" అనిపిస్తాడు. ఆ విభ్రాంతిలేని కళాభిజ్ఞుడు కనక వసురాజు "అవ విని నవ్వి సూక్ష్మగతి నారసి........ మనకేళిశైలమది ...భ్రమించి పల్కెదైనను మృషగాదు నీ పలుకు నాకనగంబులె తద్ద్రుమావళుల్" అనుకోవచ్చుని స్నేహపూర్వకంగా సమర్థిస్తాడు. అందుకో సీసపద్యం పట్టింది. తర్వాత "అదిగాదే మన కేళిభూధరము...." అని నిర్ధారించి "చూతమాయద్రిసంపదలంచుం గయిదండఁ జూవి ధరణీపాలుండు గిరిఁగదియన్" స్నేహితుని చేయిపట్టుకొని యా కొండను జేరెనట. అప్పుడక్కడి "వెమానిక మానినీ మధురగా"నాని కానందించినవాడై నోరుపిప్పి "నర్మసఖుండు వల్కె" అని కోలాహల అచలాన్ని చలాచల విచారంలో ముంచేటట్లు వర్ణించేస్తాడు. అది ముందు జరగబోయే కథలో వ్యక్తిత్వాన్ని పొంది తనపాత్ర నిర్వహిస్తూంటే అది ఒక చలనంలేని కొండమాట అనిపించకుండా ఉండటానికి పాఠక మానసస్థితిని సిద్ధపరచటానికి దోహదం ఔతుంది.

రాజు "అదిగాదే మన కేళిభూధరము" అనేటప్పటికి నర్మసచివుడు అది చిలుక గోరవంక కోకిల నెమిళ్ల కలరవాలూ తుమ్మెదల ఝుంకారాలూ వారణ వన

దేవతా కిన్నరీ బృందగానాలూ దికుదిక్కులా నిండిఉంది కనుకనే కోలాహలం పేరు సంపాదించిందేమో అంటాడు. వెంటనే నీ పాదఘాతం తిన్నందుకు ఉదార్చటానికి మేరు కైలాసరోహణగిరులు చేరినట్లుందంటూ బంధుసరణిని తలపిస్తాడు. ముఖ్యంగా "ఎగతిన్ ప్రుక్కెనొ గట్టు రాచకొమరుం డలనాఁడు.... నేఁడును గంటె నెతురల్ గ్రిక్కెడు" అనీ "కృపాస్వాంతంబునం బ్రోవుమింక నరేంద్రా ! యని గట్టువేడ్కెడి నినుంగంటే తృణగ్రాహినూతన నీలాశ్మదరీ ముఖాగ్రవిచలద్వాతూల మంద్ర ధ్వనిన్." రక్షింపుమని ఆ కొండనోట గడ్డికరచినట్లున్న నీలాల గుహనుండి వచ్చే గాలికి కలిగిన మూలగటం ప్రస్తావించటం ఆ కొండ మనుష్యాకృతిని ప్రవర్తించిందా అనిపిస్తుంది. ఆ తరువాత పెద్దవచనంలో వివిధ జీవసంచారమైన చలనస్థితి ఉంది. అందులోకూడా "భవదరుణ చరణనిహతిఁ బెకలిన కఱకుటెఱకలు మగుడ నిగిరించిన తెఱంగున" అని వసురాజు తన్నుకి విరిగిన రెక్కలు మళ్ళీ పెరుగుతున్నట్లు అని సజీవాకృతిభావం స్ఫురింపచేస్తాడు. చివరికి పద్యంలో "ఇన్నగంబు హిమవన్నగ మందనరారు భూవరా !" అని వాచ్యంగా నగమే అన్నా హిమవంతుడన్న భావంతో అధిదేవతామూర్తిమత్వాన్ని తలపిస్తాడు. ఆ వెంటనే రాజు దానిపై కెక్కి కూర్చునే చర్య కనుకూలంగా నగమనే ప్రస్తావించాడు. ఇలా నర్మసచివుని మాటల్లో కోలాహలం చలాచలవిచారం కలిగించి శరణువేడటం గడ్డికరవటం వంటి చర్యల్లో వ్యక్తిమత్ భావాన్నే పాఠకుల మనసుల్లో నాటుతుంది అదే రాబోయే శక్తిమతీ కోలాహల ప్రణయగాథకి అనివారిత సమ్యక్సాధన మౌతుంది. రామరాజభూషణుని వసుచరిత్ర ప్రబంధంలో పాత్రలిలా క్రమక్రమంగా జీవం పోసుకుంటాయి.

వసురాజు కేళిభూధరంమీది కోలాహలం మారమయ్యేటట్లు మిత్రునితో కొండెక్కి "నిర్ఝరపయురాందోళితైలాసుగంధి నికుంజాంత సవేందుకాంతమణివేది" అయిన చంద్రకాంత శిలా వేదికమీద విశ్రమించగా మాధురీ ధుర్యమైన కలస్వనం వినిపించింది. అది ఆనందబ్రహ్మమైనదట. భూనాకలోకాల నెవ్వరిగానమూ దానికి సరిగాదట. ఆ సంగీత కలస్వనము రాజు మనమున నాకానాక అనురాగభరంబు పెంచినదట. కళ్యాణానికి బీజప్రాయమైనదా రాజుమాట. అది ఎక్కడిదో తెలుసుకు రమ్మని ఎవరో వీణవాయిస్తూ పాడుతున్నారని వివరించిన నర్మసచివుణ్ని పంపాడు.

నానావిధ నాదసంకులం అయిన కోలాహల పర్వతం ఎక్కి ఒక్క వీణానాదమాత్రాన్ని గ్రహించటం దాన్ని ఆనందబ్రహ్మమని ఆస్వాదించటం ఒక యోగ

సూక్ష్మం. నాదబిందూపనిషత్తులో "శ్రూయతే ప్రథమాభ్యాసే నాదో నానావిధో మహాన్, వర్ధమాన స్తథాభ్యాసే (పర్వతంపై కెక్కుతుంటాను విశ్రాంతి పరిశాంతస్థాయి నందుకోటంగా ఉంది ప్రబంధంలో) శ్రూయతే సూక్ష్మసూక్ష్మతః" అని వివరింప బడ్డ నాదాభ్యాస మార్గానుగుణంగానే ఉంది. దానికి తగ్గట్లుగానే "నానాగాయన.... ఇట్లానంద సందోహమున్" అనే పద్యంలో ఆ అర్థప్రకాశమూ ఉంది: సంగీతజ్ఞులైనవారికి శ్రీరాగతానం పలికించే సమాసవిరామపు విరుపులూ ఉన్నాయి. కళ్యాణానంద బ్రహ్మబీజాత్మక శ్రీవిలాసం ఈ పద్యం గమనించండి.

శా. నానాగాయన గాయనీమణుల గా-నంబుర్వి నాలింపమో!
నానాఁటన్ నగభేది వీటఁగల గ-న్ధర్వాప్సరోగీత వి
ద్యానైపుణ్యము లెన్నియేని వినమో!- యం దైన నిం దైన విం
దైనాదంబొనఁగూర్చునే మదికి ని-ట్లానంద సందోహమున్. ౨-౧౬

సరె చూచిరావాలని నర్మసచివుడు వెళ్లాడు. "కిన్నరీవినాదానుకారి శారీశుకాది ఘోష ఘుమఘుమితంబైన కోనఁగనియె" తరువాత "నిరుపమంబైన దివ్య మందిరము గనియె" అందులో "వనితారత్నములు మెలఁగు పల" నెఱిఁగి యచ్చట "తమోవినీలకచ.... తరుణశశాంకఫాలనొకతన్కి" "వీణావాదన ప్రౌఢిచేఁజెలులన్ రంజిలఁజేయుచున్కి" గని నృపసంసేవాపరుడు "ఆ ప్రజాధినాథు నా జగన్మోహనుని చెత్తుననుమఁజనియె" సుహృజ్జన భావబంధములెప్పుడూ కళ్యాణసంధాయకాలే. తను చూచిన తన్వి "సాంగమై మొనసిన యతను సమ్మోహవిద్య" అనిపించటంతో తన రాజమిత్రుని జగన్మోహనుడనిపించాడు. ఒకరికొకరు తగినవారని వారికళ్యాణం అవశ్యం కావి అనీ అనుకున్నాడన్నమాట. అందుకే రాజునిచేరి యా చెలిఁని నఖశిఖ పర్యంతం మధురవాగ్విన్యాసంచూపి ఆమె రూపం రాజు మనసుకెక్కేటట్లు 29-53 పాతిక పద్యాల్లో వర్ణించి చెప్పాడు. ఆ వర్ణనాప్రౌఢిమకి తట్టుకోలేనివాళ్లు 31వ దైన "నరరాజకన్యలును.... నా తరుణిఁబోల్పఁదగరు నరేంద్రా!" అన్న కంద పద్యమూ 55వ దైన ఉత్పలమాల చివర "లతాంగిరూపు కన్నారఁగఁజూచివచ్చితి నవాంబురుహాంబక నీకుఁజెప్పగన్" చదువుకొని 57వ తేటగీతి పద్యం చివరి "హితాగ్రణివి ద్రోవసూపుము నుడు"తో కథనందుకోవచ్చు. ఆపైని 60వ కంద పద్యం "కుతుకమున.... హితసూచిత సరణిఁగోనకేతెంచునెడన్"తో కథ ఒకస్థాయి నందుకున్నట్లు తెలుస్తుంది.

ఇప్పుడు "లతాంగిరూపు కన్నారఁగఁ జూచివచ్చితి" అన్నచోట కొందరు పండితులూ అలా వారిని నమ్మిన ఇతరులూకూడా 'రూపు' అనేది పెళ్ళికాని ఆడ పిల్లల మెడల్లో కట్టిఉంచే కన్యాత్వపు గుర్తు అనీ దాన్నిచూచివచ్చిన సచివుడు ఆమాట చెప్పి ఆమె అవివాహిత అని రాజుకు సూచించాడని వ్యాఖ్యానిస్తుంటారు. అందులో కొంచెం ముదిరినవారు రాజుకి కాబోయే ఇల్లాలిని అంగాంగ దర్శనం చేసినట్లనిపించే 'రూపుకన్నార' చూచినట్లు చెప్పటం మర్యాద కాదనీ అతడు కన్నార చూసానన్నది అవివాహితగా మెడలోఉన్న గుర్తేననీ ఖండితంగా వాదిస్తారు. ఈ విషయం కొంచెం ఆలోచించాలిసిందే.

దేశీయాచారాల్ని సాంస్కృతిక పక్షంగా అనుశీలనం చేస్తున్నవాళ్ల మన దేశంలో బాల్యవివాహాలెలా మొదలయ్యాయంటారంటే: మహమ్మదీయులు తమ దండయాత్రల్లో ఆడపిల్లల నెత్తుకుపోయి వారి జనానాలో చేర్చుకునేవారట. అయితే పెళ్ళయిన పిల్లలజోలికి పోని ఒక సుగుణం ఉండేదిట వాళ్ళకి. వాళ్ళ బెడదనుంచి తప్పుకోటానికి హిందువులు తమ ఆడపిల్లలకి చిఱుతప్రాయంలోనే పెళ్ళిళ్లుచేసి అలా పెళ్ళయిన గుర్తుగా ఆ పిల్లల మెడల్లో తాళికట్టించటం మొదలుపెట్టారట. అలా తాళిబొట్లున్న ఆడపిల్లల్ని మహమ్మదీయులు వదిలేసేవారట. ఇలా పెళ్ళిళ్లలోకి తాళి బొట్లు ప్రవేశించి ఆచారం అయికూర్చున్నాయంటారు

మహమ్మదీయ దండయాత్రలూ అందులో వారి దుండగాలూ రాయలసీమ ప్రాంతాల్లోనే ఎక్కువ జరిగినట్లు చరిత్రఉంది. అలాంటిచోట మా ఆడపిల్లకింకా పెళ్ళికాలేదుఅనే ఒకగుర్తుగా ఈ రూపుకట్టి మహమ్మదీయుల దుండగానికి ఆహూతిచేసే ఆచారం ప్రవర్తించింది అంటే నమ్మటం కష్టం. అందులోనూ తల్లికోట యుద్ధం వల్ల జరిగిన అనర్థాల అనుభవం ఉండగా పెనుగొండచేరి మానం కాపాడుకున్న తిరుమలరాయల కాలంలో రామరాజభూషణుడు అలాంటి ఆచారాన్ని తన ప్రబంధం ద్వారా ప్రచారం అయేట్లు ప్రస్తావిస్తాడనుకోటం సమంజసంగాలేదు. నాటి సాంఘిక పరిస్థితులందుకేమాత్రమూ అనుకూలంకాదు.

మరోసంగతి ఆడపిల్లకి పెళ్ళయిన మొదటి ఏడాదిలో వచ్చే శ్రావణమాసం పౌర్ణమికి ముందువచ్చే శుక్రవారం అత్తవారు వచ్చి వరలక్ష్మీవ్రతం చేయించి లక్ష్మి ముద్రఉన్న చిన్నపసిడి బిళ్ళని నల్లపూసలతో గుచ్చి ధరింపచేస్తారు. ఆ బిళ్ళని

రూపు అనటం ఉండికాని పెళ్ళిఅయ్యాకే దాన్ని ధరించే ఆచారం తెలుగువాళ్ళల్లో ఉంది. మరి రాయలసీమ పండితుల పరిశీలనం ఏమిటో? ఆనాటి సాంఘిక జీవనానికది ఎలా వీలని సమర్థిస్తారో అనూహ్యం.

ఇక గుప్తమాటెలాగున్నా పాతిక పద్యాల్లో తాను చూచివచ్చిన తరుణివర్ణనం సుదీర్ఘంగానే చేసి అదేమీ ఉత్ప్రేక్షాభావం కాదు మహానుభావా నేకన్నారా చూసిన సత్యస్వరూపం అనే సచివుడు "రూపు కన్నారఁగాంచి వచ్చితి"అనటంలో అమర్యాద ఏమీ లేదనీ రామరాజభూషణుడు శాస్త్రీయ దృక్పథంతోనే అలా పలికించాడనేది కొంచెం ఆలోచిస్తే తెలుస్తుంది.

వివాహవిధిలో "సుహృదస్సమవేతాన్ మన్త్రవతో వరాన్ప్రహిణుయాత్ మదర్థం కన్యాం వృణీధ్వమ్ ఇతివరాన్ ప్రేషయిత్వా" అని ఓ మన్త్రం ఉంది. "మంచి హృదయముకలిగిన, కార్యములందు దీక్షగల వేదవేత్తలయిన ఉత్తములను కన్యనన్వేషించుటకై పంపవలయును. నా కొఱకు కన్యను అన్వేషింవుడు" అని చర్ల గణపతి శాస్త్రిగారు మన్త్రతాత్పర్యం వ్రాసారు. "ఇతనితో కలిసి మెలిసి వుండే టటువంటి అలాంటి స్నేహభావంతో వుండేటటువంటి వాళ్ళుకావాలి" (525 పుట) అని రేమెళ్ళ సూర్యప్రకాశశాస్త్రిగారన్నారు. వసురాజుకి నర్మసచివుడలాంటి స్నేహభావంగలవాడు. వివాహార్థం కన్యాన్వేషణ చేయమని వసురాజు వాచ్యం చెయ్యకపోయినా "సంగీతకలస్వనము మనమున నొకానొక యనురాగభరంబు బెనుపవవనివుఁడు" "వివరించి (వివరమెఱిఁగి) క్రమ్మఱన్ వచ్చెదవే తదాయతన వాటికిఁ దోపుద మీక్షణంబునన్" అన్నమాటల్లో సంగతి తెలుసుకున్నాడు సచివుడు. దానికి అనుకూలమైన అన్వేషణే చేసుకువచ్చాడు. అతడుగదా సుహృత్ అంటే!

అలా మిత్రుడు చేసుకురావలసిన పరీక్ష ఏమిటంటే: విపర్యయంగా "దత్తాం గుప్తాం ఘోరాం వృషభాం వినతాం వికటాం ముండాం మాండూషికాం సాంకారికాం వాతాం పారీంచ వర్జయేత్" అంటుంది శాస్త్రం. "ఎవరికైనా వాగ్దత్త అయితే పనికిరాదు........అటువంటి వీట్లన్నిటిని చెప్తూ వికటమైనటువంటిది, ఏదో నాసికాపై కల్యామో కర్ణపై కల్యామో చక్షుర్వైకల్యామో అలాంటి వాట్లతోటి పనికిరాదట-శిరస్సుయందు కేశములు లేనటువంటిదే అలాంటిది పనికిరాదు" అని రేమెళ్ళ సూర్యప్రకాశశాస్త్రిగారి వివరణ ఉంది (526 పుట) ఇంకా చూడ్డానికి వెళ్ళేటప్పటికి

"సుప్తాం, రుదంతీం నిష్క్రాంతాం వరణే పరివర్జయేత్" అలాంటి స్థితిలో దర్శన మిచ్చినదీ పనికిరాదుట. ఇలాంటి శాస్త్రవిషయాలన్నీ చక్కగా తెలిసిన నర్మసచివుడు గిరికా లతాంగిని చక్కగా పరీక్షించి వచ్చి వివరంగా సాహిత్యపు విలువల వెలయిస్తూ మరీ చెప్పాడు. అది శాస్త్రీయవిశేషం కనుక వసురాజూ ముచ్చటగా విన్నాడు. ఈ వైదిక కన్యావరణ విధానాన్ని రామరాజభూషణుడు తన ప్రబంధంలో మంచి సందర్భ శుద్ధిగా వివిధ వర్ణనా ప్రకాశంగల పాఠిక పద్యరత్నాల్ని కథాసూత్రానికి గుచ్చి యిచ్చాడు. లతాంగిరూపు అంగప్రత్యంగక విశేషాలతో సచివుడు కన్నారచూచి వచ్చితి ననటం సత్యం. అందువల్లే వాటివర్ణనలూ చేసాడు.

ఆ గిరికాదేవి అంగప్రత్యంగ వైభవశ్రీలని సచివుని నోట వివిధ కల్పనా విశేషావహ శిల్పచాతురీ మహితంగా పద్యపద్యాన్నీ ఒక్కో విలక్షణంగల ప్రత్యేకత కాలవాలంగా చేస్తూ రామరాజభూషణుడు తన ప్రబంధనాయికను 32-51 వరకూ ఇరవై పద్యరత్నాల దీపింపజేసాడు. ఆ వివరాలు ప్రతిపదార్థ వ్యాఖ్యల్లో ఉండనే ఉన్నాయి. అయినా సహృదయ సమ్మోహనం అయిన రెండింటిని మాత్రం ఉండ బట్టలేక ప్రస్తావిస్తున్నాను. ఒకటి చెవులను రెండోది ముక్కును గూర్చినవి. ముందు చెవులు చూద్దాం. పద్యం తేటగీతి 49వది.

"త్రిజగతీ సుదతీరూప-విజయకీర్తి, గలుగు నవియంతి ఫాలభా-గమున వ్రాసి నలువ
యా శుభవాచకం-బులకుశ్రీల, మొదలఁదుది నిల్పెననఁగర్ణ-ములు దనర్చు."

మూడులోకాల్లోనూ కూడా ఉన్న అందగత్తెలను తన అందముచే జయించిన కీర్తి పొందగలదని బ్రహ్మ గిరికాదేవి నుదుటవ్రాసి ఆ వాక్యాన్ని శ్రీతో మొదలుపెట్టి శ్రీతోనే పూర్తిచేసాడట. ఆ శ్రీలేట ఆమె రెండుచెవులూను. బ్రహ్మ లిఖించిన శుభలేఖగదా ! ఈ త్రిజగతీ సుదతీరూప విజయకీర్తిలో సర్వాంగ సమన్వయధ్వనివి రామరాజభూషణుడు అందిస్తున్నట్లుంది. "అంగప్రత్యంగకానాం యస్సన్నివేశో యథోచితమ్, సుస్నిగ్ధ సన్ధిబన్ధఃస్యాత్ తత్సౌన్దర్యమితీర్యతే" అన్నట్లు అవయవాలు కుదురుగా ఎక్కడివక్కడ పరువంగా అమరికగొని ఉన్న శారీరకసౌష్ఠవం అందం అనిపించుకుంటుంది. అలాంటి అందమైన ఆడవాళ్ళు మూడులోకాలవాళ్ళనీ గెలిచి జయిస్తుందిట. బ్రహ్మ వ్రాసిన దెంతటి యోగ్యతావత్రమోమరి ! E, D. Puffer అన్నాయన Beauty is unity and totality " అన్న పూర్ణపూర్ణాంగముల పూర్ణ

త్వాపాదక సంయోజకత్వమే సౌందర్యమది ఇక్కడ ధ్వని. రెండు శ్రీకారముల నడిమి విజయసంయోజక ప్రమాణవాక్యము. అపూర్వ కల్పనము.

రెండోది ముక్కుమీద పద్యం: ముక్కుతోపాటు కళ్ళు ప్రేక్షణమాలికలై కలుస్తాయి. ఆ ఉపాంగాలకి సుప్రసిద్ధాలైన ఉపమానాలు ఈ ఉపాంగరూపాలు వాటి పూర్వజన్మ తపఃఫలసిద్ధిగా రమణీయమైన కల్పన ఉన్న చక్కని శార్దూల విక్రీడితం. 47వ పద్యం.

నానాసూనవితానవాసనల నా-నందించు సారంగమే
లా నన్నొల్లదటంచు గంధఫలి బ-ల్కాకనం దపంబంది యో
షా నాసాకృతిఁదాల్చె సర్వసుమన-స్సౌరభ్య సంవాసియై
పూనెంబ్రేక్షణ మాలికామధుకరీ-పుంజంబు లిర్వంకలన్.

ప్రస్తుతం గిరికానాసిక అయి పుట్టిందిట పూర్వజన్మలోని సంపంగి పూవు. అప్పటి దానిబాధ పూవులన్నింటిపై చేరే తుమ్మెదలు తననుమాత్రం వెలివేశాయని. ఆ వెలి భరింపలేక పెద్ద అడవిలో తపస్సు చేసిందిట. అందుకు దక్కిన వరం ఏమిటంటే గిరికాదేవి ముక్కై పుట్టటమూ, ఆ ముక్కు అన్ని పూలవాసనలకీ స్థానం అవ్వటమూ రకరకాల ఆ వాసనలను వదులుకోలేని పూర్వజన్మలో తనను వెలివేసిన ఆడతుమ్మెదల గుంపులు ఇప్పుడు గిరికాదేవి వీక్షణపంక్తులై తన రెండు ప్రక్కలా సేవిస్తూ ఉండటం. అదీ సంపెంగ తపస్సిద్ధి. ఉపమానాలు ఉత్తమలక్షణాలు కలవిగా ఉండాలి. ఉంటాయి. అలాంటి ఉత్తమలక్షణాలున్న ఉపమానాలే తపస్సు చేసి ఉపమేయ స్వరూపాన్ని పొందాయంటే అంతకంటే ఉపమేయాలకి ధన్యత ఏమిటి? ఆ ధన్యత గిరికాదేవి ముక్కుకీ కళ్ళకీ కలిగిందంటే వాటి సౌందర్య స్వభావాలని ఇంకేం వర్ణించగలం. ఈ సందర్భంగా రామరాజభూషణుని ఇంకే పద్యంలోనూ ఇంతటి రసవత్తరమైన సన్నివేశంతో సాగించిన శిల్పవిన్యాసం కనిపించదు. ఇలా నాయకమణిలా ప్రకాశిస్తూన్న ఈ పద్యాన్ని ఏ ముక్కు తిమ్మన్నగారినుంచో సంపాదించుకుని వచ్చి ఇక్కడ ఇముడ్చుకున్నాడని వాదు ఏర్పడిందంటే ఈ పద్యం ఎంత రసప్రాగల్భ్యం గలదని ప్రసిద్ధికెక్కిందో గ్రహింపవచ్చు. నిజంగానే అది ఒక అమృతపు గుళిక. మరి దీని పైపద్యమే చూడండి దీనిముందెలా వెలవెల పోతుందో:

ఇంతి మృదూక్తి మాధురికి-నిక్షురసం బెనవోలఁ జాలకా
ద్యంతము నోడి మధ్యమ గు-ణాశ్రయమై నెఱకాఁక నెన్ని జ
న్మాంతరము ల్వహించియుఁ ద-నంతనె ఖండము లయ్యెఁగాని యా
వంతయుఁబూన దెంత పొడి-యయ్యు నఖండ తదీయ సంపదన్.

ఇక్కడ గిరికాదేవి తీయని మాటలకు చెఱుకుపాలు సాటికాలేక మొత్తంగా (తేనె ఉందనుకోండి మొదట్లో నాలికచివర తగిలిస్తే కాస్త చేదుగా ఉంటుంది, గారెలున్నాయనుకోండి ముందు కమ్మగానే ఉన్నా తినగాతినగా కసరుగా ఉంటాయి. రుచిలో ఒకటి మొదట్లో ఓడిపోతే ఇంకోటి చివర్లో ఓడిపోయింది. చెఱుకుపాలు రుచిమాత్రం గిరికమాటల రుచిముందు మొత్తం అంతట్లోనూ) ఓడిపోయింది. అందుచేత సత్త్వరజస్తమోగుణాల్లో మధ్యమగుణమైన రజోగుణంతో తపించి (బెల్లంవండి పంచదార చెయ్యటానికి వేడిచెయ్యటం అదే తపించటం) బెల్లమై చక్కెరై జన్మాంతరాలు పొందినా తనకు తానే ముక్కలై పొడి అయిపోయిందేగాని గిరికాదేవియొక్క అఖండమైన వాక్సంపదను సాధించుకోలేకపోయిందిట. ఇందులో తపస్సుకి జన్మాంతరఫలం కూడా దక్కకపోటం అసంతృప్తికరం అయింది. అదేమిటి ఆవిడమాటలు చెఱుకుపాలకన్నా బెల్లానికన్నా పంచదారకన్నా తీపి అని చెప్తుంటే స్వారస్యానికేం లోటు అనిపించవచ్చు. అఖండ తదీయ (వాక్) సంపదన్ అంటుంటే ఆవిడ వట్టి వాగుడుకాయ అనిపించటంలా మరి! బాబూ అది మాటల్లో ఇమిడిఉన్న మాధుర్య సంపదయ్యా అని నెత్తి కొట్టుకు చెప్పినా పానకం కారేదయినా బెల్లంముక్కలైనా పంచదారపొడి అయినా తీపిని పోగొట్టుకోవుగదా! పోగొట్టుకోటం కాదుబాబూ పెంచుకోటానికే ఈ అవతారాలెత్తటం అంటే ఈ అవతారాలతోటే అవి పోటీపడే అఖండ తదీయ (వాగవతార) సంపదనే గ్రహింపవలసివస్తుంది. కాకపోతే తీపికి ముక్కలూ పొడులూ అఖండాలేమిటి! దీన్నిబట్టి ఆమె వాగుడుకాయే అనిపించే ప్రమాదం ఉంది. అదలా ఉంచి చెఱుకుపాలు తీపిని పెంచుకొని ఆవిడ మాటల తీపిని జయించటానికి ఈ తిప్పలన్నీ పడ్డట్లనుకుందామంటే అసలు ప్రయత్నమే మధ్యమగుణాశ్రయం అనటంతోటే ఇది కలిసివచ్చేదికాదని అక్కడే అసంతృప్తి కలుగుతోంది. దానికితోడు మొదటి చివరి కణుపులంటూ చెఱుకుకట్టలని జ్ఞాపకం చేస్తే మరింతచేదు మింగినట్లుంటుంది. ఎటొచ్చీ వాచ్యంకాని వాఙ్మాధుర్యం ఉత్తమగుణమైన సత్త్వాశ్రయగుణ విశిష్టం అన్న ధ్వనితో సంతోషించాలి. ఇలాంటి గుణ

వై కల్యాలేమీ లేని ముక్కుమీది పద్యం ము త్తయిదువలంకరించుకొన్న ముక్కెరలాగ స్వయంగానూ ప్రకాశిస్తూ ముఖానికంతకీ వెలుగులని విరజిమ్ముతోందని ప్రకటించటమే ఇక్కడ ఆశయం అని గుర్తించాలి.

నర్మసచివాగ్రణి గిరికావేణిని రమణీయంగా వర్ణించి "మముబోంట్లకు నుతింప నలవియగునె" అంటూనే తాను చూచివచ్చితినన్న లతాంగిరూపు ఏదో మెడలో కట్టిన వట్టి గుర్తుమాత్రమే కాదని 52వ పద్యంలో "కమనీయాకృతి యోగ్యకీర్త నములం-గన్నట్టు నాళ్యామ"గా ఆకృతి విశేషమేనని స్పష్టంచేస్తూ చివరిపాదంలో "కొమరుంబ్రాయపు రంభ యాచిగురుటా-కుంబోడి సికేతగున్"గా ఆమె తారుణ్యా లావణ్యాల యోగ్యతా పరిగణనచేసి వైదికపరమైన తన కన్యాన్వేషణను బాధ్యతా యుతంగా నెరవేర్చుకొని వచ్చిన నిర్ణయాన్ని ప్రకటించాడు.

ఇంకోమాట: "కువలయాధీశ! నీవు గ-న్గొంటివేని; చెలువ చెలువాత్మఁ బాయక-నిలుచునేమొ" అంటాడు నర్మసచివుడు. ఇంత వర్ణనా చేసి తన నిర్ణయం ప్రకటిస్తూ మధ్యలో ఇదేంమాట! అంటే ఇది అనుమానమేమీకాదు. "నీవు చూస్తే వంటే వదలిపెట్టవులే" అనే నమ్మకమే. తప్పకుండా సమ్మతుందన్న విశ్వాసమే. "యస్యాం మనశ్చక్షుషోర్నిబంధః తస్యాం ఋద్ధిః నేతలధాత్రి ఏతే ఇత్యేకే. ఏ వధువును మీరు చూచినపుడు, మనస్సుకీ దృష్టికీ లగింపై ఇది బాగున్నదీ అని అను కుంటారో అక్కడ సమృద్ధి కలుతుందయ్యా!" అని రేమెళ్ళవారిచ్చిన (528 పుట) వైదిక దృక్పథాన్ని ప్రకటించటమే అది.

అది గుర్తించిన వసురాజా "కిన్నరవిహంగయుగళిచే-మున్ను విన్న, సన్ను తాసన్న శుభదప్ర-సన్న ఫణితి; మది సరిదాక ముదమునఁ-బొదలి మేది; నీపతి హితా గ్రిణిని ప్రోవ-నూపుమనుకు" అతడు "ఈబాలఁబోరాదు...." అంటూ ఏర్పరించి దారి వివరిస్తూ నడిపించుకు వెళ్ళాతు. అయితే ఈ పోరాని దారులని ప్రస్తావించటం ఎందుకు? అంటే వైదిక వివాహ ప్రయోగంలో 8వ మంత్రభాగం "అనృక్షరా ఋజవస్సన్తు పన్థాయేభిస్సఖాయో యన్ని నోవరేయమ్" అని ఉంది. దానికి రేమెళ్ళ సూర్యప్రకాశశాస్త్రిగారు "హేసఖాయః-వరేయమ్-శ్రేష్ఠమైనటువంటి కన్యయొక్క తండ్రిని గురించి, యేభిః-పథిభిః-ఏ మార్గములతోటి మీరు వెళ్తున్నారో ఆ మార్గ

ములు, అన్యక్షరాః - కంటకాది కర్కశరహితారః - ముఖ్యా రాఖ్యా మొదలైనవి లేకుండా వుండుగాక!" అని ప్రతిపదార్థసహితంగా వివరించారు. ఆ విశేషమే రామరాజభూషణు డిక్కడ ప్రస్తావించాడు. అయితే శాస్త్రనిష్కర్షని సౌమ్య వాగ్విన్యాసంతో నిషేధకారణాలు వివరిస్తూ నర్మసచివుడు తన మిత్రుని కర్కశమార్గాల నుండి తప్పించి చక్కని దారిని తీసుకువెళ్ళాడు. ఒక్కొక్కటే చూపిస్తూ "అధిప యిదిమానికపుఁగోన-యది లతాంత, రజము సొరువయిది కప్పు-రంపుటనఁటి, చప్పరం బలయది కాంత-సదనమనుచు, నరపతికిఁజెప్పె నరుగుచో-నర్మసఖుఁడు". అని కథా సూత్రాన్ని మంచి పట్టుగా సాగించుకుంటున్నాడు సూతపౌరాణికుడు. ఈ కొలికి ముత్తెము 60వ పద్యమైన కందము. "కుతుకమున నచలసుతయగు, సతిఁగనఁజను రాజమౌళి-చాడ్పున నపుడా, క్షితిపతి నతిఁజూచుతమిన్, హితసూచిత సరణిఁగోన-కేతెంచునెడన్"... ఇందులో గిరికను అచలసుత, సతి అనీ వసురాజును రాజమౌళి అనటం ముఖ్యంగా గుర్తుంచుకోవాలి. అది పార్వతీ శివ భావన.

ఆ వచ్చిన వసురాజుకి తొలుత భద్రకుంభములు, తర్వాత పచ్చతోరణాలూ కనిపించి కళ్యాణగరిమఁదెలిపినాయట. తర్వాత నెమ్మదిగా "ప్రాచీనపుం జాలుం దీవెల చాటున న్నిలచి.... ఆలోలాక్షి నీక్షిం" చాడట. నర్మసచివుడు 51వ పద్యంలో "నీవు గన్గొంటివేని....ఆత్మఁబాయక" అన్నదాని సార్థక్యం ఇప్పుడు 63వదైన చంపక మాల "కనుఁగవ పూర్ణకామమగు.... మన మతిచిత్రవృత్తియగు.... సంభ్రమం బెనసి రసోత్తరంగమగు నీప్సిత మానగమానభేదకిన్" అని వివరించాడు. ఇది రామరాజభూషణుని వైదిక విజ్ఞానదృష్టికి మంజేతికంకణం.

వసురాజు గిరికామనోహరాకృతులందు దృష్టినెలా నడిపించాడో చెప్పి 64వదైన తేటగీతిలో "రాజన్యమౌళి.... వనితరూప, మనిత రాయతమగు నాత్మ-నభి నుతించె." అని రాజునోట నా సౌందర్యాలని తృప్తిగా పలికించి 76వ పద్యం మత్తేభంలో "అపుడా నర్మసఖుండు చేరఁజని క-న్యారత్నముంజూచితే.... నా పలుకు తథ్యంబౌఁగదా యింక నేజపి వేషంబునఁ జేరఁబోయి లలనా జన్మప్రకారంబు దేట పడం గాంచెదఁ బంపుమన్న" అంటూ సచివుని జపి వేషధారణకు కారణం కల్పించాడు. ఇంకా ఇదెందుకు! కన్య కంటికి నచ్చింది మనసుకు నాటింది. ఇపు డీజన్మ ప్రకారం విచారించటం ఏమిటి? ఇక్కడా వైదికవిష్ఠ ఉంది.

"అనమానార్ష గోత్రజాం। లక్షణ్యయతీశ లక్షణ్యాం ప్రియముద్వహేత్" అని వున్నది....సమానమైన ప్రవర (ఋషిక్రమం) సమానమైన గోత్రం కాకుండా వున్నట్లయితే అటువంటి ఆమెను తీసుకువచ్చి "పెళ్ళిచెయ్యాలట. ఇంకా "బంధు శీల రక్షణ సంపన్న శ్రుతవానరోగ ఇతిబలసంపత్" వరుని పక్షంలో వారి బంధువు లందరూ బాగుండాలి. శీలం బాగుండాలి అన్నట్లే వధువు పక్షమూ ఉండాలిట. "బంధుశీలరక్షణ సంపన్నామరోగాం పరీక్షేత" అరోగాం అన్నప్పుడు "ప్రజోత్పాదన అసమర్థాం ఇత్యర్థః" అని సంతానం కనటానికి వీలులేని రోగం గనక అయినట్లయితే ఆమెను నీవు స్వీకరించవద్దు. అటువంటి రోగరహితమైనటువంటి ఆవిణ్ణి స్వీకరించ వలసింది. లా రేమెళ్ళవారు తాత్పర్యం ఇచ్చారు. ఆ శాస్త్రవిధానాన్ననుసరించే సచి వుడు జన్మప్రకారం కనుక్కుంటానన్నాడు. ఇక్కడినుంచి ఓ నాటకం మొదలు. వసురాజు ప్రేక్షకుడు. సచివుడు జపి పాత్రధారి. తక్కినవారు సహజపాత్రలే. ఈ సందర్భంగా సచివుడు పగటివేషగాడై బయటపడితే అంతటికీ మోసం వొతుందని రాజు కంగారు. "ఏగతి యోగిరూపము వహించెదొ.... యిష్టసఖా భవదీయ నీతి కార్యాగతి నేడు చూతముగ-దాయని యంపిన నాక్షణంబునన్" అని 78వ పద్యం ఉత్పలమాలలో వేడుకుంటాడు పొగడుతాడు, బ్రతిమాలతాడు, పంతమాడుతాడు. ఆయనబాధ ఆయన్ది మరి! ఎలాగయితేనేమి "నరపాల నిరపాయ-హితవిహార, హరిగడిదేరి యొక జడ-దారియయ్యె" పై అన్నింటికి తగిన విశేషాలతో సచివుడు యోగి రూపాన్ని ధరించాడు.

వెనుక నర్మసచివుడు హఠాత్సంభవుడైన సద్యోజాత వ్యక్తి అనుకో అక్క ర్లేదనీ కొందరు రాజువెంట వస్తుంటే వాళ్ళలో ఒకడై ఉండవచ్చనీ అనుకున్నాం. ఇప్పుడతడు మాయా యతిగా మారటం చూస్తుంటే అనుమానంగా ఉంది. సామాన్య మానవుడైన సచివుడు లతల్ని తలకి చుట్టుకుంటే జటామకుటం అనిపిస్తుందా? పసుపురంగులో ఉండే పుప్పొడి పూసుకుంటే విభూతి అనిపిస్తుందా? ముఖ్యంగా పూలమొగ్గలసరం జపమాల ఎలా అనిపిస్తుంది? అందులో మంజువాణి వంటి సమం జస వచన చాతురీ రంజితలున్న పూబోడులని నమ్మించటమా! అసంభవం. కాని 79వ దైన సీసపద్యంలో రామరాజభూషణు డలాగే వ్రాసాడు. నిజమే. దాన్ని కొంచెం సమ్యగ్దృష్టితో పరిశీలించండి.

శిరస్సుకి లతామకుటం, ఒడలికి పుష్పపరాగాం, చేతిలో శాఖాదండం చిగురు టాకు వలువలూ, చెట్టుపట్టపటకా, ఇంకో చేతిలో పూలసరమూ ఫలసార పాత్రాగల వ్యక్తి ఒకడున్నాడనుకోండి. ఆ వ్యక్తే రాజుగారికి పరిచితుడైన నర్మసచివాకృతిలో వెంటవచ్చిఉండి అవసరానికి మాయాజటిలుడిగా మారే సందర్భంలో అసలు వ్యక్తి కున్న లతామకుటం జటాజూటంగా, ఒడలి పుష్పపరాగం విభూతిగా, శాఖాదండం మంత్రిదండంగా, చిగురుటాకు వలువల కాషాయాలుగా, పట్టపటకా యోగపట్టిగా, పూలమాల జపమాలగా, కేసరాల త్రాడు దర్భల మొలత్రాడుగా, ఫలసార పాత్ర కమండలంగా రూపాంతరం అయ్యేట్లు చేసుకున్నాడంటే ఎవరైనా ఎలా సందేహించ గలరు ! ఇప్పుడాలోచిస్తే నర్మసచివుడై వచ్చిన వ్యక్తి అతని సహజరూపాన్నిబట్టి వసంతుడని తేలిగ్గా తెలుసుకోవచ్చు. రాజవిదూషకులకి సామాన్య నామధేయం వసం తకుడనే అయినా రామరాజభూషణుడు కల్పనావిశేషావహంగా సృష్టించిన నర్మసచివ పాత్ర కసలు పేరే పెట్టలేదు. వసంతకుడని పేరుపెట్టిఉంటే భాసాదుల నాటకాల్లో మోదకాలు మెక్కటంలో మక్కువ చూపించే హాస్యపాత్ర మాత్రంగా అనిపించి "నరపాల నిరపాయ హితవిహార హారి"గా ముద్రపడకపోవచ్చు. నర్మసచివుడుగా ఆ ముద్రి దక్కించుకున్నాడు. అమరకోశంలో "కేళీపరీహాసా; క్రీడాలీలాచనర్మచ" (౧-౨౧౪) అన్నచోట గురుబాల ప్రబోధిక "నృణాతిరత్యతిశయం ప్రాపయ తీతి నర్మ-నృానయే-రత్యతిశయమును బొందించునది" అని నర్మశబ్దాన్ని వివరించి ఆ ముద్రినే స్థాపించింది.

ఇంకోమాట తృతీయాశ్వాసంలో 134-148 పద్యాల్లో "వనవిభవముఁదె"ల్పుచు వసంతుని మంత్రిత్వాన్ని ఇతర విశేషాల్తో గిరికకు చెలులు వివరించటంలో నర్మ సచివాగ్రిణి పాత్రి సార్థకతని ధ్వనింపజేసాడు రామరాజభూషణుడు. "నిరుపమ మాధవ నిత్యసన్నిధానమున బొల్చు" (134) "లతావని తాళి" (135) "మరునకుఁ జైత్రమంత్రి.... తచ్ఛదావరణము బాయవిప్పి" (136) "మానధనంబుల ముద్రి వెట్టు" (137) "పరాగ పటిమఁగప్పి మధువ్రతిఁ జేరఁబోవుచు" (138) "పద్మిని చిక్కి స్రుక్కగా దినకరముద్రజూపి" (139) "పైపైఁగాంచన స్నానమాడించెన్ మాధవుఁ డీసమాగతి వింటే" (140) "వాక్యసంసిద్ధి మాధవు వరనఁగన్న" (141) "కోరక వ్యూహ ముక్తావళిదార్చె" (142) "భవదీయాలాప లీలా ప్తి నింపలవంగోరి" (143) "సముద్ధూళిత చూళికా భసితయై బద్ధాళి రుద్రాక్షయై" (144) అంటూ నర్మ

సచివుడు నడిపిన మంత్రాంగాన్ని ధ్వనింపచేస్తూ రకరకాల కల్పనల పలికించాడు. నిజానికి అసలే వసువియోగ వ్యథలో కొట్టుకుపోతున్న గిరికా లలనకు ఇంకా బాధనే కలిగించే వసంతవర్ణనకి చెలులు పూనుకోకూడదు. అలా పూనుకోటంలో వసురాజుకి సీయందు మనస్సుంది: ఆ విషయాన్నాయన మంత్రి సరసంగా మనకి తెలియ చెయ్యటమే కాక ఆ రాజు దర్శనభాగ్యమూ కలిగించి ప్రణయముద్ర స్థిరపరచాడనే జరిగిన వృత్తాంత విశేషాన్ని ధ్వనింపజేస్తే గిరికాలతాంగికి తాపోపశమనం కలుగ వచ్చుననే చెలుల ఆశయం. సాహిత్య రసపోషణుడైన రామరాజభూషణుని ధ్వని వైదగ్ధ్యానికి నర్మసచివుని పాత్ర ఇలా పట్టుకొమ్మగా చేవ కలిగిఉంది.

నర్మసచివుడిగా పేరు ఏదీ లేకపోయినా మాయాజటులిడిగా చేరినప్పుడు మంజువాణి "తావక శుభాంకముఁగన్న సువర్ణరేఖలం బాయని కూర్మి దె"ల్పు మనగ "గౌతముని.... అన్వవాయ కలశాంబుధిఁబుట్టినవాఁడ గౌతమాఖ్య నెసఁగువాఁడ" నంటూ ఒక ముని పేరుచెప్పి ఆయన పేరుమీఁదే వంశీకుడుగా గౌతముడు అనే పేర్న మసల్తున్నానంటాడు. శాక్యమునిని అమరం "గౌతమశ్చార్కబంధుశ్చ" అని పేర్కొంది. జనతావినుతాభిధేయుఁ"డైన ముని గౌతముడైతే అర్కబంధువైన ఆ వంశీయ గౌతముడు తాను నందుడనబడేవాడు కావచ్చు. సౌందరనంద పరిణయం తెలిసిందేగదా! దాన్నిబట్టే "మహా స్వరసప్రతిభానుభావుఁడ"నని తన్నుగూర్చిన విశేషం చెప్పుకున్నాడు. అర్కబంధువు-పద్మం. శ్రీవిద్యానిలయం. ఆ విద్యాదృష్టితో చూస్తే: వసిష్ఠాది ప్రజాపతుల్లో ఉన్నాడో గౌతమ మహర్షి. ఆయన "బ్రహ్మను ప్రార్థించి విత్తనములు చల్లగనే ఫలించునట్లు వరము పుచ్చుకొనె"నట (పూర్వ గాథా లహరి). "వాచం ధేను ముపాసీత-తస్యాః చత్వారి స్తనాః స్వాహాకారో వషట్కారో హంతకారః స్వధాకారః" (బృ. ఆ. 5-8-1.) వాక్ అనే ధేనువు నుపాసిస్తూ ఆయన స్వాహాకార వషట్కారాలనే రెండు స్తనములను పిండి దేవతలను హంతకారమును పిండి అతిథుల్నీ స్వధాకార స్తనమును పిండి పితరుల్నీ తృప్తిపరుస్తూంటే, ఆవాక్కును సరిగా ఉపాసన చేయనివారికి అది "అధేన్వాచరతి మాయయైష వాచం శుశ్రువాగ్ం అఫలా మపుష్పామ్" ఋ 10.71.5 మాయాధేనువై వాగ్ధేనూపాసకుడైన గౌతముని శబ్దదర్భకాండం తాకిడికే రూపుమాసింది. కథలో గోహత్య అంటగట్టబడితే గౌతముడు గంగను ప్రవహింపజేసి ఆ పాపం పోగొట్టుకొన్నట్లూ ఆ గంగే గౌతమిపేర ప్రవహిస్తూ నది అయిందని చెప్తారు. దీన్నిబట్టి ఆ గౌతముడు "ఏవాహ్యాస్య

సూనృతా విరప్శీ గోమతీ మహీపక్వాశాఖా నదాశుషే" ఋ 1-8-8. సూనృతా అంటే నియమిత కర్మానుష్ఠాన విధివాక్యం, విరప్శీ అంటే రమణీయార్థప్రతిపాదక శబ్దయుక్త వాక్యం, గోమతీ అంటే ఆవు పాలిచ్చినట్లు కోరికలనిచ్చే మంత్రవాక్యం. ఇవన్నీ చక్కగా పక్వమైన ఫలాలతో ఉన్న తరుశాఖా సమానమైన సాంస్వతో పాసకు డన్నమాట. అట్లాంటి వాడి వంశంలో వాడిగా మాయాజటిలుడు చెప్పుకున్నాడు. ముఖ్యంగా "పక్వాశాఖానదాశుషే" అన్నది గ్రహిస్తే వసంత వైభవం మనసులో మెదలకపోదు. అంతేకాదు వాగ్దేను సనముల్లో రెండోదిగా ఉన్న "వషట్కారము" యః సూర్యః సధాతా సఉఏవ వషట్కారః "ఐ. బ్రా 3-48" తద్వాఏషఏవ వషట్కారః య ఏష తపతి" శ. బ్రా. 1.7-24 అని విధాత అయిన సూర్యుణ్ని వషట్కారుడన్నాయి శ్రుతులు. పైగా "వౌషట్"లో "వౌశబ్దో నిపాతత్వాత్ వౌ ఆగతి ప్రజననే త్యాది ధాతుజత్వాత్ వాగమనస్వభావ మాదిత్య మభిధత్తే తదే తదభిప్రేత్య అసౌవావ వావిత్యుక్తమ్। వసంతాద్యా ఋతవః సంఖ్యావశాత్ షడిత్యభిధీయన్తే॥ (సా.భా.ఐ.బ్రా. 3-6) అంటే "వౌషట్"లో "వౌ" అనే పూర్వ భాగం సూర్యుణ్ని "షట్" అనే ఉత్తరభాగం వసంతాది ఋతువుల్ని తెలిపేవిట. ఆ సూర్యుడు మన వసురాజైతే ఆ వసంతుడే ఆయన నర్మసచివాకృతిగొని వచ్చిన వాడు. తర్వాత మాయాజటిలుడై మంజువాణి అడగ్గా తన ఆత్మస్వరూపం ధ్వనింప చెయ్యటానికే "గౌతమ"నామాన్ని వాడుకున్నాడనేది స్పష్టమేకదా!

ఇలా భారతం పంచమవేదం అన్న ప్రశస్తిని సార్థకంచేస్తూ వైదిక వివాహ విధిసూత్రాన కల్పనా విశేషావహమైన రసమాధురీ రంజితపద్య ముక్తాఫలసరం అల్లుకు వస్తున్నాడు. ఈ వైదిక విజ్ఞానాన్ని పరికిస్తే దీని అమూలకంగా భావించ లేము. వధూవరణం ఒక సామాన్య విషయంగా భారతం ప్రస్తావించని, లోనారసిన విషయవివరణమేఇది. కాబట్టి రామరాజభూషణుని భారత (ఆద్యసత్కథా) తాత్పర్యం అన్న ఆంతర్యం వెక్కుచెదరలేదు.

సరే గౌతమాఖ్యనెసగు తాను పిన్నటనాఁటనుండి సకల పదముల ఆత్మాను సరణ మహిమతో వసునాథు రహస్య మంత్రిసంభావనచే యాత్రాసరళిగా వచ్చి ఆయనకు ఉపాయన మిచ్చుట కూర్చువాడనై వచ్చానంటాడు. 95వ దైన చంపకమాలలో "వికచసారస సౌరభసౌరపూరితాంబర"మీకొండ అనటంలో మధ్యాహ్నికార్షణి

ప్రదానం పద్మినీ మనోహరుడైన ఆయనకు ఉపాయనంగా ప్రయోగం చేసాడు రామరాజభూషణుడు. ప్రతిపదార్థ వ్యాఖ్యల్లో "సౌరభసారపూరితాంబరంగా చేసారు గాని పద్యపాఠం "సౌరభసౌరపూరితాంబరం"అనే ఉంది. సౌరపూరితాంబరం అదిట. ఆకాశానికున్న పేర్లలో 'సురవర్త్మ'అనేది ఒకటి "గగన మనన్తం సురవర్త్మఖమ్" అని అమరం. "సూరాణాంవర్త్మ, సురవర్త్మ సురలయొక్క మార్గము" అని గురుబాల ప్రబోధిక. ఆ మార్గం 'సౌర'ప్రయోగంకాగా అంబరం "అంబతే శబ్దాయత ఇత్యంబరం-అబిశబ్దే-శబ్దగుణకమగుటవలన మ్రోయుచుండునది." అని గురుబాల ప్రబోధిక. ఇప్పుడు సౌరపూరితాంబరం అంటే సూర్యప్రకాశంచేత మ్రోతతో నిండి ఉన్న కొండ అది ఆ కొండని 11వదైన వచనంలో "వనదేవత లెత్తు నారతిపళ్ళెరంబుల కరణిఁదనరు తరణికాంతపట్టిక"లను కలదిగా రాజుతో సచివుడిదివరకే అన్నది గుర్తుచేసుకుంటే ఈ పద్యంలో సరస ఏకిరుకీ జనితమై వికచసారస సౌరభంతో వ్యాపించిన తుంపరలవల్ల తరణికాంతపట్టికలున్న ఆ కొండ సౌరపూరితాంబరం (సూర్యకాంతిచే మ్రోతతో నిండింది) అయ్యింది. అది మధ్యాహ్నకాల సూచన. అది మనుచరిత్ర ద్వితీయాశ్వాసం 12వదైన మత్తేభంలో "నళినీబాంధవభానుతప్త రవికాంత స్యంది నీహారకందళ చూత్కారపరంపరల్ పయిపయిన్ మధ్యాహ్నముం దెల్పెడిన్" అని తెలియజేసిందే. నర్మసచివుడు గౌతముడుగా ఈ పద్మినీ (స్త్రీ) సముదయాన్ని చేరింది మధ్యాహ్నాని కన్నమాట. అయితే రాజుతో నగసౌందర్యాల్ని దర్శించింది ఎప్పుడో? అంటే మనం గుర్తుచేసుకున్న వచనంలో "తరణికాంత పట్టికలఁ బుట్టు దట్టంపు సెకలపై నెట్టుకొను నతిచిరప్రసూత చమరీ స్తన్యంబులు పొంగిన గమంగొని చెంగటి మునిజన తపోవన సవనభవంబులఁ బ్రవర్గ్యారంభంబులని" చూడగ సూర్యకాంతమణుల పలకల వేడితగిలి ఆ నడుమనే ఈనిన చమరీమృగాల పాలు పొంగితే అది అక్కడుంటున్న మునులుచేసే ప్రవర్గ్యహోమారంభా లనుకున్నారట. అంటే మధ్యాహ్నకాలం దగ్గిరపడుతోంది అనే. ప్రాతఃకాలిక నైమిత్తికాలు నెరవేర్చుకొని వనదర్శనార్థం వచ్చారు ప్రథమాశ్వాసంలో. పొద్దెక్కేవరకు తిరిగారు. మధ్యాహ్నం ఔతుండగా కోలాహలాచలం చూడ్డం అయింది. అంతలో గానం వినిపించింది. మధ్యాహ్నానికి గౌతముడు సరసదకీరుకంలో నవపద్మినీ మనోహరుడికి ఉపాయనం సమర్పించుకోటానికి అక్కడికి చేరినట్లు చెప్తున్నాడు. ఇలా కాలానుగుణంగా చర్యను ప్రకటింపజేసేటప్పుడు 'సౌరపూరితాంబరం' అనే

పాఠం బాగుంటుంది. రామరాజభూషణు డీసమయజ్ఞతను పాటించాడనేది నిర్వివాదం. వివిధార్థ విశేషాల్లో దీన్ని విస్మరించకూడదు. ఇక ప్రవర్గ్యహోమప్రస్తావన చేయటం వల్ల ఆతని వైదికపరమైన తాత్పర్యమూ వెల్లడిఔతూనే ఉంది.

చివరికి తను వచ్చినపనిగా ఆ మాయాముని 97వ దైన చంపకమాలలో "ఈ లతాంగి పావన కులగోత్రభూతి చెలువా! చెలువారఁగఁ జెప్పవే" అని అడిగే సాడు. దానికి మంజువాణి మీకు తెలియందేముంది! ఏదో మామీద కూర్మితో అడిగా రంటూ "విన్నవించెద నే విను"మని మొదలు పెట్టింది. చక్కని కథన విధానంలో 102 పద్యంగా "అచలవైరి స్తుతకీర్తిసాంద్రుఁడు వసుక్ష్మాపాల (వసురాజు) చంద్రుం డిలన్" కలడంది. ఇంద్రుడి రాజధానిలా ఆరాజు కథిష్ఠానపురం ఉందంది. (103వ పద్యం) దాని మెడలో హారంలా శుక్తిమతీనది ఉందంది (104వ పద్యం). ఇంతే ఇక్కడినుంచి ఆ నది ఒక సొగసుగత్తెగా సజీవపాత్రగా దర్శనం-ఇస్తుంది. మాట వరసకా నది అంటుందేగాని జీవనము, ఆశయమూ, ప్రచారమూ, నవకమూ వెలసిన మూర్తిగానే పరిచయం చేస్తుంది 105వ పద్యంగా. అక్కడినుండి గిరికాకన్యకు జన్మ కారణమైన శుక్తిమతీ కోలాహలుల పరస్పర దర్శన ఆకర్షణ సంభాషణ సంగమ సందర్భాలని 140వ దైన వచనందాకా జడప్రకృతియన్నది భ్రాంతిలోకి నెట్టి మూర్తి మంతములైన సజీవపాత్రలే అనే భావన మనసుకి నాటుతూ మంజువాణి అన్న తన పేరుని సార్థకం చేసుకుందా చెలియ. సరస ప్రణయకావ్యశ్రవణానంద ప్రస న్నత పొందటమే మాయాజటిలునకు పని అయ్యింది. ప్రణయకథ పతాకసన్నివేశం. కొంచెం పరిశీలించాలి.

ఎంత మనసున్న మగువే అయినా పెద్దల యొటుకబడని కూటమికి అధార్మిక భీతి స్త్రీకి తప్పకుండా ఉంటుంది. శుక్తిమతికీ అలాగే ఉంది. ధర్మరక్షణాదీక్షతో భూమిని పాలిస్తూ ఇంద్రుడినే మెప్పించిన వసురాజే అధార్మికతను సహించడు. ఆయన శిక్షనుంచి తప్పించుకోటానికి ఒకటేదారి. అది తనపక్షంగా దోషంలేదని ప్రకటించుకోటం. అదే శుక్తిమతి అనుసరించింది. తనయెడ తప్పులేదని ఎలుగెత్తి మొరపెట్టి చాటుకుంది. ఆమె ఆర్తి "ఈ తడవేల ప్రోవరావె" అనిట. వధూవరుల ఇరుపంక్తల పెద్దరికమూ లేని అధర్మభీతి పోగొట్టి ఆ పెద్దరికం వహించటానికి ప్రజ ఎవ్వరికైనా ప్రభువు అధికారం కలవాడని ఆమె గుర్తించి, తాను ఆ స్థానానికి వెళ్ళి చెప్పుకోలేదు కనుక ఆ ధర్మసంరక్షణకాలం మీరిపోతోందని, తానున్నచోటునించే

ఎలుగెత్తి ఈ తడవేల వసుభూప ప్రోవరావె అని ప్రవాహధ్వనిగా మొరపెట్టింది. ఆమెకంటె ముందే "భూరివారి విహగ"ములు వధూపక్షనగల ద్విజుల "రవగౌరవ మెచ్చెనెల్లెడలన్" అట. కాదామరి! పురోహిత మర్యాద అట్టిది. సమంజస వచన చాతురీరంజిత గాబట్టి మంజువాణి ఇక్కడి కథనంలో ఇకముందు జరుగవచ్చే వసు రాజ కార్యం జడపర్వత శిక్షణ కనుకూలంగా ఇక్కడ శుక్తిమతిని సంపూర్ణ సజీవ మూర్తిగా పాత్రవ్యథా వ్యక్తీకరణ చెయ్యనట్లు చెప్పింది. నదీ-సేటిపక్షులూ అంటూ జడ తిర్యగ్భావనకే మరల్చింది. అయినా అంతవరకూ సాగించిన మూర్తిమంత భావ నను సహృదయ శ్రోత వదలివేయక ఆ ఎలుగెత్తి మొరవెట్టటం శుక్తిమతి ఆశయం లోని ధర్మరీతిగానే గ్రహించాలి. మరి ఆ చెలి అలా ఎందుకు మరల్చిందీ అంటే కథాక్రమంలో వచ్చే "నానాజనపద కటక స్థానాశ్రయు"లట్లు గ్రహింపగల వారూ కాదు గ్రహించనూకూడదు. వారు రాజుగారికి నివేదించుకుంటారు. "ఎక్కడినుండి వచ్చెనో యొక్క నగంబు........ గుభిల్లున శుక్తిమతీ స్రవంతి పేరక్కన వ్రాలి యాఁగె" (146వ పద్యం) అనీ "....భూమి ధరోపరోధమున బొంగు నభంగ పరిజ్ఝరంబు పైపై మహియెల్ల నల్లుకొన" (148వ పద్యం) "....తోఁట, చేను, కొటారంబు, దొడ్డియనెడు నాసలన్నియు నిసుమంత లయ్యెస్వామి ... భాగ్యమునికిఁ దప్పివచ్చితి"మని నదికి కొండ అడ్డంపడితే వరదలు వచ్చినట్లు చెప్పుకుంటారు. ఇలా క్రమంగా ఈ పరిస్థితికి మారేటట్లు 141వ పద్యంలో శుక్తిమతీ వ్యథా వ్యక్తీ కరణంలో చరాచరోభయభావ సమర్థనీయమైన ఫణితిని మంజువాణి కథనం సాగించి నట్లు చెయ్యటమే రామరాజభూషణుని ఆంతర్యంగాని కోలాహలుని బలాత్కారానికి బలికాబోతూ రక్షణకై దురపిల్లటంకాదు. 148వ పద్యంలో అన్నట్లు "భూమి ధరో పరోధమునఁబొంగునభంగ పరిజ్ఝరంబు" భంగపడని శుక్తిమతి పొంగిపోయింది. అంతవరకు సాగిన ప్రణయభావ క్రమపరిణామ చిత్రణం అంతాచూస్తే ఈ తాత్ప ర్యమే రామరాజభూషణుడి ఆంతర్యం అని తెలుస్తుంది.

వధూవరు లొకరొన్కకరెంత ఇష్టపడినా పెద్దలు మధ్యవర్తిత్వం వహించి వారిని వదిమంచి ముందరా దంపతులను చెయ్యాలన్నది మంగళకరమైన వైదిక మర్యాద. దానిని పాటించనందుకె కోలాహలుని శిక్షణ. ఆ శిక్షణతో ధర్మనిర్వహణ చేయటమే వసురాజు తపస్సుగా ఇంద్రమైత్రి సమకూడింది. విమానం దక్కింది. గుర్తుంచు కోండి: ఆ వసురాజే గిరికాదేవి వలపుటురుల్లో చిక్కుకొన్నప్పుడు వధువుపక్షంగా

మంజువాణి రాయబారం నడిపిస్తే వారిద్దరిమధ్య ప్రణయం ఫలోన్ముఖం అయింది. అప్పుడు మధ్యవర్తిగా మహేంద్రుడే సర్వనిర్వాహకుడౌతాడు. ఇలాంటి పెద్దలు నెరపవలసిఉన్న నిర్వాహకం ప్రాముఖ్యాన్ని గుర్తించే శుక్తిమతి వ్యక్తిగా పౌరసత్వ ధర్మాన్ని పాటించి ధర్మపీఠానికి మొరపెట్టుకుంది. దానివల్ల శుక్తిమతీ కోలాహలుల పరిణయచరిత్రకేమీ కళంకం అంటదు. వారిద్దరూ ఒకరికొకరు మనసిచ్చి పుచ్చుకొన్న ప్రణయమూర్తులె. మంజువాణి నోట ఆ కథ సుమనో మనోరంజకంగా చెప్పించటంలో రామరాజభూషణుడు నూటికి నూరుపాళ్ళూ కృతకృత్యుడయ్యాడు. ఆ సాఫల్యాన్ని ప్రతిపదార్థ వ్యాఖ్యాన గ్రంథాలనుంచి రసాస్వాదన చెయ్యటం మంచిది. ఊరికే సారాంశంగా కథామాత్రంగా ఇక్కడ చెప్పి వదిలేస్తాను.

కవి వర్ణనలకు చాలిన జీవనమూ, స్వచ్ఛమూ పావనమూ అయిన ఆశయమూ, లోకంలో శాశ్వత సాఫల్యతా బోధకమైన నడతా ముత్తెపు మెరుగనిపించే లావణ్యమూగల శుక్తిమతి పేరుగల జవరాలుంది. ఆమె జాత్యుత్తమురాలుగా నర్మదా, బాహుదా, వేత్రవతీ, సరస్వతీ మొదలైన చెలికత్తెలతో రోజూ బ్రహ్మగారి కొలువుకి వెళ్ళి వస్తూంటుంది. ఒకనాడల్లా వెళ్ళివస్తూంటే కోలాహలుడనే సుందరుడు బ్రహ్మసభకు వెడుతూ శుక్తిమతి కెదురయ్యాడు. అతడూ సత్కులప్రసూతుడే. హిమవంతుని కొడుకు. ఇంక చెప్పాలిసిందేముంది పార్వతికి తమ్ముడూ ఈశ్వరుడికి మరిదీకదా! ఆ ధన్యుని శుక్తిమతి మన్నించి కులీనమర్యాదగా వినయంతో తొలగి వచ్చేసింది. కాని ఆమె అందచందము లాకోలాహలుని ధైర్యాన్ని సడలించేసాయి. ఆ చెలువ చెలువు సుశ్లోకుడైన కోలాహలుని వశమయ్యింది. ఇలా ఇద్దరిలోనూ అనురాగం ఉదయం అయింది.

అప్పటినుంచీ కోలాహలుడు 112-117 పద్యాలదాకా మదనపీడితుడయ్యాడు. 118వ దైన కందంలో అతడు మణిభూషణా లలంకరించుకొని దివ్యరూపోజ్జ్వలుడై శుక్తిమతిని చూడబోయాడు. (ఆమె తలిదండ్రులెవ్వరో ఏమయ్యారో తెలియదు)ఆమె కూడా ఎదురేగి అతన్ని సగౌరవంగా పిలుచుకువచ్చి రత్నపీఠికాసనం ఇచ్చింది. వినయంతో కొండంత దేవుడికి కొండంత పూజ కాదుగాని "భక్తినేనిచ్చు నీ పుష్పపత్రి తోయిమాత్రము" స్వీకరించమంది. సకలార్థ సమృద్ధిగల నీ కోరదగిన దీ మూడు లోకాల్లోనూ ఏముంటుందంటూ 124వ కందంలో అంతటి మీరిటు రావటం నాయందుగల

అనురాగ విశేషమే అని అందించింది - చక్కగా అందుకుని కోలాహలుడు నిజమే నంటూ భువనాశయ సన్నివేశవేదివి సరసాగ్రిగణ్యవుగదే అన్నాడు. ఆమె సుగుణాల్ని సన్నుతించాడు. ఆ దారిలో ఎంతమంది వస్తూపోతూ నాకెదురౌతున్నా నిన్ను చూసినట్లుండదు. మనకూరిమి పూర్వజన్మానుబంధం అయ్యుంటుంది. నా మక్కువ నీవు గ్రహించికూడా నువు నన్ను పలుకరించకుండా తప్పుకుపోతూంటావయ్యో. మరి నిన్నుచేరి నీ తీయని మాటలు వినేదెలాగని ఎప్పుడూ అనుకుంటూ ఉంటాను. వర్ణనీయలైన వారినిగురించి కవులెంతవరకైనా సాగిపోయేటట్లు నీ పొందుగోరి దూర మనక ఇలా వచ్చేసాను. నా సర్వస్వమూ నీ కిర్పించుకుంటాను నీ యిష్టంచొప్పున నడుచుకుంటాను నన్నింక ఈ దైన్యాన్నించి తప్పించి నీ అంతరంగంలో చేర్చుకో మన్నాడు.

శుక్తిమతి వాని మాటల మర్యాదనీ గొంతు గొప్పతనాన్నీ మెచ్చి నమస్కరించి నయభయవినయాలు ముప్పిరిగొని ఇట్లా అంటోందని కథాసూత్రపు కొలికి కంద పద్యంలో ఉంది. ముఖ్యంగా కులీన అయిన యువతి ఆంతర్యం తొందరించినా అంతరం గుర్తించి ప్రవర్తించటంలో ఉండే సహజాభిజాత్యరీతిని ఈ కందం శ్రోతల ముందుంచుతుంది. తగినట్లై అచలితోత్తుంగ ధైర్యమూ, గౌరవభావమూ, పవిత్రమైన నడతా, దిగజారని శీలమూగల మీకు....ఏదో అంటూ తనను కించపరచుకొని నాతో చెలిమి ఎట్లు పొసగునని అందంగా కందంలో "మీయెడ....మారసము లెచటికెక్కు మహాత్మా!" అని గడుసుగా నివారించింది. (మీరే ఇందులో దిగవలసి ఉంటుందని భవితవ్యాన్ని ధ్వనింపజేసిందానది) ఆడువారి మాటలకు అర్థాలు వేరులెమ్మన్నది ఎరుగడో తమకం గుర్తింపనీయలేదో మరి ఆ కోలాహలుడు "భవత్కమనీయ కాంతి ధారావళిలో మునింగితి దయామతిఁ బ్రోవక సుళ్ళఁబెట్టెదో; నీవిక గుబ్బిచ్చి యెత్తి ఘన నిర్వృతిఁ జెప్పలఁ దేల్చెదో" అని భారం ఆమెపైనే నెట్టాడు. మెత్తపడిందేమో శుక్తిమతి "నిజగౌరవోన్నతు ల్దలపవుగాని.... మీ కులగిరికోటలోఁ గడు లఘుత్వముగాదె తలంచి చూడుమా" అని మళ్ళీ నీవు కోరితే "రంభాది నిలింపభామలు నీకుఁగఅవే" అని తారుణ్యలావణ్యజృంభణ వారి నెపంగా స్మరణకు తెచ్చి పరోక్షంగా వానిను త్తేజితుడ్ని చేసింది. అట్లాగే అతడు రాగాంధుడయ్యాడు. తనలాగే నదుల్ని వరించిన శివ, కృష్ణ, శంతన, సముద్రులను చెప్పి వారికెవ్వరికిలేని లఘుత్వము తనకెట్లా వస్తుంది! ఇంక అంతరాల మర్యాదావాదం చాలు "ఏలు

నన్నని సతికమలాలిపట్టు, ప్రబలతర దీర్ఘ భుజశాఖ" బట్టెనట ఆమె తొట్రుపడి మొగము దిప్పుకొన్నది. ఇక్కడ స్త్రీ సహజ లజ్జావతి అన్నది గుర్తించాలి. వైజయంతీ విలాసంలో వేశ్యదేవదేవిలా "తెలివ తెలివైచు నెపమున నెఱిగట్టిన వలువ విడిచి నిలిచిన" (3 ఆ-33 ప) అన్నట్లు కులీన శుక్తిమతి మసలగలదా ! తప్పని అనంగీకారము కాకపోయినా ఆమె తొట్రుపడింది. మొగం తిప్పుకుంది. కాగా రాగాంధుడైన కోలాహలుడి కది తనయెడ నిర్లక్ష్యం అనిపించింది. ఇలాంటి పెంకి ఘటాలని మోటతనం లేకుండా ఆపలేం అంటే తొట్రుపాటు పారిపోటంగా పరిణమించకుండా నిలపలే మనుకొని మొగం గీసిన కందగడ్డ చేసుకుని సహజ జడపర్వత లక్షణానికి చెందిన ఆటోపం (అంటే తాత్కాలికంగా కదలకపోటమే - సజీవ పేృమిక స్థితికడకు వచ్చేసిందిగామరి) చూపాడు 140వ వచనం "నెట్టననాగట్టు దొరపట్టి .... తన యాహార్యభావ గౌరవంబు కర్లోలి నీరయనివారణంబునుం గానోపభోగసమయ సముచిత విజనతాకారణంబును గందర్పబల సంబాధ బాధావధీరణంబునుంగాగ మాటి మాటికిం గూటములం బాటింపుమని యబ్బోటి పదంబులం బడిన నడువున నడగున వ్రాలి.... పెద్దయుంబ్రొద్దు నిరోధించు సమయంబున" పాదములబడి వేడుకొన్న ప్రియుని తదనంతర విషయానుగుణ చర్యలను శుక్తిమతిని రోధింపలేదు. ఆ మీది పద్యంలో ఆమె మొరపెట్టిన దాని తాత్పర్యం ఇదివరకే తెలుసుకుని ఉన్నాంగదా ! ఈ కథలో ఇన్ని వివరాలకు పోవాలనుకోలేదు మొదట్లో. ఈ వివరాలనుబట్టి శుక్తిమతీ కోలాహలుల పరిణయంలో (తిర్యగాది పరంగా రతి శృంగారరసం ఉచితం కాదనే మాట వదిలేయండి) ఆక్షేపణ ఏమీలేదు. ముఖ్యంగా శుక్తిమతి దోషం అసలులేదు. ఆమె తొట్రుపాటూ వెనకంజా అంతాకూడా అంతవరకు వలపుకాని సందర్శనాదికంలో ప్రస్తావనకి రాని పెద్దల మధ్యవర్తిత్వం గూర్చిన ధార్మికదృష్టే. అయినా అప్పటికే పర్వతభావం వుంజుకుంటున్న కోలాహలుడితో ఆ ప్రస్తావన తెస్తే అంగీకారంగా భావించి పైబడతాడేమో అని సాహసింపలేకపోయింది. (అంత వరకూ మీరు గొప్పవారు మీవాళ్ళు గొప్పవారంటూనే ఉంది. అతడు తొందరపడ్డాక సమయంలో ప్రస్తావించటం "నీవీమోక్షణవేళాయాం వస్త్రమూల్య విచక్షణమ్" లాంటిదికదా ! విషయానంతరం ధర్మపీఠానికి మొరపెట్టుకుందిగదా !) ఇంత జాగ్రత పడినా ఆంధ్రవాఙ్మయ సంగ్రహం వ్రాసిన శ్రీ కే. వెంకటనారాయణరావు బి. ఏ., ఎల్.టి., గారు చాలాచాలా అన్నారు. 185వ పుటలో "పోనిండు కథాకల్పనమైన

గలదాయన్న నిందుసున్న. ఔచితిలేదు. కల్పనలేదు. జీవకళలేదు" అని. ఎంత అదృష్టవంతుడో ఆయన లేనివన్నీ కంటజూడగలిగాడు. ముఖ్యంగా ఆయన "బలాత్కరించి భోగించిన కోలాహలానికి శుక్తిమతి లోబడి తరువాత వశంవదయైనది. అది నీతి ;" అని ఆక్షేపించారు. ఆ కథాక్రమం వివరంగా పరిశీలించాంగదా ! అలా అనిపించిందా ; నారాయణరావుగారి అదృష్టం లేనివాటిని కంటచూడకలగటంకదా ! సరేమరి పుట్టబోయే కొడుక్కి పట్టంగట్టటం లాంటి బేరాలుపెట్టి అలా ఇష్టమైతే నీకును నాకును సంగమంబగున్ అన్న మానవతుల ప్రణయనీతికి ఈ కవిత్వవేదిగారి భాష్యం ఎలా ఉంటుందో దీన్నిబట్టి ఊహించుకోవలసిందే !

మొత్తాని కసలుసంగతి కోలాహలం అనే దొడ్డకొండ అడ్డువస్తే శుక్తిమతీ అనే నది పొంగి వరదలై పారితే తోటాచేనూ కొటారాలూ దొడ్డీ అనే వేవీ కనిపించక మునిగిపోయాయని జానపదాది ప్రజ రాజుకి విన్నవించుకున్నారు. వాళ్ళ నా ఉపద్రవాన్నుంచి కాపాడాలని ఆ మొండిబండను విరగదన్నాలని 151వ కంద పద్యంలో ప్రజల కభయం ఇచ్చి వసురాజు కదలిన కథాసూత్రపు కొలికిము త్తెం పవరించింది మంజువాణి. అలా వెళ్ళిన వసురాజు "మహాద్రి నఖంబున మీటె నభ్రవిభ్రాంతముగాఁగ దుందుభికబంధము మీటిన రాముకైవడిన్." తర్వాతి కథా పరిణిగా వసురాజు ఆ కొండనలా మీటగా నది వరదతీసేస్తే సూర్యుని ఎండలకి నేల నెటియలువారిందంటుం దొకందపద్యంలో మంజువాణి. కోలాహలం కొండ రెక్కలు ముక్కలయేట్లు బంతిలా దాన్ని మీటిన వసురాజు ధాటిని అప్సరసలు మృదంగ నాదాలు చేసి మెచ్చారట. అప్పుడు రామరాజభూషణుని పౌరాణికుడు కథాసంవిధాన ఫణితిగా మళ్ళీ కంద పద్యంలోనే మంజువాణి కథనంమీది ఔత్సుక్యంతో కపటముని "అవలికథ తెలుపుమనియె నధిత ప్రీతిన్" ఈవలికథాసూత్రపు కొలికిము త్తెముగ్రుచ్చి ద్వితీయాశ్వాసాంత పద్యాలకవకాశం ఇచ్చాడు. ఇలా చాలావరకూ కందాలూ అక్కడక్కడ తేటగీతులుగా కథాసూత్రపు ముత్తెపుకొలుకుల అల్లికతో చిక్కగా చక్కగా కల్పనావిశేషావహ వర్ణనావైవిధ్యంగల పద్యరత్నహారాన్ని రామరాజభూషణుడు ఒక క్రమంలో చికిలీ చేసుకువస్తున్నాడు. మరి పైసంగతి చూద్దాం.

# 3

రామరాజభూషణుడు వసుచరిత్రలో తృతీయాశ్వాసాన్ని క్లిష్టవిషయ సంక్లిన్న మయం జేసుకున్నాడు. ముఖ్యమైన విషయం నాయికానాయక పరస్పరావలోకనం-తత్ హృదయస్పందనం. కాగా ద్వితీయాశ్వాసంలో "లలనా జన్మప్రకారంబు దేట పడం గాంచెద" అని చేరిన జపివేషికి ఆ ప్రకారంలో పూర్వకథతోనే ఆ ఆశ్వాసం పరిపెట్టుకుంది. అసలు జన్మప్రకారం రాబట్టవలసే ఉంది. చివర్లో మాయాముని అదేనా అడిగాడు. ఇంకా ఆ సందర్భంలో నాయకుడు ఇంద్రసఖ్యం పొందిన విశేషమూ మిగిలిఉంది. వీటికితోడు పరస్పరాకర్షితులయ్యాక రాజు రాజధానికి మరలటం, గిరిక మనోవైకల్యం, ఆ నివారణార్థం చెలుల సలహామీద వనవిహార సరోవిహారాలూ మనోజపూజా తత్ఫల నిరూపణందాకా ఈ ఆశ్వాసంలో చేబట్టాడు రామరాజ భూషణుడు. తప్పదుమరి. ప్రారంభించిన కళావిన్యాసాన్ని క్రమపరిణామంలో రూపుదిద్దాలి. లేకపోతే అక్కడితో అయింది అయ్యగారి పని అనిపిస్తుంది. జాగ్రత్తగా ఆ కళాక్రమపరిణామ విన్యాసం ఎంత పకడ్బందిగా కొనసాగిందో ఏ ధర్మ సౌందర్యాలని సంతరించుకుందో ఆ యా సమయాల్నిబట్టి అవగాహన చేసుకుందాం.

ప్రధాన విషయం నాయికా నాయక పరస్పరాలోకనాకర్షణలుకదా ! వచ్చిన చిక్కేమిటంటే నాయిక జడప్రకృతులైన నదీపర్వత సంతానం. జడం అనిపించవచ్చు. నాయకుడేమో మానవప్రకృతికదా ! అట్లాగయితే వీళ్ళ ప్రణయభావ సంచారం రతిస్థాయినంది శృంగారపరిణతి నందటం అనౌచిత్యం ఔతుంది. అదే రసాభాసం. భారతకథలో "అన్నదికిఁ బర్వత సమాగమంబున వసుపదుండను కొడుకును, గిరిక యను కూఁతురుం బుట్టిన నయ్యిరువురను శుక్తిమతి దద్దయు భక్తిమతియై గిరినిరోధంబువాయ నుపకారంబు సేసిన యుపరిచరునకు మెచ్చి కానుక యిచ్చిన నాతండు వసుపదుం దనకు సేనాపతిం జేసికొని, గిరికం దనకు ధర్మ పత్నింగాఁజేకొని యున్నంత" అన్నప్పుడీరసాభాసం సహృదయ మానసకంటకంగా గుచ్చుకొంటుంది. ఆ ముల్లు తీసెయ్యాలనే రామరాజభూషణుడు చరాచరోభయార్థ ప్రవర్తనం కల్పించి ద్వితీయాశ్వాసంలో నదీపర్వతాధిదేవతా స్వరూపాలని తన కల్పనా వహమై వెలసిన వచన చాతురీరంజితయైన మంజువాణినోట సమర్థవంతంగా ప్రణయ వన్నివేళ పరిణత రతిస్థాయిని శృంగార రంజితంచేసి ఉంచాడు. అక్కడ "తిరగాది

రతియు ననుభయనిష్ఠ రతియునగు శుక్తిమతీ కోలాహలుల సమాగమవర్ణనము రసాభాసమనియుఁ గావ్యముల వర్ణింపఁదగదనియుఁ జెప్పుచున్నారు." అని ఎవరి మాటనో లేకపోతే శాస్త్రపద్ధతినో శ్రీ శేషాద్రిరమణ కవులంటున్నారు. "శుక్తిమతి మహానదిం గోలాహలంబను పర్వతంబు గామించి యడ్డంబువడిన" అని ఉన్న భారత కథకు పరిమితమైనంతవరకూ అది అంతే కావచ్చు. మరి ఆ వెనుకటి భారత భావాన్ని నాటుకున్న మనసుల్లో రామరాజభూషణుడు ఆ జడాలకి జీవమై తన్యంపోసి రూపుదిద్దిన కళాభిసరణంగాని మూర్తిమంతాలుగా అందుకునే సహృదయం చాలక పోటంవల్ల అట్లాగే అనిపిస్తుంది. మన చేతిలోది భారతంకాదు. అందులోని నదినీ పర్వతాన్నీ తన కళాప్రతిభతో జీవంపోసి రూపుకట్టించి ఆడిస్తున్న రామరాజభూష ణుడి వసుచరిత్ర. తాను స్వీకరించిన మూలమైన భారత అభిహిత తాత్పర్యానికి ప్రాణప్రతిష్ఠ అది. మంజువాణి అమృతవాక్కుల్లో ప్రత్యక్షమైన జీవన పావన క్రియాద్భుత సృష్టి. తత్ప్రజాపతి సూతపౌరాణికుడు రౌమహర్షణుడు. దర్శకుడు సాహిత్య రసపోషణుడు రామరాజభూషణుడు. తన్మయభావనాయతులైన సహృద యుల కది రసవిద్య. కాకపోతే మరి నీరసమే. క్షమించాలి "కవిభావాన్నన్వేషించే వాళ్ళు ఇలాంటి చీకటితెరల్ని చీల్చుకొని ముందుకు సాగేటప్పుడు తప్పనిసరి అయిన సాహసాన్ని దుడుకుతనంగా భావించకూడ"దని ముందే మనవిచేసుకునే ఉన్నాను.

కథలోకి వచ్చేస్తే రౌమహర్షిణి మంజువాణి మంజువాణీ విలాస సంపదలతో (వెనుకటి ఆశ్వాసం చివర అడుగబడిన అనంతరకథ) అమ్మాయితపసితో ఇట్లు పలుకునని ఆమె మాటల్లోనే కథసాగిస్తున్నాడు. వసురాజు పర్వతాన్ని మీటటం అయిందిగదా వెనుక ! ఇప్పుడు కందపద్యం కథాసూత్రపు కొలికిముత్తెంచేసి రాజు విజయానికి సంతోషించి దేవపఙ్క్తి పారిజాతాలు వర్షించి దుందుభులు మ్రోయించి మహేంద్రునిరాక తెలుపుతుండగా దిక్పాలసహితంగా "ఆ వేయికన్నుల వేల్పు భూపభుని మెచ్చి యుచితమగు పారితోషికం బొసఁగవచ్చె"నట. వసురాజు నమస్కరిస్తే తన ఒడలి కన్నులు కప్పుకొనేట్టు కౌగలించుకొన్నాడుట. కొనియాడా డట. హితునిగా గ్రహించి "సుమనోరథమొక్కటిఁగొమ్మటంచు.... మణిభాసమా నమగు నొక్క విమానము చూపి" దాని మహిమను వర్ణిస్తూ 4-11 పద్యాలయ్యాక 12వదైన కొలికి ముత్తెపు కందంలో "నానాఁటి కనంత కాంచనంబులు గురియున్" అనే ఘనమహిమను ప్రకటించాడు. ఇంకా ఆ విమానం దోషాంతకమునీ, నిత్య

కళ్యాణనిధి అనీ కామరూప రమ్యమనీ అమృతాన్నసారప్రదమనీ చెప్పి పుష్పక విమానం దీనిసాటి రాదన్నాడు. ఏమంటే పుణ్యజనభర్త (కుబేరుని) బాసినదట. మరి ఇదో! అదేమాట పొందికలో వసురాజనే పుణ్యమూర్తినీ జనభర్తనూ పొంది గొప్పదయ్యిందనిపించటం ఒక చతురత. దాని గొప్పలింకా కొనసాగిస్తూ చారిత్ర కంగా బ్రహ్మ విష్ణు మహేశ్వరు లధిరోహించారట వెనుక. వారి కరుణను తాను పొంది ఇప్పుడు నీకిస్తున్నాను. ఇంకెవ్వరూ దీన్నధిరోహించగల సమర్థులు కారన్నాడు. దీనిమీద మాస్వర్గాని కప్పుడప్పుడు వస్తూపోతూ ఉండమన్నాడు. తర్వాత ఆ విమానాన్నప్పగించి ఇంద్రుడు వెళ్ళిపోయాడు. ఇక్కడ మనం గుర్తించ వలసిన విషయం ఒకటుంది. ఈ వసురాజు కాబోయే పెళ్ళికొడుకు. విమాన బహు మానంతో స్వర్గానికి రాకపోకలు సాగింపగల మహిమ నార్జించుకొన్న నాయకుడు. మరి కాబోయే అత్తవారు అంతకు మించినవారుగా ఉండటం మర్యాద అనిపించి రామరాజభూషణుడు శుక్తిమతినీ కోలాహలునీ బ్రహ్మగారి కొలువుకు వెళ్ళివస్తూ ఉండే ఆచారం కల్పించి ఆ నడిదారిలోనే వారి ప్రణయాని కంకురారోపణ చేయిం చాడు. దానం పుచ్చుకునే వాడికంటే దానిమిచ్చేవారే ఓ మెట్టు పైన ఉండేట్లు చేసాడు. అందులోనూ కన్యాదానమయ్యె! రామరాజభూషణ ఘన కపోలకల్పనా తటి దౌచిత్యకిరణము. ముచ్చటైన వెలుగు.

సరె ఇంద్రుడు వెళ్ళిపోయాడు స్వర్గసంచారానికనువైన బహూకృత విమానంతో నిలచిన వసురాజుని మునులు "ఆ నృపతికపుడు పరిచర నాయధేయం బంకించి సంకీర్తనంబు గావించిరి" అంది 18వ వచనంలో మంజువాణి. దాన్ని శంకిస్తూ "దేవేంద్రుఁడే యాతని నుపరిచరవసువని నటులున్నది చూడుఁడు" అని శ్రీ శేషాద్రి రమణ కవులు రెండు సంస్కృత భారత శ్లోకాల నుటంకించారు. ఆ శ్లోకాల్లోవి ఇంద్రుడి మాటలే అనుమానంలేదు. ఆ మొదటి శ్లోకం విమానం గొప్పదని చెప్పి నాచే నది నీకియ్యబడిందనటంవరకే ఉంది. తర్వాత శ్లోకాన్ని ఇక్కడెక్కిస్తున్నాను పరికించండి: "త్వమేకః సర్వమర్త్యేషు విమాన వరమాస్థితః। చరిష్యస్యు పరిస్థోహి దేవో విగ్రహవాని వ॥ ఇవీ ఇంద్రుని మాటలే. ఒక్కసారి నన్నయగారి మాటలు గూడా గమనిద్దాం." ....ఇచ్చిన నవ్వసువును దద్విమానారూఢుండై యుపరిలోకం బునం జరించుటంజేసి యుపరిచరుండు నాఁబరఁగి" ఇంతేఉంది. ఇంద్రుదేమీ

నామకరణం చేసినట్లులేదు. పై సంస్కృత శ్లోకంలో అయినా చరిష్యసి+ఉపరిగా (పైనతిరిగెదవు) వ్యత్య స్తంగా ఉన్నాయేగాని ఆ మాటలు ఉపరి-చర అనే క్రమంలో గూడా లేవే? 'ఉపరి-చర' ఇంకా 'వసువు' అన్నట్లుందా ఆ శ్లోకంలో! ఎలా అన్నారో మరి. గుర్తించండి రామరాజభూషణుడుకూడా మునులచేత నామకరణో త్సవం ఏం చేయించలేదు. (ఉపరిచరవసువను నామము మునులు పెట్టినటులున్నది-శ్రీ శే. ర. కలు) సందర్భశుద్ధినిబట్టి వసురాజు పొందిన అదృష్టాన్ని తమ అనుష్ఠాన నిష్ఠలకే దక్కకపోయినా తమ తపోనిష్ఠకన్న వాని భూధర్మభరణనిష్ఠయె ఘనమైన కారణంచేత దక్కిందిగా మాత్సర్యదృష్టి ఎరుగని మునులు సహృదయంతో కీర్తిస్తూ అంతవరకూ రాజుకి ఉన్న వసునామధేయాక్షరద్వయానికి ఇప్పుడు దక్కిన అదృష్టం "ఉపరిచర" (పైలోకసంచారం) కలిపి పలికారని "ఉపరిచరనామధేయం బంకించి సంకీర్తనంబు గావించిరి." అని చక్కగా నన్నయగారి "ఉపరిచరుండు నాఁబరఁగి" అన్నదానికీ రామరాజభూషణుడు ఔచితీ రమ్యమైన సమ్యగ్వివరణ మంజువాణి పరంగా చేసాడు. ఎంతటి ఔచిత్యపరిగణనాపరిలోభం! ఎంతటి నన్నయ భారతాభి హితార్థ సమర్థనాదృష్టి!

కాగా "అనంతరంబ యనంత విజయకీర్తి లాభసౌభాగ్య ధన్యుండగు నా రాజన్యుం డనన్యాదృశ పరిమోదభరంబునఁ బురంబునకు మరలివచ్చి ... శుక్తిమతీ నది విహారదీర్ఘికయును గోలాహలంబు లీలాచలంబునుంగా మెలంగుచునుండె" అని కావ్యనాయకుని "మహాకులీన తౌజ్జ్వల్యం మహాభాగ్యముదారతా। తేజస్వితా విదగ్ధత్వం ధార్మికత్వాదయోగుణాః" అన్న యోగ్యతలను చర్యాక్రమ ఔచిత్యపరిధిలో వచనంలో సూక్ష్మంగా ప్రస్తావించింది. కనుకనే మంజువాణికి సమంజస వచన చాతురీరంజిత అని సూతపౌరాణికుడు ముందే ఒక యోగ్యతాపత్రం ఇచ్చేసిఉన్నాడు. "అంత నిచ్చట" అంటూ ఆ 18వ వచనాంతంలోనే ఆమె మళ్ళీ శుక్తిమతి కథకు మళ్ళింది. అదే మాయాజటిలుడు సంగ్రహించాలని బయలుదేరిన అసలు లలనా జన్మప్రకారం.

శుక్తిమతి "కొయ్యన గర్భంబు దేటపడియె" అంటూ తేటగీతిని క్రొత్తిగా ముక్తం చేసింది కథాసూత్రానికి మంజువాణి. 20, 21 పద్యాల్లో ఆమెను గర్భిణిగా రూపు కట్టించి 22 ప్రసూతికా గృహంలో ఒక కొడుకునీ కూతుర్నీ కన్నదిట. తండ్రి అయినందుకు తనవంశం తరించిందని కోలాహలుడు వసురాజు మీటున

ముక్కలైన వగమరచి పోయాడట. ఎందుకు మరచిపోడండీ! అతడూ ధర్మం తెలిసినవాడె. "అనధీత్యద్విజోవేదాన్ అనుత్పాద్యతాథాసుతాన్। అనిష్ట్వాచైవ యజ్ఞాంశ్చమోక్షమిచ్ఛన్ పతేదధః" అనేదాన్లో "అనుత్పాద్యతాథాసుతన్.... మోక్ష మిచ్ఛన్ పతేదధః" అంటే పుత్రుని కనకుండా మోక్షమాశించేవాడు అధఃపతన మౌతాడు అని. ఆ ధర్మంకోసం స్త్రీని పెళ్ళాడమని ఉంది" ధర్మార్థం ప్రియ ముద్వహే" అని. అందుకే శుక్తిమతితో ప్రణయం సాగించాడు. ఫలితంగా సంతానం కలిగింది. మరి "ప్రజయా పితృభ్యః" అని పితృవర్గాన్ని తరింపజేసి ఋణవిముక్తికి అవకాశం పొందాడు. అదీ అతని ఆనందం. అది వ్యక్తిగత వేదన లన్నింటినీ తొలగించేస్తుంది. అతడూ వసుకృతావమానం తొలగించుకున్నాడు. ఈ వైదికభావనాధ్వని అది.

తనని ఆదుకున్న వసుధర్మాదరణ తలంచి (పౌరబాహ్యతగా తాను మొరపెడితే వసురాజు వచ్చి కోలాహలుడ్ని రెక్కలు విరిచి నిలిపిన కారణంగా ఇప్పుడు పుట్టిన సంతానానికి ఆ కోలాహలుడే తండ్రి అని లోకానికి వెల్లడయ్యింది. లేకుంటే మధ్య వర్తుల్లేని ఆ అధార్మిక రహస్యసమాగమం ఈ సత్యాన్ని బయటకు రానిచ్చేదో లేదో! వివాహవ్యవస్థనిలా ఆ దంపతులమధ్య స్థాపించి ధర్మాన్ని నిలిపిన వసురాజు మైత్రి కింద్రుడు దిగిరావటం పెద్ద ఆశ్చర్యంకాదు. వైదికవివాహంలో వధువుకి వర్చస్సును కలిగించే ఒక పాత్ర ఇంద్రుడూ నిర్వహించాలి మరి. బండికాడి తెచ్చి దానికి చిడత లుంచే కన్నాల్లో బంగారం ఉంచి అందులోంచి వధువుమీద పడేటట్లు నీళ్ళు పోయిస్తారు. అప్పటి మన్త్రం ఇంద్రప్రార్థనే. "ఖేనసః ఖేరథః-ఖేయుగస్య శచీ పతే। అపాలా మింద్రత్రిః పూర్త్వ్యకరత్సూర్యవర్చసమ్" అని.) బ్రాహ్మణాశీ ర్వాదాలతో వసుపదుడని కొడుక్కి నామకరణం చేసిందట శుక్తిమతి. రెండోబిడ్డ మన ప్రబంధ కథానాయిక కాబోయేది. అందుకే ఒక కందపద్యపు కొలికిముత్తెంలో మునులు "గిరిక" నామమిడినట్లు చెప్పింది. "గిరిరాజ తనయకై వడి సిరిరాజిల వెలయు నీసుశీల" అని మరే ఆ పేరుపెట్టారంది.

బిడ్డలకు ఉగ్గుపట్టడాలూ జోలపాడటాలూగా పెంపకం సాగుతోంది. కాబోయే కథానాయిక గిరిక అంచనడకలూ, చిలుక పలుకులూ, తుమ్మెద పాటలూ, నెమిళ్ళ నటనలూ వాటంతట అవే వచ్చేస్తుంటే ఆమెకు సర్వసౌభాగ్యాలూ కలగాలని ముని

పత్నులు దీవిస్తూంటారట. వనదేవత లాబిడ్డకు తామే సైరంధ్రిలుగా, దాదులుగా, చెలికత్తెలుగా సంచరిస్తూ పెంచుతున్నారట. క్రమంగా ఆమె ఆటలునేర్చి తండ్రియైన కోలాహలుడి దగ్గరచేరి గుజ్జనగూళ్ళాడే అంతటి దయ్యింది. ఆమెకు తల్లి గవ్వలు కట్టిందేమిటని వాటిని తీసిపారేసి ఆ తండ్రి మణిహారాలు పెట్టేవాడు. అవి గ్రుచ్చుకుంటాయని తల్లి బాధపడి వాటిని తీయించేసి ఎజ్ఞకలువ లలంకరించేదిట. అంటే గిరిక అంతకంతకూ సుకుమారిగా ఎదుగుతోందనిపింప జేయటమే. ఆమె శైలసుతాగ్రణికీ నదీలలామకూ అనుంగుబిడ్డగదా! అదీ గిరిక ఆభిజాత్యగౌరవం. అల్లారుముద్దుగా ఎదుగుతున్న తన కూతురికి తాను బ్రహ్మకొలువుకు వెళ్ళినప్పుడు కలిగిన పరిచయం మూలంగా సరస్వతీ సారథులైన హంసకవులను రప్పించి సాహిత్య విద్యలు నేర్పించిందిట తల్లి. తనకడ ఉన్న మణులని బహూకరించి కిన్నరులను రప్పించి వారిదగ్గర సంగీతం గానం చేయటం వీణవాయించటం చక్కగా నేర్పించాడుట తండ్రి. అంతేకాదు ఆమెకని తన వైభవం వెలపెట్టి ఒక మాణిక్యమందిరం కట్టించి ఇచ్చాడుట. అక్కడివన్నీ ఆ గిరికా విహారరంగాలే అని మంజువాణి తన కథనం ముగించింది. ఇక్కడ కథాసూత్రపు కొలికి మళ్ళీ 36వ కందపద్యం. అందులో "అని వనిత యుపరిచర వసుజననాయకుఁ గథయుఁగన్యజననాగతియుఁన్" వినిపించిందనీ ఆ మాయాముని సంతసించాడనీ అంటారు రౌమహర్షణి: సూత పౌరాణికుడు.

పాపం ఇంతసేపూ ఆ లతలమధ్య తనువు కనపడనీయకుండా దాగిఉన్న వసురాజుని గుర్తుచేస్తున్నాడు సూతపౌరాణికుడు అలా ఉండే జరుగుతున్నది గమనిస్తూ మిత్రుని మాయావేషమూ నటనా దాన్తోపాటు మంజువాణి మాటనేర్పూ, అలాగే ఆ మాటల్లో అచటి లలన శుక్తిమతి కన్న జాతిరత్నమే అని గ్రహించి అది తనసొత్తే అని భావించాడు. రత్నహారీతు పార్థివః అని గుర్తుచేసుకుంటే బలవంతంగా అయినా హరించి స్వంతం చేసుకుంటా ననుకున్నాడని ధ్వనిస్తుంది. అది స్వీకారంలో కలిగిన తత్తరభావమేగాని రసాభాసం చేసుకునే రావణ చేష్టాభావం కాదుగనుక ఆ ధ్వనిని నిరాకరించాలి. ఏమైనా ఆమెను కావాలనుకున్నాడు. ఆమెను కూడా తనను కావాలనుకునేట్లు చేసుకోవాలి. అంటే ఆమెకి కనిపించాలింక. అయితే ఈ ముసుగులోంచి బయటపడాలి. ఎలా! అందుకు మిత్రుడేదో మంత్రం వెయ్యాలి. అతడా సానుభూతి సామర్థ్యాలున్నవాడె. పెద్ద ధ్యానం నటించాడు. అంతర్దృష్టితో

చూసానంటూ ఈ సుకుమారిని వసురాజేంద్రుడు పెండ్లాడునని భవిష్యత్తు చెప్పాడు. వాళ్ళిద్దరినీ కలపకుంటే బ్రహ్మసృష్టిలో గొప్ప ఏమిటన్నాడు. "నెలఁత ద్రిలోకనుత నిర్మలరూపకలాధన్య"ట "నృపకోటులలో వసురాజు మేటి"ట వారిజంట పూవూ తావీలా ఉంటుందన్నాడు. చెలులతో ఆ వేడుక చూసేయోగం మీకుందన్నాడు. మంజువాణి గడుసుగానే "ఈ లతాంగి వసుధావరునెన్నఁడు చెట్టవట్టునో" అందిట. మాయాముని నువ్వు నమ్మలేకపోతే చూడు నా "మంత్రప్రౌఢి రప్పింతు" అని "మాయాజపాకలనాదంభముపూని" గట్టిగా "మజ్ఝాయనన్" రాజుకి వీలుచిక్కింది. ఇప్పుడే సమయం అని మేఘపుతెర తొలగిన చందమామలా తనను గప్పిన లతల్ని తప్పించుకొని వచ్చి ఎదుట నిలిచాడు. అప్పుడు రేగిన తుమ్మెదల గానం ఆ రాజుకి వందిమాగధ స్తోత్రపాఠం అయింది. అప్పుడక్కడి పద్మముఖులు "తలిరుఁబ్రాయము వాని....అమ్మహీజాని గని లేచి యమిత వినయసంభ్రమము దోఁపనిలిచి" అని విని పించాడు రోమహర్షణి. కొంచెం ఇక్కడ ఆగాలి.

బహూశః "ఈ తలిరుఁబ్రాయమువాని" అనేది చదివేనేమో శ్రీ శే.ర. కవులూ వారిని అనుసరించిన వారూ అనుమానంలోపడ్డారు. వారు "వసురాజునకు గిరికా పరిగ్రహణమునాఁటి కేవురు పుత్రులున్నటులుండ రామరాజభూషణుఁడు వసురాజు నవివాహితుఁడా యని యనుమానించు విధముగఁ జిత్రించెను" అన్నారు. ఒక్క మాటు నన్నయగారి కథనం చూద్దాం. "వ. అట్టి యింద్రోత్సవంబున ప్రీతుండయిన యింద్రువరంబున నుపరిచరుండు బృహద్రథ; మణివాహన, సౌబల. యదు, రాజన్యు లనియెడి కొడుకుల నేవురం బడసి" అని ఉంది. అయితే ఈ అయిదుగుర్నీ ఒకే భార్యవల్లనా లేదా అంతకుమించి ఎంతమందివల్లనా పడసింది అంటే తెలియదు. కొడుకులను పడసినాడు కనుక భార్య ఉండాలని ఊహ చెయ్యటమే—ని పెళ్ళయిందా అన్నా మరో దాఖలా ఏంలేదు. మరి ఆ కొడుకులమాటేమిటీ: "అతిప్రీతుండయిన యింద్రువరంబున" పడసినవారు. చూడండి దేవలుడు దేవుని వరమున బుట్టెడు మామిడిపండ్లను బొందెను. అనగానే దేవలుడికి మామిడిచెట్టు ఉండి ఉంటుంది. దానికే దేవుడు బుట్టెడు పళ్ల కాపించాడు అనుకోవలసిందేనా? ఇక్కడ అలా అను కోకపోతే ఇంద్రుడు వరం పేరుమీద అప్పగించి ఉంటే వాళ్ళు రాజు కొడుకులెలా ఔతారు అన్నదీ శంకయే. పెళ్ళాలున్నా పిల్లల్లేనివారికి ఎవరో పెంపకం ఇస్తేనే కొడుకు ఔతున్నప్పుడు వరంగా ఇంద్రుడిస్తే కారా: అసలీ తర్కం అంతా ఎందు

కండీ ఆ కవులభావం వసురాజు చాలా వయసైనవాడని గుర్తుచెయ్యటమే అను కుందాం. దానికోసం భారతమూ పిల్లలూదాకా పోవటం ఎందుకుమరి. ఎప్పుడో ఈ గిరిక పుట్టకముందు కోలాహలాన్ని మీటిన వాడుగదా వసురాజు! ఈ విషయం వసుచరిత్రలోనే ఉంది. అనుమానించటం మొదలుపెడితే అంతకుంటే పూర్వకాలం లోనే వేటకువెళ్ళి మునిజనాశ్రమంలో తపస్సుచేసాడంటే ఇప్పుడు వచ్చి గిరికను చూసి పెళ్ళాడాలనుకున్నాడంటే వినేవాళ్ళకైనా తోచవద్దా అనుకుంటారనే రామరాజ భూషణుడు ఆ తపస్సుమాట వదిలేసాడేమో అని ఒకటీ, తపస్సునాటి ఇంద్ర దర్శ నాన్ని వాయిదావేసి కోలాహలాన్ని మీటిన నాటికి మార్చాడంటే అప్పటికి వసురాజు మంచి వయసులో ఉన్నవాడని అనిపించటానికే ఏమో అని ఒకటీ మెదుల్తాయి మరి. అయితే తపస్సుని రాజధర్మ పరిపాలనా నిష్ఠలోనే అంతర్లీనం అయినట్లు ఇదివరకు ఎంచుకున్నాం కదా! రెండోమాటకి గిరిక తల్లికడుపున బడని ఆనాడు వయసుకా డనిపించినా ఆ పిల్లపుట్టి పెళ్ళీడుకి వచ్చిననాటికి ఆమె తండ్రి యీడుగల ముదురు మనిషి అయినా కాకతప్పదుగదా! అది తెలియజాలకనే పౌరాణికుడిచేత "తలిరుం బ్రాయమువా"డని రామరాజభూషణుఁడు చెప్పించాడా! ఇది కొంచెం గమనించండి!

లక్ష్మీనారాయణుల పెళ్ళికి వాళ్ళెక్కి ఊరేగటానికి విశ్వకర్మ ఒక విమానాన్ని తయారుచేసి ఇచ్చాడట. ఆ పనయ్యాక ఎప్పుడో ఆ నారాయణు డింద్రుడి కిచ్చాడుట. దాన్నే ఇంద్రుడు వసురాజు కిచ్చాడుట. 13వ సీసపద్యం చివర తేటగీతిలో "ఇది యశేష దోషాంతకంబు" వయోదోషాన్ని హరించింది అందుకే. నమ్మకంలేదా! "ఇది నితాంతకళ్యాణనిధి" ఎన్నేళ్ళు గడిచినా ఎప్పటికప్పుడే పెళ్ళాడటానికి తగ్గ వాడుగా నిలిపే స్థిరత్వం గలది. నమ్మలేరా! "ఇది కామరూప రమ్యము" మన్మథ రూపం ఇచ్చి ఆనందింపజేస్తుంది. నమ్మరూ! "ఇది అమృతాన్నసారప్రదంబు" అమృతాన్ని ఆహారించేవారి అంటే దేవతలసారం ఇస్తుందిట. ఆ సారం దైవత్వమే గదా! దాన్నిబట్టి ఎన్నేళ్ళు గడిచినా ముప్పైఏళ్ళవాడుగానే ఉంటాడు. ఎంతమంది పెళ్లాలున్నా పిల్లలు లేకపోవచ్చు. పెళ్ళాల్లేకపోయినా పిల్లలుండవచ్చు. అబ్బే! దేవత్వం ఉంటే....మనకి వద్దులెండి ...కాని వసురాజుకి ఆ దేవత్వం విమానంవల్ల వచ్చిందని సూచించాడు మంజువాణి మాటల్లో రామరాజభూషణుడు. అలా మనిషికి దైవత్వం అంటగట్టటం మరీ అన్యాయం అంటారా! ఏం కాదు. నన్నయగారి భారతం చూడండి! ఇంద్రుడిచ్చిన మొదటి వరమేఅది. "నాయొద్దకు వచ్చుచుం

బోవుచు మహీరాజ్యంబు సేయుచు నుండుమని వానికి దేవత్వంబును గనక రత్న మయంబైన దివ్యవిమానంబును ... ఇచ్చిన" కనుకనే కొడుకులున్నా వాళ్ళకి అమ్మ లున్నా కూడా వసురాజు అవివాహితుడా అనిపించే పెళ్ళీడువాడే అలాగే ఉంటారు. ఇందులో రామరాజభూషణుని మాయాచిత్రణం ఏమీలేదు. ఆయనకి దక్కిన దైవత్వ సిద్ధి అది. "తలిరుఁబ్రాయమువాని" అన్నాడందుకే రొమర్షణి. ఆయన శ్రోతలు శుక శౌనకాదులు. కనుక ఇలాంటి అనుమానాల్లేవు. అంతే. నిజంగా రామరాజ భూషణుడు చేసింది భారతాభిహిత తాత్పర్యాన్ని తన కల్పనా చాతుర్యంతో ఆ ఆద్య సన్మణిని సానబట్టి, కుశ్శంకల మకిలి వదలించి ప్రకాశింప చేయటమే. అది మన అదృష్టం.

ఎలాగో వసురాజు గిరికామాణిక్య మందిరంలో ప్రత్యక్షం అయ్యాడు. యతి మిత్రుడు "చింతిత కళ్యాణ సమృద్ధిరస్తు" అని దీవించాడు. నారీజనం ఆశ్చర్యం నుంచి తేరుకొని సమర్పించిన బంగారప్పీటమీద పద్మాసీన అయిన రాజహంస అనిపిస్తూ వాంఛావికసిత ముఖారవిందుడై కూర్చున్నాడారాజా. అనుకున్నట్లా లతాంగి తనను కావాలనుకునేట్లు కుదురుగా ఆమె ముందుకి చేరుకున్నాడు. ఆమె ఇదివరకె ఆయన కథవిని అబ్బురపాటుతో ఉంది. ఇప్పుడు ప్రత్యక్షంగా "అను పమ కాంతివైభవ సమన్వితు నా వసురాజుఁ గాంచు పద్మిని" అని ఆమె పద్మినీజాతి స్త్రీ అంటున్నాడు రొమహర్షణి. వసు (సూర్య) తేజ దర్శనంతో ఆమె అంత రంగంలో అనురాగభావం (సరస) ఉదికితే వలపు అంకురించిందట. జన్మాంతర (యౌవనారంభ) వాసనా తరంగాలు కదలాడాయట హర్షకాంతి నింపుకొన్న చూపుల తుమ్మెదలు ముసురుతున్నాయట. ఇక్కడ వ్యాఖ్యాతలు సంచారీస్థాయి రసవిషయకం అయిన చర్చ చాలానే చేసారు. చివర "ఇక్కడ అనుపమ కాంతియను నీ పద్య ములో గిరికాపరమైన యర్థమందు సంపూర్ణమయిన శృంగారమును జెప్పినాఁడు" అని శాస్త్రసమన్వయ ప్రయత్నం చేసారు. అయినా ఒక్కమాట. శ్రీ వెంపరాల సూర్య నారాయణ శాస్త్రిగారి మనుచరిత్ర వ్యాఖ్యానంలోని రసచర్చ నుంచి కొంచెం ఎక్కిస్తాను. "శృంగారమునకు రతిస్థాయి భావముకదా! భావము-స్థాయి-రతి యన నేమో ముందు పరిశీల్యము. "నిర్వికారాత్మకే చిత్తే భావః ప్రథమ వికిృయా" అను సూక్తిచే బాల్య యౌవనముల సంధిలోఁగలుగు రసజ్ఞాన యోగ్యత, అనఁగ నాయికా

నాయకుల యౌవనారంభమున శృంగార విషయికముగ అంతఃకరణమునఁ గలుగు నొకానొక వికారము భావము.

"అట్లు వయస్సంధికాలమున నాయికానాయకు లొండొరులను జూచుకొని నపుడు మనసున సంకురించు నానందరూప మగు వికారము 'రతి' యనఁబడినను, ఆ భావము "సజాతీయై ర్విజాతీయై రతిరస్కృత మూర్తిమాన్, యావద్రసం వర్త మానః స్థాయీభావ ఉదాహృతః" అను సూక్తివలన సజాతీయ విజాతీయ భావము లచే నంతరింపక, విభావానుభావ సాత్త్వికవ్యభిచారులచేఁ బుష్టమై రసరూపము నొందుదాఁక నిలచియుండునది స్థాయి యనఁబడును. "యూనో రన్యోన్య విషయా స్థాయినీచ్ఛారతిర్భవేత్" అను ప్రమాణముచే అన్యోన్యావలోకనమున నితరేతర విషయమై వ్యక్తమగు నిచ్ఛరతి "పరిష్కృతమున.... .... శృంగారమున నాయికా నాయకు లుభయులును ఆలంబన విభావములు; కాని యెుక్కొక్కరు కాదుగదా!.... రతియుభయని ష్ఠముకాక యాలంబన విభావమే లేదనిపించును.

"ఇఁక ఉద్దీపన విభావములని చెప్పఁబడిన ప్రాయము, సొమ్ములు, చేష్టలు, మలయానిలాది తటస్థములు" (ఇంతదాక 93వ పుట. కొంచెము 94వ పుటనించి) "లోకోత్తర పదార్థానా మపూర్వాలోక నాదిభిః విస్తారశ్చేతసోయస్తు విస్మయస్సని గద్యతే" అని చెప్పఁబడిన మనోవికారరూపమగు 'విస్మయము' కలిగినది.

"ఆ విస్మయమువలన" క్రియా స్తస్త్రాక్షి విస్తార సాధూక్తి పుకాలదయః" అని చెప్పఁబడిన విస్మయమువలని వ్యాపారములు వెంటనేఁబొడమినవి." ఇంకొంచెం 97వ పుటనుంచి-"ప్రారూఢ కటాక్షాదిక మారయ ననుభావమయ్యె"నని సరసభూపా లీయము.

"ఉద్దీపన విభావములైన శృంగారచేష్టలును, అనుభావమైన దృష్టివిశేషమును వ్యక్తమొనర్చి...." ఇంతవరకె. ఇక్కడే ఉంది మన సన్నివేశంకూడా! ఇంకా నాయిక దృష్టివిశేషం 49, 50 పద్యాల్లోనూ అన్యోన్యాలోకన దృష్టి విశేషం 51, 52, 53 పద్యాలదాకనూ కొనసాగుతూనే ఉంది. సహృదయులు స్వారస్యాన్ని అందింది అందినట్లుగానే ఆస్వాదించాలని నా అభిప్రాయం. ఏదో ధ్వనిగా నిరూపించిన "సంపూర్ణమైన శృంగారరసమని గ్రహించ"టం ఎట్లా! దృష్టి విశేషాలైన అను భావాల ప్రసారమే ఇంకా కొనసాగుతున్న కథాంశంలో విభావై రనుభావైశ్చ అని

రససంచారంలో ఇంకా రెండోమెట్టయినా అధివసించందే ఇంకా సాత్త్విక సంచారి స్థాయిల మెట్లు దాటందే రసమందిర ప్రవేశం ఎలా జరుగుతుంది. మనం ఆ సోపానక్రమంలో రసానందమందిరం అందుకోవాలనే రోమహర్షణి ఈ అనుభవాలకి మారాకులు తొడుగుతూనే ఉన్నాడింకా. అందుచేత సంపూర్ణ శృంగారం ప్రౌఢపాండిత్యప్రకర్షలో ఆ పద్యం ధ్వనించినా మనం తప్పుకుపోవటంలోనే స్వారస్యం ఉంటుంది. ప్రత్యేకం అనాఘ్రాత పుష్పం అయిన నాయిక విషయంలో.

ఆ మనుచరిత్రలో అయినా ఈ వసుచరిత్రలో అయినా నాయికల వీణావాదన లేమిటని విసుక్కుంటూ ఉంటారు కొందరు. ఇక్కడ గిరిక సంగీతంలో ప్రశాంత మానసికస్థితిని సాధించుకొని మనోవికారక్షాళనం అయిన నిర్వికారాత్మక చిత్తురాలై స్ఫటిక నిర్మలమై ఉంది. అప్పుడు కపటయతి రాగా మంజువాణి ప్రసంగించిన శుక్తిమతీ కోలాహల పరిణయం ప్రథమ విక్రియగా భావోదయం అయి వసురాజ వృత్తాంతం అద్భుతాశ్చర్యాల పెనగొంటుంటే ఆయన మహాత్మ్య వర్ణనంతోపాటు తననారాజు వరింపగలడన్న ముని దీవెనవల్ల ఆలంబనాన్ని పొంది కంగారుపడుతున్నపుడు కలిగిన దర్శనంవల్ల ఆమెలో అనుభావం మసలుతున్న సందర్భం ఇది. రామరాజభూషణుడు చక్కని రసపరిణామక్రమం నడుపుకుంటూ వస్తున్నాడు. కథాసూత్రానికి రసానుభావం కొలికిముత్తెంగా గుచ్చిన 50వ దైన కందం చూడండి. వసుధాసుధాంశుఁజూదవుచు। వెసముఱుచు మరలిమగుడ-వెతలుమ లలనా, లసమాన దృష్టిజాతము। లసమాంబకు చిత్రశరము-లై విలసిల్లెన్. రామరాజభూషణుడు సాహిత్యరసపోషణుడే మరి 52వ తేటగీతిలో "కౌతుకము పూని యొండొరుఁ-గాంచఁదివురు ... అదిగదా భావిశోభన-వ్యంజకంబు" అనిపించాడు పౌరాణికుడిచేత.

వాళ్ళ చూపులు పారింతర్వాత మంజువాణి (54 కం) "రాజవరేణ్యు తలఁపు నారసి" ప్రేమగా "నిన్ను నిచ్చో భజింపఁగాఁగలిగె" అని ఆయన రాక కానందాన్ని ప్రకటించి "తరమె మానాతి చిరభాగ్యగరిమఁ బొగడ" అని మరి "తావక చాటు కథాసుధారసంబున నలరించుమీ భువనమోహినిఁ బిన్నటనాఁటి నుండియున్" ఈమె "శుక్తిమతియుం బ్రాలేయ శైలేంద్ర నందనుఁడుం గాంచిన కన్య" అని ఆభిజాత్యాన్ని తెలిపి సౌకుమార్యాన్ని వివరించింది. "1 గురుకుల క్రమాయాత (తండ్రినుంచి సంక్రమించింది) మీ గిరిజ చల్లదనము 2 జననైకరూఢమీ తటినిపట్టి (తల్లినుంచి సంక్ర

మించింది) సరస గంభీరభావంబు" కాగా "సహజసిద్ధ మీనలిన సోదరీమణి మేని తావి" అన్నది. ఆ కన్య నేర్చిన విద్యలగురించీ చెప్పింది. "తరంబె కన్నెఁగొని యాడన్ గేయవాక్ప్రౌఢిమన్" అని.

"నావిష్ణుః పృథివీపతిః" అనే సూక్తి ధ్వనిగా విష్ణుమూర్తినిచేసి ఆ రాజును 'శ్రీనిధి' అంది. 'క్షీరసాగరకన్యకా' వాడుకను ధ్వనిగా లక్ష్మినిచేసి తన చెలిని 'సింధు తనయ' అంది. ఆ విష్ణువు కీలక్ష్మి తగినది. పేరెక్కింది. ఈ మహాముని 'దయామందరాగమహిమచే' అనే ముందే ఈమెకు నీయందిష్టమని స్పష్టంచేసింది. (60 కం) ఆ ముని మాట రాజుమాట కలపటానికి పనికివచ్చింది. వెంటనే ఆయన "అతను మంత్రజాలము విదితమైన యీ ముని"ని పొగడవశంకాదు. "మాకుఁ బర మాప్తుకు మీ యనుఁగు వయస్యఁగాంచు సుకృతాతిశయం బవలీలఁగూర్చె"అన్నాడు. తరవాత వచనంలో "భావాద్భుత (మంజువాణితో) దివ్యభామినీ మృదుమధుర కోమలాలాపంబు లాలింపంగలిగె" (ఇచట రాజామెను దివ్యభామినిగా గ్రహించటం గుర్తుంచుకోవలసి ఉంది.) ఈ గొడవలో మాయామునికి ఇంకా ఆ వేషంలో ఉండటం అనవసరం అనిపించింది. అదే రాజు మాటల్లోనూ ధ్వనించిందతనికి. దాంతో "పూర్వరంగంబు రసోత్తరంబగుట యెఱింగితివిగదా యింక సందియంబు వలదని వీడ్కొని.... చని యనతిదూరంబున ...సారంబగు తపోధనాకారంబు డించి యథా పూర్వవేషంబుతో రాజు నన్వేషించు క్రమంబునం గ్రమ్మర నేతెంచి....నిల్చు నవసరంబున"అని పౌరాణికుడు కథసాగిస్తున్నాడు.

ఇదంతా ఎందుకు? ఏ వేషం అయితేనేమి అంటే. ఇలాంటి సరస సన్ని వేశాల్లో నాయికచూసే చూపుల్ని చెలికత్తె వ్యాఖ్యానిస్తూంటుంది. నాయిక మాట్లాడదు. మరి నాయకుడట్లాకాదు. మాట్లాడని ఆ నాయికతో మాట్లాడాలని కొట్టుమిట్లాడుతూ ఉంటాడు. పూర్వపరిచయంలేని నాయిక చెలికత్తెను వ్యాజంగా తీసుకుని మాట్లాడ వలసి ఉంటుంది. ఎలాగైనా అది ఎబ్బెట్టుగానే ఉంటుంది. అలాటి సందర్భాల్లో వయస్యుడుంటే ఆతనిమీదుగా ఎన్ని వ్యంగ్యోక్తులు దొర్లించినా కుదురుతుంది. అందుకే రాజు తెలివిగా "మాకుఁ బరమాప్తుఁడుగాక" అని మునివేషధారికి ధ్వనింప చేసాడేకాని నాయిక చెలులకి దొరికిపోయాడు. (అసలా వయస్యుడిలాంటి వసంతక ప్రతినిధికాదని తెలుసుగా) మిత్రుడుగా వచ్చిన దెవరో కనిపెట్టేసారు. కోలాహల

గిరి విహారానికి వచ్చి ఈ రాజే తమ చెలిని చూడాలన్న కోరికతో ఆ వేషంలో (కం 64) "అనిపెనని తలఁచిరి ముదితల్" అని కథ పట్టుగా నడుపుతున్నాడు పౌరాణికుడు. గుట్టు తెలిసిపోయింది వారికి రాజుకు నాయికమీద మనసుంది అనేదే ఆ గుట్టు. ఇక గిరికకి ఆయనమీద మనసు నిలిచేటట్లు తామే పుట్టినప్పటినుంచి ఆమెకు వంటబట్టించే ఉంచారు. అలాటి సరస సన్నివేశం దొరికితే చెలులెలా ఆటలుపటిస్తారో చెప్తాడండి పౌరాణికుడు.

రాజుగారు రావటంతోటే "గిరికాననము" కొత్త వెలుగులు పొందిందిట. పర్వతారణ్యమా-గిరిక ముఖమా! చమత్కార వాసనలున్న ఇంటింటా ఇలాంటి కలకలలూ కిలకిలలూ వినపడుతూనే ఉంటాయి. రామరాజభూషణుడి కళారహస్యమే అది. శ్లేషలు సమకూర్చగలగటం కథ గిట్టించటంవేరు-జడప్రకృతులకి చైతన్యకృతి మర్యాద వేరు- సందర్భోచిత వ్యాజోక్తి విధానం వేరు. ఒకటి రసఘట్టాలకి అడ్డుకట్ట అయితే ఇంకోటి రబ్బరోలుకి రెక్కలుగట్టి ఎగిరేట్టు చెయ్యటం లాంటిది. చివరిది హృదయావర్జకం అయి ఆనందడోలికల్లో ఊగిస్తుంది. ద్వితీయాశ్వాసంలో శుక్తిమతీ కోలాహలుల పరిణయఘట్టం రెండర్థాల కావ్యంగా చెప్పినా ఈ తృతీయాశ్వాసంలో వసురాజు జంటని లీలాదీర్ఘికాకేళి శైలాలుగా చేసిన జడచైతన్యాల తూకంకట్టినా, ఇప్పుడిలా వ్యంగ్యహాస్యం చిలికించినా ఎక్కడా ఏ అడ్డుకట్టలూ, ఏ అతుకుపట్టులూ, ఏ అట్టహాసాలూ లేవు. అన్నింటా రామరాజభూషణుని శ్లేష సుకుమారహాస విన్యాస పదభావ సమావేశంగానే. తన ప్రబంధనాయిక గుణాల్లాగానే ఆ శ్లేషకూడా గురుకుల క్రమాయాతమైన చల్లదనమూ; జ(న)నైకరూఢమైన సరసగంభీరభావంబు, సహజ సిద్ధమైన ఔచిత్య పాలితకళావిలాసం (మేనితావి) సహృదయ శిరఃపారిజాతాలు.

చెలులంటున్నారూ, ఆ నాయిక తలవంచుకుందట, సిగ్గా లేక రాగపుఁదమియా అంటే- రెండూట. సిగ్గయితే తలవంచవచ్చు. రాగపుఁదమి అయితే ఆలంబనం అయిన రాజుని చూడాలిగా. ఆ! అదే ఆమె రాజునే చూస్తోందిట. తలవంచుకుని ఎలాగండీ! ఆయన ఏమన్నా తన గుండెలమీద ఉన్నాడా! ఓ ఉన్నాడుట. ఎలా? "కుచాంచలహారధార"లో ప్రతిబింబిస్తున్నాడుట. ఏం గడుసుతనం. ఈ గడుసుదనం గిరికదా! ఆ కిటుకు తెలుసుకున్న చెలులదా! అది చెప్తున్న పౌరాణికుడిదా! అంటే రామరాజభూషణుడే ఆ గడుసువాడు అనాలి.

ముఖంలో ముఖంపెట్టి చూడలేని చూడరాని తన నాయికకు దర్శన లాలసత్వం ఆ ముగ్ధకు తీరే ఉపాయం కాస్త ప్రౌఢలయిన చెలికత్తెలనోట చెప్పించి ప్రేరణ కలిగించాడు. "కరుసాడే జాగ్రత్త" అన్న సామ్యం అన్నమాట ఇంతవరకూ ఆ యా పాత్రలూ కాకపోతే పౌరాణికుడూ అంటూ ఈ గడుసుతనం రామరాజ భూషణుడి దని ప్రత్యేకించటం ఏమిటంటారేమో ఇలా చేసిన ప్రతిఫలన వ్యవహారం ఆ మహానుభావుడు ప్రబంధం మొట్టమొదటి పద్యం (అవతారికే) లోనే మొదలు పెట్టాడండీ: "శ్రీ భూపుత్రి వివాహవేళ నిజమంజీరాగ్రరత్నస్వలీల" అనీ. అదంతా ఒక అద్భుతభావస్పందనం. అది వేరేవ్రాసాను. అనుబంధంగా చివర కలుపుతాను. ముచ్చటవేస్తే పరికించండి. ఇక్కడ కథ నడవాలిగా మరి:

హారంలో చూసుకుని ఆనందించమని సూచించి ఊరుకుంటారా ఆ కొంటె కోణంగులు. "ఈ చిగురుఁబోడి కుచార్పిత హారనాయకోజ్జ్వల రుచి గంటిరే ఈమె కుచములర్పిస్తే వానిని గ్రహించిన నాయకుడి మోమెలా వెలిగిపోతోందో చూడండిని ఏడిపించారు. ఉడుకుమోతుతనం వచ్చిందా అమ్మాయికి. లేదులే ఆ హారం నడిమి రత్నం ఎంతబాగుందేమిటి తెగచూసుకుంటున్నావు. ఇదివరకులేని కొత్తఅందాలేవో కనపడుతున్నట్లున్నాయేదాన్లో. ఔను మనోనాయకుడు కనపడుతున్నాడుగదూ అని గుట్టు కాస్తా బయటపెట్టేసారు వాళ్ళు. ఆ చెణుకులకి తట్టుకోలేకపోయిందా ముగ్ధ. అయినా మెఱుపుల్లాంటి చూపుల్తో వాళ్ళని ఆదలించింది. గుబగుబ నడచిపోయి అక్కడున్న తెరచాటున నిలబడింది. ఏమిటలా వెళ్ళిపోయిందన్నాడు రాజు చెలుల్ని చూసి. మంజువాణి కలిగించుకొని మీమధ్య తెరఉండటం చూసేవాళ్ళకి వివాహ క్రమాన్ని తోపిస్తోంది అంది. తన మనసులోని వివాహప్రసక్తినే చెలి బయటపెట్టి నందుకు ఆమెయందు గౌరవభావం పొంది తన ఇష్టచర్య లన్నింటిలోను సాయపడు తూండే కలహంసి అనే మా అమ్మ చెలి ఈ అవస్థనించి తప్పించటానికెందుకు రాకుంది అనుకునే లోపులోనే ఆవిడ వచ్చేసింది. మంచిమాట చెప్పింది. తన కమూల్య శుభం జరగాలని కోరి మునులు కల్పకపుష్పాల నాశీర్వాదాలతో యిచ్చి వెళ్ళారట. అవి తీసుకుందువుగాని రమ్మంది మీ అమ్మ అని చెప్పింది. సరేనని బయలుదేరబోతూంటే చెలులాపి ఇక్కడున్న పెద్దమనిషి అనుమతి తీసుకోకుండా వెళ్ళవచ్చా! ఎంత అమర్యాద! అని మందలించి ఆమెకు బదులు తామె రాజుతో "మా చెలిమీఁది ప్రేమ నీ మనమునఁ బాయకుండుమని" వీడ్కోలుచెప్పి పోయారు.

వారు "ధరణీ సరణీ పురందరుం డనుపకపోవు పెట్లు" అని మహేంద్ర సభా మర్యాదను స్మరించారంటే వారికది బాగా అలవాటై ఉండాలి. అంటె వెనుక ఒకసారి వసురాజన్నట్లు వారు దివ్యభామినులేనేమో ! కావచ్చు.

ఈ క్షణానుభావమెడలిన యా సన్నివేశ పరిణామాలను ప్రతిపదార్థ వ్యాఖ్యలనుంచి ఆస్వాదించవచ్చు. కథాసూత్రపు కొలికిముత్తెమయిన తేటగీతి 77వది. "ఆళిహస్తావలంబనం-బడరనడుచు, కన్యఁదదధీనవృత్తియై - కాంచునట్టి, వసుపతి నిరంతరాలోక-వైభవంబు, సాగనీదయ్యెఁగన్నీటి-జడి గడంగి." చూడండి. "వసుపతి నిరంతరాలోక"మనే "వైభవంబు" పోగొట్టుకొని కన్య అయిన గిరిక దరిద్రురాలు అయిందిట. వైభవం నశిస్తే దరిద్రంకాదూ ! "తదధీనవృత్తియై" సాహిత్యంలో అయినా "వ్యవహారోహివృత్తిరిత్యుచ్యతే" అని వృత్తివ్యవహారాంశమే. ఆ వృత్తి ఏమిటంటే ఆ కన్యయొక్క కళ్యాణాశయ వ్యవహారాంశమె. మంజువాణి తెరచాటు గొడవ నెపాన ఆ మాటె తింది. కాని ఏమిటో వసురాజు ఉలకలేదు పలకలేదు. ఏదో వంకన మొత్తం చెలులంతా "మా చెలిమీఁది ప్రేమ నీ మనమునఁ బాయకుండు"మన్నారు. అబ్బే చలనంలేదు. దాన్తో ఆలోకనానుభవం సఫలతకి సంబంధించి ఏ సూచనా (అభయం ఇవ్వటం అలాఉంచి) లేదు అయ్యగారినుంచి. అలాంటప్పుడు ఏ ఆడకూతురైనా కుమిలిపోదుటండీ ! కన్ను నీటిజడికి కడంగాయట. ఉచితమే. దీనికేమిటి కారణం ! హస్త (అవలంబనం) కన్యా అని కనిపిస్తుంటే జ్యోతిశ్శాస్త్ర విషయం ఏదో ఉండాలనిపిస్తుంది. ఆ దృష్టితో చూస్తే పద్యం మొదటిమాట ఆళికూడా ఒక రాశిపేరే. అది వృశ్చికం. దాని పేరు ఎత్తితేనే కొత్తకథ తయారౌతుంది. పాపం గిరిక తన ఇచ్ఛావ్యవహారాల్లో (వృత్తి) ఎప్పుడూ సహకారిగా ఉండే మాతృచెలి తనకు మంజువాణీ, మొత్తం చెలులూ సాధించలేకపోయిన కళ్యాణాంగీకార వ్యవహారంలోనూ సహకరిస్తుందని ఆశతో ఆ కలహంసి ఐస్తె బాగుండును అనుకుంది. సరే వచ్చింది. కాని తానిష్టపడేది రాజయోగం అయితే వియోగం కల్పించిందావిడ. ఏదో చూపుల్తో అయినా ఆనందిస్తుంటే ఇదేం పని ! తేలుకొండి పని. ఆ ఆళికి తన హస్తావలంబనం దొరికేటప్పటికి తన సహజాధీన వృత్తిచేత అడచింది. అంటగుట్టింది దానికి కన్నీటిజడి కడంగదా ! అదేమిటి ఆళి జ్యోతిశ్చక్రంలో రాశి అనుకున్నాంగా అసలు. పద్యంలో హస్తనక్షత్రాన్ని కన్యరాశిని స్ఫురింపజేస్తున్నా ప్రస్తుతానికి కన్య పెళ్ళిచూపుల వ్యవహారం సాగుతున్న

అమ్మాయిగానే చూద్దాం. ఆ పెళ్ళి చెయ్యాలంటే ఏ రాశి అంశలో పెళ్ళి అయితే ఎలాంటి ఫలితం కలుగుతుందో కాలామృతంలో ఉంది. ౩ బిన్దుః ౭౫ శ్లో. "మేషాంశే" అని మొదలూ "నిస్స్వాంశకే చాళినః" అనేది చివరా. ఆ చివరిదాని కర్థం "ఆళినః అంశే-వృశ్చికాంశే, నిస్స్వః-దరిద్రాః, స్యాత్" అన్నారు వ్యాఖ్యాతలు. "వృశ్చికాంశమందు దరిద్రురాలగునని తెలియునది." అని తెలుగులో చెప్పారు. అదండి సంగతి. హస్తావలంబనం చేతులు కలుపుకు తిరిగే హితవిధానం. ఎటువచ్చి కొండిగలదాన్తో చేతులుకలిపింది. అలయోగాత్ అలీ అలమనగా తేలుతోక. అది గలది అని. గు.బా.ప్రి. ౨ బిం. ౨౩౦ శ్లో. మరి దాని అధీనంలో ఉన్న వృత్తి అంటపొడవటం. రాశిగా వివాహ విషయంగా వృశ్చికాని కధీనంలో ఉన్న వ్యవహారం దరిద్రకల్పనం. అది "వసుపతి నిరంతరాలోకవైభవం" చెడగొట్టగా కలిగింది. ఆ శ్లేషలో జ్యోతిశ్శాస్త్రఫలం అనుభవానికి రావటం ఎంత చక్కగా సమర్థించి చూపాడో! ఇంకా ఏమైనా కావాలనుకుంటే ప్రతిపదార్థ వ్యాఖ్యలు చూడండి! ఒక్కమాట పాపం ఆ మాతృసఖి తేలుకొండెలాంటిది కాదండీ! వయసు పొంగులో పొర్లిపోయే వలపుగుండెలికి పెళ్ళివ్యవహారాల్లో తీసుకోవలసిన జాగ్రతలు తెలియవు. ప్రస్తుతం ఈ పొంగుమీద నీళ్ళుచల్లటం అవసరమే. ఆ తర్వాత రాయబారాలూ మొదలయిన పెద్దలు-నడపాలసిన తంతు ఉందిమరి. అన్నీ బాగుంటే ఆ పెద్దవాళ్ళు ఆనందంతో ఆశీర్వదించి అక్షింతలువేసే శోభనదేవతలే.

బాగానే ఉంది. పెళ్ళీ ప్రేమా అంటూ వనితాజనం ప్రసంగించినా మాట్లాడని వసురాజు వాళ్ల చెలిని తీసుకువెళ్ళిపోయాక గిరికకోసం సంభ్రమించటం మొదలు పెట్టాడు. ఇలా చలించిపోయినప్పుడు ఆయన హితమంత్రికి అప్పుడు నోటితాళం ఊడింది. "లలనా నలివాస్తు్రీడవీవు నిన్నుఁ గన్గొనిన లతాంగి యీలువు మనోభవుఁ డింతకుఁగొల్లబాడఁడే" "హితకార్యసంగతికి సందియమంద నేటికిన్" అని ధైర్యం చెప్పి ఆ చెలులకు మళ్ళీనే మిత్రధర్మంతో కథాసూత్రపు కొలికిముత్తెం 89 కందంలో "బాలాపాణిగ్రహ శుభవేళానిర్ణీతి కిపుడ విచ్చేయుము" అని పెళ్ళిమాట చెప్పి రాజధానిమార్గం పట్టించాఁడు. వసురాజు "చనియె సంపత్పేటికిన్ వీటికిన్" చేరి "శాంతమగు నాత్మకేళీ నిశాంత మొంది" కూడా శాంతి కనడయ్యె. ఆయనకి గిరిక యోచన తక్క "ఇతర ప్రసంగసంభావనమునఁ దవులక తదేక పరవశుఁ"డై ఉండగ "పొండిమం బలరె నెమ్మేనన్" (98 తే) అంటూ సాగించే సూతుని కథన

చాతుర్యం ప్రతిపదార్థ వ్యాఖ్యలనించి ఆస్వాదించండి. ఇక్కడ మనం చూడవలసింది ప్రత్యేకంగా ఉంది.

వనపాలుర ఆహ్వానానికి వసురాజు బయలుదేరింది రథంమీదగదా! అయితే తిరిగివచ్చేటప్పుడు ఏనుగెక్కి వచ్చాడంటాడేమిటి? ఇలాంటి అసందర్భం చూసే ఆంధ్ర వాఙ్మయచరిత్ర సంగ్రహకారులు "కథాకల్పనమైన కలదాయన్న నిండు సున్న" అన్నారేమో! అసలు ఇంద్రుడిచ్చిన విమానం ఉండగా ఆ రథమూ ఈ ఏనుగూ ఎందుకనే ఆలోచన రావద్దా! 18వ వచనంలో "అవ్విమానంబునెక్కి నాకలోకాది లోకంబులు నానావన గవనానీకంబులు నవద్వయద్వీపసారంబులు నదీనద ప్రచారంబులు నీక్షించుచు" అని ఆయన విమానంమీద తిరిగేచోట్లు ప్రస్తావించాడు. దరిదాపుగా ఎక్కడికి వెళ్ళినా విమానాన్నే వాడుతున్నా డనిపిస్తుంది. ఇంద్రుడు దాని మహిమలు వర్ణిస్తూ "ఇది కామరూపరమ్యము" ఎక్కినవారికి మన్మథరూప వికాసాన్ని కలిగించే రమణీయ మహిమకలదేకాదు. ఆ విమానమే ఎక్కేవారు కోరుకునేరూపాల ప్రయాణసాధనమైపోయే రమ్యమహిమ కలదనికూడా. కనుకనే వనపాలుర మాటవిని బయలుదేరినప్పుడు సామాన్య జనభావనా వ్యవహారంగా రథంగా చేసుకు బయలుదేరాడు. తిరిగివచ్చేటప్పుడు ప్రియురాలు సంచరించిన ప్రాంతాన్ని అంత తొందరగా వదలి రాలేక మందయానంలో ప్రసిద్ధిగన్న ఏనుగుగా చేసుకువచ్చాడు. వెళ్ళిరావటంలో ఈ తేడాలను పట్టించుకోరు సామాన్యులు. వాళ్ళకి కామరూప వ్యవహారం బయటపడిందంటే రాజుగారిని దేవుడుగాచేసి మొక్కులూ పూజల్తో వాళ్ళు భక్తులుగామాత్రం తయారై మంత్రి-సైనిక-పౌర బాధ్యతలు మరిచే ప్రమాదం ఉంది. కనుక తన సహృదయ శ్రోతలకి మాత్రం గిట్టుబాటయేట్లు సూత పౌరాణికుడు కథనం సాగించాడు. ఇదంతా మూలభారతకథకి మెరుగుపెట్టే కథా కల్పనమే. ఔచిత్య రమణీయమై కొత్తవెలుగులు చిమ్ముతోంది. 97 సీసంలో "అఖండ కాండ ప్రయోగ లాఘవముఁదెలిపి, సాత్త్వికగుణ సామగ్రి సవరింపఁడో సుమనోధర్మ మొనరఁదాల్చి, ...నవ్యసాహిత్యచింత వహింపఁజేయఁడో నవరసభావ వైభవముఁజూపి" అని ప్రసంగించిన పౌరాణికుడు ఆ వైభవం అంతా తన కథనంలో ప్రకాశింపచేసాడు.

99వ పద్యం సీసం చివరి తే. గీ.లో "అవని పతి కాంతరంగికుఁడగు నసం గుఁడు" అని మన్మథుడు వసురాజుకి ఆంతరంగిక మిత్రుడన్నాడు. అతని మిత్ర

కార్యం "అయ్యచల రాజపుత్రిఁ దత్ (వసురాజు) అధీన మానసాంబుజను" ఒన ర్చటం. ఇంతవరకూ రాజును లోగొన్న రాగాలాపనాన్నిబట్టి ఉదయించినఅనురాగ భరానికి ఆలంబనం నిర్ధారించిన వాడొక ఆంతరంగిక మిత్రుడున్నాడు. గౌతమనామం మాయాయతిగా చెప్పుకున్నవాడు. ఇప్పుడు నాయిక మనస్సులో రాజుగారికి స్థానం కల్పించటంకూడా అతడే నెరవేర్చవచ్చునుగా ! అది వానివల్లకాదు. దానికి మన్మ ధుడే సమర్థుడు. ఈ మన్మధమిత్రుడైన వసంతుడికే వెనుకటి వాతావరణ కల్పనం సాధ్యం. మన్మథుడందుకు పనికిరాడు. ఇక్కడ అనంగుడు ఆంతరంగికుడని సూటి గానే ఉండగా దాన్నిబట్టి నర్మసచివుడిగా సన్నివేశకల్పనం కుదిర్చినవాడు వసంతు డని ధ్వనింపజేస్తున్నాడు సూతపౌరాణికుడు. ఇదివరకే మనం తెలుసుకున్నాం అనుకోండి. ఇవి దానికి తిరుగులేని సాక్ష్యం. అంతేకాదు ఇవి నర్మసచివు డిపాత్రకి మంగళహారతికూడాను. సహజం అయిన ఔచిత్యరక్షకమైన పాత్రనిష్క్రమణం. శ్రీ శే. ర ఉ "విదూషక పాత్రముపలని ప్రయోజనము కథయందుఁగలదుగాని యీ పాత్రము కథారంగమునుండి నిష్క్రమించుపట్టునఁ గవిసామాన్య ప్రబంధ ధర్మము నవలంబించెఁగాని తన కల్పనా విదగ్ధతఁ బ్రకటించియుండలేదు." వంటి మాటకి "అవనిపతి కాంతరంగికుఁడనంగు"డని స్థానం లేకుండా జాగ్రత్తపడ్డాడు. ఆ నిష్క్రమణానికి ఔచిత్యము చూపినదారి అదే. అది చీలికలూ రాళ్ళూరప్పలూ లేని సూటిఅయిన రాచబాట. దానిని కల్పనావిదగ్ధత అంటారో లేదోగాని అనితర సాధ్యమైన మార్గం. రామరాజభూషణుని సాహిత్యరహస్యం !

మరోసంగతి. సన్నివేశసందర్భాల్లో సంబంధాలున్న పాత్రలు వేరే వేరే చోటుల్లో ఉన్నా కథకుడెవర్నీ మరిచిపోకుండా సంబంధంఉన్న క్రమంలో "అంత నక్కడ" అని అతుక్కువస్తూ సంపూర్ణ సన్నివేశాన్ని కళ్ళకు కట్టినట్లు చేస్తుంటాడు. అలా రూపుకట్టించటం నాటకీయతగా తిక్కనగారు దానికి విధాతగా ఆంధ్ర సాహిత్య వేత్తలు మన్నిస్తూ ఉంటారు. అయితే అలా రంగాన్ని మార్చటానికి ఆంతరంగిక మిత్రుడైన మన్మథుడు "ఎంతానఁగొల్పె వధూవిభానువర్ణమనుచు విస్మితుఁడై" వసురాజును "కనికరించి....అయ్యచలరాజపుత్రిఁదధీన మానసాంబుజ నొనర్చె"నని శ్రోతల ఔత్సుక్యపు తెరతిప్పి రంగం మార్చాడు పౌరాణికుడు వసుచరిత్రలో. ఎంత ఔచిత్య విద్యావినోదం ; మనోజుని మనోజవం. సుమనోమనోమోహనం ఈ కథారంగ ప్రవర్తనం. అతి సహజం. కల్పనాకృత్రిమత్వం కనిపించదు. అదే రామ రాజభూషణుని మరో సాహిత్య రహస్యం.

అలా రంగం మారింది. గిరిక మనసు వసురాజ పీఠం అయింది. అయితే ప్రియాసక్తమైన మనసుతో ఇంకేమీ తోచక కాలి బొటనవ్రేలితో నేల రాయటం మొదలుపెట్టిందిట. ఆ రాత 'వసురాజు' అన్న అక్షరస్వరూపంగా మారిందట. వసు-రాజు అనే ఆ పలుకులు లోలోన రెట్టిస్తుంటే తదర్థచింతన సఫలం అయి కాలి గీతలు వసురాజ చిత్రరూపంగా దిద్దుకున్నాయిట. అలా మనసును నడిపిస్తూన్న మన్మథగురుడు నేల అనే పలకమీద అక్షరాలూ - శబ్దాలు - వారి అర్థాల చిత్రాలూ ఒకదాని తర్వాత ఒకటిగా చక్కగా శాస్త్రక్రమాభ్యాసం చేయిస్తున్నాడుట. ఆమె అలా నేలమీద ఉండిగదా అని మన్మథుడు తన బాణాల్లో కేంద్రిందయిన చూతాస్త్రాన్ని ప్రయోగిస్తే గిరిక తట్టుకోలేక నీళ్ళల్లోకి దిగిందిట. అక్కడ తనకి మళ్ళీ నీటబుట్టి వరుసకు సోదరులైన తమ్ముల అండ ఉంటుందికదా అని. తమ్ములంటే అరవిందాలూ అవికాస్తా మన్మథుడి మొదటి ములుకులుగా బాధించటం మొదలు పెట్టాయి. అరవింద మశోకం చచూతంచ నవమల్లికా నీలోత్పలం చైతే పంచ బాణస్య సాయకాః. ఇందులో కేంద్రియమైందీ మూడోదీ చూతం అయితే గిరిక తప్పించుకుని రక్షణకోసం కొలన్లో దిగితే అంతకంటె ముందుదీ మొదటిదీ అయిన అరవిందమే ఆ బాధకు గురిచేసిందిట. దానిమీద అర్థాంతరన్యాసంలో సమర్థన కాల్చుకుతింటానికి జ్ఞాతిఉంటే ఇంక నిప్పు ఎందుకూ అని జ్ఞాతిశ్చేదనలేనకిమ్ః గా సంస్కృతంలో అలా ఆరంభించిన మన్మథ వ్యాకులత ప్రతిపదార్థవ్యాఖ్యల్లో గ్రహించ వచ్చు. కథావసరంగా మనం సాగిపోదాం. 108 కం.లో "శంబరభంజనుడతి నిశిత విశిఖపంక్తి నగల్చెన్"గా అందిస్తూ 117 కం. లో "కను మొరగి.... నిజారామ వాటిఁజేరి" కూడా తట్టుకోలేక 119 కం. లో "వడి నిగుడ గమకించెన్"తో గిరిక తననంతంజేసుకో యత్నింపఁబోయిందన్నాడు రొమహర్షణి. ఈ లోపులో "బిత్తరిన్ మణిగృహంబునఁ గానక బోటిక త్తియ ల్తరమంది.... కేళివనకుంజము లారయ వచ్చి ... యచ్చటం.... చెల్వఁగనుంగొని," "తరుణీ తగునమ్మ కడింది చెయ్దముల్" అని మందలించి వియోగి జనబాధాసంగతులు ఎరిగించి తర్వాత దిష్టి తీసేసారు. 127 కం. లో మంజువాణి చెలికి ఇట్లా చెప్తోందని కథనం. రాజుకి నర్మసచివుడు ధైర్యం చెప్పినట్లె ఆమెకూడా "నీ కటాక్షోర్మి వాక్సుధానీకమునకు"మారుని బలగాలు తుమ్మెదలూ చిలకలూ ఓడి పారిపోయి లతల్నీ చెట్లనీ పట్టిపోయాయి "ఇవి యెల్ల నీ కేల యెగ్గొనర్చువనత ! యావంత ఆవంత వలపదమ్మ !" అనీ "ఇంత తలఁకం బనిలేదు మనోజుధాటికిన్" అనీ ధైర్యం చెప్పటమేకాదు తట్టుకోటానికి ఉపాయమూ

చెప్పింది." నెమ్మది కోర్కి నెమ్మితోనిమ్మని మ్రేము....కమ్మని వింటి జోదు పాద మ్ములు... భజింతు మమ్మరో రమ్మని" పిల్చుకువెళ్ళింది. 131 కం.లో "సోలుచు.... సఖులఁదెగడుచుఁగటన్" అని గిరిక అవస్థల నేకరువుపెట్టాడు. ఆ అవస్థ పడు తూనే "వెలఁది వెడలె విపినవీథులకును." అలా వెంటపెట్టుకుని చెలులంతా "నానా సూనసంపదలు" వివరిస్తూ కాలం గడుపుదామనుకున్నారట. అబ్బో! చాలాచాలా చూపించారు. 148 దాకా 17 పద్యాల్లో. 148 కం. లో ఇంక వాళ్ళు పూలు కొయ్యా లనుకున్నారని అందించి ఆ కొయ్యటం 149 రగడలో వివరించాడు. 150 చంపక మాలలో మదనుని పూజకోసం ఏలోపంలేని పూలుసేకరించటంగా చెప్పాడు సూత పౌరాణికుడు. చెలుల హెచ్చరికలో "యీ తెఱవ నిచట మసలఁగా నీకతోతెందు.... కుసుమ.... పరిసరము లసమశరునకు వర్పింత మనుచు వెడలి" అని 152 కం. లో చల్లగాలికి మార్గశ్రమ పోగొట్టుకున్నారు. తరువాత వాళ్ళు సరోవరం చూసారుట. ఇలా చెరువులూ కాసారాలు వంటివి చూద్దం చాలామంది వర్ణించారు. పౌరాణికుని నోట రామరాజభూషణుడి వర్ణనం చూడండి మరి.

చం. వనజముఖు లమ్మంగొని ర-వారిత వారి తరంగ రంగ న
ర్తన సలిలభ్రమభ్రమణ-రంగ దభంగ రథాంగ ధామమున్
మనసిజ హోమకుండ నిభ-మంజులకుంజ గతాళిభామమున్
ధనదసరోజధామసమ-ధామము నొక్క సరోలలామమున్.

శ్రీనాథ నాచనసోముని "కనిరి కుమారులంత శశి-కాంత శిలాతలశీతలస్థలీ.... పుష్కర మన్ తటాకమున్" పద్యానికి సాదృశ్యం కనపడుతున్నా శబ్దకల్పనంలో మాధుర్యంతో పాటు గీతి విధానంకూడా చోటుచేసుకొని ఎలా మృదంగ సునాదం కురిపిస్తోందో చూడండి. తన స్థాయిని పరిస్ఫుటం సుస్థిరం చేసుకున్నాడు రామరాజభూషణుడు.

నాయికా జలకేళీ ప్రాధాన్యం గలదిగా ఇంకా వచనంలోనూ పై సీసంలోనూ కూడా ఆ సరోవర సౌందర్య మహిమలున్నాయి "ఇందుగుర్రింకి, మదనుఁ బూజింపఁ గోరుక్కలు-పొదలు ననుచు ... నీరాడఁ జేరునపుడు" ఆ సుదతులు జలకేళి సవ రించటం 164 దాకా 14 పద్యాలు నడిపి కథను కలుపుతూ 165 తే. లో "కొలన వీరీతి నీరాడి.... త త్తటమ్ముఁజేరి" నంత గిరికకు కల్పక ప్రసాదమైన దుకూలాలు ఇచ్చి కట్టుకోమని ఆమె జుట్టు ఆరబెట్టి ఆపై అలంకారాలన్నీ చేసారు. ఆమె

వాళ్ళనీ అలంకరించుకోమంటే అలా వారూ అలంకరించుకున్నారు. ఇంత హడావిడీ "దర్పకరాడ్భజనాదరంబునన్" సాగించారు. పవిత్రస్థలాన్నెంచుకొని మన్మథరూప చిత్రం రచించారు. ఎలా అంటే చక్కని వట్టివేళ్ళ కప్పున్న విమానం క్రింద పన్నీట తడిపిన పుప్పొడితో అరుగువేసి దానిమీద పూలమెత్త అమర్చి ఆ మీద పద్మకర్ణికను నిలబెట్టి కస్తూరీ పంకంతో రూపుదిద్దారు. మదనుని వామాంకంమీద రతీదేవినీ వారి ముందుభాగంలో చంద్రవసంతుల్నీ ఇరుపక్కలా గంధవహ (వాయువు) హంస శుకపిక మధుప స్వరూపాల్ని చిత్రించారు. అన్నీ సిద్ధం అయ్యాక షోడశోపచార పూజచేసి "మాన మథనాయ! మదనాయ-మధుసఖాయ, మన సిజాయ నమోనమో-యనుచు మ్రొక్కి" 171 కం.లో "కామ! కమలాస్త్ర :....కామి నులు విన్నవించిరి...."ఏమనీ అంటే నీకన్నీ ఉన్నాయి ఇంక మేము" ఏమిచ్చి పూజిం చుటల్ 'శీతాంశో రమ్యతార్పణ'మ్మను క్రియంజేకొమ్ము" అని స్తోత్రం సాగిస్తూ 177 సీసం చివరగా "పూర్ణచంద్రముఖినేచ కయ్య యోచక్కనయ్య" అని ప్రార్థిం చారు. కథాగతిగా 178 కందంలో స్త్రీ హత్యాపాతకం చుట్టుకుంటుందిసుమా అని హెచ్చరించేటప్పటికి మలయానిలం వీచింది పూలజల్లు పడింది శుకపికాలు పలికాయి. పై పద్యంలో మారు డెదుట కనిపించినట్లయింది. దాన్తో ముగ్ధ గిరిక మూర్ఛపోయింది. తక్కినవాళ్ళ కళ్ళబాష్పాలు నిలుస్తుంటే తొట్రుపడ్డారు. ఎలాగో గిరికకు శైత్యోప చారాలు చేసారు. కడకు "నెలఁతకీవసు లాభంబు-నింపు మంచు, నింపు విల్కాని మఱలఁబ్రా-ర్థించుటయును". వారి మాటల్లో ప్రియుని నామాక్షరాలు చెవులసోకగా తెలివివచ్చి గిరిక కనులు విప్పింది. 185 కం. "కేళీకమనీయకాననపాళిక వెలువడి (ఆచోటు వదలి) ...... బాలికఁదెచ్చిరి విహారభవనంబునకున్" అని కథాసూత్రపు కొలికిపుత్తెము తగిలించి సూతపౌరాణికుడు ఆశ్వాసాంతాలకి వదిలాడు.

ఈ తృతీయాశ్వాసంలో రామరాజభూషణుడు ప్రదర్శించిన మహేంద్రజాలం సాహిత్య కళాజిజ్ఞాసువులకి ఒక వరప్రసాదం. గోటమీటబడింది కథలో కోలా హలమేకాని సహృదయాల్లో జడాలకి జీవంపోసి ఆడించిన రామరాజభూషణుని ప్రజ్ఞాపాటవం అది. 86వ పద్యంలో "రాగముల్ గాంచు,c దమోమయావృతుల గాంచు, భజించుఁజలాచలత్వముల్" అని వసురాజుని గురించి చెప్పింది నరిగ్గా గమ నించండి. రాగము-సహృదయ సమ్ముఖీకరణమె; తమోమయావృతులు- చీకటినీడల కదలికలు, ఇంక చలాచలత్వముల్-ఆ కదలాడు సజీవప్రకృతులు సుస్థిరగాధా విశిష్ట

తలను: ఫణించుట-పరిసన్నం చేసుకునే పరిసాధని. అంటే ఇందులో పాత్రలు సహృదయ భావంలో నిర్వికారాత్మక చిత్తం, అందులో ప్రథమ విక్రియగా మెదలిన సీతలై సజీవసంచారపరిణతిలో స్థాయిగా రసస్థిరప్రకాశంతో జడాలైనా వ్యక్తిత్వంతో నటించి సహృదయుల హృదయాల్లో తిష్ఠవేసుకుంటాయి. అలా చెయ్యటం కొండను పిండిగొట్టటం లాంటిదే అయినా రామరాజభూషణుడిలాంటి మహాశిల్పికి అది ఒక గోటిమీటు. కొండను పిండిచెయ్యటంకాదు రసపోషణ సామర్థ్యంతో ఆ పిండినికలిపి సాహిత్య శిల్పాలను మనోమోహనంగా తీర్చిదిద్దాడు. మదనపూజా సందర్భంగా పద్మకర్ణికమీద కస్తూరీపంకంతో చిత్రించిన మన్మథమూర్తిని ఘనదేహవ్యక్తిగా ప్రత్యక్షీకరించిన ప్రసాధనీ మంత్రశక్తి ఆయన సాహిత్యసాధనారహస్యం. దాన్తో పరిదర్శించిన ఇంద్రజాలం వసుచరిత్ర తృతీయాశ్వాసం. కోలాహల జడబుద్ధి దర్పాద్రిత్రా పరిణామసారం గిరికా నరసాకృతి. వసురాజు వరసహృదయ స్థాయిని మనోజకృతైక్యతా రసప్రకర్షగా ఈ తృతీయాశ్వాసం జీవంపోసుకున్న ప్రకృతి పాత్రలు నటించే ఒక ప్రబంధ రూపకం.

నన్నెచోడుని కుమారసంభవంలో పార్వతి తండ్రి "నగచక్రవర్తి మహాత్మ వైభవాలయ జగు పేర్మి హిమాలయంబు"గా "అనంత మహత్వసంపద"లున్నా ఎన్ని ఉపమోత్ప్రేక్షారూపకాదులని అడ్డుపెట్టుకున్నా "ఆ ప్రాలేయకుత్కీలచక్రవర్తి నిఖిల స్త్రీ రత్నంబయిన మేనక నిజాగ్రమహిషింగాఁ బరమసుఖలీల" అన్నపుడా జడమైన కొండకోసం సజీవవ్యక్తి అయిన మేనక కూడా రత్నభావంతో జడం అనిపించే శబ్దవ్యాజం కావలసివచ్చింది జంట కట్టడంలో. ఆ జంట "మేనకను నా హిమాద్రికి, మైనాక నగంబువుట్టె" అనగానే పాపం ఆ మానవతి ఆ బండని ఎలా కన్నదో అనిపించకపోదు. వసుచరిత్రలో 3 ఆ. 22 వ. "కరమరుదైనచోట నదిగాంచెఁ గుమారుఁ గుమారికామణిన్" అన్నపుడలా అనిపించదుకదా! కోలాహలుఁడు కూడా "పావనంబయ్యె మదన్వయంబు కృతినైతి నటంచు" ఎంచటంలో తండ్రి అనిపిస్తాడేగాని జడమైన కొండ అనిపించడు. ఈ సాటి తీసుకురావటంలో నన్నెచోడ కవిరాజ శిఖామణి సాహిత్యస్థాయి తక్కువదని నా ఉద్దేశం కాదు. రామరాజభూషణుని కళ నందుకునే ఉపాయం చూపటమే నా ఆశయం జీవకళా విన్యాసమే అది. అది కొనసాగిన క్రమపరిణామంలో ఔచిత్యవంతంగా ప్రదర్శించటం అనే పథకాన్నిబట్టి ఇంద్రదర్శనం విమానదానాదికా లోకవంక సాగ మరో

వంక శుక్తిమతీ గర్భధారణంనించి గిరికా పరిణయంలో మదనారాధన, దర్శనందాక 16 లేక 18 ఏళ్ళ చరిత్ర ప్రసంగింపబడిన ఏకదిన (ఒక పగటి) వృత్తం ప్రధానం అయిన ఒక అంక ప్రదర్శనంగా సాగిందీ తృతీయాశ్వాసం. మరి ముందుకు వెడదామా !

# 4

చతుర్థాశ్వాసం మంజువాణి రాయబారం తప్పిస్తే అంతా పరిబంధపర్వమే. అంటే నిండు వర్ణనల కుండ అని. పద్యాలు ఎక్కువే ఉన్నా వర్ణనకు విషయాలు పరిమితమే. ఉన్నవల్లా సూర్యాస్తమయం, సంజ, చీకట్లలమి, చందమామా చుక్కలూ పొడవటం, మన్మథోద్దీపకాల, ఉపాలంభనాలూ, కాగా మంజువాణి రాయబార ఘట్టం సరేసరి. కడపట సూర్యోదయ వర్ణనం అక్కడితో గిరిక "అనఘదినాన కృత్యము లొనరించి గురున్ భజించి యుండెం బ్రీతిన్" అని ఆగుతుంది. తృతీయాశ్వాసం ఒక పగటి నాటకం అయితే ఈ చతుర్థాశ్వాసం ఆ ఒక్కరాత్రి కథనం; రామరాజభూష ణుడు "సత్కవి కల్పనావిశేషావహ"మని చాటి చెప్పుకున్నది ఈ వర్ణనల సాన బట్టటమే. ఆద్యసత్కథ అయిన నన్నయ భారతంలో దీనికి మచ్చుముక్క ఏమీ కనిపించదు. 137 పద్యాల ఒక ఆశ్వాసమే అలా బంధించి ఉండగా "ఆంధ్ర వాఙ్మయ సంగ్రహకర్త "కథాకల్పనమైన గలదాయన్న నిండుసున్న, ఔచితిలేదు కల్పనలేదు." అన్నారు. వారి కథాకల్పన అన్న మొదటిదానికి రామరాజభూషణుడు స్వయంగా "కేవల కల్పనాకథలు కృత్రిమ రత్నములు" అని నిరసించి ఉన్నదాన్ని బట్టి అన్నా అనిఉండవచ్చు. అది కొంత నిజమైనా అయి ఉండవచ్చు. మరి మళ్ళీ 'కల్పన' అని వారన్నది కథకు సంబంధించిందే అయి ఉండాలి. అయితే ఆ కల్పన లేదని చెప్పటానికి వీలులేదు. ఈ ఆశ్వాసం వారి కంటబడలేదేమో ! అదృష్టం.

శ్రీ శే. ర. క. లు "మంజువాణి కనవసరముగా నాకాశసంచారశక్తి, కామ రూపధారణశక్తి యొసంగి యాయమ కమానుషధర్మముల నారోపించుట, కొండొకచో సామాన్య సఖిగా నుపయోగించుటలోఁ గవి యాశయము బోధయగుట లేదు." అన్నారు. చూడండి అసలు ఎంతటివారికైనా ఎన్ని మహిమలున్నా అవసర సమ యాల్లో సామాన్యులుగానే నడుచుకుంటారు. పోతనగారి గజేంద్రమోక్షం పట్టు కున్నాం అనుకోండి. ఆర్తరక్షణ పారవశ్యంలో శంఖచక్రాదుల్ని గ్రహించకుండానే

"పలికె నక్షీణానులాపంబులన్" అని 36 దాకా 10 పద్యాల్లో నింపించి 37 కందంలో "అని.... వనజారిమారి....మరుని(బేర్కొని కినుకన్" మన్మథుని ఉపాలంభించటం మొదలు పెట్టింది. 43 వరకు 6 పద్యాలు నడిచాక 44వ దైన తేటగీతిలో "అనుచు ననవింటిపెనుదంట-నాడరాని గెంటనములాడి.... పవనుపై( జలము వొడమ" మలయానిలంమీద విరుచుకు పడింది, 50 వరకు 6 పద్యాల్లో. చివరికి 51 కందంలో "....తుహినకర కిరణచురిన్ మునుఁగఁజనఁ జెలులు గని హాయనివనరుచు నడ్డగింప నతిశోకమునన్." వెన్నెల యేటిలోఁబడి మునిగిపోవాలనుకుంది ఆ ప్రియోన్మాదిని. చెలులు కంగారుపడి అడ్డుకున్నారు. దాన్తో ఆమెకు దుఃఖం ముంచుకు వచ్చేసింది. బావురుమని ఏడిచేసింది 52 పద్యమైన ఈ శార్దూలంలో. చూడండి.

శా. ఆ జాబిల్లి వెలుంగు వెల్లి కల డా-యన్నేక రాకా నిశా
రాజశ్రీ సఖమైన మోమునఁ బటా-గ్రంబొత్తి యెల్గెత్తి యా
రాజీ వాననయేడ్చెఁ గిన్నర వధూ-రాజత్కరాంభోజ కాం
భోజీ మేళవిపంచికారవసుధా-పూరంబు తోరంబుగాన్.

అల్లసాని పెద్దన "అ, ప్పాటలగంధి వేదననె-పంబిడి యేడ్చెఁగలస్వనంబుతో మీటిన విప్చు గుబ్బచను-మిట్టల నశ్రులు చింద్రువందఁగన్" అని పద్యం రెండు పాదాల్లోనూ, నంది తిమ్మన "గానిలి యేడ్చెఁబ్రాణవిభు - కట్టెదుటన్ లలితాంగి పంకజ, శ్రీసఖమైన మోముపయిఁ-జేల చెరంగిడి బాలపల్లవ, గ్రాసకషాయకంఠకల- కంఠవధూకుల కాక లీధ్వనిన్"అని మూడు పాదాల్లోనూ తమ నాయికలు సందర్భాను సారంగా ఏడ్చినట్లు చెప్పారు. ఇద్దరూ ఉత్పలమాల పద్యాలే వాడారు. ఆ ఇద్దర్నీ మించాలన్నట్లు రామరాజభూషణుడు శార్దూలం తీసుకున్నాడు. బాగానేఉంది.

వరూధిని ప్రవరాఖ్యుడిలో జాలిపుట్టించి సానుభూతి సంపాదించి అయినా దారికి తెచ్చుకోవాలని "పాటున కింతులోర్తురె కృపారహితాత్మక" అంటూ ఆ పాదస్తుతిలో మురిపెం మొలకెత్తించటానికి ఉందోలేదోమరి. పైట-దాని మాటెత్తక కన్నులు విడిన సిటిబొట్లుపడి చెదురుతున్న "చనుమిట్టల" "భవన్నఖాంకురము సోఁకెఁగనుంగొను మంచుఁజూ"పి వినటానికి ఇంపైన "కలస్వనంబుతో" ఏడ్చింది. పరిణయభిక్షకోసం ఆమె కడపటి ఆస అది.

అభిమానవతి అయిన సత్యభామకి పరిణయంలో పంపకం పెట్టటమే గిట్ట దయ్యే. అలాంటిది పారిజాతంవల్ల మొత్తం కొల్లబోవలసివస్తుందని వింది. దానిపై కృష్ణుని మెరమెచ్చులు. ఇంకేముంది! "ఈసునఁబుట్టి డెందమున హెచ్చిన శోక దవానలంబుచే" ఈర్ష్యాగుణంనుంచి గుండెల్లోపుట్టి దుఃఖం అనే దావానలం చెల రేగింది. కృష్ణుడే తనను అనునయించేటట్లు చేసుకోవాలి. కనుక కన్నీళ్ళు వచ్చినా రాకపోయినా కళ్ళు అద్దుకోటానికి "చేలచెరంగిడి" లేమావివగరుచిగుళ్ళు మేసిన ఆడుకోయిల స్వనంతో ఏడ్చింది. మగకోయిల గొంతు ఉత్సాహానికీ సంతోషానికీ పోషకం. అందరూ మధుర పంచమస్వరానికి "పుంస్కోకిలమ్" అనే అంటారు. మరి కరుణా-సానుభూతీ సంపాదనార్థంగా రతిస్థాయిని చేస్తూ శృంగారాన్ని పండించు కోటానికి సత్యభామ హీనస్వనంతో ఆడకోయిలనే అనుకరించి ఏడ్చింది.

ఇప్పుడు రామరాజభూషణుడు తన నాయికకూడా ఏడ్చినట్లు చెప్పాలనీ అందులో ఆ ఇద్దరిని దాటిపోవాలని అన్నింటా స్థాయిపెంచేసి గిరికనూ ఏడిపించాడు. అందుకు కారణంగానీ సందర్భంగానీ ఎక్కువ కాదుగదా అసలు సమకూర్చలేక పోయాడనిపిస్తుంది. ఎంతో మన్మథవ్యథ ఉంది. నిజమే. అప్పుడు చందమామా వెన్నెలా సుఖమియ్యకపోగా బాధించేమాటా ఒప్పుకుంటాం. ఆ బాధ భరించలేక ప్రాణాలు వదిలివెయ్యాలనిపిస్తుంది. సహజమే. అందుకు వెన్నెల వెల్లువలో దూకాలనుకోటం-వెన్నెలద్రవప్రవాహం ఏమీకాదే మునిగి చావటానికి! కొంచెం కళ ముదురుపాకాన పడిందిక్కడ. చంద్రదర్శనమే తాపకారణమైనప్పుడు వెన్నెల్లోకి వెడితే ఒడలు మాడి మసి అయిపోదా? తప్పకుండా అయ్యేదే అనుకోవాలి. లేక పోతే గిరిక ఏడుపుకి కారణం ఉండదు. అలా రామరాజభూషణుడికే ఎట్టెట్టుగా తోచి ఉంటుంది. కాబట్టే ఆ దూకే ప్రయత్నానికి చెలులు అడ్డుపడ్డారనీ! దానివల్ల తన ప్రయత్నం సాగిరాలేదనీ ఉక్రోశం వచ్చినట్లు బావురుమన్నది అనుకోవాలని "ఆ జాబిల్లి వెలుంగు వెల్లికల (చెలులు అడ్డుకోటంవల్ల) డాయన్లేక" అని వేరే ఓ కారణం కల్పించాడు. దీన్ని పైని అనుకున్నట్లు ముదిరిన ప్రబంధకళామౌఢ్యంలో మహాప్రసాదమని ఔచిత్యంగా సరిపెట్టేసుకోవాలి. అది మీ ఇష్టం! పెరుగుదలలు చూస్తే "మోముపయి చేలచెరంగిడి" పెరిగి మోమున పటాగ్రింబొత్తి"గానూ 'ఏడ్చె', 'గాసిలియేడ్చె'లు పెరిగి "ఎలుగెత్తి....ఏడ్చె"గానూ, "కలస్వనంబుతోన్", "బాలపల్లవగ్రాస కషాయకంఠ. కలకంఠ వధూకుల కాకలీధ్వనిన్" అనేవి పెరిగి

"కిన్నర వధూరాజత్కాంభోజ కాంభోజీ మేళవిపంచికారవసుధాపూరంబు తోరంబుగాన్" అయ్యాయి. ఈ జోపవిని కనికరించటానిగ్గానీ, అనునయించి లాలించటానిగ్గానీ అసలు నాయకుడు ఆ ప్రాంతాల్లోనే ఎక్కడా లేడు. ఈవిడ ఎగ్గెత్తి ఏడవటం రాజధానిలో ఉన్న వసురాజుకి వినిపించాలని రామరాజభూషణుడి తాత్పర్యం ఏమో అనుకుందామంటే- అంతటితో సానుకూలం ఔతుంటే మంజువాణిచేత రాయబారం జరిపిస్తాడా: చూస్తే ఆయనకీ ఆ ఉద్దేశం ఉన్నట్లు తోచదు. మరి ఏమిటీ?.... ఒక్కటే. అది స్పర్ధ. "శిరీషకుసుమపేశల సుధామయోక్తులం(బెద్దనార్య" అని రాయలంతటి వాడిచే పిలిపించుకున్న కవినీ, పండితలోకంచేత "ముద్దుపల్కుల తిమ్మన" అనిపించుకున్న కవినీ తోసిరాజని పెద్దపీట ఎక్కాలనే తాపత్రయమే.

ఈ పద్యంలో "కాంభోజి"రాగం పేరు ప్రస్తావింపబడిందిగనుక "సంగీత కళారహస్యనిధి" కంఠధ్వనిలో (ఏడుపులో) రాగచ్ఛాయని నెలకొల్పి తనపీట ఎత్తు ఎలాగైనా పెంచుకున్నాడనిపిస్తుంది. దీని ప్రతిపదార్థ వ్యాఖ్యచివర శ్రీ శే. ర. క. లు "ఎలుగెత్తుటవలన విచారాతిశయము సూచితము. కాంభోజిరాగము దీనస్వరముగావున గిరికా విలాపము వినువారికి మిగుల జాలి కలిగించుచుండెనని భావము." అని వ్రాసారు.

కాంభోజీ, పూర్ణకాంభోజీ అనే రెండూ 28వ మేళకర్త అయిన హరి కాంభోజి శుద్ధ మధ్యమజన్యరాగాలు. వాటి ఆరోహణావరోహణలు: కాంభోజికి—సరిగమ పధ- స | సనిధపమగరిస. మొదటిభాగం అయిన ఆరోహణలో(ని) నిషాదస్వరం లేదు. కాని రెండోభాగం అయిన అవరోహణంలో అదికూడా ఉంది.

పూర్ణకాంభోజీ— సరిగమపధస | సధపమగరిస. ఈ ఆరోహణా అవరోహణా అయ్యిన రెండువంకలా దేల్లోనూ(ని) నిషాదస్వరం లేదు. ఇలాంటి పద్ధతుల్నిబట్టి అసలు రాగాలని మూడు రకాలంటారు. "షాడవౌడవ సంపూర్ణ భేదాత్ రాగాస్త్రిధామతః। పూర్ణ-షాడవ-ఔడవాలని ఆ రకాలకి పేర్లట. వాటిల్నెలా గ్రహించటం అంటే ఔడవః పంచభిః ప్రోక్తా స్స్వరైః షడ్భిస్తుషాడవః। సంపూర్ణ స్సప్తభిర్జ్ఞేయా ఏవం రాగస్త్రిధామతాః॥ సంపూర్ణ అనే రకంలో దానిపేరునిబట్టే మొత్తం ఏడు స్వరాలూ ఉంటాయి. షాడవం అన్నా అదేవిధంగా ఆరు స్వరాలుమాత్రం ఉంటాయి. ఔడవం అంటే అయిదు స్వరాలే ఉన్న రకం అన్నమాట. ఉదాహరణ చూడండి.

పూర్ణరకం— సరిగమపదనిస | సనిదపమగరిస
షాడవరకం— సరిగమపద-స | స-దపమగరిస ఇదే పూర్ణకాంభోజి
ఔడవరకం— సరిగమప- - స | స- - పమగరిస.

షాడవఔడవాల్లో లోపించేస్వరాలు 1 ఆరోహణలోనూ అవరోహణలోనూ ఒక్కలాగే లోపించవచ్చు. 2 లేదా ఆరోహణలో మాత్రం లోపించి అవరోహణలో పూర్ణరకం అయి లోపించిన ఆ స్వరాల్ని స్వీకరించవచ్చు. 3 అలాగే ఆరోహణలో పూర్ణరకంగా ఉండి అవరోహణలో షాడవ ఔడవ రకాల్లో ఏదేనాకావచ్చు. పై ఉదాహరణలో పూర్ణకాంభోజిరాగం ఆరోహణలోనూ(ని) నిషాదస్వరం లోపంవల్ల షాడవరకమే అవరోహణలోనూ(ని) నిషాదస్వర లోపంవల్ల షాడవరకమే. అయితే కాంభోజిరాగం అలాకాదు. ఆరోహణంలో మాత్రం షాడవరకం. ఇందు లోపించే స్వరం(ని) నిషాదమే. అవరోహణంలో అది పూర్ణరకం అన్ని స్వరాలూ ఉంటాయి. కాబట్టి కాంభోజీరాగం సరిగమపద-స ఆరోహణంగానూ, సనిదపమగరిస అవరోహణంగానూ కలిగి ఉంటుంది. ఇదంతా ఎందుకు అంటే వీటినిబట్టి రాగాలకి రస నిర్ణయం ఉంది. అది తెలిస్తే కాంభోజీరాగం దీనస్వరం ఔనోకాదో మనం తేల్చి వెయ్యవచ్చు.

సాయం యోగే రసేవీరే శృంగారే చేతికీర్తితమ్ ।
సంగ్రామే వీరతారూపం లాలయన్గుణకీర్తనమ్ ॥
గానే షాడవ రాగాణాం గదితం పూర్వసూరిభిః ॥
వ్యాధినాశే శత్రునాశే భయశోక వినాశనే ।
ఔడవాస్తు ప్రగాత వ్యాగ్రహూతాన్యర్థ కర్మణి ॥

"సంపూర్ణరాగములు వీర శృంగార కరుణ హాస్యరస ప్రతిపాదకములు. షాడవ రాగములు యుద్ధములందు వీరరసప్రధాన మగునట్లుప్రయోగింపవలయును" గ్రంథ తాత్పర్యమింతదాక మనకుచాలు. కాంభోజీరాగము ఆరోహణలో షాడవరకముగదా : దానికి వీర రసప్రాధాన్యమే ఉన్నది. కాబట్టి ఈ భాగం దీనస్వరం కాకూడదు. కాదు అని శాస్త్రం. అయితే అది అవరోహణలో పూర్ణరకం. వీర (ఇది ఇందులోనూ ఉంది) శృంగార కరుణహాస్యాలు ఒలికించేదిగా ఉంది. అయితే అన్నీ కురిపించుకోనక్కరలేదు. సందర్భాన్ని బట్టి ఇక్కడ కరుణరసాన్ని ప్రధానంచేసుకోవచ్చు. ఎటువచ్చీ

షాడవంలో ఒక్క వీరం మాత్రమే ఉంది గనక అది తప్పనిసరి. ఆరోహణలో ముందు వీరరసం నెలకొల్పి ఆ తర్వాత కరుణలో కొట్టుకుపోయినా మొత్తంమీద గిరిక వేదనానుకూలం అయిన దీనస్వరం భాసించటం కష్టమే. రామరాజభూషణుడికి ఇది తెలుసు. ఆ రసాలను తారుమారు చేస్తే కరుణ తర్వాత వీరం అయి మొదట్లో లేనిధైర్యం క్రమంగా పుంజుకొని వీరవిజయం పొందవచ్చు. కాబట్టి గిరిక ఎల్గెత్తి ఏడ్చిందన్నాడు. అంటే కాంభోజీరాగం అవరోహణలో పై స్థాయినుంచి మొదలు పెట్టి పూర్ణరకంగా కరుణ పలికించి, ఆ వెనుక ఆరోహణ షాడవంలో వీరం గిలికించవచ్చు. ఇలా గిరిక ఏడ్పులో ఎల్గెత్తటం బావురుమనటంమాట ఎలాఉన్నా పైస్థాయి 'స' నుండి కాంభోజీరాగం మొదలుపెట్టటం కరుణరసస్ఫూర్తికి సంగీత కళాసంప్రదాయంగా గ్రహించాలి. అప్పుడు తక్కిన కలాపం అంతా తదనుకూలార్థ కల్పనం అన్నమాట.

ఇంకోమాట. రాగకాల నిర్ణయాన్నిబట్టి కూడా చూసేద్దాం. "వేళావళీచ కాంభోజీ సావేరీ బేగడా తథా। పూర్వరాత్రౌప్రవర్తన్తే పున్నాగో నాటకాదయః" అన్న దానిప్రకారం కాంభోజీరాగం పూర్వరాత్రికాలంలో వినియోగం. అంటే సాయంత్రం 6 గం. - 9 గం. మధ్య పాడతగింది. అంటే చంద్రాదుల ఉపాలంభనం అయేటప్పటికి రాత్రి 9 గంటలయిందని కాలమాన సూచన.

ఇప్పటికి చివరిమాట "కాంభోజీమేళవిపంచికారవ" వ్యవహారంలో రాగ విశేషం చూసాంగదా। మేళవిపంచికావిశేషం మిగిలిఉంది అన్నట్లే. కిన్నర యువతుల ప్రకాశిస్తూన్న పద్మాల్లాంటి చేతుల్లో కాంభోజీరాగానుకూలంగా మేళనం చేయబడ్డ వీణకలిగించే రవం (కాంభోజీరాగమే) అనే అమృతప్రవాహం పరిపూర్ణతనందేటట్లు (విస్తరింపగా) గిరిక ఎత్తిన ఎలుగు కలిసిం దనటంలో స్వారస్యం ఉంది. మేళన విషయం మరోసారి చూడవచ్చు. కనుక ముందుకి పోదామా మరి.

నాయకు డక్కడలేడు గనుక ఏడుస్తున్న గిరికని ఓదార్చే భారం చెలుల పాలిట పడింది. వాళ్ళామె మోమెత్తి కళ్ళు తుడిచి మా అమ్మగదే ఎందుకు ఏడుస్తావు। రేపీపాటికి వసురాజు ఆదరిస్తే నువ్వు ఒప్పులకుప్పవై సర్వభోగాలూ అనుభవిస్తావు అంటూ తమపాలిటి బాధ్యత చక్కగా నెరవేర్చారు. అంతలోనే

ఇక్కడ బిడ్డ ఇలా తల్లడిల్లిపోతుందని తెలిసికూడా ఇందాక అనగా వెళ్ళిన మంజువాణి ఇంకా రాలేదేమిటనుకున్నారు. దిక్కులు చూస్తున్నారు. అంతలో సంధ్యారాగ సదృశమైన "దివ్యప్రభాఘట్టం (దివ్యకాంతి పుంజం) బొక్కటి పుట్టెఁ గట్టెదుర." దానిని చెలులు "దీప్తిమాత్రింబు గాదిది.... దివ్యధామ (ఇంద్రప్రసాదమైన రత్నవిమానమేనో) మనుచుఁ జెలు లాడుకొనవచ్చె నంత... మంజువాణి." ఇక్కడ కథాసూత్రపు కొలికి కందము త్తెమె. ఎచ్చి వసురాజశేఖరుడిచ్చిన ముద్రిక లతాంగి (గిరిక) యెదుటనిడి చెలుల్, గ్రమ్ముకొని యడుగ నిట్లను, నచ్చేడియ ధన యుదంత-మాద్యంతంబున్". పెళ్ళికొడుకేమన్నాడనే సమాచారం చెలుల్లో ఎంతో ఉత్కంఠ కలిగించింది. ఆ సంగతి నర్థంచేసుకోగల మంజువాణి మొదటినుంచి ఇంతవరకూ తను ఏమేమిచేసిందీ అంతా విపులంగా చెప్తోందిట. మరి నాయిక మాటేమిటి? ఆమె చేతిలో నాయకుని అంగీకారసూచకం అయిన ముద్రిక పెట్టిం దిగా. ఇంక ఆమె ఈ లోకంలో ఉండదు. ఆమె మానాన్నామెనలా వదిలెయ్యటానికే కళాకోవిద అయిన మంజువాణి తనకార్యం ఆద్యంతం చెప్పదలుచుకోటంలో కిటుకై ఉంటుంది. అలాంటి చెలి దొరకటం గిరిక భాగ్యం. మొదలుపెడుతూ అలా మీరు వసురాజు మనసు తెలుసుకొని ఈమె యాతన అంతా చెప్పిరమ్మని పంపారా? ఆ మాటమీద 'కార్యవేగమ్మున' తొందరగా పని తెమల్చుకు రావాలని ఆ క్షణంలోనే ఆకాశగమనాన్ని చేపట్టానంది మంజువాణి. ఈ ఎగరటం అంతవరకూ సామాన్య చెలిగా ప్రవర్తించిన ఆమె కెలావచ్చిందని కుశ్శంకచేస్తూ శ్రీ శే.వ.క.లు. అమానుష ధర్మాన్నారోపించాడు రామరాజభూషణు డనటం వెనక చూసాం. అసలామె మాదు తక్కిన చెలుల్ని అయినా గిరికనైనాకూడా మానుషస్త్రీలని ఎలా అనుకున్నారో? మంజువాణి గిరిక పుట్టుక వివరించి మాయాజటిలుడితో ఏమన్నదో గుర్తుచేసుకు చూడండి" ఆనగజాత (కోలాహలుడికి పుట్టినదే) యీ తరుణి (గిరిక) - యీ వన దేవత లీవయస్యలు" అనిగదా 3 ఆశ్వా. 35 పద్యంలో వారు అమానుష స్త్రీలని స్పష్టంగా లేమా. 'ఆ' అని నిర్దేశించింది. "అతివ (గిరిజకు) సైరంధ్రులై, దాదులై, వయస్యలై విపినదేవతలు ప్రోతు రనుదినంబు" అని 28వ పద్యాంతంలో పూర్వం స్మరింపబడినవారే అని శ్రోతకి గుర్తుండేటట్లు రెట్టించి చెప్పిందే. మరి అలాంటి వారికి ఆకాశగమనశక్తిగానీ కామరూపధారణశక్తిగానీ ఉండటంలో వింత ఏముంది? వ్యాఖ్యాతలు మానుషత్వం వారికారోపించి చూడటంవల్ల రామరాజభూషణుడు అమానుష ధర్మము లారోపించటంగా కనిపించింది. అంతేమరి. కళ్ళకు పెట్టుకున్న

సులోచనాల అద్దాలరంగే చూసేవస్తువు లన్నింటా ఉన్నట్లు కనిపిస్తుంది. ఆ రంగు లాంటిదే ఇక్కడ ఆరోపించటం. చెలుల్ని వనదేవత లంటిగాని తానెవరో చెప్పుకో లేదుగా అంటే ఆత్మోత్కర్ష పెద్దలు ఒప్పరు. అయినా వేరేతీరుగా మనకందించింది చూడండి" ఇట్లల్లారు ముద్దైన కూతున (గిరిక) కున్ వాహిని (శుక్తిమతి) వాణిఁ దాల్చు సుకవిస్తోమంబు రప్పించి (సరస్వతీదేవి వాహనాలైన హంసల్ని పిలిపించి) తద్ఘన విద్యామహిమల్ కరతలామలకముల్ గావింపె" అని చెప్పింపిగదా! ఆసుకవి (హంస) స్తోమంలోది మంజువాణి అని పేరునుబట్టి తెలియటంలేదా! అనుమానంగా ఉంటే ఆమెనుగూర్చిన రౌమహర్షణి ఏం అంటాడో చూడండి; మొదటగా "ఆ కంజనయన (గిరిక) యనుఁగుంజెలులలో సమంజస వచన చాతురీరంజిత యగు మంజువాణి" (2వ ఆ. 86వచ) ఇక్కడ ఆమెనూ ఒక చెలిగా పరిచయం చెయ్యటం చూశాక సుకవిస్తోమంలోది అయినా కాకపోయినా కనీసం చెలులందరితోపాటు వన దేవతగా అయినా గుర్తించాలిగా! అలా చెలుల్లో చెలిగా ఉన్నా 'సమంజస వచన చాతురీరంజిత' విశేషంవల్ల ఓ సుకవిగానూ గుర్తించవచ్చు. వాత్సల్యాతిశయంచేత విద్యాగురువైనా చెలిగా ఆదరించవచ్చు. అయినా ఆమె ప్రత్యేకత ఆమెకి ఉంటూనే ఉంది. పౌరాణికుడు చెప్తూనేఉన్నాడు "మంజువాణి మంజువాణీ విలాస సంపదల ననియె" (3 ఆ. 2 పద్య) విద్యాగురువు కావటానికి పౌరాణికుని ఈ రెండు యోగ్యతా పట్టాలూ చాలు. సుకవి అవటానికి ఆమె వినిపించిన రమణీయార్థ ప్రతి పాదక వచోవిన్యాసంగల గిరికా సంభవ ప్రబంధం నిదర్శనంకాదా! కాగా 41వ వచనంలో పౌరాణికుడు "అనిన నమ్మందయాన సందియంబున నిట్లనియె."గా యువతితోపాటు హంసకూడా అనిపించే "మందయాన" విశేషంగా చెప్పటంతో సందియం తీరిపోవాలి మరి.

ఆ తరువాత రాయబార కార్యం నిర్వహించి వెనుకటి వారి యశః స్థానాన్ని అధిగమించాలని తన విద్యాచాతుర్యాలను వెలబెట్టటానికి ఎదురు చూస్తోంది అని పిస్తుంది. శృంగార నైషధం 2 ఆశ్వా. 49 సీ. "నలినసంభవువాహనము వారు వంబులు, కులము సాములు మాకు.... మధురాక్షరములైన మా మాటలు వినంగ నమృతాంధసులు యోగ్యులు........వేదశాస్త్రపురాణాది విద్యలెల్లఁదరుణి! నీయాన ఘంటాపథంబు మాకు" అని దమయంతితో చెప్పుకున్న ఆ రాయబారి యింటిగరిత "వాణిదాల్చు సుకవిస్తోమంబు"న ఒకతె ఏమొ. శ్రీనాథుని రాయబారి బ్రహ్మరథాన్ని

లాగే హంసల వంశానికి చెందినవాడు. తన కులము సాములు ముదిమిచేనేమొ "శ్రీమంబునం డీలుపడియున్నంజూచి యేనువిమానదండంబు కంఠంబున ధరియించి విరించి చేతం బారితోషికంబు వడసితి" అని స్వోత్కర్ష చాటుకున్నవాడు కాగా రామరాజభూషణుని రాయబారి విజయవంతంగా కార్యం నిర్వహించుకువచ్చి శ్రోతల ఔత్సుక్యం మేరకి వివరాలందిస్తోంది. ఆమె సమయానుకూల ప్రవర్తనంలో గురు భావం ప్రస్ఫుటం అయే సన్నివేశాలూ రోమహర్షణి చెప్పాడు. గమనించండి. చెలుల పరిహాసాలు తట్టుకోలేక గిరిక తెరమరుగున చేరగా ఆమె అలా ఎందుకు వెళ్ళింది అని రాజు అడిగితే మంజువాణి పెద్దమనిషి తరహాగా అంతకుమించిన చాతుర్యంతోనూ ఈ తెర మీ ఇద్దరిమధ్యా ఉండటం పెళ్ళితంతుని జ్ఞాపకం చేస్తోంది అంది. ఓ పిచ్చివాడా ఆడపిల్ల తెగబడి నన్ను పెళ్ళిచేసుకోమని మీదపడి అడుగు తుంది అనుకున్నావుటయ్యా! సరసంగా సూచిస్తుంది. నువ్వేమి రసజ్ఞుడివో అదీ తెలుసుకోలేకుండా ఉన్నావు- ఈ రకమైన పెళ్ళితంతు మనకెప్పుడు జరిపిస్తావు అని అడుగుతోందయ్యా అని విసిరింది తన ప్రియత్నంలోని రాయబారావసరజాలం. ఆ తరువాత వంటిగా కేళివనం చేరుకున్న గిరికను వెతుకుతూపోయి కనుక్కొని మందలించి దిష్టితీసారుట చెలులందరూ. అప్పుడు అనావిలగతి మంజువాణి చేరిం దిట. ఇంత తలకంబనిలేదు మనోజుధాటి కని ధైర్యం చెప్పిందిట "... నెమ్మది కోర్కి....నిమ్మని....కమ్మని వింటి జోదుపాదమ్ములు భజింతుమమ్మరో ! రమ్మని బోటి (మంజువాణి) కోమలి (గిరిక) కర మ్మనివార్యగతిం దెమల్పగన్" అధికారం ఆమెకుంది. సాధనా తంత్రోపదేశం చేసిన గురువు సమయమూ సందర్భమూ తుల తూచి కార్యగతిని నిర్ణయించి జరిపించగల గౌరవస్థానం ఆమెది. చంద్రుడు, మన్మ ధుడు; మలయపవనము అనే మంటలు ముస్పిరిగొంటే బిడ్డ భరించగలదా ! నేను చాలా తొందరగా పోయి నాయకుడి మనసు తెలుసుకొని మన చెలి వేదన తెలిపి శుభవార్త తెస్తాను అంటూ పుల్లయ్య వేంవారంగా బయలుదేరలేదు. "కొమ్మ హారంబు పూని" మరే బయల్దేరింది. ఆమె మాటకి ఉండే విలువనిబట్టి మంజువాణి "వాణీదాల్చు సుకవిస్తోమం"లోనిది అని తేల్గానే గుర్తించవచ్చు. ఇంతగా ఔచితీ పరాయణం అయిన పాత్రకల్పనా సామర్థ్యం రామరాజభూషణుడు మంజువాణిలో నిక్షేపించాడు. కార్యావసరజ్ఞతా కర్తవ్యదీక్షాకృతుల కాలవాలమైన సుకవి ఆమె. "సుకవితాయద్యస్తి రాజ్యేనకిమ్" అని గిరికా కళ్యాణ ప్రబంధ నిర్వాహకాద్యం వాణీ దాల్చు సత్కిలోకపదం తలపక ఉండిపోయిన సహృదయు మూర్తిన్య. ఇంక ఏ అను

మానమూ పెట్టుకోకుండా ఆమె నిర్వహించుకువచ్చిన రాయబార-విశేషాల నందు కుందాం.

ముందుగా మంజువాణి ఆకాశంలోకి దూసుకువెళ్ళే సామర్థ్యాన్ని పొందిందిట. అలా ఆకాశంలోకి వెడుతుంటే ఆమెకు భూమి రివ్వున ఎగిరినట్లు తోచిందిట. నిజమె. పరుగుపెట్టేవాడు నేలకేసిచూస్తూ పరుగుపెడితే అతని కళ్ళకి నేల వెనక్కి పరుగుపెడుతున్నట్లు అనిపిస్తుందిగా అలాగే ఆమెకీను. భూమి ఎగురుతోందిగదా అని దానిమీది జడప్రకృతులేమీ తలకిందులయ్యాయా విరిగాయా ఒరిగాయా అంటే అలాంటిదేమీ లేదుట. వాటికేభంగమూ వాటిల్లలేదు. బడివాయక అంటే అదే. ఏ భంగపాటూ చెందకుండా భూమి పర్వతాదులతోసహా ఎగిరినట్లుంది. భూమి ఎంత వేగంతో ఎగిరినట్లుంటే ఆమె అంత వేగంతో ఎగిరిందన్నమాట. 'బివ్వు'న అని ఎంతో వేగాన్ని సూచించింది. తాను ఆ వేగంతో ఎగిరినట్లు చెప్పుకోటం ఆత్మోత్కర్ష కనుక ఇష్టంలేదు. శ్రోతల ఔత్సుక్యాన్నిబట్టి అది భూమిపరంచేసి చెప్పింది. ఆధునిక విజ్ఞానశాస్త్ర పితామహుడు న్యూటనుగారి "ఏ చలనానికైనప్పటికీ వేగంలో సరిసమానమూ, మార్గంలో కచ్చితంగా వ్యతిరేకమూ అయిన ప్రతిచలనం ఉంటుం"దనే తృతీయ చలనసూత్ర విధానం ప్రకటించిన విజ్ఞానఖని మంజువాణి. మొత్తంమీద ఈ సీసపద్యం మొదటిపాద విషయం మంజువాణి ఆకాశంలోకి రివ్వున తారాజువ్వలా నిట్టనిలువుగా ఎగిరిందని.

మీదిమీదికి వచ్చే గాలివల్ల చెవుల్లో హోరు ఏర్పడి ఆకాశమే రొదపెట్టి నట్లనిపించిందట. ఎదుటినుంచి వచ్చే గాలినే పట్టగల దొప్పల్లా చెవుల నిర్మాణం ఉంది. దాన్నిబట్టి మంజువాణి నిట్టనిలువునా ఎగరటం చాలించి మార్గాన్ని ఎన్నుకొని ముందుకు సాగుతున్నట్లు గుర్తించాలి. అలా సాగుతూ తలవంచి క్రిందికిచూస్తే ఎదురువచ్చే ప్రదేశాలు ఒక్కొక్కటే తెర తొలిగి ఎదుటబడు (తొలగిపో) తున్నట్లు అనిపించిందిట. తలెత్తి పైకిచూస్తే చంద్రుడు విస్తారంగా సాగి హఠాత్తుగా పొడుగు ఎదిగిపోయినట్లు తోచిందిట. అదెలాఅంటే వెలిగించిన ఊదువత్తిని వేగంగా కదిలిస్తే చుక్కలా ఉండవలసిన నిప్పురవ్వ గీతలా సాగినట్లు కనిపించదా। చంద్రుడా చుక్కలాగే మంజువాణి ప్రయాణవేగంవల్ల సాగి పెరిగినట్లనిపించాడుట. దారి పొడుగునా (అక్కడక్కడ గగనంలోనె నిలబడి చూచిందనుకుంటే) ఆ క్రమంలో

చూసుకువస్తే నేలమీదవన్నీ చిన్నచిన్నవై క్రొత్తక్రొత్త రూపాల్లో కనిపించాయట. కొండలు అచ్చన (ఇప్పుడు గోలీలనుకోవచ్చు) కాయల్లాగా, చెఱువులు అద్దపు బిళ్ళల్లాగా, పారుతున్న ఏరులు ముత్యాల దండల్లా, వనాలన్నీ నారుమడుల్లా కని పించినట్లుందని మంజువాణి కథను చాలా విశాలప్రాతిపదికమీదే సాగిస్తోంది. ఆమెది ఎంతటి అనుభవప్రామాణికమైన గగనయాన విజ్ఞతాపరిశనమో! రామరాజభూష ణుడు అభినందనీయుడు.

ఆలా ఎగిరి సాగుతున్న మంజువాణికి పురదుర్గాదులన్నీ భూమ్మీద కుప్పలు కుప్పలుగా కనిపిస్తూంటే ఒక్కసారి ఆమె గాలిలోనే నిలచిఉండి అధిష్ఠానపురం వంక చూసి విస్తుపోయిందిట. ఏమి అంటే అక్కడ ఏదిచూసినా కాంచనమయమే నయ్యె. సిరి అనంత తనువులై కనిపిస్తోందక్కడ. నాట్యగృహాలూ గుజ్జుపుసాలలూ వర్తకప్రాంతాలూ అన్నీ రత్నప్రతిమాఖచితాలై ఉన్నాయి. కస్తూరీ శ్రీగంధ కర్పూరాలూ కుంకంపువ్వూ ఇచ్చే సువాసనలకి ఆమె గమనశ్రమ ఉపశమింపజేసు కుందిట. తర్వాత ఎవరికంటా పడకుండాపోయి దిక్కుల కలయచూసింది. ఆ నగరం అనే యోగిపుంగవుడు ప్రాకారం అనే యంత్రపీఠంమీద కూర్చొని ఆ ద్వారాలు బంధింపబడటం అనే కన్నుమూతతో, వెన్నెల అనే విభూతి పూతలో ఐందవమైన (ఇందు సంబందముగల అంటే ఇందుడికి 'సోమ' అని ఇంకోపేరుంది. అది స + ఉమ యోగంచేత అర్ధనారీశ్వరభావం కలది ఔతుంది. ఆ భావసంబంధంగల మహాదేవ ధ్యానం అనే) అమృతాన్ని ఆస్వాదించే జండా అనే జిహ్వతో చంద్ర కాంత శిలలనుంచి కారే సీరు అనే ఆనంద బాష్పాలు విడుస్తూ నిశ్శబ్దం అనే ప్రశాం తిని పొంది పూర్ణ సమాధిస్థితివిపొంది ఉన్నాడుట. అలాంటి పరమహంసానుభూతి మంజువాణికేమీ క్రొత్తకాదు కనుక ఎంతో చక్కగా నిరూపించింది.

తరువాత ఆమె నగరం అంతరాంతరాల్లో జరుగుతున్న వింతలెన్నో చూసింది. వాటిని ప్రతిపదార్థ వ్యాఖ్యాగ్రంథాల్లో చూడవచ్చు. ఇక్కడ ఒక చిన్న వివరణ. ముందుగా నగరం ప్రశాంతంగా ఉందని ఆ వెంటనే లోలోపల ఎక్కడెక్కడో ఏమేమిటో అందులోనూ వేశ్యావాటికా చరితం స్మరించటం ఏమిటనిపిస్తుంది. కొందరు విమర్శకులది నిరసించారుకూడాను. చూడండి సమాధిగతమైన దేహం (యోగిది)గా కాదండీ పరిచయం అయింది. అది "యోగశిఖోపనిషత్తులో ఇలా ఉందండి:"

దశద్వారపురం దేహం దశనాడీమహాపథమ్। దశభిర్వాయు భిర్వ్యాప్తం దశేన్ద్రియ పరిచ్ఛదమ్। షడాధారా పవరకం షడన్వయ మహావనమ్। చతుః పీఠసమాకీర్ణం చతురామ్నాయదీపకమ్। బిన్దునాద మహాలిఙ్గం శివశక్తి నికేతనమ్। దేహం శివా లయం ప్రోక్తం సిద్ధిదంసర్వదేహినామ్॥" ఇలా సిద్ధిని కలగజేసే సమాధిగతం అయిన దేహంలో మనోవికారాలు అదుపునబడి ఎలా కొట్టుకుంటాయో ఈ నగరాం తర్గత చైతన్య వివరణం తెలియజేస్తుంది. అందులో ముఖ్యంగా పంచేంద్రియ వికార సంచారం ఎలాంటిదో తెలియందే సమాధి విశేషం పట్టుపడదు. దేవవేశ్యలనబడే అప్సరసలీ ఇంద్రియాలకి ప్రతీకలు. "అపసారయన్తి - స్ఖలయన్తి ధైర్యాత్సర్వా నిత్యప్సరః; సృగతౌ— అందరినీ ధైర్యముపలన స్ఖలింపఁజేయువారు" అని అప్సరస్ శబ్దానికి వ్యుత్పత్తి చెప్పింది గురుబాలప్రబోధిక. అలాగే అదుపుచేసుకుంటే "ఆప్యన్తే-ప్రాప్యన్తే పుణ్యకృద్భిరితివా—పుణ్యముచేసిన వారిచే పొందఁబడువారు. స్త్రీయాం-స్త్రీలింగమందు, బహుషు-బహువచనమునందే ఈ శబ్దమునకు ప్రయోగ నియమము" అని పుణ్యం అనే సత్కార్యాచరణంలో తోడ్పడే వారనీ పంచేంద్రియ ప్రతీకలుగా ఎప్పుడూ బహువచన ప్రయోగనియమం గలట్లుగా తెలుసుకోవచ్చు. ఆ పుణ్య-సత్కార్యాచరణం వాటిని అదుపుచెయ్యటమే. అలాచేసే చిత్తానికి ఇంద్రుడు ప్రతీక. ఆయనకు ఋభుక్షుడని ఓ పేరుంది. "ఆఖండలస్సహస్రాక్ష ఋభుక్షా" అని అమరం 44. "ఋభూన్-దేవాన్ క్షిపతి-కర్మసుప్రేరయ తీతిఋభుక్షా-దేవత (అప్సరసలు కూడా) లఁబనులయందుఁ బ్రేరేపించువాఁడు, క్షిప-ప్రేరణే:" అంది గురుబాల ప్రబోధిక. ఇలా ఇంద్రియాల నదుపుచేసి నియమితకార్యాల సద్వినియోగ పరంగా సాగే సహృదయేంద్రియభోగమే సమాధియోగం. అది నాకవిహారం కాగా నగరవిహారంలో ఈ భూమ్మీద నాగర విధాయిక పరిధికల ఆటవెలదులూ వారి వాటికలూ పరిహరించవలసిన వేమీకావు. అక్కడ భూర్తవ్యవహారంగా పరిధిదాటితే అదుపుచేసి ఆ పరిధిని పాలింపజేసే ధరాధిపుడే ఇంద్రుడు. శుక్తిమతీ కోలాహలుల అతిక్రమణని అదుపుచేసి ఇంద్రుని మెప్పు పొందాడుగదా వసురాజు! మన ప్రబంధాల్లో వేశ్యవాటికా గణికల చతురతల వర్ణనలు తప్పక ఉండటంలో కల యదార్థ భావం ఇదే. "మథనం సర్వశాస్త్రాణి నవనీతం యథామృతమ్। యోగీపిబతితం సర్పింతక్రం పిబతిపండితః॥ శాస్త్రాలనే పెరుగుచిలికి యోగులు వెన్నా నేయీ స్వీకరించేవాళ్ళుట, పండితులేమో మజ్జిగ త్రాగేవాళ్ళుట. పెద్దలంటారు. సరే

మంజువాణికూడా "వెలయాంద్రచే నప్సరాధిరాజ వేశ్యవాటిక చూడ్కికి వేడ్క యొసఁగె" అంది.

అలా ఏవేవో జరుగుతుంటే "అవియెల్ల నరసికొనుచు" అన్ని సర్వైశ్వర్య మండితాలైన మందిరాలే కనిపిస్తుంటే "ఇందు నృపపుంగవు మంగళధామమెద్దియో." "అని చింతించుచు" యక్షగంధర్వాదుల వ్యాపారాల్నిబట్టి "విమానచిత్రముల్గా" అని గుర్తించి "భవనద్వారంబు సేరంజనన్." తెలివైందే మంజువాణి: "కనఁదోఁచె నృపుహజార మామహామంటపముఁదాఁటి యవలఁజనుచు" అర్చనాగృహాలూ, భోజనశాలలూ వంటి అన్నింటిని "దాఁటి ధరావతీర్ణ నై" అంది. ఇదివరకు ఆమె ఒక మేడ పై భాగాన దిగింది. ఇప్పుడిలా నేలకిదిగింది. ఏవో గుర్తుల్నిబట్టి "ఇదియ కాఁబోలు నృపుకేళి సదనమనుచు నచట మాయాబల తిరోహితాంగనగుచు" రాజు గారి కేళీమందిరం సమీపించి మాయావిద్యచే శరీరం ఇతరులకి కనిపించకుండా ఉండేట్లు చేసుకుంది. ఎవరన్నా చూస్తారేమో అనే. అలాగే ఆ మందిరంలో నిద్ర పోతున్న సుందరుల్ని చూసిందట. ఆ స్త్రీలు రాజుగారి పూర్వపత్నులేమో (కాకనూ పోవచ్చనుకోండి. చెప్పలేదుగా మరి:) కాగా సేవాతత్పరలైన చేడియలు నిద్రలో కూడా తమతమ విధుల్ని అప్రయత్నంగా నెరవేర్చటం చూసిందట. ఇంక మనం ఇదివరకు వీణమేళనాన్ని గురించి వాయిదా వేసుకున్నాంగదూ: ఆ విషయం ఇంక ప్రస్తావించవలసిఉంది ఇక్కడ :

రామరాజభూషణుడిమీద అభిమానం అంటే అల్లసాని పెద్దనలో నెరసులెన్ని భూతఅద్దంలో చూపించాలని తాపత్రయపడే వాళ్ళున్నారు. అలాంటివారిలో ఒకరు మనుచరిత్ర 3 ఆశ్వా. 57వ పద్యాన్ని ఉదహరించి తన వైదుష్యం ప్రకటించిన వారి ఉపన్యాసంలో విషయం ప్రస్తావించాలి. ఆ పద్యం ఇది.

శా. వాలారుం గొనగోళ్ళ నీ వలనతన్-వాయించుచో నాటకున్
మేళంబైన విపంచి నిన్న మొదలున్-నీ వంటమింజేసి యా
యాలాపంబె ఘువేళఁబల్కెడుఁ బ్రభా-తాయాత వాతాహతా
లోలత్తంత్రిల మేళవింపఁగదవే-లోలాక్షి దేశాక్షికిన్.

రాగకాలానికి అనుకూలంగాని ఈ ఉదయవేళకూడా నీవు మేళవించి వదలిన విపంచి నిన్నటి సాయంతనపు ఆనాటరాగాన్నే పలుకుతోంది. అది తప్పుగనక ఈ సమయానికి

పనికివచ్చేటట్లు దేశాకికి మేళవించవలసిందని వరూధిని చెలులు ఆమెను ప్రోత్స హించే పద్యం ఇది. ఇంకా ఆ వీణ ఆనాటరాగాన్ని మీటకుండానే ఎలా పలుకు తోందీ అంటే వేసవగాలి తరగల తాకిడికి మీటబడినట్లే కంపిస్తున్నాయట దాని తీగెలు. ఇప్పుడా ఉపన్యాసకుడు గాలికి అలా కంపించటం ఒకవేళ అలా కంపించినా వినవచ్చేటంతగా ధ్వనించటం సాధ్యం కాదనీ; కావలిస్తే శ్రుతిచేసిన వీణదగ్గర చేరి వినసకట్టుతో వినరిచూడండి; అలా ఒక్కనాటికీ పలకదు. అన్నారు. ఈమధ్య అది ఆయన వ్రాసిన ఒక వ్యాసంలోనూ చదివాను. మంచి హేతువాదమే.

ఒకసారి పెద్దన తంత్రుల మీటటాన్ని గురించి ఏం అన్నారో చూడండి. "వాలారుంగొనగోళ్ళనీ వలసతన్ వాయించుచో" అంటె కడు సున్నితమైన మీటుకి వీలుగా వాడియై వంపుగన్న గోళ్ళతో అంటీ ముట్టనట్లు విలాసంగా వాయించటం. అంతేగాని ఏ ఇనుపగంటం లాంటి కట్లో వేలికి తగిలించుకొని తీగల బలం పరీ క్షించేటట్లు కొట్టటంకాదు. అలా మీటు సున్నితం అయినప్పుడే వీణావాదనంలో రాగభావదీప్తి కంచు (చిటి) తాళాల నడుమ కటువై ఏలాగో చెవుల చొరటంకాక మృదుమధురం అయిన ప్రస్తారంలో కర్ణామృతం ఔతుంది. అంతకంటె మృదువైన గాలి మీటుకైనా ఆ తీగెలు ప్రకంపింపనూవచ్చు; దానివల్ల నాదమూ పుట్టవచ్చు. పై ఉపన్యాసంలోలా నేనూ ఓ హేతువాదం చేస్తానుమరి చూడండి. చక్కగా ఎదిగిన సర్వీచెట్లుంటే గాలివాటానికి నాదం పుట్టటం సహజంగా మనం వింటూఉంటాం. ఆ నాదం పుట్టిస్తాయనే వాటిని ఈలచెట్లు అనికూడా అంటారంతా. తీగెలకంటే ఎంతో లావుండే ఆ రెమ్మలే గాలికి నినదిస్తుంటే సున్నితమైన తీగెలెందుకు నినదించవూ ? ఇప్పుడీవాదాన్నీ గేలిచేస్తూ మళ్ళీ వినసకట్టు తీసుకొని చెట్టుదగ్గిర నిలబడి వినరండి ఈలవేస్తుందేమో చూడండి అని అలాంటివారన్నా అనవచ్చు. అయినా దానికి ఈల చెట్టు అన్న పేరు పోదు. పెద్దనగారు చెప్పినట్లు పలికే వీణ చిన్నబోదు.

ఇక్కడ ఈ మాట ఎందుకు ఎత్తానంటే రామరాజభూషణుడుకూడా వీణ అలా గాలికి పలకటం, దాన్ని స్వయంగా మంజువాణి విన్నట్లు అమెనోట వినిపిం చాడు. ఈ 75వ పద్యం మొదటిపాదం పై వారి కంటపడలేదేమో ! చూడండి "ఒకతె చన్నులమీఁది-యుదిరి కిన్నరగాలిఁ, బలుకనింత చలించి-బయలుమీఁబు." అని- ఉదిరికిన్నర అంటే శుద్ధసువర్ణమైన వీణావిశేషం అని ప్రతిపదార్థంలో ఉంది.

ఆ పైన గాలికి పలకటం అనేది స్పష్టంగా సూటిగా "గాలిఁబలుక" అని తెలిసేటట్లే ఉంది. మీటినట్లుకూడా ఉన్నా అది తంత్రులనుగాక వట్టిబయలు మీటటంగానే ఉంది. గమనించాలి.

సరే కంపనం పుట్టవచ్చు. వీణ నినదించనూవచ్చు. కాని రాగచ్ఛాయ విని పిస్తుందా అని సందేహమేమో ! రాయలకాలంనాటి వీణలకి ఇప్పటివాటికి మల్లేమెట్లు ఉండేవికావు అనీ, రామరాజభూషణుడా మెట్ల పద్ధతిని ప్రవేశపెట్టాడనీ ఈ కవి అభిమానులు కొందరంటారు. పెద్దన ఆ వెనుకటి తరం వాడుగనుక అప్పుడీ మెట్ల పద్ధతి లేనట్లుగ పాతపద్ధతిలోనే రాగస్వరాలనుబట్టి ఆ యా స్వరాలు పలికేటట్లు అన్ని (స్వరసంఖ్య) తీగలని వరుసగా బిగించి ఉంచుకొని అవసరమైన స్వరతంత్రు లను మీటి రాగప్రస్తారం చేసేవారు అనుకోవాలి. ఒక వంకనుంచి ఆరోహణ క్రమంలో బిగిస్తేచాలు రెండోవంకనించి అవరోహణం పలికించవచ్చు. గాలి (సుడి లేకపోతే-అప్పుడు వేకువగాలే ఉంది) ఒకవంకనుంచి రెండోవంకకు సాగుతూ వీస్తుంది. అంటే ఒక స్వరతంత్రి తరువాత మరో స్వరతంత్రి చొప్పున క్రమంగా తాకుతూపోతుంది. అది అవిరళంగా అలా తాకుతూనే ఉన్నా ఆ తీవెల స్వరక్రమాన్ని కర్ణశుద్ధిగల విదుషీమణులైన వరూధిని చెలుల చెవులకి స్ఫుటంగానే సోకింది. అది ఆరోహణ క్రమంలో ఉన్నా అవరోహణక్రమంలో ఉన్నా వాళ్ళు రాగాన్ని గుర్తించారు. అది కాలానుగుణమైంది కాదనీ, అనుగుణంగా మార్చాలనీ తెలిసిన వాళ్ళు కనుక మార్చవలసిన రాగం పేరు దేశాక్షి అని సూచించారు. ప్రవరాఖ్యా లాలసమైన ఏకదేశ దర్శనం కోరటంగాని మారటంగాని దృష్టిలో పెట్టుకుని తత్కాలానుగుణమైన భూపాలాది ఇతర రాగాలున్నా దేశాక్షి నెన్నారు వారు. అంతే గాని పెద్దన యతికోసమో అంత్యప్రాసకోసమో కక్కుర్తిపడి వారిచేత ఈ రాగాన్ని ఎన్నికచేయించలేదు.

రామరాజభూషణుని పద్యంలో వీణ గాలికి పలికినప్పుడు రాగచ్ఛాయ పేరు చెప్పబడలేదుగానీ ఏ రాగమూలేని వట్టి హోరు వినపడిందనికూడా చెప్పబడలేదు గదా ! అలాంటి హోరే అయితే అది విధినిర్వహణలో అతిక్రమణంగా పరిగణింప బడి అందుకు నియమితురాలైన స్త్రీ శిక్షకు గురిఅయ్యేది కాబట్టి ఆ గాలికి వీణ రాగాన్ని పలికిందనే అనుకోక తప్పదు. ఇలా వీణ మేళవించటం అంటే రాగాను

కూల తన్నియమిత స్వరక్రమంలో తంత్రులను సవరించటమే. "కాంభోజీ మేళ విపంచికారవ" అని ఇదివరలో ప్రయోగించి ఉండటంవల్ల పెద్దనగారి వీణామేళన విధానమే రామరాజభూషణుడూ ప్రకటించి ఉన్నాడు గనుక భూషణాభిమానులు చెప్పే మెట్లకల్పనం సందేహాస్పదమే. అసలు వీణా నిర్మాణంలో మెట్లు (స్వ) సర కట్టు మొదలుకాలేదనికూడా చెప్పలేము. ఎందుకంటే పెద్దన సరస్వతీ ప్రార్థనలో ఆ దేవి వీణకు "దంతపు సరకట్టు" ఉన్నట్లూ వానిమీద కదలాడే "తతరుణాంగుళిచ్ఛాయ"కు "ఇంగిలీకపు వింత రంగులీన" కలిగిన తీరు వర్ణించాడు. పెద్దన నాటికే ఉన్నవాటికి ఆ తరువాతి వాడైన రామరాజభూషణుడు సృష్టికర్త అనే వారి అభిమానం ఎంతో! అంతేమరి. ఏమైనా ఆమెట్లపద్ధతి నాటంత వాడుకలో లేదనే మాట ఇద్దరి పద్యాలవల్లా తేలింది. ఇక ముందుకి పోదాం. అసలే మంజువాణి కంటికి కనిపించకుండా ఉందయ్యే.

తిరస్కరిణీ విద్యచే తానెవ్వరికీ కనిపించకపోయినా మంజువాణికి అంతా కనిపిస్తారు. నిద్రలో ఉన్న మదవతుల్నీ అసంకల్పితంగా స్వధర్మాలనుసరించే దాసీ జనాన్నీ దాటింతర్వాత రాజుగారి గదిలోంచి మాధవీ హేమా అనే ఇద్దరు పరిజనులు రావటం చూసింది. వారిద్దరి మాటల్లో రాజు "ఆ రామక్షోణికిఁజన్న నాఁటఁగోలె (అంటే ఆ సమయంనుంచి అనే అనుకోవాలి) నిద్రాసౌఖ్యముల్మానినాఁడు" 'ఏమో' అంటే కారణం వారూహించలేకుండా ఉన్నారన్నమాట. వారి ఆ మాటలు వీనుల విందుగా విని ప్రియవిస్మయాలు కలుగుతూంటే గదిలోకి వెళ్ళింది. కథాసూత్రపు కొలికి మళ్ళీ కందము త్తెమె. 77. అక్కడ అద్భుతం అయిన మంచంమీద "చిత్ర ఫలక మీక్షించు (ఏమిచిత్రమో) నా సార్వభౌముఁగంటి"నన్నది. ఆయన మనసు "శైలకన్యకా.... మగ్నమొకాక ప్రియాంతరస్పృహా.... కందముగాకని ... పొంచి యుండగా" ఆ రాజు వలపు కలతబడి మరో కందపద్దెము త్తెంకో "ఇట్లనుజి, తాపవే శిత వనితఁ (బహుశః గిరికయే కావచ్చు) గని మ-హామోహమునన్" 82. "ఎమిటి కల్గితే.... నీకు నేనొకయెగ్గుఁజేయఁగదే తలోదరీ!" "నీవు నన్మరలిచూడఁ ద్రిశుద్దిగ నేలితంచు నే, నలరితిఁగాని భావజుని-కగ్గము సేయుటెఱుంగఁ గోమలీ" నీ మనసు కఠినమూ నీ చేతలు కుటిలములూ అయ్యేనేల! అందుకు కారణం "గురుని(తండ్రి) గుణము", "తల్లి కుటిల వృత్తి" అనటంతో తన చెలినిగూర్చే అని గుర్తించింది. "అని విభుఁడింతిఁబల్క విని....పద్మనయనలార సంతసము దాల్చితి మామక మాన

సంబునన్" కాగా రాజింకా అలాగే అంటూంటే "వనితామణి (ఎలా బాధపడుతోందో) యున్కియుఁ దెల్పి యాత్మకుంబండు వొనస్తునంచు" అక్కడున్న (కీలుబొమ్మల) "యంత్రిపుత్రికామండలి"లో ఒకదానిగా మారి "పకపక నవ్వియో వసునృపాలక.... పరతంత్ర లింతులు వరింతురె కాంతులఁ దమ్ముదామ"అని మొదలుపెట్టి "... మగ వారి న్నమ్మగా వచ్చునే" "అంటి....డెందము ఝలుక్కని పెక్కు తలంపు లూరఁ గాన్" అప్పుడు రాజు "చారణకన్యయో.... వనదేవతయో యొక మంజువాణి యేతే రఁగఁబోలు బాలఁగటిఁదెల్పఁగ", "అని యూహించి నదీ తనూజతలపాహా. మామక ప్రేమబంధ నిమగ్నంబనిపల్క వింటినిఁక నా తాపానలంబాజె" ఇప్పుడింక "ఆ ప్రియతమాఘోరార్తి కిం గుందెదన్" అని వేదనతో మంచంమీద ఒరిగాడు. వెంటనే "ఇంతి నెయ్యపుంగుఱుతు" అయిన గిరిక హారాన్ని రాజు మెడలో వేయగా ఆ రాజు కళ్ళువిచ్చి హారంచూసి ఎక్కడిది అనుకొని "....తాపము జనింపదువో యిది మేను సోఁకఁగాన్" "ఎచ్చటనో కన్నయట్లాహంబయ్యెడి....నీహారాద్రిజకన్య హార మగు సందేహంబు లేదెంతయున్" అని నిశ్చయించి ఆ హారంమీద "గాఢతన్ మైత్రిఁజూపున్" అంటూ ఆ మిత్ర చర్య అంతా 106 దాకా 7 పద్యాల్లో ప్రదర్శించి హారం తెచ్చిన ఆమెనుగూర్చి ఆ ప్రతిమారూపం వదలి యెదుట నిలిచి పలుకుమని అర్థిస్తూ "వనితా : వల్లభజీవితంబులు సఖీవాక్యస్థితంబుల్ గదే" అంటే చెలులు తెచ్చే ప్రియానుకూల వార్తలే వల్లభులను బ్రతికిస్తాయి అని. దానికి మంజువాణి నిజమే నేను మంజువాణినే అంటూ బొమ్మవిడిచి కొమ్మయై నిలిచి మ్రొక్కిందిట. "తెలవ (మాచెలి) నిట్లు....తిరిగి చూడవు తగునయ్య....వెలఁది....వినఁగదయ్య" అంటూ అమె 112 వరకూ 5 పద్యాలు వినిపిస్తే సమాధానంగా రాజుకూడా "ఉచితోత్తరంబుగా" 115 దాకా 3 పద్యాలు చెప్పాడట. కథాసూత్రపు కందపద్దెముత్తెంతో మంజువాణి "....ఏచెదవో వెనఁద్రోచెదవో తెలుపు ముల్లం"బని కరాకండిగా అడిగింది. రాజు ఇలా అనుమానించటం అన్యాయమని "నాతి విను... మనసుఁగానకుంట....ఇన్నాళ్ళు నీ ఖేదజలధిఁగడువఁ దెప్పకలిగెనేఁడు" అని తేరుకొని మహేంద్రుడు నా మనసెరిగి స్వయముగా పోయి రేపకడ కోలాహలుని నా కొరకు ఆయన కన్యను అడగ బోతున్నాడు అని నాకు ఇంద్రపరిచారిక వచ్చి చెప్పింది. ఆ వార్త "విన్నవాఁడ నయి సుమీ.... ఓర్చెఁనాడ ప్రాణంబులతోన్" మరి ఇంక "ఈ శుభవార్త మీ చెలియ కిప్పుడపోయి యెఱుంగఁ జెప్పి....ప్రాణములూఁబడిలంగఁజేయు....అంచు నను బేర్కొని యీ మహితాంగుళీయ మర్పింపుఁడొసంగి వీడ్కొలిపె నేరును వచ్చితి

నీ క్షణంబునన్."గా "అని యఖిలంబుఁ దెల్పి రమ-ణాంగుళి ముద్రిక మంజువాణి యి,చ్చిన నవలా విలాసమునఁ జేకొని" భక్తి గౌరవాదరములతో తలదాల్చి, కళ్ళ కద్దుకొని, గుండెల పొదవికొన్నదట. ఆ ఉంగరాన్ని రాగానే 57లో "వచ్చి రాజ శేఖరుఁ, డిచ్చిన ముద్రికల లత్కాంగి-యెదుటనిడి"నదే. అప్పటి చర్యనే మళ్ళీ ఉటం కించటమే ఇప్పుడు చెప్పిన పౌరాణిక వచనం. ఇదే కథాకథన విధానం. ఎక్కడ ప్రధాన కథ ఆగిందో గుర్తు ఉంచుకొని అవాంతర కథని పాత్రనోట పలికించి చివర మళ్ళీ ప్రధానకథ నందుకుని కొనసాగించటం. ఆ అవాంతర కథాపరిణామం ప్రధాన కథావిలీనంచేసి ఔత్సుక్యాన్ని రేకెత్తింపచెయ్యటమే కాదు ఔచిత్యానికి ప్రాణం పోయటంకూడా సాధించాడు సూతుడు. అవాంతర కథకి శ్రోతలు యువతులు. వింతలూ విశేషాల మక్కువ ఎక్కువ ఉన్నవాళ్లు. కథకురాలు సాక్షాత్తూ సరస్వతీ దేవిని ధరించే మంజువాణి. మరి ఆకాశగమనం మాయంకావటం సాలభంజికలా మారటం కలకల నవ్వటం మాట్లాడటం చివరికి అసలు నిలిచి కార్యం సాధింమకు రావటం స్త్రీ జనాకర్షకం అయిన స్త్రీ కథనం. కావలసిన సరంజామా అంతా సమ కూర్చబడింది. కథాకథనస్వరూప స్వభావాలిలా సమీక్షించుకుంటే "కవి యాశయము బోధయగుటలేదు" అనిపించదు. అనిపిస్తే అసలిందులో వేరే ఒక అవాంతర కథ ఉందా అనిపించాలి. నిజానికి లేదు. కాని మంజువాణి కథనంలో ఆమె రాయబారం ప్రత్యేక ప్రబంధంగా రూపుదిద్దుకోటంతో అది వేరే ఒక జానపద గాథ అనిపిస్తుంది. అదొక ఐంద్రజాలిక సృష్టి. అంగుళీయక జాలకంలో ప్రదర్శింపబడిన ఒక మాయా నాటకంలా సాగింది. ప్రదర్శనం పూర్తి అయింది మామూలు అంగుళీయకమే మిగి లింది. అది రామరాజభూషణుని కల్పనా వైదగ్ధ్యం. ఆ మాయలో చిక్కుకుంటే వివశం అయిన మనసు దాన్ని గుర్తించదు. అంతే. హారం ఇచ్చి ఉంగరం తేవ టానికిన్ని తంత్రాలా అనిపిస్తుంది. రామాయణం సుందరకాండలో హనుమంతుడు పిల్లివేషం వెయ్యటం దగ్గర్నుంచీ ఎన్నోఉంటే ఉంగరం ఇచ్చి చూడామణి తేవటా నికి అనిపించంది ఇక్కడెందుకనిపించాలీ? పరిస్థితుల్ని గమనిస్తే అలాంటివేమీ అనిపించవు. చక్కగా ఉంటాయి. మనోల్లాసాన్ని కలిగిస్తాయి.

ఉంగరంమీద ప్రియనామాక్షరాలు చూడగానే "....తత్కరగ్రహ మహో త్సవ మప్పుడె కాంచినట్లు—" గిరిక విలాస విభ్రమం చెందిందిట. ఈ ప్రణయ వ్యాపారం అంతా చెలులు పోయి శుక్తిమతీ కోలాహలులకు వినిపించి వసురాజు

కోసం పిల్లని అడగటానికి ఇంద్రుడే దిగి రాబోతున్నాడని చెప్తే ఇద్దరూ సంతోషించారు. అది ఆ చెలుల విజయం.

ఆపైన రాత్రి వేగించటం. వెన్నెలలుమాసి కోళ్ళుకూసి వేగుచుక్క పొడిచి చంద్రాస్తమానం జరిగి తూరుపు వెలుగులు రావటం జక్కవల చేరికలూ పులుగులు గూళ్ళ వెడలటం కలువలు ముడుచుకోగా తామరలు విచ్చుకోటం పొద్దుపొడుపు సూర్యోదయం ఎంతో రమణీయంగా వర్ణించబడ్డాయి. చక్కగా ప్రతిపదార్థ వ్యాఖ్యల్లో చదువుకోవచ్చు. ఈ వివరాలన్నీ చెలులు గిరికకు కాలక్షేపంకోసం చెప్పినట్లుంది. తెల్లవారింతర్వాత గిరిక పాన్పుదిగి కాల్యము నిర్వర్తించుకొని గోముగా తండ్రిగారి ప్రక్కన చేరింది. అని చెప్పి రోమహర్షణి ఆశ్వాసాంత విధికి ఇల్లిత పెట్టాడు.

ఇక్కడితో రామరాజభూషణుని ప్రబంధశిల్పి పథకంలో వసురాజు చరిత్ర పరమైన రూపకల్పనం పూర్తి అయింది. కాబట్టి ఇప్పుడు ఒకసాటి సమీక్ష అవసరం. కాస్త ఓపిక పట్టండి: ప్రథమాశ్వాసంలో వనపాలకులు వచ్చి ప్రార్థిస్తే వసురాజు విహారానికి వెళ్ళటం 143-162 మధ్య 20 పద్యాల్లో ప్రధాన పాత్రకి రంగప్రవేశం కల్పించటం అయ్యింది. అంతకు పూర్వంది అంతా ప్రబంధ వాఙ్మయ సామాన్యమైన పురవర్ణనాది విషయాల్లో అలా అలా వసంతవర్ణనంపేర పాత్రప్రవేశానుకూలంగా ప్రబంధ ముఖ్యరస ద్యోతకం అయిన రంగం సిద్ధం చెయ్యబడిందన్నమాట. ప్రధాన పాత్ర అయిన వసురాజు (150 ప) నిజహితయుతుఁడై. ఉపవనంబు సొచ్చి వసంత శోభని తిలకిస్తుంటే కిన్నరపక్షి ద్వంద్వం ఆసన్న శుభం పలికి ఎగిరిపోయింది. వాటి మార్గాన్నిబట్టి కోలాహల లీలాచల విహారం చెయ్యాలనుకున్నాడు. అంటే ఉపవనంనించి రంగం ఆ ఆసన్న శుభస్థానం అయిన ఆ క్రీడాచలం మీదికి మారుతోందన్నమాట. నాటకీయ పరిభాషగా రంగం మారటం అన్నానేగాని అలా అలా తన సాహిత్యరహస్య ధర్మ విహారంలో ప్రకృతికే చైతన్యం కలిగించి అంతకంతకు నదీపర్వతాల మధ్య మానుషప్రణయం గ్రహించటానికి సహృదయాంతరంగాన్ని సిద్ధంచేసే సమ్ముఖీకరణ విద్యే అది. ఏదో వేటకని పోయి అలసి నీరసంతో నీటి పట్టుకోసం తడుముకుంటూ అనుకోకుండా అందగత్తెను కలసి వాగ్దానంతో వశం చేసుకుని ఏదో మిషమీద తనదారిన పోటం ఎంత గొప్పవాళ్ళ ఘంటం ఎంత చికిలీ

చేసినా దానికే ఉబ్బి తబ్బిబ్బులై ఎవ్వరేగంతులు వేసినా ఈ సమ్మోహీకరణం అనే సాహిత్య రసపోషకమైన వశీకరణ మహావిద్యలో వారిని దాటిపోయి తనకు తానే సాటి అయ్యాడు రామరాజభూషణుడు.

ద్వితీయాశ్వాసం ఆదేరోజు కథ. రంగంమాత్రం "అమ్మహీజాని విహారా చలేంద్రం." ఇక్కడ "ఆ యెడ నొక్క నర్మసచివాగ్రణి యిట్లను" అనటాన్ని బట్టి ఇదివరలో 'నిజహిత' (150) బహువచనం అయితేనే వాళ్ళల్లో ఒక్కడని ఇక్కడ తెల్లం ఔతుంది. అయితే ఆ తక్కినవారిమాటో ! 'మహీశుల ననిపి బలము నచటనె నిలిపి' అంటూ జాగ్రత్తపడిన వాడీ హితుల విషయంలో మరపున బడ్డాడా రామరాజభూషణుడు. అదేంలేదు. అనామకులైన ఇతర హితసచివులమాట ఆసన్న శుభానుగతైక భావనుడైన నాయకునికి పట్టని అన్యరసవిషయాలకు ప్రతీకగా వదిలేసాడు. ఇతివృత్త నిమిత్తం తీరిన పాత్రలమాట ఎత్తకపోటం కథాకథన విధానంకూడాను.

తరువాత గానం వినపడింది. రాజుకి అనురాగభరం కలిగించింది. ఎక్కడి దిదో ఏమిటో తెలుసుకు రమ్మని సచివుని పంపాడు. చూసివచ్చి చెలులమధ్య వీణ వాయిస్తున్నదో కన్య. 'ఆ చిగుటాకుంబోడి నీకే తగున్' అని మెప్పించి రాజు అనుమతి పొంది మునివేషంలో ఆ స్త్రీజనంతో పరిచయం చేసుకుని నాయిక జన్మ ప్రకారం అడిగాడు. మంజువాణి అనే చెలి అడిగిన ఆ జన్మప్రకారంతోపాటు వసురాజు ధర్మపాలనా, తత్ఫల వృత్తాంతాలూ చెప్పింది. నిజానికామె చెప్పిందే వసుచరిత్ర. అయితే ఆ నాయికానాయకుల పూర్వవృత్తాంతాలతోనే ద్వితీయాశ్వాసం ముగిసింది. విమర్శగా చూస్తే మంజువాణి సాగించిన కథాక్రమం అద్వితీయం. అంటే ప్రథమాశ్వాసంలో సూతపౌరాణికుని కథనం రాజ్యమూ-రాజూ-రాజధానీ సంబంధాలు కుదుర్చుకోటానికి చాలా ఇబ్బంది పెట్టిందిగదా ! ఆ ఇబ్బంది ఏమీ లేదు మంజువాణి కథనంలో. పైగా ఎంత వీరరస స్ఫోరకంగా మొదలుపెట్టిందో ; ఆ మొదటి రెండు పద్యాలూ చూడండి.

మ. కలఁడుల్లోక మహామహోగ్ర హుతభుగ్జ్వాలావళీ నిర్జల
స్థల దంభోనిధి లక్ష్య హైమవతప-క్షోదదక్షోరు ది
గ్వలభీ దుర్భర భేరికాభయదభాం-కారైక సంప్రీణితా
చలవైరి స్తుతకీర్తి సాంద్రుఁడు వసు-క్ష్మాపాలచంద్రుండిలన్. 102

శా. స్వారాజ్యంబునుబోలె నింద్రుని కధి-ష్ఠానంబధిష్ఠానమై
యారాజన్యున కింపుసొంపెసఁగు ని-త్యశ్రీలతావాలమై
యారామస్మయమాన సూన మకరం-దాసార శైవాలినీ
ధారావర్ధిత మాధురీగుణ లస-త్కాంతారకాంతారమై. 103

ఇలా ఉత్తరోత్తరా ఆహ్లాదజనకం అయ్యే ఈ కథన విధానమే రామరాజభూషణుని సాహిత్యరహస్యం. ఈ సందర్భంలో శ్రీ వాసిలి వేంకట లక్ష్మీనరసింహారావు, ఎం.ఏ. గారు 'తమ వసుచరిత్రి తత్త్వము' అనేవ్యాసంలో "అమూలకమయిన యీ అధిష్ఠానము భూషణకవి స్వతంత్రసృష్టి" అనేదీ "మంజువాణి-మాయతపసి-భూషణ కవి సృష్టించిన మహాద్భుత పాత్రిములు" అనే మాటా ఆవశ్య స్మరణీయములు. మాయతపసి అనటంకంటె నర్మసచివాగ్రిణిగా స్మరించటం న్యాయం అనుకోండి. కథకురాలుగా శుక్తిమతి కోలాహలుడ్ని మెచ్చికూడా కూటమిని వారించే సందర్భాన్ని కులీన యువతీజనానికి సహజమైన రుచిమల్లజ్జావశం అయిన హృల్లీలగా చేసి ఆ కోలాహలుని "సతికమలాలిపట్టు ప్రబల తరదీర్ఘ భుజశాఖఁ బట్టుట" ఆ యువతీ జనం ప్రతీక్షించే ప్రేమాతిశయంగల వరుని ప్రరోచనాపరం అయిన పరిగ్రిహ వినోదంచేసి తత్ఫలంగా మెదిలే మధురస్పందనం ప్రమదగా మంజువాణి మనో ధర్మాన్ననుసరించి చెప్పటం గుర్తింపతగింది.

మంజువాణి కథనమే సాగుతోంది కనుక తృతీయాశ్వాసంకూడా అదేరోజు కథే. వసురాజు విజయంతో మొదలు. దానిమెప్పు ఇందరిదర్శనం, ఆయనవల్ల దక్కిన విమానమూను. నాయిక అసలుకథ మొదలు. పుట్టటం పెరగటం ఆరోజు దాకా చెప్పేసింది. వాణీఁవాల్చు ఆ సుకవి కథనంలో "అచేతనంబులు చేతనరీతిఁ దనర" శుక్తిమతీ కోలాహలుల పరిణయం, అది ఫలించి వసుపదుడూ గిరికా పుట్టటంగానూ "చేతనంబు లచేతన భాతినొనర" గిరికా సౌందర్య లాలసత్వంతో వసురాజు తీవెజొంపములలో ఒక తీవెగాజేసి నిలిపిన వాగ్వైభవం చూపింది. శ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారు "రామరాజభూషణుని సాహితీ శక్తులు" వ్యాసంలో పొందుపరచిన "భావానచేతనానపి చేతనవ చ్చేతనా నచేతనవత్। వ్యవ హారయతి యథేచ్ఛం సుకవిః కావ్యేస్వతంత్రయా" అనేది స్మరించుకుంటే సరిగ్గా అల్లాగేచేసి కథ నిర్వహించిన మంజువాణి "వాణీఁదాల్చు సుకవిస్తోమం"లో ఒక సుకవిగా గ్రిహించటం కష్టంకాదు.

ఆ సుకవి కథనానంతరం నాయికానాయకుల పరస్పరావలోకనాలూ తదనంతరం ఎవరి ఇళ్ళకు వాళ్ళు మరలటం, ఇల్లుచేరి అక్కడ నాయకుడు ఇంటనుండి యిక్కడ నాయికా విహారాలనుభవించటం. మరి ఈ మన్మథపీడ ఎన్నాళ్ళయినా పడి ఉండవచ్చు. కానీ ఒకే ఆశ్వాసంలో అంతవరకూ నడచిన కథ వెంటఉంది గనక అది ఆ ఒక్కనాటిదే అనుకోటం సమంజసం. నాయికచేత చెలులు మన్మథార్చనం చేయించారు. తీరా ఆ దైవం ఎదుట ప్రత్యక్షమయిందిట ఆమె తెలివి తప్పింది. చెలులు ఉపచారాలతో తెలివిరప్పించి ఆమె క్రీడామందిరం చేర్చారు. ఇలా నాయికానాయకులను మరుల ఇరులలో ఇరికించి వదలింది తృతీయాశ్వాసం.

ప్రియ (వసు) నామాక్షరాలు సంజీవికరణిగా చెవులబడితే తెలివితెచ్చుకున్న నాయిక మెల్లగా తన 'చారుమణిధామం' చేరటం స్మరిస్తూ వెనుకటి సన్నివేశాన్నే అందుకుంటూ మొదలైన చతుర్థాశ్వాసం కూడా ఆ ఒక్కరోజుకి చెందిన కథే. ఇందులో వర్ణనలు అలా ఉంచితే మంజువాణి రాయబారం గుర్తుఉండిపోయే ప్రధాన కల్పితాంశం. ద్వితీయ తృతీయాశ్వాసాల్లో మంజువాణి సుకవి కర్తవ్య బోధకురాలూ కాగా ఈ చతుర్థాశ్వాసంలో చక్కని కార్యనిర్వాహకురాలుగా కూడా దర్శనం ఇస్తుంది. కొందరికి ఇంద్రజాల మహేంద్రజాల విద్యాప్రదర్శకురాలు అనిపించినా అనిపించవచ్చు. అన్నీ ఆవిడ కర్తవ్య సాధనలో ఉపకరణాలే అయ్యాయి కనుక తప్పు పట్ట అక్కరలేదు. అసలా విద్యలను ప్రదర్శించే అవసరం ఏం వచ్చిందంటారు. చూద్దాం. ఆవిడ ప్రదర్శించినవి 1 ఆకాశగమనం 2 తిరస్కరణీ అనే కనిపించకుండా ఉండటం. 3 మణిపుత్రిగా కామరూపధారణం- అలాగేఉండి నవ్వి మాట్లాడటం అనేవి.

గిరికా కుమారి మారునిబారి కోరువని పరిస్థితిని అర్థంచేసుకుంది మంజువాణి. (సాకిన మరులుగదా) సందర్భాన్నిబట్టి బుగ్గలు గిల్లటం కన్ను పొడవటం వంటి బాధలుపెట్టే వెన్నెలగోళ్ళూ తామరములుకులూ వంటివి అనువులంటి కాళ్ళబందాలు వెయ్యకుండానే అంటే చాలా తొందరగా వెళ్ళి ఈ కన్య యుత్తలముఁదెల్పి వసురాజు చిత్తమరసి వత్తునని బయలుదేరింది. అప్పటికే చాలా ప్రొద్దుపోయింది. నగరం మాటుమణిగింది. అలాంటప్పుడు శ్రీ శే.ర.క.లు "వసురాజు పరిజనులతో రథసహాయమునఁ జేరవచ్చిన ప్రదేశమునుండి వసురాజు పురముఁజేరుటకు

మంజువాణి కాకాళయానముఁ జెప్పుటలోఁ బ్రయోజన మంతగాఁ గానరాకున్నది." అన్నారేగాని అట్లు కాకపోతే చెరసాలపాలు కావలసివస్తుందేమో పరిశీలించారుగాదు.

ఆమె చేరవలసింది రాజధానీ నగరం మాత్రమేనా ! మహారాజుల విశ్రాంతి మందిరం. చేరవేయవలసింది ఆయనకుమాత్రమే వెల్లడికావలసిన రహస్య ప్రణయ వార్త. మరి ఆయన వనానికి బయలుదేరినట్లు పరిజనులతో రథసహాయమున బయలుదేరితే చాలా ! మేళతాళాలుకూడా ఉండాలా ! కుదరదు. పోనీ ఏ గుఱ్ఱమో ఉపయోగించవచ్చునుకున్నా, రథంకంటే తక్కువైనా గొడవ తప్పదు. గొడవ అంటే వట్టి చప్పుళ్ళకి సంబంధించిందనీ, ప్రయాణం అంటే దూరాన్ని అధిగమించేదీ అని వాటి ప్రమాణలు లెక్కచూడటంకాదు. వెళ్ళేది రాజధానీ నగరం అనీ దానికి కోటా దానిచుట్టూ అగడ్తాలాంటివి ఉంటాయని మనం మరిచిపోయినా మంజువాణికి గుర్తే. ఇంకా కాపలాలో ! తనను పట్టుకొని శత్రుగూఢచారిణి అనుకొని చెఱలో నెట్టినా నెట్టవచ్చు. ధూర్తవిటుడెవడైనా వెంటబడి వేశ్యవాటిక చేర్చినా చేర్చవచ్చు. నడిరాతిరి ఆ ఆడకూతురు ఎందుకిలాంటి చిక్కుల్లో ఇరుక్కోవాలీ ! చేతనై ఎగిరిపోగలిగితే నగరంలో జరిగే ఇలాంటి వాటిని వేడుకగా చూస్తూ గమ్యం చేరుకోవచ్చు. సకల విద్యానిధి అయిన మంజువాణి ఇవన్నీ తెలిసినట్టిదే గనుక సమయానుకూలంగా ఆకాశగమన విద్యను ఉపయోగించుకొంది.

ఇంక తిరస్కరణీవిద్య. కాపలాదారుల కంటపథకుండా కాపాడే అంధకారకంటకమేగదా ! దానిమూలాన్నేగదా మాధవీ హేమా అనే రాజ పరిచారికల కంట పడకుండా వారి సంభాషణ విని పరిస్థితి తన ప్రవేశానికనుకూలం అని గ్రహించింది. మాయమై ఉండటంవల్లే అది కుదిరింది. ఇంకా అలా ఉండే రాజుగారి మనసు తెలుసుకునే ప్రయత్నమూ చెయ్యవచ్చు, రాజుగారు చూస్తున్న చిత్రఫలకంలోకి తొంగిచూసి ఆ మూర్తి ఎవ్వరిదో తెలుసుకోనూవచ్చు. తొంగిచూట్టంలో ఎవరి పొరపాటైనా ఆయన్ను తాకటం జరిగితే స్త్రీగా తనకది మర్యాదకాదు.

తర్వాతది మణిపుత్రికగా కామరూపం. కీలుబొమ్మగా ఏం చేద్దామనీ. కనిపించకపోయినా చలనంవల్ల రాజుకి అనుమానం కలిగించవచ్చు. ఉచ్ఛ్వాస నిశ్వాసాలే పట్టి ఇస్తాయి. కనుక అలాంటి చిక్కురాకుండా అక్కడున్న బొమ్మల్లో ఒక బొమ్మ

అయి రాజ చర్యల్ని పరిశీలించింది. అయితే ఆ కామరూపంలో ఉండి నవ్వటం మాట్లాడటం ఏమిటి ! అంటే అదో పరీక్ష. ప్రాణంలేని బొమ్మ పకపకలాడి పలుకుతుంటే ఇది ఏ పిశాచావేశమో అని భయపడి జ్వరంపడే వాడయితే సాక్షాత్పరాశక్తి అయిన పార్వతీదేవి మేనగోడలిని వరించ తగడుగదా ! దానికారాజు బెదరలేదు సరికదా ఏ చారణకన్యయో ప్రియురాలి వార్త తెచ్చి ఉంటుందని తెలివిగా మణిపుత్రి నుండి విడి రమ్మని తన యోగ్యతను నిరూపించుకున్నాడు. పిల్లనిచ్చుకునేవాళ్ళు బిడ్డ మేలుకోరితే ఈ మాత్రమైనా పరీక్షించరా ! ఇన్ని రకాల మంజువాణి మహిమాన్వితురాలని మనదృష్టిలో పడితేనే ఆవిడ వాణీదార్చిన సుకవిగా ఆ పాత్ర గౌరవాన్ని గుర్తించగలుగుతాము. లేకపోతే అనామకులైన ఇతర వనదేవతా మాత్రలైన చేడియల్లో ఒకతెగా మిగిలిపోయేది. ఆ తరువాత వసురాజుతో చతుర సంభాషణం మాట చెప్పేదేముంది ! చేతనాచేతనాల నేకవృత్తిగా రసమయంచేసి పలికిన గ్రంథకర్తకదా ! పోతే రాజు మెడలో తాను తెచ్చిన చెలి హారం వెయ్యటంలో తాకవలసిన పొరపా టేదైనా జరిగితే స్త్రీగా తన మర్యాద దక్కదేమో అనుకో అక్కరలేదా ! అంటే ఆమె మర్యాద చెడకుండానే ఆ హారాలంకారం చేసింది. మరో ఇంద్రజాలమా ! ఔను. ఇన్ని విద్యలను సమయానుకూలంగా ఉపయోగించుకొన్న మంజువాణి మర్యాదమీరని మరో విద్యాప్రభావం చూపించిందని మనం గ్రహించలేమా ! ఇంకా వాచ్యం చెయ్యాలా ! అక్కరలేదు. ఆ వరసలో చదితే ఆది అంతే అని తెలుస్తూనే ఉంది.

ఒకసారి హేమా-మాధవీ అనే పరిచారికల సంభాషణలో "చన్న నాఁటగోల" అనీ మరోసారి రాజునోట "సందియమున నిన్నాళ్లు" అనీ వినిపించటంతో గిరికా వసురాజుల ప్రణయం కథ ఎన్నాళ్ల సాగిందా అని ప్రశ్న పుట్టటం సహజం. అయితే సుకవి మంజువాణి అటువంటి అవకాశం ఏమీ ఇయ్యలేదు. "తెఱవ, పంచ శిఖ శాతశరహేతి-పాలు చేసి, తిరిగి చూడవు దగునయ్య !" అన్నదాన్లో కూడా రోజులు గడచిన జాడలేదు. అంటే పైవారి మాటలకి అర్థం ఆ సమయమునుండి ఈ సమయం వరకూ అనేగాని వేరుకాదన్నమాట. సారాంశంగా వసురాజు వన పాలిక అభ్యర్థన వినటం మొదలుకొని మంజువాణి రాయబారంతెచ్చి విషయం వినిపించినదంతా రెండు సూర్యోదయాల మధ్య నడిచిందే. అంటే ఇంతవరకు అయింది ఏకదిన ప్రబంధం అని తెలుస్తుంది. "ఆదే ౧ ఆ ౧౬ పద్యంలో ఉన్న

"ఏకదిన ప్రబంధ....కల్పన" అన్న రామరాజభూషణుని సాహిత్యరహస్యం. అంటే మళ్ళీ ఒక రోజులో ఒక ప్రబంధం కల్పించటం కాదంటున్నాననుకోకండి. మంజువాణి వినిపించిన వసుప్రబంధం ఒక పగలు దాటకుండా చేసిన కల్పనమే. అద్భుతంకదా!

ద్వితీయాశ్వాసంలో వసుచరిత్ర కథాచైతన్యానికి మూలం అయిన నర్మసచివ పాత్ర తృతీయాశ్వాసం మధ్యలోనే మరలిపోతే వాగ్విన్యాసపరం అయిన ఆ చైతన్యాన్ని అందిపుచ్చుకుని ఒక ఏకదిన కల్పనమైన ప్రబంధాన్నే వినిపించి ఆ తరువాత జరుగబోయే గిరికా కళ్యాణానికి పూర్వరంగం సిద్ధపరచిన పాత్రగా కూడా మంజువాణి పాత్ర చతుర్థాంకం చివరిదాకా ఉండి మరే తరలినమాట గుర్తుచేస్తూ ఇంత వరకైనది ఏకదిన ప్రబంధ కథగా గుర్తించాలనే ఈ ప్రత్యేక సమీక్ష. అయింది ఆ మరునాడు మొదలయ్యే కథకు పరుగుపెడదాం.

## 5

"....ఇంద్రుఁడు మదాళియ మెటింగి .. నగోత్తముం గన్నియ వేఁడవచ్చె నఁట కౌతుక సాంద్ర మునీంద్ర కోటితోన్" అన్న వసురాజు మాట మంజువాణి తెచ్చిన వార్త అందుకొని కోలాహలుడు సన్నద్ధుడై ఉండి "ఆత్మకనోత్సవ లాలనాయత్త హృదయుఁడై "నట్లు సూతపౌరాణికుడు మరునాటి కథగా పంచమాశ్వాసం మొదలుపెట్టాడు. వార్తానుసారంగా ఇంద్రుడు వచ్చి సత్కృతుడై వసురాజుకోసం కన్నె నడగటం, మహానందంతో ఆయన అంగీకరించటం, మాతృ పితృ వర్గాల బంధువులు వచ్చి గిరిక నాశీర్వదించటం, ఆ రాత్రికే బృహస్పతి ముహూర్తం పెట్టటం, అక్కడినించి ఇంద్రుడు వసురాజు కడకేగి (రంగం మార్చి) సంగతిచెప్పి ఆరోజే ముహూర్తం అనికూడా చెప్పటంతో మంత్రి సామంతాదుల హడావిడీ, సమస్తదేశ రాజులకూ శుభలేఖలు పంపిస్తే వాళ్ళు కానుకలతో రావటం, వసురాజుని సురాంగనలు పెళ్ళికొడుకుని చెయ్యటం ఆ యా దేవాదులిచ్చిన ఆభరణాలు ధరించటంతోపాటు ఇంద్రుడు కానుకపెట్టిన సరోజదామకము వాసవమాలిక పేరు సార్థక్యం పోకుండానే వసురాజు ధరించటం, మంగళవాద్యాల పేరుగా రంగం కోలాహలుని వీటికి మారి అక్కడ గిరికను పెళ్ళికూతుర్ని చెయ్యటం, వివరాలతో కడపట ధవళ

వర్ణగానాలతో ఆశ్వాసం ముగిసింది. ఇదంతా వివాహానికి పూర్వరంగ కలాపం అయిన తంతు. అందులో "కన్నె నెచ్చెలులు కానన దేవతలు" ప్రసక్తం అయ్యారు కాని మంజువాణి కనిపించకపోవటం గుర్తించాలి. నిజానికి ఈ కలాపంలో ముచ్చటలు ఆ మంజువాణి నోట పలికిస్తే మరింత రమణీయం అనిపించేది. ఆ సుకవి మరో ప్రబంధం చెప్పేస్తుందనో ఏమో పౌరాణికుడే ఈ కథనం సాగించాడు. ఏదో మాటవరుసకి 126వ పైన కందంలో సాక్షాత్ భారతిదేవి ధవళవర్ణాలందుకుందం చెప్పటంలో ఇంక మంజువాణి పనేం ఉందిలే అనిపించినా ఆ మాటకూడా ఆవిడ నోట వింటేనే స్వారస్యం. మరి ఇలా సాహిత్య రసపోషణుడైన రామరాజభూషణుడెందుకు చేసాడో! తరవాత చూద్దాం. ఇప్పటికి కప్పగంతులుగా ఆశ్వాస విషయం అందుకుంటూ పోదాం.

కోలాహలుడు కూతుర్ని చెంతనుంచుకొని ఎదురుచూస్తున్నాడు. అనుకున్నట్లుగానే ఇంద్రుడు మునిదేవగణాల్తో కలిసిరాగా మర్యాదలు నెరపి కూతురిచే మ్రొక్కించాడు. ఆమె అందానికి రంభాద్యప్సరసలే విస్తుపోయారు. వారితోవచ్చిన గంగాదేవి గిరికను కౌగలించుకొని తలిదండ్రులకు కీర్తి తెచ్చావమ్మా అంది. ఇక్కడ ఆమె కోలాహలునిగూర్చి "నియతోన్నతిగాంచె తండ్రియున్" అనటం గుర్తించాలి. మళ్ళీ శుక్తిమతీ కోలాహలుల ప్రణయఘట్టం. పూర్వపరిచయానురాగ మూలకమే అయినా తానొంటిపాటున ఉండగా వచ్చి కోలాహలుడు వలపుమాటలు దొర్లిస్తూ ఉంటే అందులో గాంధర్వం అనో రాక్షసం అనో పెళ్ళిమాట ఎత్తకపోటంతో శుక్తిమతి ఆభిజాత్య తారతమ్యం ఎంచి సూచించినది పట్టించుకోలేదు కోలాహలుడు అందులో అర్ధాంగీకారం ధ్వనించింది అతనికి. దాన్నిబట్టె ఆమె కొంగుబట్టి దగ్గర తీసుకున్నాడు. శుక్తిమతికీ అంగీకారం లేకపోలేదు. కనుకనే అతనికౌగిట్లో ఒదిగింది. కాని ఇదేదో పైశాచిక పద్ధతి పరిణయంగా అనంతరకాలంలో తిరస్కరింపబడతానేమో అన్నభయంతో గీపెట్టింది. (సుప్తాం మత్తప్రమత్తాం వారితోయత్రోపగచ్ఛతి। సపాపిష్ఠో వివాహానాం పైశాచాష్టమో అధమః॥ నిద్రిస్తున్నటువంటి లేక మత్తు పదార్థాన్ని సేవించి మైకంలో ఉన్నటువంటి లేక ఉన్మాదస్థితిలో ఉన్నటువంటి కన్యను బలాత్కరించి చెరచటమే పైశాచము. భారతదేశంలో పెళ్ళిళ్ళు పుస్తకం పుట 18) పెద్దల మధ్యవర్తిత్వం ఉంటే ఏ చిక్కూరాదు. అసలు ఊరికే శుక్తిమతి అలా కంగారుపడిందేగాని కోలాహలుడి అంతరంగంలో అది గాంధర్వ వివాహమే.

(స్వేచ్ఛయా అన్యోన్య సంయోగః కన్యాయాశ్చవరస్యచ। గాంధర్వస్యతు విజ్ఞేయో మైథున్యః కామసంభవః ॥ దీనిలో వధూవరులిద్దరూ పరస్పరం ప్రేమించుకుంటారు. వారు కామవాంఛకు అధీనులై స్వేచ్ఛాపూర్వకంగా ప్రవర్తిస్తారు. భా. పె. పుట 15) వెనుకటికి అన్నీ అయ్యాక ఆమె తన భార్య కాదనే వాదంచేసిన రాజు కథలో గాంధర్వవిధానం పేరెత్తి వివరించుకొన్నందువల్ల భయం లేకపోయిందా నాయికకి. పైగా దబాయించి వరాలడిగి గడుసుతనం చూపించింది. తీరా వరప్రయోజనంవేళకి ఆ భర్తవల్ల తిరస్కరింపబడి యెన్నో బాధలనుభవించింది. మరి శుక్తిమతి భయ పడటంలో తప్పేమిటుంది। అప్పుడు కోలాహలుడు ప్రణయావేశంలో తొందర పడ్డాడు. ఫలితం వసురాజు శిక్షకు తలఒగ్గటం. కానీ ఆనాటి తమ కూటమి పేరు చాటుకోకపోయినా గాంధర్వ వివాహపద్ధతిగా ధర్మబద్ధం అయిందే. దాన్ని అలాగే పాటించాడుకూడా। పుట్టిన బిడ్డలని ఆదరించి ఇప్పుడు 'తన'నియతోన్నతి ప్రస్ఫుటం అయేటట్లు కూతురుని ఆ వసురాజుకే కన్యాదానం కూడా చేయబోతున్నాడని గంగా దేవి వంటి పవిత్రమూర్తి కోలాహలుడికిచ్చిన యోగ్యతాపట్టం అది. అతని గార్హస్థ్యం ధన్యం అయింది.

గంగాదేవి వసురాజును "....హరికృపన్ శీఘ్రింబ చేపట్టి యో గిరికన్యా। యరలేక నీవతఁడు నేకీభావముంజెందుమా" అని దీవించింది. అంతలో కోలాహలు డింద్రునికి మ్రొక్కి "ఈవేమిట మెత్తు వెమిదగనిత్తున్" "....భవత్ప్రసన్నతన్ హెచ్చె మదీయ గౌరవము...." అన్నాడు వినయంగా. అందు కింద్రుడు "....నీ జనకుం డధ్వరభాగభోక్త....నీకరుదే....నితాంతోన్నతకీర్తి గౌరవము...." "....నీ తనయ.... నర్హాధినాధార్పణాహ్లాదంబందఁగరాదె... " "....ఆ వసుధరాధీశుండు.... నీ కన్నె, నన్నరనాథాగ్రణి రాణిఁజేసి కనుమా....నానావిధైశ్వర్యముల్" అన్నాడు. దాంతో కోలాహలుడు పొంగిపోయాడు. "ఇమ్మనివేఁడ వేఁకొఁకఁడనే....దేవ.... తావక మిత్రున కిమ్ము కన్నియన్"అని ఆ అధికారాన్ని ధారాదత్తం చేసాడింద్రుడికి. అప్పుడు తండ్రిచెంతనున్న గిరిక తనలో ఇంక మారుశరముల గోటగిల్లి వేయగల ధైర్యం కలిగినట్లు చేతిలోఉన్న లీలాకమలాన్ని గిల్లుతోంది అంటాడు పౌరాణికుడు.

వెనుకటికి పరమశివునికై పార్వతిని అర్థించటానికి వెళ్ళిన ఋషుల్లో అంగి రసుడనే ఆయన హిమవంతుని "యజ్ఞభాగభుజాం మధ్యేపద మాతస్థుషాత్వయా"

(కాళిదాసు కుమారసంభవమ్ ౬ సర్గ ౮౪ శ్లో) అన్న మాటబలం పుంజుకునే సాధికారంగా ఇందుగ్రిదన్నాడు వసుచరిత్రలో. హిమవంతుడు "ఇయం నమతివః సర్వాన్ త్రిలోచన వధూరితి" (ఇదే త్రిలోచన వరుని వధువు మీ అందరికీ నమస్కరిస్తోంది) అన్నాడు. మరి ఆ నగరాజు కొడుకూ మరో ఆకు ఎక్కువే చదివాడు. "ఇమ్ము కన్నియన్" అని అత్యంత ఆత్మీయ గౌరవాల జలిమిగొన్నట్లు అన్నాడు. కాగా "....పార్శ్వే పితురధోముఖీ। లీలాకమల పత్రాణి గణయామాస పార్వతీ॥" (పార్వతి తలవంచుకొని చేతిలోని వేడుక తామరరేకుల్ని లెక్కపెడుతోందిట.) అన్న దానికింకో అడుగు ముందుకువెళ్ళి గిరిక మారుశరమును లెక్కచేయక గోటగిల్లుతోందిట. ఎంత రమణీయార్ధకల్పనం! ఔను మరి అక్కడ నాయకుడిదివరకే మన్మథుని రూపుమాపేసాడయ్యె. ఇక్కడ పూజావిధానంలో మన్మథుడికి రూపంఇచ్చి తాత్కాలికంగా మూర్ఛిల్లినా అంతిమవిజయం తనదే. అతని ఉన్మదప్రసవబాణాన్ని (3 ఆశ్వా. 94 పద్యం) తుత్తునియలు చేస్తోంది. ఎంతటి సందర్భానుకూల కల్పనా సామర్ధ్యం రామరాజభూషణుడిది! మరోసంగతి నన్నెచోడ కవిరాజ శిఖామణి "కుమారసంభవము"లో హిమవంతుడు మునులతో "....మత్సుతన్ హరునకు నిత్తునా వెఱవనయ్యె." (ఈశ్వరుడంతవాడికి నేను కూతురినిచ్చేపాటి వాడినా ఆ మాట తలుచుకుంటేనే భయంవేస్తోంది) "సపుత్రకళత్రి మేను మీవరవుడ మిమ్ముఁ గొల్వఁగలవాఁడ" (మావాళ్ళందరితోనూ మీ సేవచేసుకుంటాను) "అవశ్యము దీని మీరు చెచ్చెర నొడఁగూర్చి నాకు దయసేసి కృతార్థునిఁ జేయుఁడి త్రటిన్" (ఈ కళ్యాణాన్ని ఎలాగో సమకూర్చి ఆ గౌరవం నాకిప్పించి నన్ను ధన్యుడ్ని చెయ్యండి) అన్నాడు. ఇందులో భయభ్రాంతులుంటే సమయోచితం అయిన ఆత్మీయతా గౌరవాలు పెనగొన్న "ఇమ్మనివేడ వేఁటాకఁడనే...." అంతా నీదే (భాధ్యత) "తావక మిత్రునకిమ్ము కన్నియన్" అన్న కోలాహలుడు పైమెట్టుకి ఎక్కాడు. రామరాజభూషణుని ఔచిత్య పరిజ్ఞానాన్ని శంకించిన పెద్దకిది కనువిప్పుకాకపోటం దురదృష్టం. మనమాటుక్కి రామరాజభూషణుడిలా ఆ కవికుల గురువునీ ఈ కవిరాజ శిఖామణినీ అధిగమించి ఓమెట్టుపైనే ఉన్నాడు. ఇలాంటివేమైనా చూసేనేమో శ్రీ గంటి జోగిసోమయాజులుగారు "వసుచరిత్రమును రచించి రామరాజభూషణుడు ప్రబంధలోకమున నింతకంటె నెక్కుడు వన్నెగలుగు ప్రబంధము వ్రాయుట కవకాశము లేదని చూపివేసెను." అన్నారు. (డా. జి. వి. సుబ్రహ్మణ్యంగారి సంకలనం 'సారస్వతవ్యాసములు' పుట 307)

బహుశః దేవేంద్రుడు తోటివారితో విమానాల్లో ఆకాశాన రావటం గమనించారో ఏమో గిరిక తల్లివంకవారూ తండ్రివంకవారూ కూడా పెళ్ళికి వచ్చేసారు. మనుమరాలి పెళ్ళి అని మేనకా హిమవంతులు వచ్చారు. మైనాకుడు వచ్చాడు. మేరుమందర రోహణాదులైన నగసామ్రాజ్య ధౌరేయులందరూ వచ్చారు. వారి బరువుకి భూమి ఒరిగిపోకుండా కాసుకునే బాధ్యతగల శేషుడుమాత్రం రాలేదుట. తల్లివంక గంగా, నర్మదా, వారాహి, యమునా, రుద్రాంఘ్రిజ, తామ్రపర్ణి, పినాకినీ, శీతాద్రిజాతా ఇంకా శుక్తిమతి ప్రియచెలులు బాహుదా మొదలైన వాళ్ళంతా వచ్చారు. పెళ్ళికబురు తెచ్చిన మహేంద్రుని సేవించారు. తనను సేవించటానికి వచ్చిన నదీకాంతల నాయన కరుణించాడు. అంతేకాదు "నూతన మహానగరంబు మదిం దలంచినన్" అప్పటికప్పుడే అద్భుతంగా "హరికృపఁబట్టణంబయ్యె వనము." "అందు శుభార్థమై భవము దెలుప" సమకూడాయట. అవి "కనుగొని కన్నె నెచ్చెలులఁ కాననదేవతలు....ముదంబున నెన్నుచుఁ బుణ్యవాహినీ వనితలుఁ దారు సామయిక (సమయాని కవసరమైన) వైభవముల్ సమకూర్చు నంతటన్." ఇంద్రుడు బృహస్పతిని ఆ రాత్రికే ఒక ముహూర్తం చెప్పమన్నాడు. ఆ దేవగురువు మిథున లగ్నాన్ని నిర్ణయించాడు. 53 ప. ఆ మాట మధ్యవర్తిగా ఇంద్రుడు కోలాహలుడికి పదిమందిలో ప్రకటించి ఆ దేపనిమీద వసురాజును చూడబోయాడు. రంగం ఆయనతో అక్కడికి మారిందన్నమాట. వసురాజు నమస్కరిస్తే "పెండిలికొడుకవు గమ్మనుచు" దీవించాడు. "నిన్నటిమాపు....ఇయ్యెడ కేల రాఁడొకో....మిత్రుఁడవి మక్కువమీఱ నినుం దలంచితిన్." "తలఁచి భవదీయ మానసతల చింత యెఱింగి (59 ప.) ....తావకాంగ భవ తాపనివారణ తత్పరుండనై" "ప్రొద్దునవచ్చి....నీకు నమ్ముద్దుల కన్నెనిచ్చు నగముఖ్యున కొక్క పురీలలామకం బుద్దవిడిన్ సృజించి సుముహూర్తము నేఁడె యనన్ రయంబునన్." "నిన్ను బెండ్లికొడుకుం గావింపఁగా వచ్చితిన్" 62 ప. అన్నాడు. అంతే మంత్రి పురోహిత దండనాథ శాసనధరులు ఆ క్షణంలో నగరం అంతటా శుభసన్నాహాలు చేయించారు. ఆ వైభవం "వాసవపురివారు చోద్యమంద" చూసారంటే వేరే చెప్పాల్సిందేముంది.

ఇక్కడొక్కసారి ఇంద్రుడి మాటల్లో ఏమైనా విశేషాలున్నాయేమో పరిశీలించాలి. నిన్నటిమాపు వసురాజేల రాలేదో అనుకున్నాడట ఆయన అన్నిమాపుళ్ళూ వారు కలుస్తున్నారన్నమాటే. కాబట్టే నిన్నటిమాపు రాకపోటంతో విశేషం ఏమిటా

అనుకున్నాడు. దీన్నిబట్టి చూస్తేకూడా హేమా మాధవీ 'నాఁటినుండి' అన్నదానికర్థం అప్పటినుంచీగా అనుకోటంలో మనపొరపాటేమీ లేదుకదా! ఇంక రాజుగారి మాటలో అంటే మన్మథోన్మాదజనితా లనకున్నా తప్పుకాదు. ఉన్మాదం కొద్ది అవి థోరణిమాత్రమే సుమా! ఇప్పుడు ఇంద్రవచనం వల్ల చదుర్థాశ్వాసం వరకూ జరిగింది ఏకదిన వృత్తాంతమే అన్నది ధృవపడింది.

మరొకటి "మక్కువమీఱ నిమం దలంచితిన్" "తలఁచి భవదీయ మానసతల చింత యెఱింగి" అన్నాడాయన. రెండుసార్లు తలచటం అంటే మొదటిసారి వాకబు చెయ్యటం రెండోసారి ఆ వాకబువల్ల (ఏలరాఁడకో' అన్నట్లు ఉండనేఉంది) అని చెప్పటమే. అంటే దానివల్ల వచ్చిన సమాధానం నీ మనసులోని వలపుచింతను తెలిపింది కనుకనే 'ఎఱింగి'తి నని తాత్పర్యం. అయితే ఆ సమాధానం చెప్పిందెవరు? ఆ విషయం తెలిసినవాళ్ళే చెప్పాలి. అలా తెలిసినవాడు నర్మసచివుడు ఒక్కడే ఉన్నాడు. అప్పటినుంచి అతడు ఏమయ్యాడో తెలియదుకదూ! ఆలోచించి కథాన్వయం చూస్తే ఇంద్రుడికావార్త అతడే చెప్పిఉండాలి. మరి అతడికి స్వర్గానికివెళ్ళే అమానుషశక్తి ఏమన్నాఉందా! లేకేం. అసలతడెవరని? నర్మసచివుడు కపట వేషధారికాని మానుష ఆస్థాన విదూషకుడుకాడు. ఎవరా వేషధారి. వసంతుడు. నిత్య నందనవన విలాసి. కాబట్టి ఇంద్రుడి సందేహానికి సమాధానం అందించి ఉంటాడు. ఇలా పరిశీలిస్తే ఆ పాత్ర నిష్క్రమణం అన్ని ప్రబంధాల మాదిరిదేకాదనీ ఔచిత్య వంతమూ ప్రత్యేక ప్రయోజనాపేక్షితమూ అని తేటతెల్లం ఔతుంది ఇంద్రవచనం మూలంగానే.

అయిందా ఇంక 64-67 నాలుగు పద్యాలూ నగరాలంకారమే. 68 లో "కాంచన పత్రికావళుల" వ్రాయించి శుభలేఖలు పంపితే "సమస్తదేశ వసుధాధీశు"లూ "యోగ్యనవహాటక పుష్పఫలోపహారముల్"తెచ్చి సమర్పించారు. అప్పుడు "కోలాహలంబు రోదసి నఖండమగుచు నాదాత్మక బ్రహ్మమతిశయిల్లె"ను. పుణ్యపురంధ్రికామణులు వివాహగీతాలు పాడారు. శ్రీదేవి "సుధారమ్యపాత్రపాలికలతో.... వేలుపుర్మానితో" 'నృపాల గృహసీమఁజెంది'నది. అప్సరసలు "చాటు చతురోక్తులాడుకొనుచుఁ గడిసి తత్పాలమున శుభాక్షతములునుప" తల అంటుటాదిగా పెళ్ళికొడుకుని చెయ్యటం 75-82 "రమణులెత్తిరి మంగళారాత్రికములు" దాకా ఎన్మిది పద్యా

లున్నాయి. ఆ మీద "వైవాహికారంభ స్థాపిత వేదిఁ జెందె వసురా-ద్రత్నంబు భవ్యోన్నతిన్" కాగా ఒక్కొక్క యువతి ఒక్కొక్కటిగా బొదల తడియార్చి, పన్నీటి తుంపురులుపడ వీవనవీచి, పూవులందించి, గంధముపూసి, మణిభూష లలంకరించారు. అక్కడినించి కుబేరుడిచ్చిన కిరీటాన్నీ ఇంద్రుడిచ్చిన కట్టాణి సుపాణి అనే చెవ్వాకులూ, వరుణుడిచ్చిన ముత్తెపుదండ, గరుత్మంతుకిచ్చిన పచ్చల భుజకీర్తులూ, మేఘనాయకు డిచ్చిన రత్నకంకణాలూ, నలకూబరు డిచ్చిన గండపెండేరాలూ, జయంతుడిచ్చిన చెంద్రికకావిపట్టుతాప్తాను ధరించగా ఆసౌరు చూసుకోటానికి ఒక వేలుపుటింతి అద్దం చూపించింది. శచీదేవి ముత్తెపుబాసికాన్ని వసురాజు 'కిరీటవీధి' కట్టించింది.

ఇన్ని కానుకల్లో ఇంద్రుడిచ్చిన కట్టాణి సుపాణి అనేవి ఆయన త్రైలోక్యాధిపత్యానికీ వసురాజుతో తన మైత్రికీ తగినట్లుగా లేవు. అది అభిమానంమీద దెబ్బ. అనిపించిందేమో! అప్పటికప్పుడు "అసదృశచిహ్న మొక్కటి....మహోచితంబుగా నొసఁగఁదలంచి దివ్యసరి దుద్భవ రత్నమృణాళినీ బిసప్రసవసరంబు మంగళకరంబుగఁ గరంబున నెత్తి యిట్లనున్" "....ఒసంగు సభీప్సితమ్ములన్" "దీనిఁగన్న నెడఁబాయుఁ బ్రదోషములు" "....ఇవిబవరములో నాళరజాతము వరపెడు, నాళరజాతముల నడఁచు" ఇలా ఇంకొన్ని విశేషాలూ చెప్పి కడపట "....జగత్త్రయసార ఏస్తుజా తమ్ము సృజింపనేర్చు నిర-తమ్ము దలంచిన యంత లోపలన్." ఇది స్వర్గం వదలి భూమికి చేరినా వసురాజుకి అలంకారమై వెనుకటి పేరే 'వాసవమాలిక' అని సార్థకం బౌతుంది. "....ఈ, పరమ మహేంద్రమాలిక సు-పర్వులకైన భారమో, గిరిహర నీవు నేనని స-ఖిత్వము మీఱఁగ నీకొసంగితిన్" "....అస్మదీయ వరసంభూతామరత్వంబుతో దీనింగొమ్మని" ఇచ్చాడు. ఆ వేళ కోలాహలంమీది నవ్యనగర ప్రాంగణంనుంచి మంగళవాద్యాలు మ్రోగి తొందరించాయి. తదితర వర్ణనా విశేషాలకి ప్రతిపదార్థవ్యాఖ్య లున్నాయికదా!

ఇక్కడొక చిన్నసంగతి ఉంది. అది ఇంద్రుడు పరమమహేంద్రమాలికను వసురాజు కిచ్చిన సందర్భాన్ని గురించి. "భారతమున తపఃప్రభావ రాజ్యపాలనా సామర్థ్యముల కింద్రుడిచ్చెనని యుండ వివాహకాలమున బహూమతు లియ్యఁబడెనని భట్టుమూర్తి వ్రాసి" అంటారూ....అసలు వివాహమే నన్నయ భారతంలో మూల

బడిన విషయంగదా! "గిరికం దనకు ధర్మపత్నింగా( జేకొని యున్నంత" మాత్రమే వివాహంమాట ఉంది. అందుచేత ఇచ్చే బహుమానాలేవో వ్యాసుడైనా నన్నయ అయినా ఆ కనపడినప్పుడే అప్పచెప్పించేసారు. నిజానికి "మెచ్చితి నీవు నాతోడం జెలిమిసేసి నా యొద్దకు వచ్చుచుం బోవుచు మహీరాజ్యంబు సేయుచు నుండుము" అనిన మహేంద్రుని మైత్రి భారతపరిష్కారము ఏకపక్ష వికారంగా ఉంది. చెలిమి ఇరువంకల యెడదల సరికలయికగాకపోతే ఔచిత్యం చెడిందన్నవారు లేరు. వసు చరిత్ర ఈ చెలిమికి బలిమీ కలిమీ సమకూర్చి వసురాజు ఇంద్రలోకం వెళ్ళి వస్తూండ టంతోపాటు సమయానుకూలంగా ఇంద్రుడు వసు భూలోకానికి వస్తూ పోతూండటం చెప్పి సమతూకం ఏర్పరచింది. మైత్రికోసం మిత్రకార్యభారం అదీ అడగకుండానే పైన వేసుకోటం ఇంద్రుని దైవత్వానికి క్రొత్త వెలుగురేకే. ఆ కార్యం వివాహ సంబంధం కావటం మరింత బలం. అలా కుదిరిన వివాహకాలంలో తన త్రైలో క్యాధిపత్య యోగ్యతకు తగ్గట్లూ ఆ వివాహ సాఫల్యసిద్ధికా అన్నట్లూ ఎన్నో మహి మలుగల వాసవమాలిక బహూకరించటం "మూలకథలోని యౌచితినిగూడ చెరి చెను" లాంటి అనాలోచిత వ్యాఖ్యచేసి 'ఆంధ్రవాఙ్మయ చరిత్ర సంగ్రహము' అల్ప ప్రమాణం గలదైనా అనల్పప్రామాణికం అనుకునే గౌరవాన్ని చెరుచుకొంది. నన్నయభట్టారకుడే వివాహసందర్భాన్ని విపులపరచి స్నేహధర్మాన్ని స్థాపించా లనుకుంటే వసుచరిత్రలోలాగే ఆ బహుమానం వివాహకాలానికి సర్దితేనే ఔచిత్యం పాటించినవాడౌతాడు. అలా వైపుల్యాన్ని ఆశ్రయిస్తూ ఆయన కూర్చుంటే ఇప్పు డున్న రెండున్నర పర్వాలైనా ఆయనవి మనకు దక్కటం కష్టమయ్యేది. వ్యాస జననం ప్రాధాన్యం వహించిన భారతం దానికెంతో దూరం అయిన ఈ మూలపురుష గాథలోని వివాహం మూల పెట్టేసాడు. అంతేకాని సమయం సందర్భం చక్కగా సమకూర్చిన రామరాజభూషణుడు ఔచిత్యం చెరచటం ఏమిటి! ఇలాంటి పెడతల కవిత్వ వేదులకు బుద్ధిచెప్పటానికేనేమో ఇంద్రుడే "మహోచితంబుగా నొసగఁ దలంచి" అన్నట్లు వాచ్యంచేసి మరీ జాగ్రత్తపడ్డాడు రామరాజభూషణుడు. ఎంతటి ముందుచూపు! కవి క్రాంతదర్శి అనటానికి తెలుగులో మచ్చుగా నిలిచిన మహాకవి అతడు. "నీవునేనని పఖిత్వము మీఱఁగ" (104) మైత్రీస్వరూపోన్నతిచే ఇంద్రుడు రామరాజభూషణునివల్ల మహేంద్రనామ సార్థకత వహించాడు.

ఆవేళ దివిజమురజవిరావము....వడిఁదరువి'డగ రంగం ఆడపెళ్ళివారి ఇంటికి మారింది. "....లేశముం దడవుసేయకుఁడంచు ముహూర్తమెంతయున్ డాయఁగ

వచ్చెనంచు" సంభ్రమం మొదలైందక్కడ. ఇంద్రుడు సృజించిన "దివ్య వివాహ మందిరోదర కురువిందవేది యెడఁదార్చి" గిరికను 'వజ్రపీఠి'పై నుంచి పుణ్యస్త్రీలు నెత్తిన అక్షతలు వేసి నలుగులు పెట్టారు. "మంగళస్నాన విభవ సామగ్రితో "తలయంటెఁ గలికి యొకతె." 110-112 ల మూడు పద్యాలూ ఆమె వర్ణనలె. 113 లో కట్టరి దివ్యదుకూల మింతికిన్" ఆపై నదీమతల్లులు "బహుచిత్ర దళంపు టారతుల్ గ్రమమున నెత్త....వివాహవేదికి" చేరింది గిరిక. శచీదేవి వివిధ భూషణాలూ కల్పక మాలికలూ చెలులచేత పంపించింది. ఒక్కొక్క రొక్కొక్క పనిగా తల తడియార్చి, కొప్పు సవరించి సంపెంగలుంచి, నెత్తికి రత్నాల చంద్ర సూర్యాంకాలైన అలంకారాలు పెట్టి, పాపట చుక్కలసరముంచి, మృదుల దూర్వాంకురముల జుట్టున చేర్చి, అలంకరించారు. నెత్తికి బాసికం కట్టారు. నుదుట కస్తూరి రేఖ. కళ్ళకు కాటుకా దిద్దారు. చెవులకు కుండలాలూ మకరికా పత్రాలూ ఉంచారు. కస్తూరీకుంకుమ (కాశ్మీర) పచ్చకప్పురమూ జవ్వాది వంటి పరిమళ ద్రవ్యాలు ఆమెకు పూసారు. ముక్కున ముంగర మెడలో నవరత్నమాలికా చేతులకు రంగురంగుల గాజులూ, నడుముకి వడ్డాణమూ, కాళ్ళకు మణిమయ నూపురాలూ అలంకరించారు. పాదాలకు పారాణి పెట్టారు. అలా పెళ్ళికూతురికప్పుడు చేయవలసిన అలంకారాలన్నీ చేసారు. శుభాధిదేవతలు తనువులు దాల్చివచ్చి చుట్టి ఉండగా బయకారు (పాట గత్తె) లైన ముత్తైదువుల మంగళగీతాల ఛందోవికారం (ప్రబంధములంటారు) లో భారతీదేవి గిరికమీద ఇష్టంతో ధవళ (ప్రబంధ) వర్ణాలుకట్టి (ప్రొదుర్భావంబు నెలపె) 'పలుమరు నచటన్' సందర్భం వచ్చినప్పుడల్లా పాడింది. అని పౌరాణికుడు ఆశ్వాసాంతావకాశం వదిలాడు.

ఒక్కమాట శ్రీ పంతుల లక్ష్మీనారాయణ శాస్త్రిగారు తమ "సంగీత కళా రహస్యనిధి" అన్న భూషణకిరణావళిలోని వ్యాసంలో "పదమె తన్ గలహంస" పద్య వివరణాదిగా (సంగీత) గేయప్రబంధాల్నిగూర్చి ఎన్నెన్నో ప్రస్తావించారు. ఏలా ప్రబంధలక్షణం అంటూ చాలా చెప్పారు. అందులో రామరాజభూషణుడు ప్రస్తావించిన ధవళవర్ణం (ప్రబంధం) ఉన్నట్లులేదు. 'లక్ష్మీవివాహగీతికలు' క్రింద నైనా దాన్ని ప్రస్తావించకపోటం చూస్తే అది వారికంట బడలేదేమో అనిపిస్తుంది. పెద్దలుగదా! మనం మరోచోట చూద్దాం. ప్రస్తుతం షష్ఠాశ్వాసంలో మొదలౌతున్న పెళ్ళికి వెళ్ళిపోదాం.

# 6

ఇంద్రాణి భూషణమాలికలు పంపించాక మిగిలిన దిక్పాలక పత్నులూ పెళ్ళి కూతురికి తగిన కానుక పంపించారంటూ రామహర్షణి షష్ఠాశ్వాసంలో కథ అందు కున్నాడు. అంతకుముందే వాళ్ళ మగలంతా వసురాజుకి కానుకలిచ్చి అలంకరింప జేసారుగదా! అప్పటికి సూర్యాస్తమానం అయింది. అంటే పంచమాశ్వాసం కథ ఒక పగలు నడిచిందన్నమాట. అది అలా ఉంచితే ఇంద్రుడేమిటి? అటు ఆడ పెళ్ళివారికో నగరం సృష్టించి యిచ్చి ఇటు మగపెళ్ళివారివంక కన్యావరణం నిర్వ హించీ రెండువంకల వారినీ మంచిచేసుకున్నట్లనిపిస్తోందే! చెలిమి పాటించి వసురాజు పక్షంగా పాటుపడ్డాడంటే అర్థంఉంది. అటువంక కోలాహలుడు తన వజ్రానికి దొరక్క విజ్జివీగినవాడే (వసురాజు ఆదుపుచేసాడనుకోండి) అతనివంక ఎందుకు సానుభూతి చూపించినట్లూ? ఇదేమైనా ఔచిత్యానికిగానీ భారతాభిహితార్థానికిగానీ ఆటంకం ఏమో అంటే-వేదార్థానికి ఆటంకం కాకపోతే పంచమవేదం అయిన భారతా భిహితార్థమే ఔతుందిగదా! చూడండి :

వెనుక ద్వితీయాశ్వాసంలో 55 పద్యంలో "లతాంగి రూపు కన్నారఁగఁజూచి వచ్చితి" అన్న సచివుని మాట వైదికవివాహవిధి ననుసరించిందే అనుకున్నాంగదా! కన్యావరణంలో ఆ మిత్రుడికి ఇంద్రుడుకూడా సాయం ఔతాడని ఉంది ఆ విధిలో. ఆ మంత్రమే కొనసాగిస్తూ "అస్మాక మింద్ర ఉభయంజుజోషతి యత్సౌమ్య స్యాంధసో బుబోధతి" అంటారు. "ఇంద్రుఁడు మా యిద్దఱకూ సంబంధమును గోరు చున్నాడు. మేమిద్దఱము అతనికి సోమరసమైన యన్నము ఇచ్చెదమని అతఁడెరుఁ గును. కాన మాకు సాయము చేయును." అని శ్రీ చర్ల గణపతిశాస్త్రిగారు తాత్పర్యం ఇచ్చారు. దాన్ని విశదంగా శ్రీ రేవణి సూర్యప్రకాశ శాస్త్రిగారు ఇలా అన్నారు వేదార్థోపన్యాసాల్లో. "అస్మాక మింద్ర ఉభయం జుజోషతి" అస్మాక మితి— అస్మదోర్ద్వయోశ్చ-ఇతి-అనేటటువంటి సూత్రంచేత ఇద్దరికీ రెండింటినీ చెప్పటానికే-ద్వివచనానికే - బహువచనం ఇక్కడ వాడబడింది. మా యిద్దరికీ- వధూవరులం అయిన మా యిద్దరికీకూడా ఈ సంఘటన చేయటంకోసమని, ఇంద్రః జుజోషతి—సేవితు మిచ్ఛతి-ఆయనకూడా ప్రయత్నం చేస్తూనే ఉన్నాడు. ఎందు కోసమని? ఆయనక్కూడా స్వలాభం ఉందిండీ! స్వార్థం లేనిదే ప్రయోజనం

లేనిదే ఎవలూ చేయరు ఏపని! "యత్సోమ్యస్యాంధసో బుబోధతి" గృహస్థుడైతే ఇతను ఏమైనా దేవయజ్ఞాదులు చేస్తే సోమరసాత్మకమైన అన్నమిస్తాడనే ఆశతో. ఆయనకూడా ఒక వధూవరులని ఘటన చేయటానికి ప్రయత్నిస్తూనే వుంటాడు." (535 పుట) అన్నారు. అలాంటి ఘటనని ఒక్క కన్యావరణంతో సరిపెట్టక సహకార భావంతో బలపరచుకోటానికి ఒక నగరం సృష్టించి ఇయ్యటాన్ని రామరాజభూష ణుడు ఇంద్రపరంగా ప్రకాశవంతం చేస్తాడు. ఆ త్రైలోక్యాధిపతి తాను మగపెళ్ళి వారి తరఫున తరలివస్తుంటే తన స్థాయికి తగ్గట్టుగా ఒక కళ్యాణ నగరి ఉండకపోటం ఒక రకంగా అవమానమే. ఆడపెళ్ళివారి కంతసమయంలేదు. ఇంక అభిమాన వంతుడు కనుక ఆ నగరిని స్వయంగా సృష్టించి వివాహానికి రంగం సిద్ధంచెయ్యటం ఎంతో ఔచిత్యవంతంగా ఉంది. వధూవర సంఘటనం చేకూర్చటంలో పక్షపాతం లేనట్లుచేసి ఇంద్రుని దైవత్వానికి ఒక కలికితురాయి రామరాజభూషణు డలంకరిం చాడు. అది భారతాభిహిత వైదిక రాజమార్గార్థ ప్రకాశకమే.

సూర్యాస్తమానం అయ్యాక సంజవెలుగులూ ఆమీద చీకట్లూ అలముకొంటే ఆకాశాన చుక్కలు పొడవటం చందమామ రావటం వెన్నెలలు పరచుకోటం 3-7 అయిదు పద్యాల్లో ఉన్నాయి. చంద్రుడు తూరుపుదిక్కు ఏలే ఇంద్రునిభార్య శచీదేవి ముఖపద్మం పైపయిన్ (ఫాలభాగంమీద) కనిపిస్తున్నట్లు ఆ తూరుపుగట్టు చివర ఉదయించాడని వర్ణించటంచూస్తే అప్పటివాడు విదియ చంద్రుడే అనిపిస్తాడు. అంటే పక్షం శుక్ల ద్వితీయ తిథి ఆనాటిది అనుకోవచ్చు. సరే. అప్పుడు బృహస్పతి (పురోహితుడు) ముహూర్తం దగ్గరపడింది అనగానే వెల్లఏనుగును ఎక్కి వసురాజు బయలుదేరాడు. అక్కడ ఒక పెద్ద వచనం ఉంది. ఆ చివర "మహావిభవంబునం గోలాహలపురంబుఁ జేరం జను సమయంబున" ఆ పురాంగనలు పెళ్ళికొడుకును చూడవచ్చిన వింతలు 10-16 ఏడు పద్యాలలో ఉన్నాయి. "పౌరపురంధ్రులిట్లు వసు-పార్థివుఁగన్గొనవచ్చి మంగళా, చారమనోజ్ఞ లాజములు-చల్లిరి." ముత్తైదువులు వెంట వస్తుంటే శుక్తిమతితోకూడా కోలాహలుడు ఎదురుసన్నాహం నెరవేర్చగా పెళ్ళి కొడుకు "కళ్యాణవేదిక (మంటపం) గదిసెనపుడు" ఇరవైయో పద్యం ఆ వేదికా లంకార వర్ణనమె. కోలాహలుడు చూపిస్తే వసురాజు ఆ మంటపంలో కనకపు గట్టుమీద ఉన్న రతనాలపీట ఎక్కి కూర్చున్నాడు. తర్వాత మామగారు అల్లుడికి మధుపర్కం సమర్పించాడు. అంతలో పురంధ్రీమణులు వెంటవస్తుంటే పెళ్ళికూతురు

వచ్చింది. బృహస్పతిగారి మాటమీద నడుమ అడ్డంగా ఎఱ్ఱటి తెరపట్టారు' చెలులు గిరిక నాచెంతకు చేర్చారు. పురోహితుడు వధూవరుల చేతులకి కంకణధారణ చేయించారు. సుముహూర్త సమయాన్ని మునులు గుర్తుచేస్తే కోలాహలుడు తన కూతురిని వసురాజుకి ధారపోసాడు. ఆ పైన వసురాజా(మె మెడలో) "కన్నెయఱుతన్ మాంగల్యసూత్రంబు.... ఉనిచె .. నాకుల్ ప్రశంసింపఁగన్." ఇంక వధూవరులు తలంబ్రాలు పోసుకోటం 28 & 29 పద్యాలు. వెంట వెంటనే ప్రధానాది హోమా లయ్యాయి. క్రమంగా సన్నికల్లు త్రొక్కించటాలూ అరుంధతీ దర్శనం అయ్యాయి. పెళ్ళికి వచ్చినవారిని యోగ్యతానుసారంగా సన్మానించటం భోజనాలతోసహా అయ్యాయి. ఇంద్రుడా దంపతులకు విలువైన మణులూ బట్టలూ కట్నాలు చదివించాడు. ఆ వెంట కోలాహలుడు అల్లుడికి రథాలూ, గుఱ్ఱాలూ, కన్యలూ కొత్త మణులూ, హిరణ్యమూ, రజతమూ అయిన రకరకాల "శయన పాత్రాసనములు భూజానికొసఁగె." ఇంకా కస్తూరివంటి మెకాలూ కిన్నరలవంటి పక్షులూ, ముత్తెములూ, బట్టలూ, నగలూకూడా "అల్లునికిచ్చె వెండియు నాదరమున" అలాగే శుక్తిమతి కూడా అల్లునికి తన ఆస్తిఅయిన రత్నాలనీ, రత్నంలాంటి కొడుకు వసుపదుడినీ సమర్పించింది. వసురాజు ఆ బావమరదిని సైన్యాధిపతిగా నిలుపుకున్నాడు. ఇంద్రుడిలా గిరికా వసురాజులను సంఘటన పరచి వివాహం జరిపించటంతో చంద్రుడు వెనుక ఆయిద్దరినీ వియోగవ్యథలో వేధించి ఉండిన బెదురుతో పశ్చిమాద్రిగుహలో దాక్కోటానికి వెళ్ళాడు. రాత్రి అంతా పెళ్ళివేడుకకు చంద్రుడు వేసిన వెన్నెల దుప్పటిపై చల్లిన చుక్కల పూలపుడు వాడిపోతే సూర్యుడు వాటిని ఊడ్చి (ఊడిపి) వేసి దిక్కులు నిండార ఆకసంలో ఎఱ్ఱని పట్టుశాలువలు కప్పాడు. ఇలా గిరికాదేవికి వసుమహారాజుకీ శేషహోమాంతంగా నాలుగు రోజులూ పూర్ణాహుతులతోపాటు సమర్పించిన ఆహుతులను అగ్నిముఖంగా స్వీకరించిన దేవతలంతా తృప్తిచెంది కోరిన వరాలిచ్చారు. ఎవరెవరు ఏమేమి వరాలిచ్చారో ముఖ్యమైనవి 43వ పద్యంలో ఉన్నాయి. ఇంకా ఇంద్రుడు "అరిఖండన జయసాధన ప్రకాండము....దివ్య వైణవదండము దయనొసఁగి" మామూలుగానే దాని మహిమలు వర్ణించి చెప్పాడు. ముఖ్యంగా "ఆజిఁదోఁచు నఖిల, దివ్యసాధనసారమై-దీనిఁదాల్చు, ధన్యుఁడుద్దండ సుభటమూ-ర్ధన్యుఁడరయ." కాగా వేణుదండం అనటంతోటే మురళి అనుకుంటారేమోనని స్పష్టంగా "ఈ దివ్యవంశోత్తమం బచ్ఛిద్రంబు" అని చిల్లులులేనిది అని మురళి కాదనటమే కాకుండా వెదురుగదా నడుమ బోలుగా ఉంటుందనుకోకుండా

అది చేవగలదనీ చెప్పినట్లయింది. దానిచేవ నారాయణ పాశుపత బ్రహ్మశక్తి ఆయుధాలకన్న మిన్నట. అవి అన్నీ కృత్రిమ నిర్మాణాలు కాగా ఇది సహజ (దివ్య) మైంది. ఆయుధంగా అది గదే. అలా గద అయిన వేణుదండాన్ని యేటా కొలుస్తూంటే సర్వశుభాలూ చేకూరగలవు అని ఉపన్యసించి ఇంద్రుడు వసురాజుకి ప్రసాదించాడు. దైవత్వం పొందిన ఆ మానవుడు ధన్యుడు. అది అలా ఇచ్చికూడా వచ్చినవారి అందరితోటీ ఇంద్రుడు స్వర్గానికి వెళ్ళిపోయాడు.

ఈ పెళ్ళిని గురించి ఒక్కమాట: వైదిక వివాహవిధిని అనుసరించి చేసిన రమణీయార్ధ కల్పనా విశేషావహం కావటంవల్ల రామరాజభూషణుడు భారతాభిహితార్థం నిలుపుకున్నాడని అనుకున్నాంకదా! ఇప్పుడా వైదికమైన కన్యాదానంలో ప్రధానహోమం జరుగుతున్నపుడు వరుడిచేత పలికించే అపార్థావకాశం ఉన్న మంత్రాన్ని ప్రస్తావించి ఆ అపార్థాన్ని నివర్తి చేసుకోటం న్యాయం. దాన్ని గురించి కొంత "భారతదేశంలో పెళ్ళిళ్ళు" అనే గ్రంథంలో శ్రీ కడియాల జగన్నాథశర్మ, ఎం.ఏ., ఎం.ఫిల్ గారు ప్రస్తావించారు. చూడండి.

"సోమః ప్రథమో వివిదే, గంధర్వో వివిద ఉత్తరః, తృతీయో అగ్నిష్టే పతిస్తురీయస్తే మనుష్యజాః" అర్థం:- సోముడు నిన్ను మొదట పొందెను, పిదప గంధర్వుడూ, మూడవవాడుగా అగ్ని నిన్ను పొందారు. మనుష్యుడనై పుట్టిన పతి నాల్గవ వాడుగా నిన్ను పొందెను (పొందుచున్నాను) ఈ మంత్రం ఋగ్వేదంలో ఉన్నది" అన్నారు 69-70 పుటల్లో. మళ్ళీ (38వ పుటలో) పురోకీర్షికలో" S.C. సర్కార్ ఈ శ్లోకాన్ని పరిశీలించి ఋగ్వేదకాలం నుండీ మనదేశంలో బహుభర్తృత్వ ఆచారం ఉన్నదని భావించాడు (Some Aspects of the Earliest Social History of India గ్రంథంలో). కాని ఈ శ్లోకానికిలా అర్థం చెప్పుకోవాలి. స్త్రీకి సోముడు సచ్ఛీలాన్నీ, గంధర్వుడు సద్భాషనూ అగ్ని పవిత్రతనూ ప్రసాదించిన తరువాత ఆమెను తోటిమానవుడు వివాహం చేసుకుంటాడు. సర్కార్ మహోదయుడు ఈ శ్లోకానికి భాష్యం చెప్పడానికి బదులు ప్రతిపదార్థాన్ని గ్రహించటంవల్ల ఈ ఆచారం (బహుభర్తృత్వం) ఋగ్వేదకాలంనుండీ వచ్చిందని భావించాడు" అన్నారు. పాపం సర్కార్‌గారు సోముడూ, గంధర్వుడూ, అగ్నీ అనే మాటలు ముగ్గురు మనుష్యుల పేర్లు అనుకొని ఉంటాడు. ప్రతిపదార్థాన్ని గ్రహించినా పతి

ఒక్కడే మనుష్యుడు అని శ్లోకం చివర స్పష్టంగా ఉండే. స్వీయోద్దిష్ట వాదప్రజ్ఞ నవనవోన్మేష శాలిని అయి ప్రతిభా ప్రకాశం పొందకపోటంతో అది మనసుకి పట్టి ఉండదు. ఈ శ్లోకం వెంటనే మరోమంత్రం ఇలాంటిదే ఉంది. దాన్ని శ్రీ రేమెళ్ళ సూర్యప్రకాశ శాస్త్రిగారు వేదాంతోపన్యాసాల్లో ఎలా వ్యాఖ్యానించారో చూడండి :

"సోమోదదద్గంధర్వాయ। గంధర్వోదదదగ్నయే।
రియంచ పుత్రాగ్ శ్చా। దదదగ్నిర్మహ్యమ సోహిమామ్॥

సోముడు గంధర్వుడి కిచ్చాడనీ ఈ కన్యను, గంధర్వుడు అగ్నికిచ్చాడనీ, ఈ అగ్ని ఇప్పుడు పెళ్ళాడేటటువంటి ఈ పెళ్ళికొడుక్కి ఇస్తున్నాడనీ-ఇదివరకు ముగ్గురై పోయినారట. నాలుగోవాడుట ఈయన. అందుచేత చాలామంది భర్తలు ఉండవచ్చును. దీనిమీద శంకఅండీ : ఈ శ్రుతి అర్థమిది :: అంటే విడాకుల చట్టానికి ఇది వాగా మూలం (పనికివస్తుంది) ఎంత అర్థంచేసుకున్నారో చూడండి : ప్రతీదానికీ అవస్థా విశేషంచేత పరిపాలించే టటువంటి (అధి) దేవత ఉంటారు. ఇలాగ వివాహం అయేంతవరకూ ......ముగ్గురిచేత ఇదివరకు పరిపాలింపబడి ఈనాడు వారందరి యొక్క అనుగ్రహంచేతనూ ఈ పెళ్ళికొడుక్కి రావడమైనది (పరిపాలించటానికే) అని అర్థం. కాని వీరందరూ ఇదివరకు పెళ్ళాడేసి భుక్తమైనటువంటి ఈమెని ఈయనకి ఇవ్వలేదు."

అసలు సంగతి ఇలాఉంటే సర్కారు మహోదయులు ఆ అపార్థమే సెల విచ్చారుటమరి. నిర్దిష్టోద్దేశవక్ర సులోచనాల్లోంచి చూస్తే కనిపించే రంగు అలాగే ఉంటుంది. తండ్రి గురువుకు అప్పగించెను తర్వాత వరునకప్పగించెను అన్నా ఆ రంగుటద్దాలకళ్ళకి మరో సహజౌచిత్యపుటర్థవర్ణం ఆనదు. అసలు అర్థం గ్రహించటం ఎట్లాగు అన్నది మంత్రద్వితీయభాగాన్ని వివరిస్తూ శ్రీ శాస్త్రిగారు ఏమన్నారో చూడండి. "రియంచ పుత్రాగ్ శ్చాదాదగ్ని ర్మహ్యమథోఇమామ్" ఈ అగ్ని నాకిచ్చే టప్పుడు పుత్రాన్-పుత్రులను, రియం-ధనమునూ ఈమెనూ కూడా ఇయ్యమంటు న్నాడు. అంటే సంతానం కన్న ఆమెను గనక తీసుకువస్తే ఇంక మళ్ళీ సంతానం ఉంటుందా ఉండదా అనే ఖేదం ఉండదనా దీనర్థం :: అంటే "పుత్రోత్పాదన సమర్థా ఇత్యర్థః" పుత్రులను కనే సమర్థమైనటువంటి ఈమెను ఇవ్వవలసింది. అలా అనుగ్రహించవలసింది."

వీటినిబట్టిచూస్తే సోమ-గంధర్వ-అగ్ని దేవతలు ముగ్గురూ కన్యకు వయః క్రమ పరిణామంలో పుత్రులను కనగల సామర్థ్యాన్ని ప్రసాదించినవారు అని తెలుస్తుంది. "చంద్రమామనసోజాతః" అని సోముడు మనఃపరిణతినీ, విద్యాప్రవీణుడుగా గంధర్వుడు జ్ఞానపరిణతినీ (వ్రతానుష్ఠాన విజ్ఞానం) "ముఖాదింద్రశ్చాగ్నిశ్చ" అని ఇంద్రసఖ్యంతో అగ్ని సాధికార వాక్పరిణతినీ ప్రసాదించారని గ్రహించవచ్చు. "మూర్ధానం పత్యురారోహ" (ప్రవేశహోమానికి ఇంటికి తీసుకువెళ్ళేటప్పటిది) పత్యుః-భర్తనైనటువంటి నాయొక్క, మూర్ధానం-శిరస్సును, ఆరోహ-అధిష్ఠించు-అంటే ఏమన్నమాట! నెత్తిమీద కూర్చోమనికాదు ఊరేగుతూ-శిరస్సువలె-ప్రధానభూతాభవ-నాకు ప్రధానురాలుగా ఉండవలసింది. శ్రీ శాస్త్రిగారి వివరణే తీసుకుంటే ఆ ప్రధానురాలిగా పరిపాలించుకోటానికి పెళ్ళికొడుకు నాలుగోవాడు. ఆ యా పాలనలకు తల్లిదండ్రులు వారివారికడ కన్యను నియమించటమే మంత్రాల్లో 'వివిదే' అన్నా 'దదత్' అన్నా అర్థం. మరే అపార్థాలకీ ఇంక చోటులేదు. వసురాజు పెళ్ళాడిన గిరిక వైదిక వివాహవిధిని అనుసరించి అన్నింటిలోనూ పరిణతిని చెందిన వరణీయ కన్యయే అన్నసంగతి మంజువాణి చెప్పిన ఆమె వృత్తాంతంలో వినే ఉన్నాంకదా! ఒక్క విషయం గుర్తుచేసి పైకతకోసం వెళ్ళిపోదాం. ఈ పెళ్ళికి ఆవంకనా ఈవంకనా మొత్తంమీద దేవతలంతా వేంచేసారుగాని త్రిమూర్తులు ముగ్గురూ దయచేసినట్లులేదు. ఈశానుడనో శివుడనో ఒకాయన వచ్చినట్లున్నా ఆయన దిక్పాలకుల్లో ఒకడుగానే కనిపించాడు. గిరికకు స్వయంగా మేనత్త అయిన పార్వతీ ఆమె భర్త పరమేశ్వరుడూ వచ్చినట్లు లేకపోటం విడ్డూరమే మరి!

ఇంద్రాది దేవత లలావెళ్ళాక శుక్తిమతీ కోలాహలులు తమ తమ బంధువులకి తగిన సత్కారాలు చేసి వీడ్కోలుపగా ఆ నదీమతల్లులు పర్వతేశ్వరులూ తమ తమ నెలవులకు వెళ్ళిపోయారని కథ కొనసాగిస్తున్నాడు పౌరాణికమణి రౌమహర్షణి. అప్పుడు కోలాహలుడు అత్తవారింటికి చేరవోయే కుమార్తెను దగ్గర తీసుకొని గొంతు జీరవోవుచుంతగ అచట మసలుకోవలసిన రీతులు బోధించాడు 55-58 నాల్గు పద్యాల్లో. "నీ తలిదండ్రుల గభీరనిశ్చల గుణవిఖ్యాతి....మెలఁగుము" అంటూనే "పితృశరణ (గృహ) ప్రచింత మదిఁ-బెట్టక యీశనివేశితాత్మ యౌ, సతి సతి ... గదమ్మ కోమలీ" అన్నాడు. "చింతాశల్యంబు వహింపకమ్మ" అని "భవదీయ చిత్రగుణాతిశయము, వలన మాకెల్ల వన్నె రా-మెలఁగవమ్మ" అన్నాడు. అసలు

కొంత అతడు. ఆ మీదట "సతికమలాలిపట్టి, ప్రబలతర దీర్ఘ భుజాఖిం-బట్టుట"చే 'గద్దరి' అనిపించుకొన్నవాడే కడకు మా కూతుఁని అత్తారింటికి పంపుతూ నీతులు బోధించే తండ్రిగా పాఠకుల యెదల్లో నిలిచిపోయేటట్లు కోలాహలునిలో జీవంపోసి ఆడించాడు రామరాజభూషణుడు. కన్యాదానభాగ్యం పొంది స్వయంగా అల్లునివెంట పంపుతూ హొందాగా 'మాకెల్ల వన్నెరామెలఁగ'మని ఆశ్వాసించటం ఔచిత్యవంతంగా ఉంది. శకుంతలని పంపే కణ్వాదికా అదృష్టం లేదు. అందుచేత పెంచిన మరులు గొని బాధపడ్డాడు. ఒకవేళ స్వయంగా ఆ కన్యాదానాన్ని చేయగలిగిఉంటే ఆయనైనా అలా బాధపడేవాడుకాడు. నీతులుమాత్రమే చెప్పి ఊరుకునేవాడు. దేనిని దానం ఇచ్చినా దానికోసం పొరపాటునైనా వెంపరలాడకూడదు. అందుకనే "సంప్రదదే-నమమ" అనిపిస్తారు. కన్యాదానమైనా అంతేమరి. అంటే కాళిదాసైనా ఔచిత్యాన్ని పాటిస్తే ఈ సందర్భాన్ని ఇలాగే నీతిబోధనతో సరిపెట్టేవాడనిపించటమే ఇక్కడ భూషణకవి సాహిత్య రహస్యం.

అప్పుడు పుట్టినింటి మమకారంతో కన్నీళ్ళు పెట్టుకున్న గిరికను తల్లి అయిన శుక్తిమతి దగ్గరకు తీసుకొని ధైర్యం చెప్పటం 60, 61, 62 మూడు పద్యాల్లోది. మేమంతా వస్తూపోతూనే ఉంటాం (లోకం తెలిసిందానివి) "విశ్వవిదితా మురితా మది తాపమేటికిన్" అంది. ఇక్కడిది ఏదో ఛేకానుప్రాస తాపత్రయం అనుకో కూడదు. కలతచెందిన కన్నపేగు పడే ఆవేదన తెలిపే కంఠస్తంభితబాష్పవృత్తి కలుష స్వనం ఎలాఉంటుందో చూపించేందుకే 'దితా, దితా, దితా' అనే తడుముకోవ టలోగల ఔచిత్యం. వాడిన యమకశ్లేషాది చిత్రమంతా రసస్పర్శతో 'సాళనాఉనళనే వఖి' అని సర్వసృష్టికీ (ప్రబంధ పరిమిత) నవనవోన్మేష ప్రాభవం నింపటం రామరాజభూషణుని ప్రధాన సాహిత్యరహస్యం. ఆ తల్లి ఇంకా ధైర్యంచెప్తూ "సకల సమయములఁ (జల వన విహారాది) దావకప్రాణసమునిఁగూడి యిచటనె మెలంగెదు కలంగెదేలతల్లి!" అంది. కాని పైకి చెప్పన్న ధైర్యాం యెదదలో సడలి భరింప శక్యంగాని కన్నప్రేగు త్రెంచు వేటు వంటి ఈ ఎడబాటు ఆడపిల్లలవల్లే కలుగు తుంది. అలా బాధపెట్టే ఆడపడుచులు ఏ పగవారికైనా వద్దు అనిపిస్తుంటే నీరు గారిపోయేవాళ్ళకి ఎందుకిచ్చాడో ఆ బ్రహ్మ అని బాధపడుతుందా ఇల్లాలు. ఈ సందర్భంగా కవికుల గురువు కాళిదాసుగారి శాకుంతలంలో కాశ్యపుడైన కణ్వుని వ్యథాశ్లోకం స్మరించక తప్పదు. చూడండి:

యాస్యత్యద్య శకుంతలేతి హృదయం సంస్పృష్ట ముత్కంఠయా
కంఠ స్తంభిత బాష్పవృత్తికలుషః చిన్తాజడం దర్శనమ్ ।
వైక్లబ్యం మమ తావదీదృశ మహో ! స్నేహాద రణ్యౌకసః
పీడ్యన్తే గృహిణః కథంనుతనయా విశ్లేష దుఃఖైర్నవైః ॥

అంతశ్శార్దూలంలో కాళిదాసు కణ్వుడి నేడిపించి పాపం స్వయంగా కన్నతల్లి లెంత ఏడుస్తారో అనిపించాడాయననోట. దాన్నిబట్టి ఆ కన్నతల్లులు ఎంతో దుఃఖించారు అనిపించటానికి (అలాంటి కథాసందర్భంవస్తే) ప్రబంధపద్ధతిలో ఓ పది పద్యాలు గుప్పించెయ్యాలి కాబోలు అనిపిస్తుంది. కానీ సమయసందర్భాల సామరస్యంతో ఔచిత్యాన్ని పాలించి రామరాజభూషణుడు కథాకథనంలో నాటకీయ సంభాషణను సమకూర్చి చిన్నకందంలోనే ఎంత అందంగా కాళిదాసుకి సమాధానం చెప్పాడో చూడండి ;

కం. బెగడవల దనుచుబెట్టిద, మగునెవ్వగ నగడుపడుచు-నా(డుపడుచు లే
పగవారికి వలదనునా, పగవారికి నేలయొస(గె(-బద్మజు(డనుచున్. 62

దీనిభావం ముందే గ్రహించాంగదా ! కాదంటే ఇది శుక్తిమతి 'బెగడవలదు' అనంతవరకే కూతురితో అన్నమాట. తక్కింది ఆమె ఆత్మవ్యధగా గ్రహించాలి. అదికూడా వైదిక వివాహవిధిని అనుసరించే ఇలా దుఃఖం తక్కువ చేయబడింది చూడండి ; "జీవాగ్ం రుదన్తి మిమయంతే అధ్వరే దీర్ఘామనుప్రసితిందీధియుర్నరః వామం పితృభ్యో యఇదగ్ం సమేరిరే మయః పతిభ్యో జనయః పరిష్వజే" అన్న దానికి శ్రీ చర్ల గణపతిశాస్త్రిగారి తాత్పర్యం "జీవించి (యున్న) న కన్యనుగూర్చి కష్టములేని కాలమున (వియోగకాలము వచ్చినదని) తల్లిదండ్రులు బంధువులు ఏడ్చుచున్నారు. హర్షకాలములో ఏడ్చుట వ్యత్యాసముగానున్నది. ఈ బంధుజనులు దీర్ఘకాలమువరకు నారు మాభావిసంబంధమును ధ్యానింతురుగాక ; ఈ వివాహ కర్మను ప్రవర్తింప(జేయు నీ తలిదండ్రులకు సంతాన వాంఛయును కన్యయొక్క యాలింగనవలన సుఖమును అగుగాక" అని. (149 పుట) ఇందులో వ్యత్యాసంగా ఉన్న దుఃఖం సూక్ష్మీకరించటం న్యాయమేగదా !

దుఃఖం మ్రింగుకొని ఆ తలిదండ్రులు అలాచెప్పి పంపిస్తే గిరికను రథం ఎక్కించుకొని వసురాజు "ఆత్మపురంబున"కు బయలుదేరాడు. ఏం ? ఏనుగునెక్క

రాకూడదా గుఱ్ఱాన్నెక్కి రాకూడదా ! అసలు ఇందుడిచ్చిన విమానం ఎక్కి బయలుదేరకూడదా అంటే వైదిక వివాహపద్ధతి రథాన్నెక్కించుకోమనే ఉంది. చూడండి : "ఇక్కడంటాడు పూషా అనేటటువంటి దేవత. ఈ ప్రదేశంనుంచి యిప్పుడు హోమాలు చేయాలి ప్రధానహోమం ప్రవేశహోమం అని - అగ్నిసమీపం వర్శితినయతు అక్కడికి తీసుకువెళ్ళగాక ! ఎలా తీసుకువెళ్ళాలయ్యా-హ స్తగృహ్యా-హస్తే గృహీత్వా-"అశ్వినౌత్వాప్రవహతాగ్ం రథేన"-రథేన ప్రవహతామను మన్యేతాం పోర్హ్యమానాం-రథేన పోర్హ్యమానాం త్వా-అశ్వినౌ ప్రవహతాం అనుమన్యేతాం. ఊరికే నడిపించి తీసుకువెళ్ళకూడదంటారు. ఆ పెళ్ళికూరితోట-రథము నెక్కించి తీసుకువెళతా నిన్ను. ఈ తీసుకెళ్ళేటటువంటి నిన్ను అశ్వినీదేవత లనుమతింతురు గాక ! ఎందుకయ్యా రథాన్నెక్కించి తీసుకువెళ్తున్నావు ? అంటేట-యిప్పుడు వీళ్ళ మనకు కనపడినటువంటి ఈ మానుషమైన స్త్రీస్వరూపం కాదుట ఈవిడ సాక్షాల్లక్ష్మీ స్వరూపం. లక్ష్మీనామ్నీంకన్యాం" అని యిస్తాడు కన్యాదాత కన్యాదానం చేసేటప్పుడు" అని శ్రీ రేమెళ్ళ సూర్యప్రకాశశాస్త్రిగారు వేదార్థోపన్యాసాల్లో (పుట 147) చెప్పారు. ఆ వైదికవిధిలో రథం అని ఉంది కనుక వసురాజు క్రొత్త పెళ్ళికూతుర్ని రథం ఎక్కించుకునే బయలుదేరాడు.

అధిష్ఠానపురంలో ఈ వచ్చే గిరికాదేవిని చూడాలని వేడుకతో అంతా మేడలూ మిద్దెలూ ఎక్కారు. చూసి ఎవరికి తోచినట్లు వారు సిద్ధాంత వాక్యాలు చెప్పటం మొదలుపెట్టారు. ముందుగా ఆమెని లక్ష్మితో సమానంచేసారు. ఎలా అంటే ఒక కొండ (మందరపర్వతం) ఉదధిలోబడి (మథించటంవల్ల పుట్టిన ఒక వధువు) లక్ష్మిని ఒక పురుషోత్తముడి (విష్ణువు) కిచ్చాడు. ఇప్పుడు మరోకొండ (కోలాహలుడు) ఉదధి (శుక్తిమతి) ని చేరి (కన్నసంతానం మరోవధువు) గిరికను మరో పురుషోత్తముడు (వసురాజు) కిచ్చాడు. అదీ సామ్యం. అయిందా ఇంక కంతుడ్నీ జయంతుడ్నీ మించిన సౌందర్యమూర్తి అయిన వసురాజుకి ఈడుగా అటు చరాల్లోనూ ఇటు అచరాల్లోనూ కూడా కనిపించకపోటంతో బ్రహ్మగారు ఆ చరాచరాల (నగ తరంగిణుల) ను కలిపి నూతనంగా ఈ గిరికను సృష్టించాడుట. అసలా బ్రహ్మగారు తాను సంఘటితపరచిన జంటల్లో కనిపిస్తున్న లోపాలని ఇప్పుడు "సమవయోవంశ లావణ్య సద్గుణాభి, నుతుల నీ దంపతుల శుభా-న్వితల సంఘటించి వారించికొనియె వి-రించి" అనుకున్నారుట. ఆ మాటలు వేడుకగా వింటూ "తెలిదీవిఁబోలు నిజ

సద్మంబుం బ్రవేశించె"నట వసురాజు సతీసమేతంగా. "అవ్విబుధరాజబాంధవుండు వివిధకళ్యాణ గుణవిభాసితంబగు నొక్క సమయంబున" అన్న 71వ వచనం చివర "కన్నియలకుఁ, గామనిగమరహస్య ప్రకాశనం బొనర్పఁ బన్నిన యాత్మీయ-నర్మధర్మ, హర్మ్యరాజంబునకు వేడ్కనరిగియచట" "యంత్రపాంచాలికలు" ధూప దీపాదు "లొసఁగ సంతసము లెసఁగ" "మోహనశయ్యనున్నెడన్." గిరిక "వచ్చి నృపాల కేళిగృహవాటము నెచ్చెలిపిండు చాటునన్, జొచ్చి ...నిల్వ" "ఎచ్చట నైన నిత్యశుచివృత్తులు" అంటే ఎక్కడచూసినా స్వచ్ఛప్రతిఫలనయోగ్యత వృత్తిగా కల చంద్రకాంత శిలా సంభాలే ఉన్నాయట అక్కడ. అందులో ఒకదాన్ని చాటు చేసుకొని నిలబడినప్పటికీ ఆ ప్రతిఫలనంవల్ల ఆవలి స్తంభంలో ప్రతిబింబంగా గిరికను రాజుకి పట్టి ఇయ్యటం జరిగిందిట. కాగా "రాచసొమ్ము....మాటికొనంగ నేర్తురే" అంటే రాజుగారి స్వాధీనపు సొత్తు దాచిపెట్టుకోగలరా! అసాధ్యమని పౌరాణికాభిప్రాయం. ఆ మణిస్తంభాల్లో ప్రతిబింబించే తన నీడలనే గిరికాదేవి తన సఖులని భ్రమపడుతుంటే ఆమెవెంట (ఆమెని బలవంతంమీద తీసుకు) వచ్చిన అసలు సఖులు నెమ్మది నెమ్మదిగా తప్పుకున్నారుట. ఇక వదలిపోకుండా ఉన్నది స్త్రీసహజమైన లజ్జయేనట. అప్పుడు "రమణుండు దివియ నహార్యతనయ, విధు మణిసంభము నరవెడలి బయలు, పడి పెనంగుచు మరలి కంబమొక కేల, నూనియూతయుఁదక్క పాన్పెయ్యఁజేరె. స్త్రీజనసామాన్యమైన బెట్టు ఎంత సహజంగా వివరించాడో రౌమహర్షణి!

అలా గిరిక స్తంభం వదలి తన దోస్స్తంభముడాయ "అభ్యుచిత స్తంభము లయ్యె నంబకము లాభూమండల స్వామికిన్" అప్పుడామె ధరించిన భూషణాలు "చలమేల" "పతితోఁదగు మేలమ్మని...లాలించ క్రియన్" చప్పుళ్లు చేసాయట. అయినా ఇంకా గిరిక సిగ్గుపడుతూండటంతో మన్మథుడు వ్యగ్రుడై ఆమె సిగ్గును పారద్రోలటానికి వసురాజు చేతి నాశ్రయించాడుట. సన్నవలిపపు మేలిముసుగులో మోము దమ్మియూ, పైటరవికలనే పత్రరక్షక పత్రాల్లో బిగిసి దాగున్న చనుమొగ్గలయూ వైభవం ఏమీ పైకొనకపోటంతో వసురాజుగారి చూపు తుమ్మెదలు "తత్సుమనోవికాస వేళాంచిత వైభవంబునకు నాసపడు" చున్నవట. తన కను వెలుగులను ఆ గిరికా సౌందర్యానికి హారతులెత్తుతుంటే వసురాజామెను బుజ్జగించటం మొదలుపెట్టాడు. అలా అలా "వనజముఖి త్రాసమిదియేల-వదలరాదె" అనీ

"మోవిమానికమాని.... వహింతు నేవింతి మామకాళి, రామ వసునామ ముచిత గౌ-రవము దాల్చ." "అనుచు నరపతి కెంగేల-నవలకన్య,....అంగములు దడవె ... ఇచ్చ(దెలియుకరణి." అలా ఇంకో రెండు 87, 88 పద్యాలయ్యాక "పతి సతి నీవిహరింప సజ్జనవియెన్" అంతటి చమటకు కస్తురిరేఖ కరిగి జారుతుంటే "లలితనవ్యోపభోగలీ-లాలతాంత, నాయకు(డు చేవి మేదినీ నాయకుండు" "సిరుల నలరించె"నట. అప్పుడిక గిరిక "ముగ్ధమొసంగ సింహసం తానము గావునం గడను-దారత నాలతకూన యొప్పుచున్" "ముప్పిరిగొన్న వాచవుల .. తనివినంద(గ నీదు నృపాలమౌళి నేచొప్పున(బుట్టెనో భువనసుందరి సింధువరామృతంబునన్" అట్లా అనుభవం గెల్చి "సతి సాహిత్య రహస్య మీళువలనన్ సాధించి" భర్తదగ్గరే కూటమి కిటుకులు తెలుసుకొని మణితం అనే మృదుల ధ్వని వినిపించీ, కన్నుల కాటుక కరిగి జారే ఆనందబాష్పాలు మగని మోమున పడీ, గాజుల అంచెలల సవ్వడులు కలిగీ గిరిక ప్రౌఢురాలై "తోడ్తోన దత్ప్రతికిం బ్రత్యుపదేశమిచ్చె" స్వయం సహకారిగా భర్త కప్పగించిందట. అటువంటి "భూనాథాగ్రణికి న్వధూమణికి సం-భోగాంత సౌఖ్యంబు బ్రి, హ్మానందానుభవంబు(దెల్పె....యపునర్భవ ప్రభవ ఖే-దంబై విజృంభించుచున్" ఆ దంపతులు "ఈ క్రియ, రమణీయత(గాంచి రసవ-రత నవరతులన్." అప్పుడు వారు:

రతియు( జేతోభవుండు భా-రతియు నజు(డు
శచియు నమరాధినాథుండు-జలధి సుతయు
నబ్జనాభుండు ననమించి-యఖిల సమయ
సముచితక్రీడ సలిపిరి-సతియు( బతియు.

మరి ఆ వసురాజుకి కీర్తి విజయ సామ్రాజ్యాలు సుస్థిరము లయ్యాయి. జార చోర శత్రు సంచారాలు అణగిపోయాయి. ఆధివ్యాధులు తలెత్తటం లేదు. ఆ ఉపరిచర వసుమహారాజు రాజ్యంలో

ఫలము లీనెడు చెట్లతో(-బాలవెల్లి
కాన్పు పసితో నఖండ భో-గములతోడం(
బ్రజలు గాంచిరి భూరివై-భవ సమృద్ధి.

అని కథ కంచికి పంపేసి చేతులు దులుపుకున్నాడు పౌరాణికమణి రౌమహర్షణి.

కం. అని యిట్లు రోమహర్షణ, తనయుండు వసురాట్కథా సుధారసమఖిలం
బును దెలుప విని మహోత్సవ, మునఁబొదలిరి శౌనకాది-మునికుల చంద్రుల్.

అని రామరాజభూషణుడు ఆశ్వాసాంతానికి పూనుకున్నాడు ఆ కవి జాగ్రత్తచూడండి 'మునికుల చంద్రులు మహోత్సవమున బొదలిరట' కథాప్రారంభంలో ప్రస్తావించవలసిన సత్రయాగమే ఆ మహోత్సవం. మొదట ఎందుకు చెప్పలేదూ! నైమిశమూ సూతుడూ శౌనకాదులూ అనేటప్పటికే ధ్వనించవలసిన దాన్ని వాచ్యం చెయ్యటం ఇష్టంలేక. అయితే అంతంలో మాత్రం చెయ్యవచ్చునా! ఏదీ ఎక్కడ వాచ్యం చేసాడూ! మహోత్సవం అని అందులోనే ధ్వనింపచేసాడు. ఇలా వసుచరిత్ర ఆద్యంతమూ ధ్వనిప్రాధాన్యంగల ప్రబంధమే. వివిధ గతిస్ఫురణం ఇలాంటివాటిల్లో సర్వసాధారణమే అయినా కథాస్ఫురణం వదులుకోకూడదనేది ప్రతిపాదించటం దీని ఆదిర్శమని ముందే మనవి చేసుకున్నాను. ఏమాత్రమైనా ఆ స్ఫురణ ఈ 'వసుచరిత్ర-ప్రబంధ దర్శనం' చదివిన వాళ్ళలో కలగజెయ్యగలిగితే నా కృషి కృతార్థం అయినట్లు. ఇంకొన్ని విశేషాలకు అనుబంధం అతుకుతాను. సెలవు.

10-5-1985
శుక్రవారం

జొన్నవిత్తుల రామకృష్ణశర్మ
తెలకోవెల : బలుసుమూడి : భీమవరం-534 202.

# వసుచరిత్ర - ప్రబంధ దర్శనం

## అనుబంధం - 1

"పెక్కు భువన విజయ సభలయందు రామరాజభూషణ పాత్రధారియగు ఈ రచయిత" అని స్వయంగా చెప్పుకొన్న 'భూషణకిరణావళి' గ్రంథ సంకలనంలో 'సంగీత కళారహస్యనిధి' వ్యాసం వ్రాసిన శ్రీ పంతుల లక్ష్మీనారాయణ శాస్త్రిగారు మూచూడని సంగీత విశేషాలు 'వసుచరిత్ర'లో ఏమిలేవనే అనిపిస్తుంది. 1. బృంద సంగీత రీతిలోగల ఉత్తమ-మధ్యమ-కనిష్ఠ బృందగానాలు "ఉత్తమాభ్యధికం బృందం కోలాహల మితీరితమ్" వంటివీ 2. ఘన (కాంస్యతాళాదులు) సుషిర (మురళివంటి ఊదేవి) తత (తీగెలుండేవి) ఆనద్ధ (మృదంగాదులు) అని చతుర్విధ వాయిద్యాలవంటివీ 3. వాటిల్లో ఒకటైన వీణల రకాలూ వంటివీ 4. రాగరాగాంగ భేదాలూ పూర్ణ-షాడవ-ఔడవ భేదాలు వంటివీ 5. సంగీతశాస్త్రంలో కర్తల మత భేదాలు వంటివీ 6. గీతప్రబంధ స్వరూపస్వభావాలు వంటివీ 7. ప్రత్యేకించి ఏలా ప్రబంధ భేదాలూ లక్షణాలూ వంటివీ 9. శ్రుతులూ తాళాల వివరాలు వంటివీ చాలా చాలా చెప్పారు. వసుచరిత్రలోని పద్యాల్లో ఆ యా పరిభాషా ప్రయోగాలున్నవి కొన్నీ, ఆ యా సాంప్రదాయిక వివరణలు కొన్నీ ఆ యా లక్ష్య ప్రదర్శకాలు కొన్నీ ఆ యా రహస్య విశేషకాలు కొన్నీ ఇంకా ఏవో ఏవో ఏరి చూపించారు. చక్కగా వివరించారు. ఒకసారి ఆ వ్యాసం చదివితే మంచిది. శాస్త్రిగారి ఔన్నత్యం తెలుస్తుంది. కాగా ఇంతాచేసి ఇదా మీరు చెప్పేది అంటారేమో. కాదు సుమండీ!

గులాబి వంటి సుకుమార ప్రబంధ రామణీయకం వివిధ శాస్త్రాలనే రేకుల వికసనంలో ఉందని నేనూ ఒప్పుకుంటాను. ఆ యా శాసనపు రేకులని ఇలా ఛిన్నా భిన్నంచేసి కోలాహలాన్నికూడా మించిన గందరగోళపు సంతగోల సంగీత ప్రబంధాన్ని ఆస్వాదించలేను. ముళ్ళు ఉన్నాకూడా కాడ రెండు మూడు ఆకులూ ఉండి అగ్రాన విరిసి అందాలొలికించే నిండు గొజ్జంగి పూవులోగల సజీవ సౌందర్యమే ఆస్వాదయోగ్యం అనుకుంటాను. ఆ కాడ ఆద్యసత్కథగా ఉన్న ఇతివృత్తం. ముళ్ళు సత్కవి కల్పనా విశేషావహంగా సమకూర్చుకొన్న శాస్త్ర పరికరాలు. ఆకులు క్రమపరిణామాన్ని పొదువుకొన్న నవనవోన్మేషమైన ప్రజ్ఞారూపమైన కవి

ప్రతిభ. ఇంక పూవు పరికరప్రామాణికంగా సమగ్రనిర్మాణమైన రసప్రబంధ స్వరూపం. ఆస్వాదించేది పూవును చూసే అయినా ప్రబంధం చదివే అయినా అందుండి ప్రసారం అయ్యే వాసనా యోగఫల స్వారస్యం. అంటే ఈ శాసనపు రేకులు ఆ సజీవ నిర్మాణంలో తమవంతుగా ఎలా పాలుపంచుకున్నాయో ఎలా జీవన ప్రమాణాన్ని మెరుగు పరచాయో గుర్తించి సహృదయులుగా పైమెట్టు ఎక్కడమే మనకు ఆనందం. ఇదే రసానందాన్నైనా బ్రహ్మానందాన్నైనా అందుకొనే సోపాన మార్గం. ఏడుకొండలైనా గడవందే శ్రీ వెంకటేశ్వరుని దర్శనం అంటే ఎలా! శాస్త్రవిజ్ఞానం ఇంత వృద్ధి పొందిందికదా! ఆ ఏడుకొండలూ డైనమైట్లతో బద్దలు కొట్టేస్తే వెంకటేశ్వరుడే కిందపడతాడనే శాస్త్రజ్ఞులకో నమస్కారం. ఏ శాసనపురేకు ఎంతగా విరిసినా అసలు కాడ అయిన ఇతివృత్తం కొనని వదలక ఉండటం మనం గమనించాలన్నదే నాఉద్దేశం. అదే రామరాజభూషణుడి సాహిత్య రహస్యమూను.

చూడండి - మాటవరసకి ప్ర. ఆ. 104వ పద్యంలో నాట్యశాలలో మోగిన మురజరవం విని ఆ నాట్యగత్తెలకంటె ముందే నెమళ్ళు చూడటానికింపుగా నాట్యం చేసాయని ఉంది. ఆ కందం చివర్లో ఉన్నదాని వివరం "దృష్టిపాత్రము లగుచున్ అనఁగా దృష్టి సదృశములైన పత్రి సమూహములు గలవియై (నెమలిపురి ఈకలు గలవియై) కనుకనే చూడదగినవియై, అను నర్థద్వయము నెఱుఁగు నది" అని శ్రీ పం. ల. శాస్త్రిగారిచ్చారు. ఇందులో క్రియాప్రధానార్థం వెనుకబడిపోయింది. నెమలికి నెమలిపురి ఉండటం, దానికి ఈకలు ఉండటం, ఆ ఈకలకు (నెమలి) కన్నులుండటం ఎవరికీ తెలియనివి కావుగదా! ఇప్పుడు ఇవి కలవని అర్థం చెప్తుంటే మురజరవం విని మొలిచాయా అంతకుపూర్వం లేవా అనిపిస్తూ చాల్లేవయ్యా చెప్పావు అనిపించుకోవలసి వస్తుంది. ఆ వెనుక 'చూడఁదగినవి' అని అతికినా ఆ అసందర్భం మాసిపోదు.

అదే కథానుగుణంగా మురజరవం వింటంతోటే నాట్యగత్తెలకన్నా ముందే నెమిళ్ళు నటిస్తూ చూడ్డాని కింపుగా ఉన్నాయంటే అసందర్భానికి తావులేదు. మురజరవం వాటికి ఉరుములనిపించి ఉండవచ్చు అనే ధ్వని స్ఫురణకలిగి అవి నటించటం న్యాయమే అనిపిస్తుంది. కాగా అప్పుడు చూడ్డానికి ఇంపేమిటయ్యా అంటే ఇప్పుడా

రెండో అర్థం నెమలికన్నులని చెప్పాం అనుకోండి. అసందర్భపు టూహలు మారి అవన్నీ సందర్భానుకూలంగా నేసాగే ఆలోచనలు కలుగుతాయి. నాట్యంచేస్తుంటే నెమళ్లు పురివిప్పి ఆడతాయికదా, అంతవరకూ ముడుచుకొనిఉన్న తోకలో కనపడక దాగిఉండి పురివిప్పిన ఇప్పుడు నెమలికన్నులు రంగురంగుల్లో కనిపిస్తూ బాగున్నాయని విన్నవాళ్ళే ముందు చెప్పుకున్న అర్థం కలుపుకుంటారు. (అదివరకు లేవా ఇప్పుడు పుట్టుకొచ్చాయా అన్న అసందర్భపుటూహ కింక చోటులేదు) మొదట చెప్పుకున్నదీ చివర కలుపుకున్నదీ ఒకటే అర్థం. ముఖ్యం అయిన అర్థం. మధ్యలో కార్యకారణ సంబంధం ఆలోచనా ప్రవాహం సాగించటానికే రెండో అర్థం. వేడుక కోసం. ప్రౌఢపండితులకా వేడుకలో అసలు జారిపోతూండటం సంగతి 'వసుచరిత్ర-ప్రబంధదర్శనం' ఆదిలోనే మనవిచేసుకున్నాను. ప్రధాన విషయ పరిగ్రహణంలో ఇలా చెప్పటాన్ని దుడుకుతనం అనుకోకూడదు మరి. పండుగకి పిండివంటలు చేసుకొన్నామని అన్నం వండుకోటం మానేస్తామా! ముందు అన్నం తరువాత పిండివంటలూకదా!

అసలు విషయం మరోటి ఉంది. నాట్యశాలలో కన్యలు నాట్యం మొదలు పెట్టకుండానే మురజాలు ఉరుముల్లా మ్రోగించేస్తారా అని! ఔను నాట్యారంభంలో పాత్ర ప్రవేశానికి ముందే సంగీతకం అని నాంది ప్రయోగం ఉంది. దానిప్రకారం మృదంగంమీద ఒక దరువు వినిపిస్తారు. ఆ సంప్రదాయాన్ని ధ్వనింప చెయ్యటం ఇక్కడ రామరాజభూషణుడి సాహిత్య రహస్యం. సంగీత కళా రహస్యమిదికదా! దాన్నిబట్టి నాట్యశాలమీద జరిగేది అభ్యాసంకాదనీ అలాగే ప్రదర్శనమూ కాదని పిస్తుంది. రెండూకాక మరేమిటంటే సరిమాసుకునే పూర్వప్రదర్శనం అన్నమాట. అభ్యాసం అయితే సంగీతక ప్రయోగం ఉండదు. ప్రదర్శనం అయితే సహృదయ సభ్యులుండాలి. తరువాతి పద్యంలో ఆకాశాన పోయే దేవతాస్త్రీలు నాట్యం చూడ్డానికి యంత్రపు బొమ్మల్లో బొమ్మలుగా ఉండిపోయి. చివర సంగీతంవల్ల జీవంపొంది కదిలిపోయే ఆ యంత్రపు బొమ్మల్లా కదిలిపోయారు అని చెప్పవలసిన పనిలేదు. సభ్యుల్లోని స్త్రీలలో కలిసిపోయి నెమ్మదిగా జారుకునే అవకాశం వారికుండేది. అలా కాకపోటంవల్ల సభ్యులముందు జరిగే ప్రదర్శనం అదికాదు. ఇంక పూర్వప్రదర్శనం కాకతప్పదు.

ఇప్పు డీవిషయంకూడా అంత ప్రధానంకాదు. కానీ ఒకవేళ ఊహకందితే ఒక నిర్మాణాత్మక చైతన్యం హృదయవికాసానికి తోడ్పడి మనల్ని సహృదయ సభ్యుల్లో చేరుస్తుంది. దీనికి మారుగా శాస్త్రిగారిచ్చిన వ్యుత్పత్త్యర్థంతో నెమలికన్నులు మాత్రం చెప్పి ఊరుకుంటే చూపులేని ఆ (నెమలి) కన్నుల్లా లీలామాత్రవు సహృదయ సభ్యుల్లో నిలిపేస్తుంది. తరువాత మీ ఇష్టం.

అయితే ఇలా అన్నింటినీ విడమరచి చెప్తాననుకోవద్దండి. "సంఘటింప వలసిన విషయములు పెక్కు లింకను మిగిలియే యున్నవి. అయినను వ్యాసవిస్తర భీతియు, నా యసమర్థతయు దీనికి కొంతవరకు హేతువు లయినవని" శ్రీ లక్ష్మీ నారాయణశాస్త్రి గారంతటివారే అన్నప్పుడు నాలాంటి అశక్తుడిమాట వేరే చెప్పే దేముంటుంది! ఎలాగో దారిచేస్తాను. మీరు దూసుకుపొండి.

ముందుగా రామరాజభూషణుడు తననుగూర్చి చెప్పుకున్న పద్యంలో కీలకం ఏమన్నా దొరుకుతుందేమో ప్రయత్నిద్దాం:

మ. నను శ్రీరామ పదారవింద భజనా-నందున్ జగత్ప్రాణనం
దన కారుణ్యకటాక్ష లబ్ధకవితా-ధారాసుధారాశి సం
జని తైకైక దిన ప్రబంధ ఘటికా-సద్యఃకృత గ్రంథ క
ల్పను సంగీతకళారహస్యనిధిఁ బి-ల్వంబంచి పల్కెన్నృపన్. ౧౪. ౧౭

చూడండి: తానేమో రామపద భజనపరుడా! హనుమంతుడేమో కవిత్వంఇచ్చాడా! వింతగాలేదూ! చివరిపాదంలో సంగీతకళారహస్యనిధి నంటాడే మరి ఆ సంగీతం ఎవరిచ్చారు! 8వ పద్యం హనుమత్ప్రార్థనంలో "మత్కావ్య భవ్యవాగమృతఘటన, మంజుల స్వాంతు హనుమంతు-మదిఁదలంతు" అన్నది గమనిస్తే సంగీత సాహిత్యాలు రెండూ వాగమృతాలే. ఆ రెండూ కలిపిన ఏకరాశి కవితాధారాసుధారాశి అందులోంచి సంగీతపరమైన ప్రబంధాలు రోజుకొకటిగానూ సాహిత్యపరం అయిన కావ్యపద్యాలు ఘటికాసద్యఃకృతంగానూ గ్రంథకల్పన చేయగలవాడుట తను. ఇక్కడ కొంచెం వివరణ అవసరం. అది శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారి 'ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము' లోంచి గ్రహించవచ్చు. ముందుగా ప్రబంధవిషయం. "సంగీతశాస్త్రములో భరతాది లక్షణకారులచే ప్రోక్తములై, దేశభాషలలో పరివ్యాప్తములై ఉన్న శాస్త్రీయ సంగీత రచనా రూపములకు ప్రబంధములని పేరు.

(51 పుట) "పాటలోని మాటలకూర్పును 'మాతువు' అనీ సంగీతపుకూర్పు (గేయము) ను 'ధాతువు' అని అంటారనీ" (47వ పుట) ఇది సంగీత సాహిత్యాల ఏకరాశిత్వాన్నిగూర్చి. కాగా ప్రబంధ స్వరూపంగురించి "ధాతువుఅనేది ప్రబంధము నకు గల అవయవము అని సంగీతశాస్త్రజ్ఞులు నిర్వచించారు. ప్రబంధ శరీరం 4 భాగాలు 4 ధాతువులు. అవి 1 ఉద్గ్రాహము 2 మేళాపకము 3 ధ్రువము 4 ఆభోగము ... ....ఈ ధాతువుల ఏర్పాటును బట్టి ప్రబంధాలు మూడు విధాలు ద్విధాతుకాలూ త్రిధాతుకాలూ చతుర్ధాతుకాలూ. ద్విధాతుకం అంటే ఉద్గ్రాహ ధ్రువ ములు మాత్రమే ఉండే ప్రబంధం. ఉద్గ్రాహ ధ్రువాభోగాలుండేది త్రిధాతుకం. ఉద్గ్రాహ మేళాపకధ్రువాభోగాలుండేది చతుర్ధాతుకం" (57వ పుట) దీన్నిబట్టిచూస్తే కవిత్వమూ-కలిమీ ఇచ్చేపాలున్న రెండు పాత్రల్లో ఏదోఒకటి తీసుకోమని కాళికాదేవి అంటే రెండు పాత్రలూ పరిశీలించి ఒకదాన్లో ఒకటి కలుపుకుని రెండింటిలో పాలూ తాగేసాడని తెనాలి రామకృష్ణుడ్నిగూర్చి అంటూ ఉంటారుగాని "సంగీత సాహిత్య నామక విద్యాయుగళంబు పల్కుఁ జెలికింబాలింప జోడై సిరుల్ ప్రకటింపన్" ఆ పాలు రెండు రకాలవీ 'కవితాధారాసుధారాశి'గా జగత్ప్రాణనందన కరుణాకటాక్షం వల్ల లబ్ధిపొందాడు రామరాజభూషణుడనటం సత్యం. ఇలా అంతా వాగమృతమే అయినా సంగీత సాహిత్యమిశితమైంది. సంగీతంలో నారద సంప్రదాయం (కర్ణాటకం అంటారు) హనుమత్సంప్రదాయం (హిందుస్థానీ అంటారు) ఉన్నాయనటం చూస్తే హనుమంతుడు తత్సంప్రదాయ సంగీతం ప్రసాదిస్తే తాను సంగీతకళారహస్యనిధి అయ్యాడు అనుకోవచ్చు. ఇంక ఆ హనుమంతుడు రామనామగానంతో శ్రీరామ చంద్రుని హృదయంలో స్థానం పొందినవాడు కాగా సంగీతకళారహస్యనిధి రామరాజ భూషణుడు శ్రీరామ పదారవింద భజన (సంసేవనా) స్థానాన్ని స్వీకరించి ఆనందాన్ని పొందేవాడుగా ప్రకటించుకోటం వింత ఏమీ కానక్కరలేదు. సారాంశంగా వసు చరిత్రలో సంగీతసాహిత్యాలకు సమాన ప్రతిపత్తి కల్పించి అనంతరకావ్యం ద్వ్యర్థిగా సాహిత్యమాత్రం చేసాడు. దాన్ని శ్రీరామచంద్రుడికి అంకితం ఇచ్చి ధన్యత పొందాడు. ఆ ద్వ్యర్థికావ్యం హరిశ్చంద్ర నలోపాఖ్యానం. వసుచరిత్రలో సాహి త్యానికున్నంత స్థానం సమానంగా సంగీతానికెలా దక్కిందో చూద్దాం.

సంగీతంలో ఏ రాగం నడిచినా దానికాధారం శ్రుతికనుక కొద్దిగా దాని విషయం ప్రస్తావించుకుందాం. "ఆంధ్రవాగ్గేయకారచరితము" గ్రంథం 38 & 39 పుటల్లో

"వీణాపరికరణంలో తన (రామయామాత్యుని) కాలంలోని ఆరు రకాల రుద్రవీణలను వర్ణించాడు. రుద్రవీణ మొదట మూడురకాలు. అవి శుద్ధమేళవీణ, మధ్యమేళవీణ, అచ్యుతరాజేంద్ర మేళవీణ. ఈ మూడవది కృష్ణదేవరాయని తమ్ముడైన అచ్యుతదేవరాయల ప్రోత్సాహంతో నిర్మింపబడింది. ఈ మూడూ ఒక్కొక్కటీ రెండు రకాలు. అవి సర్వరాగవీణ అనీ-ఏకరాగవీణ అనీ. అన్నిటికీ మెట్లుంటాయి. ఏకరాగవీణకు సితార్‌లోవలె రాగరాగానికీ మెట్లుకదిపి మార్చుకోవాలి. వీనిలో పై నాల్గు తంత్రులను స-ప-స-మ-లుగా శ్రుతిచేసి క్రింది అనుకరణ తంత్రులను స-ప-స-లుగా శ్రుతిచేస్తే హార్మోనిక్స్ లేక అప్పర్ పార్షియల్స్ అనబడే స్వరాలు వినబడతాయని రామయామాత్యుడు తెలుసుకొని వాటికి స్వయంభూస్వరాలని పేరు పెట్టాడు. ఈ ప్రయోగంనించి తంబురాశ్రుతిని ఊతగాచేసి పాడుకొనే ఆచారం వ్యవహారంలోకి వచ్చింది."అని బాలాంత్రపు రజనీకాంతరావుగారు స్పష్టంచేసారు.

వసుచరిత్రలో నర్మసచివుడు ద్వి. 17వ పద్యంలో "తన్మృదు పంచమషడ్జ శయ్య" అని ప్రస్తావించింది ఈ శ్రుతి విషయమే. ఆ శ్రుతి కోకిల-కేకి సమూహాలు ఎలుగిచ్చినవట. మరి "షడ్జం మయూరో వదతి" "పికః కూజతి పంచమమ్" అంటారుగదా. ఆ కూతల షడ్జమ పంచమ స్వరాలే సూక్ష్మంగా స-ప అని గుర్తించారు. పైస్వరంగా మళ్ళీ 'స' నే శ్రుతిలో నిలుకడ చేసికొని రాగవిన్యాసం జరుగుతుంది. ప్రవాహం ఏకశయ్యాశ్రుతి ధ్వనిగా నాదాన్ని కలిగిస్తూంటుంది. నదియొక్క ఆశయంగా అచ్ఛతా-పావనతా-గంభీరతలని ఈ శ్రుతి స-ప.స ల ప్రతీకలుగా ప్రటనం అయినట్లు గ్రహిస్తే సత్కవి (మాతు-ధాతు కల్పనా వివేక) నిషేవితంగా జీవించే ఈ శ్రుతికే ప్రతీక శుక్తిమతి అని తెలియటం కష్టంకాదు. ఆ తరంగిణీ ఈ శ్రుతీ సర్వతా సంచారంగల నిత్యచలనంగలవే అయినా తటినిగానూ శయ్యగానూ అచల స్వరూపాలుగా ప్రవర్తిస్తాయి. రామరాజభూషణుడు "భవాన్....చేతనాన్ అచేతనవత్"గా భ్రాంతి నిలుపుతూ సుకవి అయ్యాడు. ఇదేదో గిట్టింపు అనుకోకండి. చివరి అన్వయంలో స్పష్టం ఔతుంది పరిశీలించండి.

"బృంద సంగీతరీతి, నమరు నతివేల కోలాహలముల కలిమి, నధిప యీ యద్రి కోలాహలాఖ్యమొక్కౕ" అన్న నర్మసచివుని మాటే కోలాహలపర్వతం బృందసంగీతరీతికి ప్రతీక అని నిరూపిస్తోంది. శ్రీ లక్ష్మీనారాయణశాస్త్రిగారిచ్చిన

లక్షణం "గాత్రవాదక సంఘాతో బృంద మిత్యభిధీయతే" (సంగీత రత్నాకరము 203వ శ్లోకము) అన్న దాన్నిబట్టి గాయకుల యొక్కయు వాద్యకారులయొక్కయు సంఘము బృందమని చెప్పబడును. దాన్ని బలపరిచే ఈ ద్వి. ఆ. 7వ సీసంలో మూస పోసినట్టిది. పిక మయూరాలు శ్రుతిశయ్య సమకూరుస్తుంటే చిలుక పలుకులు అకలంకత (కళంకంలేని మాటల మాతువు) నందిస్తూంటే వనదేవ యువతులు గేయ (ధాతు) క్రమం సాగిస్తుంటే నవశారికలు వంతపాడుతున్నాయి. మధ్య మధ్య చారణకుమారుల ప్రశంసలూ అలిమండలి (చెలుల) సహకారగానం ఇంకా అరటి చప్పరాల్లో కిన్నరీ బృందగానంతో నిండిఉంది ఆ కొండ. వివరాల విశేషాల మాట ఎలాఉన్నా ఆ బృందగాన మూలం ఆ పర్వతమేకదా! ఇక్కడ పర్వతంగా అచేతనమే అయినా బృందగాన ప్రసారంవల్ల చేతనమైనట్లు "భావా నచేతనానపి చేతనవత్" చేసి రామరాజభూషణుడు కథ నడిపిస్తున్నాడు.

"ననాదేన వినాగీతం ననాదేన వినాస్వరః। ననాదేన వినారాగః తస్మాత్ నాదాత్మకం త్రయమ్" గీతము, స్వరము, రాగము ఈ మూడున్నూ నాదమును విడచి యుండవు. (సంగీత విద్యాదర్పణము). "ఆహతో௨నాహతశ్చేతి ద్వేధానాదో నిగద్యతే" ఆ హతము అనాహతమూ అని నాదోత్పత్తి రెండు రకాలు. "అనాహత స్వరూపేణ జ్ఞానినామూర్ధ్వగోభవేత్, తైలధారామి వాచ్ఛిన్నం దీర్ఘఘంటా నినాదవత్, ప్రణవస్యధ్వనిః తద్వత్ తదగ్రం బ్రహ్మచోచ్యతే" (యోగచూడామణ్యుపనిషత్). ఆపులేని (ఎడతెగని) నూనెధారకి మల్లే, ఎంతోసేపు వినిపించే కంచుగంట మ్రోతలాగా ప్రణవం అయిన ఓంకారం అనాహత స్వరూపంతో జ్ఞానులందు ఊర్ధ్వంగా సాగేది ఔతుంది. ఆ చివరఉండేది బ్రహ్మ అని చెప్పబడును. పరబ్రహ్మ అయినా చతుర్ముఖబ్రహ్మ అయినా అనాహత నాదంతో పొందదగు నన్నమాట. ప్రణవం వంటిదే శ్రుతికూడా. కనుక తల్లీనతగా శ్రుతి ఊర్ధ్వగామిస్తే బ్రహ్మను దర్శిస్తుందన్నమాట. కాబట్టే వసుచరిత్రలో శ్రుతిప్రతీక అయిన శుక్తిమతి బ్రహ్మ సభకు వెళ్ళివస్తున్నట్లు కల్పింపబడింది. శ్రుతిని ఆధారం చేసుకొని విహరించేసే సంగీతం కూడా బ్రహ్మ దర్శనయోగ్యం అయిందేనని వేరే చెప్పుకోఅక్కర్లేదు. కాదంటే గీతం ఆ హతనాదం ఔతుంది. అయినా వినేవాళ్ళకి అనాహత లాభాన్నే ఇస్తుంది. "తస్మాదాహతనాదస్య శ్రుత్యాది ద్వారతో௨ఖిలమ్। గేయం వితన్యతే లోకరంజనం భవభంజనమ్" శ్రుత్యాదిముఖముగా తెలుసుకొనినయెడల ఆ హతనాదము జనులకు

తోనందమును పాపనాశనమును చేయును. (శ్రీ ఉమ్మడిసెట్టి వేంకటస్వామి నాయనిచే రచియింపబడిన సంగీత విద్యాదర్పణము) దీన్నిబట్టి కోలాహలుడూ బ్రహ్మసభకి పోయివస్తున్నట్లూ ఆ రాకపోకల సందర్భంలోనే శుక్తిమతీ కోలాహలులు దార్లో కలుసుకున్నట్లు ఈ శ్రుతిగీతుల నడిమికలయికకి ననుసరించే రామరాజభూషణుడు కల్పన చేసాడన్నది స్పష్టం కావటంలేదా !

సంగీతంలో హనుమత్సంప్రదాయం హిందుస్థానీ సంగీతంగా నెలకొని ఉందని ఇదివరకు స్మరించే ఉన్నాము. ఆ హిందుస్థానీ సంగీతంలో శ్రుతి ప్రాముఖ్యం ఎక్కువ. (నారద సంప్రదాయంలో లయప్రాముఖ్యం ఎక్కువ) అందుకే వారి రాగాలాపన (ఆలపి) లో గమకాల దురితం విపరీతం. ఆ గమకాల కల్పనపై వ్యామోహం ఎక్కువై రాగంలోఉన్న ఆరోహణ అవరోహణ (మూర్ఛనలు) స్వరాలను పార్శ్వస్వరాలకి వంచికూడా ప్రయత్నించటం ఉంది. ఛాయ వదలకుండా ఆ వ్యత్యాస స్వరాలను కొనసాగిస్తారు. అపస్థాయి అంటారు ఆ వ్యత్యాసాన్ని. ఏదో మాటవరుసగాచేస్తే అదీ ఒక అందంగానే ఉంటుంది. కానీ ఆ వ్యామోహం మరీ ఎక్కువైతే రాగం శ్రుతిశయ్యని వదలిపోయే ప్రమాదం ఉంది. అంటే రాగంలో అపస్థాయి ప్రస్తారం శ్రుతిని మింగేయటమే ఔతుంది. అసలుని అతిక్ర మించేస్తుంది. రాగప్రస్తార ప్రతిరూపుడైన కోలాహలుడు శయ్యాశ్రుతి ప్రతిరూపం అయిన శుక్తిమతిని ఆక్రమించటంగా "వసుచరిత్ర" కథ నడుస్తుంది. రాగం అపస్థాయి ప్రస్తారంలో గమకాలు గిలకరించేస్తుంటే శ్రుతి తల్లీనంగాక ఒంటరిగా హోరెత్తుతుంది. అది సహృదయ రసజ్ఞులకు చూడండి నా ఉనికి (శ్రుతి) వ్యర్థమై పోతోందని మొరపెట్టుకుంటున్నట్లు వినిపిస్తుంది. అప్పుడు సహృదయ రసజ్ఞ శిఖా మణిగా సంగీత సంప్రదాయంలో నిత్యనివాసి అయిన వసురాజు హనుమత్సంప్రదాయ పుష్టికి మూలం అయిన శయ్యాశ్రుతి అతిక్రమణాన్ని నిరోధించి తత్సంప్రదాయ రక్షణచేసినట్లు గ్రహించటం మనకేమీ కష్టంకాదు.

ఆ వసురాజు రసజ్ఞతకి గంధర్వాప్సరోగీత విద్యాపై పుణ్యమ్ముల నిత్యగాన లోలుడైన స్వర్గాధిపతి మహేంద్రుడు మెచ్చి ఆ రాజును తనంతవాడుగా చెయ్యా లనుకొని తాత్కాలికంగా తనవీటికి వస్తూపోతూఉండి ఆ మొనకువలు తెలుసుకుంటూ ఉండేందుకు వీలుగా ఒక విమానం ఇచ్చి భూలోక సంగీత రసజ్ఞులకు వసుర్లోక

మెట్టు పైనున్నాడు అనిపించాడు. అది గుర్తించి సామగాన విద్యాపారంగతులైన మునులు ఆ మహేంద్రప్రియచర్యాప్రాభవాన్ని పురస్కరించుకొని తమకు పైగా (ఇంద్రుని మెప్పింపగలంత ఎత్తున) విహరించటాన్ని 'ఉపరిచర' బిరుదంగా ఆ రాజుయొక్క అసలుపేరుకి కలిపి 'ఉపరిచరవసు'వని వ్యవహరించారు. అలాకాక ఇంద్రుడే ఆ బిరుదు తగిలించాడంటే (భారతంలో అలాగేఉంది) తానుండే స్వర్గానికి పైన చరించటం అనే అతివ్యాప్తి వస్తుంది: అలాగే రసజ్ఞతలోకూడ తనను మించిపోయాడని అంగీకరించినట్లూ ఔతుంది. అది నిజంకాదుగదా! మరి మునులే అలా పిలిచినట్లు రామరాజభూషణుడు మార్చటంలో ఇంతటి ఔన్నత్యాన్ని సంపాదించిపెట్టాడు. ఇది గమనించకుండా చాలామంది అనౌచిత్యవాదం చేస్తున్నారు. ఎంత అన్యాయమో చూడండి.

కోలాహలుడిప్పుడు పరిధికి కట్టుపడిన రాగవిన్యాస పద్ధతికి ప్రతీకగా మారాడు. శుక్తిమతి విహిత శ్రుతిశయ్యా సౌభాగ్యానికి ప్రతీకగా సంగీత గర్భధారిణి అయింది. కాగా మృగ-అన్వేషణే అనే ధాత్వర్థాన్నిబట్టి 'ఆంధ్రవాగ్గేయకారచరిత్రము' 21వ పుటలో "బ్రహ్మచేత వెతకబడి మృగయతే- సంపాదింపబడినవి గనుక వీనిని మార్గగానములన్నారు" అని చెప్పిన 'మార్గ' గానానికి ప్రతీకగా గిరిక పుట్టింది. ఆ పుస్తకంలో ఇంకొంచెం పై విషయం" సామవేద (మునిగాన) యుగానికి తర్వాతి యుగాన్ని సంగీత చరిత్రలో గాంధర్వయుగం లేక మార్గయుగం అన్నారు. ఈ మార్గ సంగీత రచనల లక్షణమూ, లక్ష్యాలూ కూడా సంస్కృత కావ్యభాషలో జరిగాయి. వీటి ఈ మార్గపద్ధతి లక్ష్య ప్రబంధాల కర్తృత్వం బ్రహ్మకు ఆపాదించారు" అందుచేతనేనేమో శుక్తిమతి "వాణిఁదాల్చు సుకవిస్తోమంబు (బ్రహ్మలోకంనించి) రప్పించి తద్గానవిద్యామహిమల్ కరతలామలకముల్గావించె" అలాగే కోలాహలుడు "కిన్నర కోటులన్నిలిపి (దేవలోకంనించి రప్పించి) గేయవిశారదఁజేసెఁ గూతునన్"గా "మార్గ" సంగీత ప్రతిరూపంగా "కిన్నరమీట, వీణఁబలికింపఁగ, గీతములుం ప్రబంధము ల్విన్నియఁబాడఁజెప్ప (వివరించటంకూడా, అంటే లక్షణం చెప్పటమనే) ననివారితచాతురి గల్గునట్లుగాన్" నిలిచింది గిరికాదేవి. అది నర్మసచివుడు తేలికగానే గ్రహించేసాడు. అతను మొదటిసారి వెళ్ళి చెట్లచాటున నుంచొని ఆమెను చూసి (ద్వి. 27 సీ) "తన పాండిమము నవు-లనెయుంచి గాంధర్వ, మవనికిఁ దెచ్చిన-హంసయాన" అన్నమాట శ్రీ పం. ల. శాస్త్రిగారన్నట్లు "ఈ నాయిక (గిరికాదేవి)

గాంధారమును భూలోకమునకుఁదెచ్చిన సరస్వతి అని అతిశయోక్తి "కాదు. అదేమైనా అనిపిస్తే "ఈ మార్గపద్ధతి లక్షణలక్ష్యప్రబంధాల కృతకృత్యత్వం బ్రహ్మకాపాడించి"న వారిదేగాని పాత్రగా నర్మసచివుడిదిగానీ ప్రబంధకర్తగా రామరాజభూషణుడిదిగానీ అతిశయోక్తి కాదు.

వసంత విలాసం కనుగొంటున్న సహృదయ రసజ్ఞశిఖామణి వసురాజుకి "ఒకానొక కిన్నరద్వయం"బు "అన్యదురాసదంబైన యొక్క యాసన్న శుభంబు ... తెల్పితోనయేగెన్" సంగీతం వింటే చెవులకోసుకొని యెగురుకుంటూపోయే జంట ఆ సమీపంలో ఎన్నడూ వినని శుభ (మంగళశోభాగానం ఉన్న) ప్రసంగంచేసి పోగా ఆయనకీ (నిఖిలోక్తి వేసి అని సర్వజ్ఞభావంగా పౌరాణికుడనటం గుర్తించాలి) ఉత్సాహం చెంగలించింది. ఆ జంట పట్టిన దారిగా కోలాహల స్థానం చేరుకున్నాడు. ఏమేమో విన్నాడు. ఆ నడుమ మాధురీమర్మమైన కలస్వనం వినిపించటం గుర్తించాడు. అది తుమ్మెద పదాల్లా రసానందబ్రహ్మమై వినిపించింది. సహృదయ మిత్రవయస్యునితో "ఆ నవ్యామృతా వ్యాహతాస్వాదంబై పరమానంద సంధానమై కోకిల తుమ్మెదవీణియలతో ఏదో ఇవేవీకూడ కాదో తెలియటంలేదన్నాడు. ఆ రసజ్ఞాధిపుడు మెచ్చే ప్రధానవిషయం గుర్తించిన ఆ సహృదయ మిత్రుడు వీణతో గొంతుకలిపి ఎవరో పాడుతున్నారు. ఆ పాట ఎంత శ్రుతిహితమధురంగా ఉందంటే గొంతులున్నందుకు సార్థకం జేసుకుంటూ కేకి కోకిలలు స్వయంగా ఎలుగిచ్చి శ్రుతిపడుతున్నాయిసుమా అన్నాడు. ఇంకొంచెం ఆలోచిస్తే ఆ పాటల్లోని షడ్జమ పంచమ స్వరాలతో తమ కూతల్లో ఏమైనా లోపాలుంటే సవరించుకోటానికి ఎలుగిచ్చి చూసుకుంటున్నాయిసుమా అని ధ్వనింపజేసాడు. చంద్రకాంత శిలాగుహాలి ప్రతిధ్వనించే ఆ సంగీత కలస్వనం రసజ్ఞాధిపునికి "ఒకానొక యనురాగభరంబుఁ (భూలోకంలో అసాధారణమైన మార్గపద్ధతిగా (క్రొత్తదైనా ఒకరకమైన ఔత్సుక్యాన్ని) జెనుప" అది ఎక్కడిదో ఏమిటో కనుక్కురమ్మన్నాడు మిత్రుని. ఎందుకంటే "తదాయతన వాటికిఁబోవుద మీక్షణంబునన్" ఆ గానం విరమింపబడకుండానే అక్కడకు వెళ్ళాలని ఆదుర్దా. అలాగే సచివుడు వెళ్ళి తెలుసుకువచ్చి చెప్పిం తర్వాత తానూవెళ్ళి చాటునే నిలబడి "వాఙ్మనసగోచరేతరాద్వైతరాగజలధి నపు డోలి తేలి రాజన్యమౌళి ఘనతరాశ్చర్యశాలియై" ఆ రూపాన్ని మెచ్చాడు. "యేషాం కావ్య (గాన) అనుశీలనవశాత్ విశదీభూతే మనో ముకురే వర్ణనీయ తన్మయ

యోగ్యతాస్యాత్ । తే సహృదయ సంవాదభాజః సహృదయాః" అన్న సహృదయ రసజ్ఞశిఖామణి అనే రాజన్యమౌళి అనటం ఇక్కడ.

ఈ మార్గపద్ధతి గాన పరిణామక్రమంగా పౌరాణికుడు వసంత విలసనంలో ౧ ఆశ్వాసం 128, 130 రెండు పద్యాల రూపకల్పనంచేసి ఉండటం గుర్తింపవచ్చు. 128 మరుత్కుమారుని పేరుమీద చెప్పినా ఈ మార్గగానరూపాన్నే పొత్తుల్లోపెట్టి ఉయ్యాలలూపి జోలపాడి పెంచటమే. ఇక్కడ ధాత్రీజాతముల్ అన్నా అక్కడ వనదేవతలన్నా ఒక్కటే. 130లో "మహాసంపూర్ణభావోన్నతిన్" వసంతం అన్నా "సరిగా గై కొనియెన్" అని యెదిగి అక్కడ "వాఙ్మనసగోచరే తరాద్వైత రాగ జలధి నపుడోలి తేలి ఘనతరాశ్చర్యశాలి"గా సహృదయుని మెప్పించు నంతటిదై నది మార్గగాన రూపమే గిరికా నామకంగా.

ఒక్కసారి "ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము" 29 పుటం కొంచెంచూద్దాం. "సంగీత రత్నాకరకాలంవరకు ఉత్తర దక్షిణ భారతదేశాలకు ఒకే సంగీతపద్ధతీ, ఒకే ప్రామాణికతా ఉండేది. 13వ శతాబ్దిలో....ఉత్తరాది సంగీతం హిందుస్థానీ సంగీతంగానూ, దక్షిణాది సంగీతం కర్ణాటక సంగీతంగానూ వేరుపడి, వేరు వేరు రూపాలలో పరిణామం చెందనారంభించాయి........"

"ఉత్తర హిందుస్థానీ రాగపద్ధతిలో ప్రధానంగా ఆరు పురుషరాగాలూ వాటికి భార్యలైన ఆరు రాగిణులూ ఆ యా కుటుంబాలకు చెందిన జన్యరాగాలూ.... ఏర్పడ్డాయి. ఈ విభజన రాగప్రధానచ్ఛాయలనుబట్టీ, వాటిలోని రసాధార స్థాయినిబట్టీ జరిగినది. ప్రతిరాగానికీ కొంత దృశ్యకల్పన ఇచ్చారు. 'మేఘ' రాగానికి వర్షాకాలపు మేఘాలతో నిండిన ఆకాశం. హిందోళరాగానికి క్రీడాదోలికలో ఊగుతున్న జవరాలు."

ఇప్పుడు డోలికలో ఊగటం పెంపకంలో బిడ్డలా (మరుత్కుమారుడు-ఆంజనేయుడు-ఆయన సంప్రదాయపు సంగీత స్వరూపం) 128వ పద్యమూ, మహా సంపూర్ణభావోన్నతిగా గిరికా నామక మార్గగాన స్వరూపం జవరాలుని 130వ పద్యం ధ్వనింపచేయటమేకాక ఆ సమన్వయంగా హిందోళ వాచ్యంగానే ఉంది. ఇంకెందుకు సందేహం ! అది హిందుస్థానీ మార్గగాన రూపం గిరికానామకమే వసుచరిత్రకథలో. ఒక్కసారి ఆ 130వ పద్యం చూద్దాం.

మ. అరిగాపంచమ మేవగించి నవలా-లవ్వేళ హిందోళ వై
ఖరి సూపం బికజాత మాత్మరవభం-గవ్యాకులంబై వనీ
ధర నాలంబిత పల్లవవ్రత విధు-ల్దాల్పం దదీయధ్వనిన్
సరిగాఁ గైకొనియెన్ వసంతము మహా-సంపూర్ణభావోన్నతిన్.

ఈ పద్యాన్ని ఎందరెందరో ఎంత ఎంతగానో ప్రశంసించారు. శ్రీ సముద్రాల నాగయ్యగారిని "సాహితీ సుధాలహరి" నుంచి ఉటంకిస్తాను. కోయిలలు పల్లవ వ్రత విధులు దాలిస్తే "వాని తపమునకు మెచ్చిన వసంతము (వసంతరాగము) సరిగా (ఋషభసహితముగా) పంచమమును స్వీకరించినది. అనఁగా వసంతర్తు ప్రవేశానంతర కాలమున స్త్రీలు హిందోళమునుగాక వసంతరాగమును కాలానుగుణముగాఁ బాడిరని తాత్పర్యము. శాస్త్రీయమగు నీ విషయము నింత బాగుగఁ బ్రకృతార్థమున సమన్వయించుట సుకరముగాదు" మిక్కిలి విలువైన ప్రశంసాపత్రము. 'ఆరుద్ర'గా పరిచయం పెంచుకున్న శ్రీ భాగవతుల శంకరశాస్త్రిగారి సూక్ష్మవివరణ చూడండి. "కర్ణాటక వాసంతంలో పంచమం ఉండదు. రామరాజభూషణుని ఉద్దేశం స్త్రీలు పూర్వం రిషభపంచమాలు లేని హిందోళం పాడారు; ఇప్పుడు అవి ఉన్న హిందోళ వసంతం పాడుతున్నారని చెప్పడమే" అని అథోజ్ఞాపికలో "హిందోళవసంతం అనే రాగానికి స, గ, మ, ప, ని, ద, స - స, ని, ద, మ, గ, రి, గ, ప - అని ఆరోహణ అవరోహణలు. (గానకళాబోధిని-యన్. సి. పార్థసారధి దంపతులు" అంటూ ఉటంకించి చూపించారు. "హిందోళరాగంలో రిషభం, పంచమం ఉండవు. ఈ రెండూ ఉన్న రాగాన్ని హిందోళవసంతం అంటారు" అన్న (ఆరుద్ర) శంకరశాస్త్రి గారి ఉద్దేశం ఆరోహణంలో పంచమం, అవరోహణంలో రిషభం చేరటంవల్ల 'హిందోళం' కాస్తా 'హిందోళవసంతం' అయిందని చెప్పటంలా తోస్తుంది. "తమ స్వరమైన పంచమం లేదని వ్యాకులత చెంది (కోకిలలు) ఆకులూ అలములూ తింటూ తపస్సుచేసాయట. ఆ వ్రతవిధులను మెచ్చి వాసంతం మహాసంపూర్ణభావంతో పంచమస్వరాన్ని స్వీకరించిందట." అన్నప్రకారం ఆరోహణలో పంచమం చేరటం సమర్థింపబడింది. అయితే అవరోహణలో రిషభం చేరటానికి హేతువేది? "సరిగాఁ గైకొనియెన్ వసంతము" మాత్రంగా పలికిన భూషణవాక్యం. మరి పంచమ స్వీకారానికి రమణీయం అయిన కల్పనలో నిమిత్తం సమకూర్చిన ఆ భూషణకవి రిషభ స్వీకారం ఇంత పలుచనచేసి పలుకటం ఏమిటో? ఎందుకో (ఆరుద్ర) శ్రీ శాస్త్రిగారు విచారించినట్లులేదు. ఇలా వారి అభిప్రాయం పునఃపరిశీలనకె దారి చూపుతోంది.

ఈ హిందోళ - వసంత అనే రెండు రాగాలనిగూర్చీ చాలా గందరగోళం ఉన్నట్లుంది. శ్రీ పం. ల. నా. శాస్త్రిగారు 163-174 దాకా 12 పుటల్లో వివరించారు. ఔత్సాహికులు ఒకసారి చూడండి. మాటవరసకి ప్రస్తుతంలో హిందోళం (నఠ) భైరవి జన్యం. (166వ పుట) "హిందోళ వసంత జన్యము కనుక...." (171వ పుట) కాగా ప్రస్తుతకాలంలో వసంతం మాయామాళవగౌళజన్యం (166వ పుట) "ప్రస్తుత కాలమునందలి విద్వాంసులు కొందఱు వసంతము - సూర్యకాంత జన్యమనియే చెప్పు చున్నారు." (167వ పుట) "వసంతము మేళకర్తృరాగము" (168వ పుట భూషణ కిరణావళిలో). ఇలా ఏవేవో చాలాచాలా చెప్పారు. అవి పాడే సమయాల్నిగురించీ ఇలాంటి భేదాభిప్రాయాలున్నాయి. శిశిర వసంతాల సంధిలో హిందోళం పాడతారు (164వ పుట) "హిందోళమున, రి-ప, లుండవు....ఈ రాగము ఏ కాలమునందైనను గాని ఉషఃకాలమునగాని పాడఁదగినది." 164వ పుట. "వసంతరాగము ఎల్లప్పుడును గానము చేయఁదగునని తెలుపఁబడెను." (173వ పుట) వసంతరాగం వసంత ఋతు వందు చక్కగా పాడదగింది (164వ పుట) ఇలా వివిధాలుగా ఉంది - మొత్తంమీద ఆ రాగాలు ఆనాడు ఒకవిధంగా ఈనాడు ఇంకోవిధంగా పాడబడుతున్నాయని శాస్త్రిగారు తీర్మానించారు. ఏమైనప్పటికీ వసంత "మహాసంపూర్ణరాగమే అగు చున్నది" (170వ పుట) అని మరోతీర్మానంచేస్తూ రామరాజభూషణుని "మహా సంపూర్ణభావోన్నతిన్" ప్రవచనాన్ని సమర్థించటానికి పాటుపడ్డారు సాంకేతిక ప్రజ్ఞతో. వారి సంగీతశాస్త్ర పరిశీలన కంజలి ఘటిస్తున్నాను. వారి ప్రౌఢ పాండితీ గరిమకు మనం తట్టుకోలేం. ఈ రాగాల కోలాహలంనించి బయటపడేదారి ఏమైనా వెతుక్కోవాలి. అయినా ఆ రెండు రాగాల సంబంధం తెలుసుకునేందుకైనా కొద్దిగా స్వరప్రస్తావన తప్పదనుకోండి. ఏంచేస్తాం మరి. ఒక్కసారి పద్యంవంక చూడండి.

అవ్వేళ-ఆ వసురాజు వనదర్శనానికి వచ్చినవేళ. అంటే వసంతవేళ అనే-పాడవలసిందీ వసంతరాగమే. పాడే నవలాలు అంత ప్రగల్భలుకారు. కొంచెం పక్కదారి పట్టారు. తరువాత వెనుదిరిగినా మరో రాగచ్ఛాయ (వైఖరి) చూపారు. బాగా దగ్గరలో ఉన్న హిందోళ వైఖరి అది. - ఆ రెండు రాగాల ఆ దగ్గరి సంబంధం ఏమిటంటే ఆ రెండింటిలోనూ స-గ-మ-ద-ని, అనే అయిదు స్వరాలే పలకటం. అవి 'సరిగ్గా' ఆరోహణలో అలాగేఉంటే వసంతరాగం. (అవరోహణలో ఏమీ భేదంలేదు) నవలాలు పడిన పొరపాటేమిటంటే ఆ ఆరోహణలో 'స' అనే

షడ్జస్వరం అన్న వెంటనే అనవసరంగా 'మ' అనే మధ్యమస్వరం పలికేసారు. అంటే అది స-మగ-(మ-ద-ని) చేసేసారు. అదే హిందోళం. మధ్యమస్వరం 'మ' తర్వాతిదైన 'ప' పంచమస్వరం పలకకూడదు రెండురాగాల్లోనూ కూడ. ఆ విషయం మీద శ్రద్ధ ఎక్కువయ్యేటప్పటికి 'గ' అనే గాంధార స్వరం చోటనే ఆ మధ్యమం పలికేసారన్నమాట 'ప' వలదనుకోటమే "పంచమ మేవగించి" అంటే ఆ అతి జాగ్రత్తవల్ల తడబడటంతో హిందోళమై ఖరి వచ్చిపడింది. 'రి' అనే ఋషభస్వరం కూడా రెండురాగాల్లోనూ లేదు. కానీ రెండోదే అవటంతో పెద్ద శ్రద్ధ పట్టక్కర్లే కుండానే నిక్కచ్చిగా వదిలివెయ్యగలిగారు. 'అరి' శత్రువులా వదిలేసారు. (పంచమం ఎలా వదలాలా అని తెచ్చిపెట్టుకున్న అతిశ్రద్ధవల్ల దాని పూర్వ స్వరానికి బలం ఎక్కువై ముందే పలికేసింది. హిందోళమై ఖరి పొడసూపిందికదా!) అసలు శ్రుతిసాయం ఉంటే గాయకులకి రాగచ్ఛాయ మాయదు. శ్రుతి అంటే షడ్గమ పంచమాలని చూసేఉన్నాంగదా! అందులో "స" అనే షడ్జమం రాగంలోనూ ఉంది మెట్టమొదటిదీ కూడాను. బాగానే పలుకవచ్చు. ఇంక "ప" అనే పంచమం చూపిస్తే చాలు. దాన్ని కోకిలలు చూపించాయి. (దానికేదో గమ్మత్తైన ఆత్మరవభంగ వ్యాకులంబయి వనీధర నాలంబిత పల్లవవ్రీత విదుల్దాల్చటం అనే వ్యాజం సమకూర్చబడింది) ఆ ధ్వనిని ఆసరాగా తీసుకొని తడబాటు వదలి నవలాలు వ్యత్యయం సరిచేసుకొన్నారు. అంతే వసంతరాగం అచ్చమైన వసంతరాగభావ పరిపూర్ణంగా వికాసం పొందింది. కోకిల అందించిన పంచమస్వరం శ్రుతి చూపించటానికేగానీ రాగంలో చోటుచేసుకోలేదని ఇక్కడ మనం గుర్తించాలి. తడబాటున దారిమళ్ళటం అనే అవిదగ్ధత (అయోగ్యత) దాన్ని మాపి సంప్రదాయ సంస్థాపనకై సహృదయ శిఖామణిగా వసురాజు కోలాహలాన్ని అదుపుచెయ్యటం అనే లక్షణ సిద్ధాంతానికిది లక్ష్యం (ఉదాహరణ) అన్నమాట. చూడండి పద్యతాత్పర్యం రూపు మారి మీ కళ్ళబడుతుంది.

పద్యం మొదటి "అరి" ఋషభస్వరం లేదనిపించటమేకాక చివరిపాదం మొదటి "సరి" కి వ్యతిరేకార్థపదం అనికూడా తేలింది సరిగాలేని గాంధారస్వరంవల్ల హిందోళం ఏర్పడినట్లు అరి"గా"లో సూచనఉంది. అది క్రమంలోనే ఉండి వసంతం ఏర్పడినట్లు సరి"గా"లో సూచనఉంది. ఆ మార్పు తప్ప రెండురాగాలూ ఒక్కటే అనేది రామరాజభూషణుని లక్షణ నిర్దేశం ఇక్కడ. దీన్నిబట్టి తాత్పర్యం: ఋషభ

స్వరం లేని వసంతరాగంలో పంచమంకూడా వదలాలనుకుంటూ (పంచమ మేవగించి) గాంధారస్వరం పలకవలసిన స్థానంలో తప్పిజారి దాని తర్వాతిదీ పంచమానికి పూర్వపుదీ అయిన మధ్యమస్వరాన్ని నవలాలు అనేసారు. తడబడి ఎలాగో గాంధారం అందుకుని పంచమంలేని ఆరోహణ సాగించటంతో ఆ వసంతవేళ హిందోళ రాగచ్ఛాయ (వైఖరి) పొడసూపింది. అంతలో శ్రుతిశయ్యలేని దోషాన్ని ఆత్మరవభంగ వ్యాకులంబై వసీధరనాలంబిత పల్లవవ్రాత విధుల్దాల్చిన కోయిలలు షడ్జమ పంచమాల తమవంతైన పంచమాన్ని శ్రుతిగా వినిపిస్తుంటే ఆ నవలాలు ధైర్యంగా తమ పొరపాటు సవరించుకొని సరిచేసుకు పాడితే అచ్చమైన రాగభావం నిండిన వసంతరాగమే విలసిల్లింది. క్రీడాడోలిక నూగు జవరాలి రూపం హిందోళ ఒక్క మెరుపు మెరిసి మాయమయ్యింది. మార్గసంగీత ప్రతిరూపమైన గిరికా అతను సమ్మోహవిద్య సహృదయైకవేద్యం. ఇందుకేనేమో రామరాజభూషణుడు సంగీతకళానిధి (కళంకం పొందవలసి వస్తుందని) కాక "సంగీతకళా రహస్యనిధి"గా తనను చెప్పుకున్నాడు. లోచనాంజన ప్రోన్మేషం విధించి నిధిని అప్పగిస్తానన్నాడు. అందరమూ ధన్యులమే.

ఇక్కడ ఒక్కమాట. సాంకేతిక శబ్దజాలంలో ఇరుక్కుంటే బయటపడటం ఎంతకష్టమో చూడండి. నిజంగా "సంపూర్ణభావోన్నతిన్" అనే ప్రయోగంలో పూర్ణ, షాడవ, ఔడవముల్లోని "పూర్ణ" అనే సాంకేతికార్థమూలేదు. ఎలాగో దాన్ని సాధించినా ప్రయోజనమూలేదు. ఆ మూడు సాంకేతిక పదాలూ "అ జాబిల్లి వెలుంగు వెల్లవల...." పద్య సందర్భంగా కాంభోజీరాగ ప్రసక్తిగా వసుచరిత్ర-ప్రబంధ దర్శనంలో సూచించి ఉన్నాను.

ఆ భావదర్శనంతో అనితరాయత్తమైన ఆత్మలో అవాఙ్మానస గోచరమై నటువంటి ఆ మార్గసంగీతరూప గిరికయొక్క అతను సమ్మోహవిద్యను రసజ్ఞ శిఖామణి అభినుతించి తలయూచె నవ్వె అవ్వనరుహసూతి చేతి యనివారిత చాతురి మెచ్చె (కమలినీ (శుక్తిమతి) కుమార్తెఅయిన గిరికయొక్క చేతిలో మ్రోగే వీణా వాదన నైపుణ్యాన్ని మెచ్చాడు. ఈ అన్వయం నచ్చకపోతే వదిలెయ్యండి) మన నాంత మాంతర విస్మయంలో పడ్డాడు. అంగనా ప్రసంగంబు కతన ఎట్టకేలకు మరలిమాచి మిత్రుని ఏగతి యోగి (అనుసంధానము చేయువాని) రూపము వహిం

చెదో యిష్టసఖా భవదీయనీతి కార్యగతి నేఁడు చూతము అని ఉత్సాహపరచి పంపాడు. యతిలియ్యమవటం వంటి సంగీత మార్గానచేరి వసువల్లభుం బెండ్లియాడు (సహృదయ శిఖామణి కంకితము గమ్ము) అని దీవించాడు. సుకవి మంజువాణి వివరణలో మార్గసంగీత స్వరూపస్వభావాలు శుక్తిమతీ కోలాహల ప్రణయచరిత్రలో ఫలించిన గిరికా నామకప్రైదగ్ధ్యం గ్రహించాడు. సమయానుకూలంగా రసజ్ఞాధిపుని రప్పించి పరిచయంచేసి తప్పుకున్నా మళ్ళీ సామాన్య సహృదయ సభ్యునిగా (సచివు నిగా) వచ్చిచేరాడు. అప్పుడు రస-రసిక భావాప్రైతిలక్షణంగా ఆ రాజవదన హృదయము నా రాజవరేణ్యు తలపు నారసి సుకవి (మంజువాణి) ఆ రసరూపి ప్రత్యక్ష పరిచయం సాగిస్తూ గిరికా మార్గసంగీతరీతులు "పదమెత్తంగల హంస లీల ..." గేయ వాక్ప్రౌఢిమ కొనియాడ తరము గాదన్నది. ఈ పద్యానికి శ్రీ పం. ల. నా. శాస్త్రిగారి వివరణ చదివి తీరాలిసిందే. చూడండి. ఇక్కడ స్థలాభావంవల్ల ఎక్కించటంలేదు.

అప్పుడా సహృదయశేఖరుని చేయూతగొని వెలుగొందాలని ఆ మార్గగీత గిరిక తత్తరపడుతుంటే ఆ రసస్వరూపాన్ని స్వంతం చేసుకోవాలనుకున్నా డా సహృదయాధిపుడు. అలా సమయం సందర్భం సమకూడిన సంగతి గ్రహించి తవంతటివానిగా చేయదలచి ఎదురుచూస్తున్న స్వర్గ రసజ్ఞచక్రవర్తి మహేంద్రుని ఆధ్యక్ష్యంలో సహృదయ సభామధ్యంలో ఆ మార్గసంగీత గిరికను భూలోక సహృ దయ సార్వభౌమునికి అంకితంచేయించాడు. ఆ రసమూర్తిని ఎన్నుకున్న సహృదయ దర్మాన్ని మెచ్చి వాసవమాలనూ దైవత్వాన్నీ (గాంధర్వవిద్యను స్వయంగా ప్రద ర్శింపలేకపోయినా అందులోని కిటుకులు తెలిసి ఆనందించే తత్త్వం కలవాడుగా గుర్తింపు) ప్రసాదించాడు. అంకితంకాబడ్డ శుభసందర్భం పురస్కరించుకొని తైల ధారావిచ్ఛిన్నంగానూ దీర్ఘఘంటా నినాదవతుగానూ నాదబ్రహ్మను సంధానం నిత్యా నంద సంధాయకంగా ఉండిపోవాలని తదాటంకశక్తుల నంతంజేయగల వేణుయష్టినీ ప్రసాదించి ఇంద్రుడు తనదారిన వెళ్ళిపోయాడు.

తృ. ఆ. 33 పద్యం నాటి "కిన్నరమీట వీణఁబలికింపఁగ గీతములుం బ్రబం ధము లన్నియఁబాడఁజెప్ప" నేరుకొన్న వెంటనే మరల బోధింపను తగిన యుక్తి తెలిసిన మేధావిగా పెరిగిన గిరిక ఇప్పుడు "నతి సాహిత్యరహస్య మీశువలనన్

సాధించి తోడ్తోన తత్ప్రతికిం బ్రత్యుపదేశమిచ్చె" అంటే ఆశ్చర్యపోవలసిన పనిలేదు.

కం. ఐదువగాణీల శుభా, పాదనగేయముల పేర-భారతి సతిపై
మోదమున, ధవళవర్ణ, ప్రాదుర్భావంబు నెఱపెం-బలుమఱు నచటన్.
౨ఆ.౧_౬౮.

శ్రీ పం. ల. నా. శాస్త్రిగారు స్పృశించినట్లు కనిపింపని ధవళవర్ణం మాట కొద్దిగా ఆంధ్ర వాగ్గేయకార చరిత్రమునుండి గ్రహించి ఈ అనుబంధం ముగించేస్తాను. "మరొక మూడు విధాలయిన ప్రబంధ విభజనం ఉంది. అవి ఏవంటే సూడప్రబంధాలూ ఆళిసంశ్రియాలూ విప్రకీర్ణాలూ"...."మూడవతరగతిలోనివి 36." అందులో 31వది ధవళ. (59వ పుట)

ధవళం :- మూడు విధాలు. 4 చరణాలుండేది కీర్తిధవళం; ఆరు చరణాలుండేది విజయ ధవళం; 9 చరణాలది విక్రమధవళం. 1-3 బేసిపాదాలలో ఛగణమూ, ఛగణద్వయమూ; 2, 4 పాదాలలో ఛగణమూ పగణమూ అధికమైతే విజయ ధవళమవుతుంది. ధవళాలు ఆశీర్వాదాత్మకాలు. లోకప్రసిద్ధమైనది యీ గేయమని సింహభూపాలుడు తన వ్యాఖ్యలో వ్రాసాడు. ఇది ఆంధ్రదేశీయమైన గేయాలలో ప్రసిద్ధమైన దానిగా మధుర కవితారీతులలో జాజరలు, అర్ధచంద్రికలు, ఏలలు మున్నగు వానితో చేర్చి ప్రభాకరశాస్త్రిగారుకూడా పేర్కొన్నారు. ఆ విషయమును వారు వార్తకవి రాఘవయ్య (1600 ప్రాంతంవాడు) రచించిన లక్షణదీపికనుంచి ఉద్ధరించారు.

జయదేవుని గీతగోవిందంలోని దశావతార కీర్తిధవళం

ప్రళయ పయోధిజలే ధృతవానసి వేదం
విహిత వహిత్ర చరిత్ర మఖేదం-కేశవ
ధృత మీనశరీర, జయజగదీశ హరే.

సుగ్రీవ విజయంలోని ధవళం.

శ్రీరాముడు గుణధాముడు వారిజదళలోచనుడు
ఘోరత రావణుగూలిచి నారీమణి తేవలయున్-శోభానా మే....

అలమేలు మంగా విలాసంలో ధవళం వేరుగానూ శోభనం వేరుగానూ సూచింప బడ్డాయి.

ధవళం : జయ రవికోటి సంకాశా జయజయ కారుణ్యనివాసా
జయజయ సద్గుణకోశా జయజయ శ్రీ వెంకటేశా.

శోభనం : వేదము లొసగిన ధన్యునకూ
విబుధుల బోషించిన మాన్యునకూ
భూధరము గాచిన మూర్ధన్యునకు
ఆదిమ మూర్తి నృసింహునకూ శోభానామే. (72వ పుట)

ఇలా సంగీతం మార్గపద్ధతిగా సృష్టి-పరిణామ-ఫలానుమేయంగా వసుచరిత్ర పాత్రల వ్యక్తీకృతం అయి కథ నడిచిందంటే అద్భుతంకాదూ ! "క్రమవిముక్తానేక బంధానుసంధానంబై, యపునర్భవ ప్రభవభేదంబై" రస-రసజ్ఞ మేళనం కుదరటం అదృష్టం. పాపం ఆ పురుటి నొప్పు లెంతగా భరించాడో రామరాజభూషణుడు. ఆ రస-రసజ్ఞానుసంధానంగా వసుచరిత్ర ప్రబంధం మార్గగాన ప్రబంధం అయి ఆ పురిటి బాధ లేకుండచేసి అద్వైతానంద ధారాసుధారాశి పరిఢవిల్లి దేశభాషా ప్రపంచ వాఙ్మయం మొత్తానికే ఆదర్శంగా అక్షరప్రసన్నమై ఆంధ్రగౌరవాన్ని సుస్థిరం చేస్తూంది.

తస్యగీతస్య మాహాత్మ్యం కేప్రశంసితుమీశతే
ధర్మార్థ కామ మోక్షాణాం ఇద మేకైక సాధనమ్.
(సంగీత రత్నాకరమ్)

# వసుచరిత్ర-ప్రబంధ దర్శనం

## అనుబంధం-2

"నాదేన వ్యజ్యతేవర్ణః పదం వర్ణాత్ పదాద్వచః
వచసో వ్యవహారోఽయం నాదాధీన మతోజగత్ ॥

నాదమువలన అక్షరమును, అక్షరముచే పదమును, పదముచే వాక్యమును, వాక్యముచే లోకవ్యవహారమును అగుటవలన వీటితోకూడిన యావజ్జగత్తును నాదాధీనము"

ఈ తాత్పర్యంలో పదాది నిర్మాణాలకి భవననిర్మాణంలో ఇటుకల్లా స్వరూప స్వభావాలతో తోడ్పడేవి అక్షరాలే. అవికూడా నాదం అనబడే అడుసుతో చేయబడు తున్నప్పటికీ స్థితిగత స్వరూపంగల ఇటుకలనబడే అక్షరాలే ముఖ్యం. ప్రమాణ బలాది విశేషాల్లో వాటిల్లో రకాలుంటాయి. స్థానకరణ ప్రయత్నాల ప్రమాణబల వివరాలు గమనిస్తే స్ఫుటం అయినవి ఏబదిగా సంస్కృతభాషలో నెలకొన్నాయి. కాబట్టే ఆ భాషామతల్లిని "పంచాశదక్షర విగ్రహా" అనవచ్చు. "పంచాశద్వర్ణాఖ్య మకర్వేదస్వరూపకమ్" అంది పంచ బ్రహ్మోపనిషత్. అలా అక్షరస్వరూపాలుగా తయారయ్యేది నాదమే అనేది సుస్పష్టం. అలా అక్షర పరిణామం పొందిన నాదాన్ని వైఖరీవాక్కు అనటం పారిభాషికం.

"చత్వారి వాక్పరిమితా పదాని । తాని విదుర్బ్రాహ్మణాయే మనీషిణః । గుహా త్రీణి నిహితా నేం గయంతి । తురీయంవాచో మనుష్యావదన్తి" ఋగ్వేద 1-161-45. బుద్ధిమంతులైన వాళ్ళు నాలుగు క్రమాల వాక్కులను గుర్తిస్తారు. అందులో మూడు అంతఃకంగంలోనే దాగిఉంటాయి. బయటపడవు. కాగా నాలుగోది మాత్రం మనుష్యులు మాట్లాడుతూ ఉంటారుట ఆ మనుష్యులు మాట్లాడే నాలుగోదే మనం పారిభాషికం అని చెప్పుకున్న వైఖరీ వాక్కు. అసలా నాలుగింటి క్రమం యోగ కుండల్యు పనిషత్ 3 అధ్యాయంలో ఇలా ఉంది. "పరాయా మంకురీభూయ, పశ్యం త్యాం ద్విదళీకృతా, । మధ్యమాయాం ముకుళితా, వైఖర్యాం వికసీకృతా" అని. క్రమంగా వివరాలు తెలుసుకోవచ్చు.

నాడీ సంచారాన్నిబట్టి వాయువుచే కదిలించాలిసిన కొన్ని స్థానాలు చక్రాలనే పేరున మనుష్యుల్లో ఉన్నట్లు చెప్తారు. "సూర్యేణ రేచయే ద్వాయుం సరస్వత్యాస్తు

చాలనే, కంఠసంకోచనం కృత్వా వక్షసశ్చోర్ధ్వగో మరుత్। తస్మాత్సంచాలయే న్నిత్యం శబ్దగర్భాం సరస్వతీమ్। తస్యాస్సంచాలనే నైవ యోగీ రోగైః ప్రము చ్యతే" కంఠం సంకోచింపజేసి (స్వరతంతువులను) గుండెలోంచి గాలిని పైకి పంపిస్తూ సూర్యనాడి ద్వారా (కుడిముక్కు కన్నంలోంచి) గాలిని వదిలేస్తూ (స్వర) సరస్వతీ చాలనం సాగించాలి. ఇలా నిత్యమూచేస్తూ శబ్దగర్భమై ఉన్న సరస్వతీ చాలనం సాధిస్తే దానివల్ల యోగి తుంద మధ్యగతం అయిన గుల్మ, జలోదర, ప్లీహ వ్యాధులూ ఇంకా ఇతర రోగాలనుండీకూడా విముక్తుడౌతాడు. సర్వతీ అంటే ఇడా నాడికి మరోపేరు. ఇలా వాయువుచేత కదిలింపాల్సిన చక్రాల పేర్లూ వాటి స్థానాలూ చూడండి.

"ఆధారం గుద మిత్యుక్తం, స్వాధిష్ఠానంతు లైంగికం, మణిపూరం నాభి దేశం హృదయస్థ మనాహతమ్, విశుద్ధిః కంఠమూలేచ ఆజ్ఞాచక్రించ మస్తకం, షట్చక్రాణి పరిజ్ఞాత్వా ప్రవిశేత్సుఖమండలే." (యోగ కుండల్యుపనిషత్ 3వ అధ్యా). ఇది సులువుగానే తెలుస్తోందిగదా! ఇంక ఈచక్రాలతో పరాదివాక్కుల సమన్వయం చూద్దాం.

"మూలాధారాత్ ప్రథమోదితో యశ్చభావః పరాఖ్యః। పశ్చాత్పశ్యం త్యథ హృదయగో బుద్ధియు జ్మధ్యమాఖ్యః। వ్యక్తే వైఖర్యథ రురుదిషో రస్యజ సంభవః" అనే పెద్దల వాక్యం చెప్పిన మొదట్లో మూలాధారచక్రంనించి పరావాక్కు బయలు దేరుతుంది. ఆ వెనుక స్వాధిష్ఠాన మణిపూరకాల రెండుదళాల పశ్యంతి ఉదయి స్తుంది. హృదయ ప్రదేశంలో అంటే అనాహత చక్రంలో మధ్యమా వాక్కు రూపొందుతుంది. మనస్సుతో కూడుకొని మధ్యమా ఔతుందన్నమాట. ఆ పైన కంఠంలో విశుద్ధచక్రంనుంచి నోటిద్వారా వైఖరీవాక్కు వెలువడుతుంది. మొదట్లో చెప్పుకున్న "చత్వారి వాక్పరిమితా పదాని...." అన్న ఋగ్వేద మంత్ర వివరణమే కనుక ఇది వైదిక వివరమే. మొదటిదైన "పరా" వాక్కుని "భావ" అనికూడా అంటారు. అది సరస్వతీ ప్రథమరూపం.

"మహో అర్ణః సరస్వతీ ప్రచేతయతి కేతునా। ధియో విశ్వా విరాజతి, ఋ 1-3-12. సరస్వతి తన ప్రజ్ఞచే మహాజలరాశిని చైతన్యవంతమొనర్చి ప్రవర్తింప జేయుచున్నది; అనుష్ఠాతల బుద్ధులను విజ్ఞానముతో నింపి వికసింపజేయుచున్నది.

అని యర్థము. ఇట నొకే సరస్వతికి మహాజలరాశిని ప్రవర్తింపజేయుట, అనుష్ఠాతల బుద్ధులను వికసింపజేయుట అను రెండు ధర్మములు చెప్పబడుటచే వాగ్దేవతయే అద్దేవత యగుట శ్రుతి తాత్పర్యము" (భారతీ నిరుక్తి 562 పుట) అన్న హరి సోదరుల వివరణచూస్తే మహాజలరాశిని ప్రవర్తింపజెయ్యటం వసుచరిత్రలో శుక్తిమతి యందు కోలాహల పర్వతం అడ్డిన కారణంగా వెల్లువై పొంగిన నదిగా సమర్థనీయం అనిపిస్తుంది. అంటే శుక్తిమతి సరస్వతీ ప్రతిరూపం అన్నమాట. అయితే శుక్తిమతీ ప్రణయగాథ సరస్వతీ పరిణామ విశేషాల వాణీవిలాసంగా ప్రతిబింబిస్తుందో ఏమో చూడాలి. ప్రయత్నిద్దాం.

> ఊర్ధ్వోర్ధ్వ మారుహ్య యదర్థతత్త్వం, ధీః పశ్యతి శ్రాంతి మవేదయంతీ।
> అలం తదాద్యైః పరికల్పితానాం, వివేకసోపాన పరంపరాణామ్ ॥
>
> (అభినవగుప్తుడు)

ప్రాచీనార్యుల మతముల (సిద్ధాంతాలోచనల) పర్యాలోచన చేయుకొలది విచార్య మాణార్థముయొక్క యథార్థ స్వరూపము గోచరమగును. ప్రాచీనార్య విచారధారలు పరమార్థప్రాప్తికి సోపానపరంపరలు. (భా. ని. 472వ పుట).

ప్రజాపతి నుదుటి చెమటబొట్లు నేయిగా పొడగట్టగ అది హోమం చెయ్యాలా మానాలా అని విచికిత్స కలిగి యోచిస్తుంటే ఒక అశరీరవాణి "జుహూధి" హోమం చెయ్యి అందిట. ఈ తైత్తిరీయబ్రాహ్మణం చెప్పిన కథ ఎలాఉన్నా కర్తవ్యం తెలియక తడుముకొనేటప్పుడు మనం ఒక నిర్ణయానికి రావలసి ఉంటుంది. అప్పుడు మనకున్న పూర్వసంస్కారానుభవాలనుండి అంతఃప్రేరణ పొందుతాం. ఆ ప్రేరణవల్ల కార్యావసరంపట్ల స్వయం వ్యక్తం అయిందే వేదవాక్. దానికి వేరే మూలం ఏదీ ఉండకపోవచ్చు. అలా స్వయంగా పొటమరించే శబ్దరూపం మూలాధార చక్రంలో "పరావాక్కు" అని మనం చెప్పుకున్నదే. శుక్తిమతి ఈ వాక్ప్రతిరూపం గనకనే ఆమె ఎవరి సంతానమో రామరాజభూషణుడు ప్రస్తావించలేదు. అవసరమూలేదు. "స్వయం సర్వంవేత్తి ఇతి వేదః" అని వేదశబ్దము స్వయంగా అన్నీ ఎరిగి ఉన్నదనికూడా నిర్వచింపబడిఉంది. ఆ వేదవాక్ప్రతిరూపం కనుక శుక్తిమతి తలిదండ్రులను గూర్చి ప్రస్తావించ అక్కర్లేకపోయింది.

"అగ్ని మేవాను గేగా(డా)తు మధ్యం ప్రాప్తా సరస్వతీ। అముం స్థితాఽధి లోకంతు భారతీ భవతి హ్యసౌ." ఒకే వాక్కు త్రిస్థానగతమై మూడు నామములతో అభివ్యక్తమగుచున్నది. అగ్నిగతమై పృథివియందు వ్యాప్తమైన వాక్కు "ఇడ". వాయు (ఇంద్ర-రుద్రాది దేవతా) గతమై అంతరిక్షమున వ్యాప్తమైయుండెడి మాధ్యమిక వాక్కు సరస్వతీ. ఆదిత్యగతమై ద్యులోక వ్యాప్తమైన వాక్కు భారతి" (భా. ని. 541, 542 పుటలు) వసుచరిత్రలో శుక్తిమతి చాలావరకూ ప్రాతినిధ్యం వహించినది ఇడా వాక్కుకే. అది పృథ్వియందు వ్యాప్తికలదీ అంటే మూలాధార చక్రాశ్రయమైంది అన్నమాట. వెనుక ఆ చక్రస్థిత వాక్కుని "పరా" అనుకున్నదే ఇది. పరా అన్నా ఇడా అన్నా ఒకటేనన్నమాట. "భావ" అనికూడా అంటారనుకున్నాంగదా। ఇంక వివరాలు చూద్దాం.

"కర్మానుష్ఠాన సమయమున వేదవిదుని యందుండెడి వేదవాక్కు "ఇడా" రూపిణియగును." ఇడా మకృణ్వన్ మనుషస్య శాసనీమ్ ఋ. 1-31-11. దానికి సాయణభాష్యం "మనుషస్య-మనోః, ఇడాం-ఏతన్నామధేయాం పుత్రీం, శాసనీం-ధర్మోపదేశ కర్త్రీమ్, అకృణ్వన్-కృతవన్తః। మనువు పుత్రికయగు "ఇడ" ధర్మోపదేశకర్త్రి(శాసనీ) యని యిట జెప్పబడినది." దీనివల్ల తండ్రి యెవరో తెలిపినట్లుకాదు. చూడండి. "యమాహూ ర్మనవ స్తీర్ణబర్హిషమ్ (వా. సం. 15-49) అను శ్రుతివాక్యమునందలి "మనవః" యను పదమును "యే విద్వాంస స్తే మనవః" అని శతపథశ్రుతి (శ. బ్రా. 8-6-3-18) వివరించినది. మనువు ప్రవర్తింపజేసిన ధర్మమార్గమున జరించుచు కర్మానుష్ఠానపరులగు విద్వాంసులును మనురూపులే యగుదురని తాత్పర్యము. (భా. ని. 546 పుట) కనుక ఇడా-పరా-భావ అన్న పేర్ల వాక్కునకు మనువు తండ్రికాడు. పై సాయణభాష్యంలో ఏతన్నామధేయాం పుత్రీమ్ అన్నదానికి విద్వాంసులైన మానవులలో జనించినదిగా మాత్రం అర్థంజేసుకోవాలి. దానివల్ల మానవ రూపధారణ సమర్థనీయం ఔతుంది. శుక్తిమతినిగూర్చి నదిగా మహాజలరాశిని పరివర్తింపచేసిన అధిదేవతగా సరస్వతికి ప్రతిరూపం అని చూసాం గదా। ఇప్పుడు "ఇడా" స్థితిలో మానవరూపధారణ కనుకనే విద్వాంస మానవ వాక్సంజాతగా "మానవి" అయ్యింది. వసుచరిత్రలో రామరాజభూషణుడు చక్కగా వినియోగించుకున్నాడు.

ఉ. జీవనమెల్ల సత్కవి ని-షేవిత మాశయమెల్ల నచ్ఛతా
పావన తా గభీరతల-పట్టు ప్రచారములెల్ల విశ్వధా
త్రీవలయత్రికాల ఫల-దేశికముల్ నవకంబు లెల్ల ము
క్తావళి విభ్రమాస్పదము-లానది పెంపునుతింప శక్యమే. 2-105.

ఆ నది అంటూనే మానవ వనితగా రూపొందించి కథ నడిపించాడు. తన శ్లేష సామర్థ్యాన్ని వైదికార్థ వినియోగంగానే ప్రయోగించుకున్నాడు. ఎంత అదృష్టవంతుడో. ఆమె "కులములోఁబెద్దయు నమూల్య-గుణమణిప్రకాండ పరిపూర్ణయును" అని వర్ణించటంకూడా వైదిక "ఇడా" వాగ్విశేషానుసరణమె. చూడండి. "ఇడా ఏషాం గణ్యా మాహినా గీః॥ ఋ. 3-7-5. దానికి సా. భా. ఏషామ్-మనుష్యాణా మగ్నివిషయా, మహినా-మహతీ, ఇడా-గీః-స్తుతిరూపా వాక్, గణ్యా-గణనీయా, పూజ్యా। కర్మానుష్ఠాన సమయమున నగ్ని నుద్దేశించిన వాక్కు "ఇడా" అని యిట నిర్దేశింపబడినది. సర్వదేవతలను ఆహ్వానించుట కుపయుక్తమగుటచే వేదవాణికి ఇడా (ఈడ్యతే-స్తూయతే అనయా) యని సార్థకనామము." భా. ని. 547. ఇందులో "గణనీయా." అన్నదే వివరణలో పైపద్యరూపం దాల్చింది. శుక్తిమతికి సాటి అయిన ఈ వాక్కు కథేమిటి? ఆమె స్వయంగా అన్నమాటలు చూడండి.

"అహమేవ స్వయం ఇదం వదామి జుష్టం దేవేభి రుత మానుషేభిః।
యంకామయే తం తముగ్రం కృణోమి, తంబ్రహ్మాణం, తంఋషిమ్

తం సుమేధామ్" "ఇంద్రాది దేవతలకును మనుష్యులెల్లరకును నారాధనీయమగు నీబ్రహ్మతత్త్వమును నేనె స్వయముగ నుపదేశించుచున్నాను. ఎవడు నా యనుగ్రహపాత్రు డగునో యాతనిని మేధావంతునిజేసి సర్వోన్నతుని గావింతును. క్రాంతదర్శనముగల ఋషి నొనర్తును బ్రహ్మనొనర్తును. అనియర్థము" భా. ని. 543. ఈ అర్థం ఇడా ప్రతిరూప శుక్తిమతికేకాక "వాణిఁదాల్చు సుకవిస్తోమంబు"లో ముఖ్యపాత్ర అయిన మంజువాణికీ వసుచరిత్రలో చెల్లుబాటౌంది. ఇక్కడ బ్రహ్మ ప్రసక్తి ఉండటం గుర్తించాలి. ఆ పైని ఇలా చూడండి. "స్తుతామయా వరదా వేదమాతా ప్రచోదయన్తాం పావమానీ ద్విజానామ్। ఆయుః ప్రాణం ప్రజాం పశుం కీర్తిం ద్రవిణం బ్రహ్మవర్చసం మహ్యందత్త్వావ్రజత బ్రహ్మలోకమ్" (అ. సం. 19-71-1) వేదాధ్యయన పరునిచే నధ్యయనము చేయబడెడి లేక గాయత్రీ జప

పరాయణునిచే స్తుతింపబడెడి వేదమాత యిట "పావనీ" యని కీర్తింపబడినది. పరాదేవతయగు సావిత్రియొక్క యనుగ్రహముచే బ్రహ్మలోకము నొందుము. బ్రహ్మలోకమనగా సత్యలోకము. విద్వాంసులగు కవులచే ననుభూత మగుచుండు బ్రహ్మ అనెడి పరతత్త్వమే బ్రహ్మ లోకము. అట్టి వేదప్రతిపాద్యము, వాఙ్మనసాతీతమునగు బ్రహ్మభావము నొందుము. అని యర్థము (భా. ని. 553) ఈ బ్రహ్మలోక దర్శనము శుక్తిమతీ కోలాహలులందు ప్రకటితంచేసాడు తన ప్రబంధంలో భూషణకవి. శుక్తిమతి వెళ్ళి వచ్చేస్తుంటేనూ కోలాహలుడటు వెడుతుంటేనే ఎదురుబదురై ఒకర్నొకరు చూసుకోటంతో ప్రణయం అంకురించిందిగా కల్పించాడు. తర్వాత వెళ్ళి కోలాహలు డామెని ప్రార్థేయపడ్డాడు. ఆమె చేజిక్కింది. ఇదేమైనా వాక్స్థితిలోఉందా అంటే: నిజంగా ఉంది. చూడండి:

"యదేషాం శ్రేష్ఠం య దరిప్ర మాసీత్ ప్రేణా తదేషాం నిహితం నిహితం గుహావిః" (ఋ. 10-71-11) దానికి. సా. భా. "ఏషాం, శ్రేష్ఠమ్-ప్రశస్యతమమ్, యత్-యచ్చ, అరిప్రం-పాపరహితమ్: వేదార్థజ్ఞానమ్, గుహా-గుహాయామ్, నిహితమ్-గోప్యమ్, తత్, ప్రేణా-ప్రేష్ణా ఉఉవిర్భవతి: వేదాభ్యాసకాలే సరస్వతీ స్వార్థమేభ్యః ప్రకాశయ తీత్యర్థః" వేదాభ్యాసకాలంలో పాపరహితం అయిన వేదార్థజ్ఞానాన్ని, గోప్యంగా ఉన్నదాన్ని శ్రేష్ఠురాలైన సరస్వతి తానే తెలిసేట్టు చేస్తుందిట. అది ఎలాగంటె "ఉతోత్వస్మై తన్వం విససేృ జాయేవ పత్య ఉశతీ సువాసాః" (ఋ. 10-71-4) దీనికి నిరుక్తి వివరణం "జాయేవ పత్యే కామయమానా సువాసాః। కామయమానా ఋతు కాలేషు। యథాస ఏనాం పశ్యతి సశృణో తీత్యర్థ ప్రశంసా." పతికి ఇష్టమైన ఋతుసమయంలో శోభన వస్త్రాలంకృత (గృహకృత్యాల్లో మామూలుగా కట్టుకుంటూండే మకిలి బట్టలు వదలివచ్చిన ఇల్లాలు) కి మళ్ళే "అప్యేకస్మై తన్వం విససేృ ఇతి-స్వం-ఆత్మానం వివృణతే" స్వీయ వివరముల వెలువరించుకొనును. శుక్తిమతి కోలాహలుడిచే ఎంతగానో బ్రతిమాలించుకొని కడకాతడు చేచాచి పట్టుకోగా ఇలాగే తనను తానర్పించుకొందిగదా: ఇంకొక్కటి పరిశీలించాలి. చూడండి:

"పావకాః సరస్వతీ వాజేభిర్వాజినీ వతీ। యజ్ఞం వష్టు ధియావసుః." పావయతి—శోధయతి ఇతి—పావకః। మనో మాలిన్యాన్ని శోధించి స్వచ్ఛమైందిగా

చేస్తుంది గనక సరస్వతి "పావక" అనిపించుకుంటుందిట. ఆ తరువాత బుద్ధిని ఆవేశించి ఉంది "ధియావసుః" ఔతుందిట. "ధియావసుః — బుద్ధ్యా సర్వానాచ్ఛాదయన్తి బుద్ధి ప్రదేత్యర్థః" అని. సా. భా. కథలో శుక్తిమతి కోలాహలుడ్ని ఎన్నివిధాల శోధించిందో! సన్మానం ముగించి కబుర్లలో పెడుతూ

చ. విలసిత రత్నకూటములు-వేలుపు కన్నెల కూటము లున్దా
.... .... .... .... .... ....ముజ్జగంబులన్. 2-123

కం. .... .... .... .... ....మీర లిచటి-కేతెంచుట యో
శీతాద్రి తనయ మదుపరి, జాతాభినవానురాగ-సంపత్తిఁగదా. 124

సీ. విలువెల్ల నీచాతి-నీచోపసరణంబు....
... .... ....

తే.గీ. .... .... .... .... ....
ఇట్టి మాటోంట్లతోఁ జెల్మి-యెట్లుపొసఁగు. 132
.... .... ....

కం. .... .... ....
... పొడవడరు మీయెడ, నెడపక మారసము లెచటి-కెక్కు-మహాత్మా 133

చం. .... .... ....
(మీ) కులగిరి కోటిలోఁగడు ల-ఘుత్వముగాదె తలంచి చూడుమా! 135

మ. మతిఁ గ్రీడారతి గగ్గెనేని....నీకుఁ గలవే తారుణ్యలావణ్య జృంభిత రంభాది నిలింపభామలు. 136

ఎక్కడా కోలాహలుడ్ని తిరస్కరించలేదు. ఏ యే లోపాలకు వరులు విముఖులయి పోతారో అందులో యేవి తనలో ఉన్నాయో ఏకరువుపెట్టి అన్నింటికీ అతన్ని ఒడబరచుకొంది. అంటే అతడే లోపాన్నీ లెక్కచెయ్యనంతగా అతని మనసు కెక్కింది. అలా "ధియావసు" నామానికి అర్హురాలయ్యింది. "కన్నెల కూటముల్" నుంచి "క్రీడారతి" అంటూ చివరివరకూ సంగమేచ్ఛా భావ పరిపూర్ణంచేసి ఇతర భావాలన్నింటినిపారద్రోలి భావశుద్ధి కలిగించి "పావకా" నామానికీ అర్హురాలయ్యింది. ఈ రెండూ మనస్సంబంధం అయినవే కనుక "ధియావసు" వైనట్లు సహృదయుల

చేత గుర్తింపచెయ్యాలి. బలంగా హృదయంలో నాటుకునేటట్లు చెయ్యాలి. అని శబ్ద సాన్నిహిత్యం గణించి చివరి "వసు" మాటనైన అవసరం ఉన్నా లేకపోయినా రెట్టించి చాటిస్తే ఆ అసందర్భాన్నిబట్టి అయినా సహృదయుల యోచనలో పడి ధియావసుత్వాన్ని గుర్తిస్తారనే వసురాజు రక్షణకోరుతున్నట్లు శుక్తిమతిచేత ఎలుగెత్తి మొఱపెట్టించాడు రామరాజభూషణుడు. నిజానికి వస్తే అటువంటి ఒక వరుడి చేతిలోబడిన ఏ వనిత (వధువు) గాని అన్యపురుషుని పేరున బిలచుటయా! చాలా అసందర్భం. దాన్ని మధించుకుంటే ఇది ఆమె ప్రతీకగా నిల్చిన సరస్వతి (ఇడా-పరా-భావ) "ధియావసు" పరిణతిని గుర్తింప చెయ్యటానికి ఎన్నుకున్న వ్యాజ మనిపిస్తుంది. చూడిండి.

ఉ. "ఓ వసుధా మహేంద్ర కరుణో దధి యీ తడవేల ప్రోవ రా
వే వసుభూప యంచు నెలుఁగెత్తి వెసన్ మొఱపెట్టు చాడ్పునన్."

ఈ తడవేల అనటానికి అంతకు ముందేమైనా ఆ రాజును కాపలాకి పిలుచుకుని ఆకట్టుకుందా! కనీసం ఒకసారి ఆ రాజుమాట తలంచి కోలాహలుడ్ని భయపెట్టనైనాలేదే. లేకపోతే చాటుగా ఎవరిచేతనైనా కబురుపెట్టిందా! ఏమీలేదు. ఓ వసుధామహేంద్ర....రావే వసుభూప : అనే సమాసాల సార్థకత ఏమీలేదు. భూమి మీద (భోగపరాయణుడైన) ఇంద్రా అంటే స్వారస్యం ఏమిటి? తరువాత "వసు భూప" వట్టి భూపాలుడే లేదా నామమాత్రంగా రాజే. కాగా రెండింటిల్లోనూకూడా "వసు" శబ్దానికి బలమైన పలుకుబడి వస్తుంది. రెండింటిల్లోనూకూడా మూడో అక్షరం వర్గ యుక్కు గావటంతో ఒత్తటం కోసం "వసు" తర్వాత ఎడంవచ్చి ఆ రెండక్షరాలూ రెండుచోట్లా సహృదయుల గుండెల్లో నాటుకుంటాయి. ఇడా వాక్ ప్రబోధానికి విచికిత్సా ఏర్పడుతుంది. ప్రబోధమూ జరుగుతుంది. స్వయం వ్యక్తమయ్యే ఆ వాక్కు మనసుల్నాక్రమించేది కావద్దా అనిపించగానే "ధియావసు" గుర్తుకు వస్తుంది. ఈ అనౌచిత్యం ఆ సాధనకోసం తెచ్చిపెట్టుకోవలసి వచ్చింది. ఆసాధన లేకపోతే తానుద్దేశించిన పాత్రగా శుక్తిమతి వాక్ప్రతీక కాకపోవలసివస్తుంది. ఆ ప్రత్యవాయాన్ని రామరాజభూషణుడు చాలా తెలివిగా రెండక్షరాల మంత్రంతో నివారించగలిగాడు. ఆంధ్రులు గర్వించతగ్గ సాహిత్య నిర్మాత శారదామూర్తి కవి.

పరావాక్కుకి "పశ్చాత్ పశ్యన్తీ" వెనుకగా పశ్యన్తీవాక్ స్థానంట. అది మూడవదైన మణిపూరక చక్రమే. వాగ్బీజము "పరాయా మంకురీభూయ" పరా

వాక్కున అంకురించి ఈ పశ్యన్తిలో "పశ్యన్త్యాం ద్విదళీకృతా" కాండాన్ని రెండు ప్రక్కలా రెండు బద్దలై పొదివిపట్టుకొని పోషకభారం వహించటం జరుగుతుంది. భరించటంచేత భర్త అనటం కుదురుతుంది. అంటే పశ్యన్తీ వ్యాపారమే కోలాహలుడు పరావ్యాపారవర్తి శుక్తిమతియెడ ఆచరించిన చర్య. సమర్ధనీయం అని తెలుస్తుంది. ఇప్పుడు మణిపూరక చక్రావర్ణన పరికించండి.

> తస్యోర్ధ్వే నాభిమూలే దశదళసితే పూర్ణమేఘప్రకాశే
> నీలాంభోజ ప్రకాశై రుపహిత జఠరే డాదిఫాంతైః సచంద్రైః
> ధ్యాయే ద్వైశ్వానరస్థారుణ మిహిరసమం మండలం తత్త్రికోణమ్
> తద్బాహ్యే స్వస్తికాఖ్యైస్త్రిభి రభిలషితం తత్ర వహ్నే స్వబీజమ్.
>
> (షట్చక్రనిరూపణమ్)

ఇందులో చక్రఆకారం త్రికోణాన్నిబట్టి పర్వతాకారం గ్రహింపవచ్చు. పూర్ణ మేఘ ప్రకాశంతో చంద్ర (కాంతశిలా) యుతమై ఉండటమేకాక కేంద్రంలో అగ్నిబీజాన్ని కలిగిఉన్న దన్నంతవరకు మనకు చాలు. ఆ బీజాక్షరదైవం అయిన అగ్ని స్వరూప వర్ణన చూడండి:

> చత్వారి శృంగా త్రయో అస్యపాదా। ద్వేశీర్షే సప్తహస్తా సో అస్య।
> త్రిధాబద్ధో వృషభో రోరవీతి। మహాదేవో మర్త్యాగ్ ఆవివేశ ॥
>
> ఋ. 5-58-3.

శృంగాదిగా పర్వతమూ వృషభాదిగా (శ్రోత్రం) దేహధారణమూ రంకె వెయ్యటం కోలాహల ధ్వనిగా ప్రతిరూపం కోలాహలుడిలో నిలిపాడు రామరాజభూషణుడు. 2వ ఆ. 108వ సీస పద్యం "సుమనోధివాస భాసుర శిఖోన్నతివాఁడు... కోలాహలాఖ్యుఁడొక ధరాధీశుఁడెదురయ్యె నవిదకపుడు." అని "మర్త్యాగ్ ఆవివేశ" మనుపుత్రి ఇడా-వాక్ ప్రతిరూప శుక్తిమతిని ఆకర్షించుకోటంగా గ్రహిస్తే కోలాహలుడు అగ్ని ప్రతిరూపుడే ఔతాడు వసుచరిత్రలో. 140 వచనంలో "...గుట్టునం బట్టరాని తమకంబు...అంపసెల కట్టియల బెట్టునం... నిట్టూరుపు పొగలు నిగుడు సొగసునం దగులు మొగులు తెగల... రాకరాకలం బైకొను కోకారి సెకసోకులం బ్రాకిన... మెఱయు సరయ చంక్రమణ చందుపలఫలక మిళదలఘు ఘుమఘుమారృటి..." అంతా పర్వతాకారంలో అగ్ని చెలరేగిన కోలాహలమే.

"ఈ చత్వారి శృంగా" అన్న మంత్రంలోనూ "మర్త్యాగ్ఆవివేశ" అనీ, అలాగే చత్వారి "వాక్పరిమితాపదాని" అన్న మంత్రంలోనూ "మనుష్యావదన్తి" అనీ మానవ ప్రశంస ఉండటం గమనింపదగింది. పైది కోలాహల పర్వతాన్ని మనుష్యరూపుడిగా దిద్దటానికీ క్రిందిది శుక్తిమతీ నదిని మనుష్యరూపిణిగా రూపొందించటానికీ ప్రేరణకలిగించే అవకాశం ఉంది. కాగా అగ్ని భరతుడుగా ఇడా వాక్ భారతి భార్యాభర్తలనిపించటమూ ఉంది. చూడండి.

"తస్మా అగ్నిర్భారతః శర్మ యం సత్" ఋ. 4-25-4.
"భారతః — హవిషో భర్తా — అగ్నిః" సాయణభాష్యం.
"అగ్నిర్వైభరతః సవై దేవేభ్యో హవ్యం భరతి" కౌ. బ్రా. 3-2.

"కర్మానుష్ఠాన సమయమున నగ్ని హవ్యవాహనుడు లేక హవిర్భర్తయగుచు భరతుడగుచున్నాడు. ఆ అగ్నియొక్క దీప్తి తదనుగతమై ఇడారూపమున నుండెడి వాక్కు భారతి అగుచున్నది." (భా. వి. 665) ఈ భారత-భారతీ సంఘటితమైన సమావేశాన్నే శుక్తిమతీ కోలాహల ప్రణయ పరిణామంగా రూపొందింప గలగటం-అందులోనూ ఎక్కడా వైదికభావాన్ని చెడనీయకుండా సమర్థించుకురావటం అసామాన్యం.

ఇంకొక్క విషయం. మనం మొదటి మూలాధార చక్రాన్ని ప్రస్తావించుకొని ఆ వెంట మూడవదైన మణిపూరకాన్ని అందుకున్నాం. ఆ నడుమ స్వాధిష్ఠానం అని మరో చక్రం ఉంది. ఆ పేరు తలవటంతోటే మనకి "అధిష్ఠానపురం", దాన్ని రాజధానిగా చేదిదేశాన్ని వసురాజు ఏలుకోటం గుర్తురాకుండా ఉండవు. ఈ స్వాధిష్ఠానం అటు మూలాధారంనుండి మణిపూరకాన్ని వేరుచేయటం అనేదే అధిష్ఠానపురాధిపతి కోలాహలుడిని గోట నెగమీటటంగా కథలో కనువదింపబడింది. డా. వి. వి. ఎల్. నరసింహారావుగారు "వసుచరిత్ర తత్త్వము" అనే వ్యాసంలో ప్రకటించిన సత్యం గమనించండి. "చేది దేశమునకు రాజధాని యేదో వ్యాసుడు చెప్పలేదు. నన్నయ్యకూడా చెప్పలేదు. కాని రామరాజభూషణుడు చేది దేశాధిపతికి అధిష్ఠానము ముఖ్యపట్టణమని చెప్పెను. అమూలకమైన ఈ అధిష్ఠానము భూషణకవి స్వతంత్ర సృష్టి" అన్నారు. మనం చెప్పుకున్న పై అన్వయం కుదరటానికే ఆ శారదామూర్తి కవి ఈ నామకరణం చేసాడంటే ఆ జాగ్రతకు జోహారులనక తప్పదు. ఇలా

వసుచరిత్రలో శుక్తిమతీ కోలాహల పరిణయగాథ వాగ్విశేష పరమైన వాణీవిలాస ప్రబంధానికి ప్రథమాధ్యాయంగా వెలయింపచేసి రామరాజభూషణుడు సహృదయ మనోభూషణమై ఉన్నాడు.

మూలాధారాన్నించి మణిపూరాన్ని వేరుచేయటంగా స్వాధిష్ఠానం ఉండి ఆ వేరుచేసే చర్యకి వసురాజు కోలాహలాన్ని గోట నెగమీటటం కార్యప్రతిరూపంగా గ్రహించాంగదా: ఆ స్వాధిష్ఠానపతి వసురాజుగా రూపొందింపబడ్డాడన్నమాట. ఇప్పుడా వసురాజు తపస్సుచేసినట్లు సూటిగాఉన్న భారతవచనాన్ని రామరాజభూషణు డెలా తోసిరాజనగలిగాడన్నది పరిశీలించాలి.

"భవేన్మూలాధారం తదుపరితలం చక్రమపి, తద్వయం తామిస్రాఖ్యం శిఖి కిరణ సమ్మేళనవశాత్. పరిత్యాజ్య ముభయమ్" "ఆధారస్వాధిష్ఠాన చక్రములు తామిస్రలోకములు. అవి ఉపాసింప తగవు." అని పెద్దలంటారు. "మణిపూరక చక్రాది సహస్రకమలమువరకు పూజింపదగినవి. ఈ వివరమునే కాళిదాస మహాకవి సకల జననీస్తోత్రమున వ్రాసెను.

> "చతుష్పత్రాంతః షట్దళపుట భగాంత స్త్రివలయ
> స్ఫురద్విద్యు ద్వహ్ని ద్యుమణి నియుతాభద్యుతిలతే ।
> షడశ్రిం భిత్వాఽఽదౌ దశదళ మథ ద్వాదశదళమ్
> కళాశ్రించ ద్వ్యశ్రిం గతవతి నమస్తే గిరిసుతే.॥"
>
> (శ్రీచక్రవిలసనము. 119వ పుట)

స్వాధిష్ఠానం ఇలా ఉపాసనకు తగదని సహృదయులు గుర్తించటానికే సూచనగా వసురాజు తపస్సుచేసినట్లు భారతంలో ఉన్నదాన్ని శుభమూర్తి కవి పరిహరించాడు.

ఇంకోటి ఏమిటంటే పరాది వాక్చతుష్టయంలో రెండోది. అయిన పశ్యంతికి స్వాధిష్ఠానం స్థానం అని కొన్ని తంత్రగ్రంథాలు చెప్తున్నాయి. "నిత్యతంత్ర వాక్యానుసారముగ మూలాధారమున వాయువుచే జనించిన శబ్దమును భావ యనియు నందురు. ఆ వాయువు స్వాధిష్ఠానమును జేర పశ్యంతి స్థితి శబ్దమునకు గలుగును" (సర్వసిద్ధాంత సౌరభము 10 ద్వి. భా. 306వ పుట) కాని "అథ తదేవ నాభి పర్యన్త మాగచ్ఛతా తేన పవనేన అభివ్యక్తం విమర్శరూపేణ మనసాయుక్తం సామాన్య

స్పంద పరికాశరూప కార్యబిందుమయం పశ్యంతీ వాగుచ్యతే" (218వ పుట) "పిదప అదియే ఆ శబ్దబ్రహ్మమే నాభివరకువచ్చి ఆ వాయువుచే స్పష్టమై (ప్రత్యక్షమై) విమర్శరూపమైన మనస్సుతోఁ గూడినదై సామాన్యమైన కదలికను ప్రకాశింపఁజేయు కార్యబిందురూపమైనదై పశ్యంతీవాక్కనఁబడుచున్నది." (శ్రీ లలితా సహస్రనామ భాష్యమ్ పుట 220) అన్న వివరంలో గాలి నాభివరకువస్తే అక్కడిది మణిపూరకమేగాని స్వాధిష్ఠానంగాదు. ఈ విషయం స్పష్టంచేస్తూ వెనుకటి భేదాభిప్రాయాన్ని నిరసించటాన్ని ప్రతిబింబింప చెయ్యటానికే అధిష్ఠానేశ్వరుని తపోవ్యాపారం భారతంలో వాచ్యంగా నిర్వహించుకు వస్తున్నాడా శారదామూర్తి కవి.

సరే తామిస్రలోకం కనుక స్వాధిష్ఠానం ఉపాసింపబడదు. అయితే మరి "తదంతర్వరుణం బీజమ్ శ్వేతం మకరవాహనమ్"గా చెప్పబడే తదధిపతి వరుణుని మాటేమిటి? ఉపాసించాలా వద్దా అని సందేహం. ఆ మాటే సాయం సంధ్యోపాసనలో చెప్పుకొని వరుణదేవుని రక్షింప వేడుకొంటాం. చూడండి. "ఇమం మేవరుణః....యత్కించేదం వరుణదైవ్యే జనేఽభిద్రోహం మనుష్యాశ్చరామసి.... అథాతే స్యామ వరుణప్రియాసః" అన్న మంత్రంలో "యత్కించేదం" అన్న వాచిక ప్రతిపదార్థరూపంగా "వేదార్థోపన్యాములు"లో శ్రీ రేమెళ్ళ సూర్యప్రకాశశాస్త్రిగారిలా అన్నారు.

"హేవరుణః, దైవ్యేజనే—ద్యులోకసంబంధమైనటువంటి జనే; త్వయి—నీయందు, యత్కించ—ఏ కొంచమైనా మేము; అభిద్రోహం—నిన్ను అభిలక్ష్య ద్రోహ మనేటటువంటిదానిని - ఏమిటా ద్రోహమంటే "తదీయ వ్రత అనుష్ఠాన మిత్యర్థః" నీ సంబంధమైనటువంటి కర్మను అనుష్ఠానము చేయకపోవుట అనేటటువంటిదాన్ని ఆ ద్రోహాన్ని; మనుష్యులమైన; చరామసి—మే మెటువంటివాళ్ళమై సంచరిస్తున్నామో - మేము నీ సంబంధమైనటువంటి మంత్రమునుకూడా చెప్పటానికి కూడా నోచుకోకుండా ఉన్నామే: అటువంటిదానిని దానినిగురించి మేము తర్కిస్తూ ఉన్నామే: దానినంతనూకూడా అనుగ్రహించవలసింది. అని ప్రార్థన చేస్తున్నాను నిన్ను. బుధ్యస్వ—ఇక్కడే తెలుసుకోవలసిందీ అని" (పుట 400).

ఇంతా ప్రార్థించటం దేనికోసం అంటే "సర్వాతావిష్య ఋధిరేవదేవాః" అటువంటి మేము చేయనీయండి మా యజ్ఞంలో నా స్థానంలో ఉన్నటువంటి ఋత్విక్

కున్నాలు వాళ్ళైనా ధూర్తతచేత: వారేదైనా వైగుణ్యాన్ని సంపాదింప చెయ్య వీయండి, నీ సంబంధ మైనటువంటి ఏ ద్రోహాన్ని మేము చేసామో దానిని కాని, చేసినదాంట్లో వైగుణ్యంకాని; దీనినుండి ఏ పాపమైతే జనించిందో ఆ పాపమునుండి నన్ను రక్షించవలసింది.

"సర్వాణి తాని విష్య—విశేషేణ శిధిలయ-హేదేవా!

"నీవు వదులుముడి వేస్తే వచ్చేసేటట్టుగా నేను ఎన్నెన్నో పాపాలుచేసాను కాని ఆ పాపములనుండి నన్ను వదులుముడినుండి గమ్మున ముడివచ్చేసినట్లుగా ఇలాగు విదిలిస్తే వదలిపోయినట్లుగా నన్ను ఆ పాపాలనుంచి అల్లా విముక్తుడ్ని చెయ్య వలసింది."

"శిధిరేవ—అని అలా వదులుముడినుండి విడువబట్టినట్లుగా" (పుట 402)

"అథాతేస్యామ వరుణ ప్రియాసః-

"అథ—పాపవిమోచ నానంతరం హే వరుణా!, తే—తవ; ప్రియాసః—ప్రియా భవేమ.

"పాపవిమోచనానంతరం నీకు చాలా ప్రియులమే అవుతాం. నీకు చాలా ఇష్టులమే అవుతాం. నీవు మావాడని దగ్గర తీసుకుంటావు నీవు. అస్మదీయః ఇతి బుద్ధిః ఉదేతి—నా తాలూకు వాడనేటటువంటి బుద్ధి అప్పుడు నీకు ఉదయిస్తుంది. కనుక." (పుట 404 & 405). మొత్తంమీద వదులుగానో బిగువుగానో ఆ వరుణపాశ బంధం పడక మానదన్నమాటె. కాస్త వదులుముడి వెయ్యవయ్యా తేలికలో తప్పించు కుంటామని మాత్రం ఆయన్ని వేడుకుంటున్నాం అన్నమాట.

మన ప్రబంధం వసుచరిత్రలో (పరా) ఇడా వాక్కు అనబడే శుక్తిమతి పశ్యన్తి అనబడే కోలాహల ప్రవర్తనకు ఒడబడినప్పుడు మధ్యలో స్వాధిష్ఠానాధిపు డనబడే వసురాజు తన రాజ్యం పౌరధర్మసూత్రాలనబడే బంధనాలను సడలించమనీ అలా సడలిస్తే తాను తప్పుకుపోయి పశ్యంతిగా (పరారూపంగన్న) మొలకెత్తిన విత్తనం రెండు బద్దలై యిరువంకలా ధరిస్తూ మొలకను సాగనిస్తానని చేసిన ప్రార్థనగానే రామరాజభూషణుడు "ఓ వసుధా మహేంద్ర...." అని శుక్తిమతి ఎలుగెత్తి మొఱపెట్టినట్లున్నదని వైదిక వరుణస్తుతి చేయించటం సమంజసంగా ఉంది. చూడండి:

"ఇమం మేవరుణః శ్రుధీహవ మద్యాచ మృడయ

"హేవరుణ!, మే—మదీయ మైనటువంటి; ఇమం—దీనిని; హవం—ఆహ్వానమును; శ్రుధీ—శ్రుణు—వినవలసింది నీవు; అంటే వింటానుకానీ ఎప్పుడో! నా పిటిషనుకి ఎప్పుడని? ఏమో ఎప్పుడో! అలాకాదు

"అద్యాచమృడయ—ఇప్పుడే రక్షించాలి నీవు" (పుట 397)

పద్యంలో "ఈ తడవేల ప్రోవరావె" అన్నది కథతో అంత ఉచితంగా లేదనుకున్నాం. కానీ అది "అద్యాచ మృడయ" అన్న మంత్రభాగానికి ప్రతిరూపం. ఆ పద్యవాక్యం ఒకవంక ఇడావాక్కు—ధియావసు పరిణతిని గుర్తింపజేస్తూంది. రెండోవంక స్వాధిష్ఠానాధిప-వరుణుని-పాశం సడలించమంటూన్న సాయంసంధ్యావిహిత ప్రార్థనని అనువదించింది. మరోవంక నదిగా "యాసాన్ రాజావరుణః" అంటే "యాసాం—అపాం; వరుణో రాజా—ఉదకములన్నింటికి కూడానున్న రాజుగా వుండేవాడు వరుణుడు." కనుక శుక్తిమతి కోలాహలా క్రమణంతో ఆ వరుణరాజుకు చేపడకున్న దోష నివృత్తికి వినతి ఒనర్చినట్లుగాకూడా ఎంతో సమర్థనీయం అయింది. ఎంత వైదికనిష్ఠ!

ఏ ఆర్భాటమూ లేకుండా ఉన్నపళంగా అవసరకార్యాన్ని సాధింపగలిగితే దాన్ని గోటమీటటంగా చెప్తూంటారు. "అద్యాచ" ఇప్పటికిప్పుడే కాపాడమని వేడుకున్నంతసేపైనా పట్టకుండా పరావాక్కి అవాంతరం కలక్కుండా వదలిన స్వాధిష్ఠానాధిప వరుణ సద్యశ్చర్యను ప్రతిబింబింపచేస్తూ వసురాట్చర్యలో "అనంతవేగ భుజగాంతకుండ మ్మహికాంతుండాశ్రిత....నఖంబునమీటె....దుందుభికబంధము మీటిన రాముకైవడిన్." అని రామరాజభూషణు డనువదించటం సమంజసంగా ఉంది.

మూలాధారానికి భూమీ అలాగే ఇంద్రుడూ అధిష్ఠాన దేవతలు. అక్కడే పరావాగ్బీజం మొలకెత్తుతుంది. మణిపూరానికి అగ్ని అధిష్ఠానదైవం. అక్కడ పశ్యన్తీ వాగ్బీజం ద్విదళవికాసం పొందుతుంది. అయితే మధ్య యీ స్వాధిష్ఠాన అధిష్ఠానదైవం వరుణుని ప్రమేయం ఏమిటి? అంటే "హిరణ్యవర్ణాః శుచయః పావకాః యాసుజాతః కశ్యపోయాస్విన్ద్రః, అగ్నిం యాగర్భందధిరే విరూపా స్తాన ఆపశగ్గ్ స్యోనాభవన్తు." ఉదకములు ఎలాంటివీ అంటే: హిరణ్యవర్ణాః—సువర్ణ

సదృశములైన ఉదకములు పగటికాలంలో, శుచయః—స్వతస్సిద్ధంగా పవిత్రములై నటువంటివి; పావకాః—శోషయిత్ర్యః—అపవిత్రమైనటువంటి వాటి నన్నిటినీ పవిత్రింపచేసేవి; యాసు—అప్సు—ఏ ఉదకముల యందు, కశ్యపః—కశ్యపః పశ్యకోభవతి యస్సర్వం పరిపశ్యతీతి సౌంజ్ఞాత్: అంటే మనం చేసేటటువంటి తప్పు ఒప్పు అన్నింటినీ చూస్తున్నటువంటి ఏ పరమేశ్వరుడు కలడో ఆయన ఉదకములయందు, జాతః—ఉత్పన్నమైనవాడు. యాసు + ఇన్ద్రః—ఇంద్రుడుకూడా ఉదకములయందే, ఉదకములే కారణముగా కలవాడు. అగ్నిం యాగర్భం దధిరే—యాః—అపః—అగ్నిం గర్భత్వేన, దధిరే—ధారితవ్యః—ధరించి ఉన్నాయో, విరూపాః—నానారూపాః; అటువంటి, ఆపః—ఉదకములు, నః—అస్మాకం; శంస్యోనాభవస్తు—సుఖకారిణ్యః—సుఖమును కలిగించేవి అయి ఆముష్మికసుఖమును కూడా కలిగించేవి అయి, బోగాక : లేదా శం—దుఃఖమును, ఉపశమయస్తు—శమింపజేయుగాక : సుఖమును మాత్రమే కలిగించేవే అగుగాక : (ఈ ప్రతిపదార్ధ ప్రసంగం వేదార్థోపన్యాసాల్లోదే)

దీన్నిబట్టి మూలాధార ఇంద్రుడూ మణిపూరక వహ్నీ ఈ స్వాధిష్ఠాన వరుణుని సంబంధం కలవారే అనేది స్పష్టం అయిందికదా : మద్యవర్తిగా స్వాధిష్ఠానాధిప ప్రతిరూపం అయిన వసురాజు మర్త్యుడుగా ఉండటమూ ఆయన భూపరిపాలనలో సమర్థుడై ఇంద్రమైత్రికర్తృత్వం దవ్వటంగా మలచిన రామరాజభూషణుని వైదిక పరిజ్ఞానానికి నిదర్శనం అనటంకాదు. ఆ పరిజ్ఞానాన్ని కావ్యం (కాంతాసమ్మితతయోపదేశయుజ మనోహరం) చేసి అందించిన వాత్సల్యానికి కృతజ్ఞులమై ఆ శారదా మూర్తిని మరువకూడదన్న బాధ్యతను మనం గుర్తించాలి.

ఇంక ఇంద్రుడు స్వర్గాన్నించి భూమికి దిగిరావటం ఏమిటి? అంటే ఆయన మూలాధారాధిష్ఠుడుగదా : మూలాధారానికి భూమితోపాటు ఇంద్రుడూ అధిష్ఠాన దేవతే అని చెప్పుకున్నాం. కనుక ఆ త్రైలోక్యాధిపతి భూతల వ్యవహారాన్నీ పర్యవేక్షించుకోవలసిఉంది. అందుకని ఇలా వస్తూఉంటాడనటం అనౌచిత్యం ఏమీకాదు. తనంత చక్కగా ఇక్కడి వ్యవహారాల్ని చక్కదిద్దుతున్న వసురాజుని మెచ్చి తనంతవాడుగా పరిగణించి మైత్రి వహించటమూ సముచితమే అందుకాయన విమానంమీద తిరుగుతున్నట్లు "ధియోరథేష్ఠా మజరం నవీయో. (ఋ. 6-21-1)

హేఇన్ద్ర! త్వాం హవంతే హ్వయంతి: కీదృశమ్? రథేస్థామ్—రథేస్థితమ్, అజరం—జరారహితమ్, నవీయః—నవీయాంసం—నవతరమ్." పా. భా. ఓ మహేంద్రా! నీవు హవనానికి ఆహ్వానింపబడుతున్నావు. ఏరకంగా అంటే రథం మీద ఉండేవాడుగా (జరా) ముసలితనం అనేది లేనివాడుగా అంటే నిత్యయౌవను డుగా పిలవబడుతున్నావు. అని. భూ ఆధిష్ఠానదేవతగా ఉండి ఇంద్రియజయం పొందిన ఇంద్రుడా స్వర్గాధిపత్యాన్ని చేపడుతూ పైకి ఎగరటానికి వేదవాక్కును రథంగా చేసుకుని సాటివారి మైత్రి నభిలషిస్తూంటాడాయన. ఆ అధిరోహణ క్రమంలో ఆ యా స్థానీయుల మైత్రితో తానే వారనిపించేటట్లూ వారంతా తనవారే నన్నట్లూ వివిధరూపాలూ సామర్థ్యంతో వహిస్తూ ఉంటాడు. వసురాజుని "నీవు నేనని సఖిత్వము మీఱఁగ నీ కొసంగతిన్" (5.104) అన్నా "ఇమ్మనివేద వేఱొకఁ డనే భవదీయ జనుండఁగానె" అని (5-29) ఇంద్రుడ్ని కోలాహలుఁడన్నా సంగతి అదే. చూడండి. "ఋగ్వేదముయొక్క మొదటి మండలమునందలి ఇంద్ర మరు త్సంవాదమున స్పష్టముగా గాంచనగును. "బ్రహ్మాణి మేమతయః శంసుతాసః శుష్మఇయర్తి ప్రభృతో మేఅద్రిః। ఆశాసతే ప్రతి హర్యన్త్యుక్థేమా హరీ వహత స్తానో అచ్ఛ॥ (ఋ. 1-165-4) హేమరుతః, బ్రహ్మాణి—మంత్రవాక్యాత్మకాని: స్తుతివచాంసి: హవీంషివా; సోమఆజ్యాదీని; మే-మమ:స్వభూతాని: చోదనావాక్యై రగ్న్యాది దేవతాంతర సంబంధేన ప్రతీయమానాన్యపి: సర్వదేవతా ప్రాణాత్మనో మహేంద్రస్యైవ తాన్ఇతి భావః। మతయః—మననయుక్తాః: స్తుతయోపి; శం—మమ సుఖోత్పాదికాః: అతోయజ్ఞేగంతవ్య మితి భావః (మహీధరభాష్యమ్) ఆ యా దేవతల నుద్దేశించి చేయబడు మంత్రాత్మకములగు స్తుతివచనములు, సోమా జ్యాది హవిస్సులు, నన్నియు నావియె. అనగ శ్రుతివాక్యమునందు అగ్ని మున్నగు నితర దేవతల నుద్దేశించినట్లు ప్రతీయమానములగు స్తోత్రహవిరాదు లన్నియు సర్వ దేవతా ప్రాణాత్మ రూపుడనగుటచే నావియె యగును. మఱియు మననయుక్తము లగు స్తుతులు (మతయః) నాకు ప్రీతికరములు. కావున సోమరుత్తులారా! నేను యజ్ఞమున కేగవలసియున్నది. ఈ స్తోత్ర హవిరాదులన్నియు ఆత్మీయములగుట చేతనే యజ్ఞభూమికేగుట కాదు; యజమానులు, వారిచే ప్రవర్తింపజేయబడు స్తోత్ర శస్త్రములన్నియు నన్నే యభిలషించుచున్నవి. అందుచేగూడ యజ్ఞమున కేగవల యును మీరును రండు! అని మంత్రార్థము (భా. వి. 123, 124).

"ఋగాది మంత్రములును, సోమాది హవిస్సు లన్నియును, 'తవాహమస్మి'- 'నేను నీ దానను' అని యీ రీతిగననుచు పరమేశ్వరునే కాంక్షించుచుండును. ఆ దేవునే పొందుచుండును- అని "యోజాగార తమృచః కామయ న్తే" (ఋ. 5-45-14, 15) అను మంత్రము వివరించుచున్నది." ఇంకా "ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే" రూపం రూపం ప్రతిరూపోలభూవ. ఋ 6-47 ఇంద్రుడు తన మాయవలన వివిధరూపములను పొందుచున్నాడు. అనీ ఉంది. రామరాజ భూషణుడు ఇంద్రుడి పాత్రను గిరికా కళ్యాణానికి సర్వనిర్వాహకుడుగా దిద్దటంలో ఉన్నది ఈ వైదిక వివేకమే.

ఇప్పు డింద్రుడు వసురాజు కిచ్చిన బహుమానాలు: "చెలికాడా: మేలు మేలు, నీ యాశ్రిత వాత్సల్యము కొనియాడ నే నేపాటివాఁడను? ఈ గుణముచేఁ ద్రిలోకాధిపత్యమునకుఁ దగియున్నాఁడవు" మిత్రలాభమున చిత్రగ్రీవుని గూర్చి హిరణ్యకుడన్నమాటలివి. రాజధర్మ యోగ్యస్థానమది. ఆ యోగ్యతను గుర్తించి యట్లె ఇంద్రుడు వసురాజుతో "మద్భుజాంతర పవిరేఖ నీయడుగునం బడదే శుభ లక్షణాకృతిన్" (3-7) అన్నాడు. ఇదేమీ అతిశయోక్తి కాదు. వసురాజుని ప్రతి రూపించే వరుణుడు అధిదైవమైన స్వాధిష్ఠానమునకు ఇంద్రు డధిదైవం అయిన మూలాధారం క్రిందిదేకదా! అక్కడినుంచి పైకెగిరి వరుణ-వసురాజును గలసి యోగ్యతను గుర్తించి మైత్రితో తనసరివానిగా చేకొని యూర్ధ్వగమన సిద్ధిగా ఆ రాజుకి తన విమానం బహూకరించాడు. "నరవర సర్వసద్గుణంబుల ప్రోవగు నీ కొసంగితిన్" (3-16) అని యోగ్యత గుర్తించి ఇచ్చాడు. దానితో వసురాజు "విమాన మహిమంబునం బ్రతిదివసజాయమానంబులగు జాతరూపమణి కలాపంబుల భూదేవతావరులకు సపర్యలు గావించుచు నిష్ఠాపూర్తంబులు నిర్వర్తించుచు" ఉండే వాడు. అలాకాక గర్వించి అదుపులేని యక్రమాలు సాగించి ఉంటే నహుషుడిలా అథఃపతితుడే అయ్యేవాడు. అలా ప్రవర్తన మంచికే సాగుతుందని నమ్మకం ఉన్నా ఒకవేళ ఎటువచ్చి ఎటుపోయినా ఇప్పటికి చాలు లెమ్మని విమానం ఇచ్చి తనవీటికి రాకపోకలు సాగించే అవకాశం ఇచ్చాడు.

దక్కిన అవకాశాన్ని సద్వినియోగం చేసుకుంటూ తన యోగ్యతను మరింత స్థాపించుకున్నాడు వసురాజు. సామాన్యజనులైన వనపాలుర సంతృప్తికోసం వసంత

విలాసం దర్శించటానికి వెళ్ళాడు. విమానంమీద స్వర్గానికి వెళ్ళి నందనోద్యాన విహార అవకాశాల నుపయోగించుకుంటూన్న వసురాజు కీ దర్శనం పెద్ద వేడుకేమీ కాదు. అలా ప్రజానుకూలంగా ప్రవర్తించే వానికొక శుభం చేకూరేమాట కిన్నెర ద్వంద్వసంభాషణ మందించింది. అలాగే గాంధర్వ విద్యావిలాసిని గిరిక కనిపించింది వలచి వలపించుకోటాలూ జరిగాయి. అప్పుడింద్రుడే సర్వనిర్వాహకుడై పెండ్లి జరిపించాడు. పెళ్ళికి వెళ్ళేముందే పెళ్ళికొడుకుకి అలంకారంగా తన వాసవమాలిక నిచ్చాడు. విమానలాభంవల్ల దుర్వృత్తికి పాల్పడక యోగ్యత నిల్పుకొన్నాడు కనుక మెచ్చి "గిరిహర నీవు నేనని సఖిత్వము మీఱఁగ నీకొసంగితిన్" అని తాదాత్మ్యం ప్రకటించాడింద్రుడు. ఎట్లా ? తనకు వేయికళ్ళున్నాయే వసురాజుకేవీ అనుకోటానికి వీలులేకుండా కళ్ళపోలిక ఉన్న పద్మమాల ఇచ్చి ఉపమాన సాయంతో భేదపరిహారం కుదిర్చాడు. రామరాజభూషణుని వర్ణనచూడండి "....చేదిస్వామి నెమ్మేన మ్లాన స్వచ్ఛసరోజ మాల్యమది చాలంబొల్చె నింద్రైక్య దీక్షానిర్దేశ్య మహాసహస్ర నయనీ సౌభాగ్యముం దెల్పుచున్." (5- 05). సరే ఇంద్రుడేమో అమరుడుగదా ? ఇంద్రుడేమిటి ఆడపెళ్ళివారంతా దైవతాలే. వసురాజే మర్త్యుడు. ఈ వరహీన సంబంధాన్నా ఇంద్రుడు జరిపించేది ? అలా ఏమీకాదు. అది తనచేతుల్లోపని వరుని కొక్కవరం ప్రసాదిస్తేచాలు సమకూడేపని. అందు కావరుడన్నివిధాలా అర్హుడుగా నిరూపించుకున్నాడు. లేకపోతే ఆ వధువుచే వరింపబడటం మంజువాణి రాయబారం ఎందుకు సాగుతాయి. అది గుర్తించి సమయానుకూలంగా "భూనాథోత్తమ యస్మదీయ వరసంభూతామరత్వంబుతో దీనిం గొమ్మని వాసవుండొసఁగెనట ఆ పద్మ మాల ఎంతటి సమయోచితాలు అవరమూ ఇంద్రమాలాను. అది "జగత్త్రియసార వస్తు జాతమ్మ సృజింపనేర్చు నిరతమ్ము దలంచిన యంతలోపలన్" (5-102) దీన్ని విమానంతోపాటు ఎందుకీయకూడదు అంటారు చాలామంది. విమానం గర్వాన్నిచ్చి దుర్వర్తనకు మరలించిందనుకోండి ఇప్పుడింద్రమాల ఇయ్యనక్కర లేదు. అప్పుడే ఇచ్చిఉంటే ఒకదానికోటి తోడై రాక్షసులకు బ్రహ్మదులిచ్చిన వరాల్లా ప్రమాదం రావచ్చు. తెలివైనవాడు గనుక ఇంద్రుడు జాగ్రత్తపడ్డాడు. ఇది రామరాజభూషణుని ఔచిత్యానికి కలికితురాయి.

పెళ్ళివల్ల దేవతలందరి మెప్పులూ బహుమతులూ వాటివల్ల అధిక తేజస్సూ పొంది వసురాజు గుణాగ్రగణ్యుడయ్యాడు. విమానంవల్ల ఉపరిచర సౌకర్యంతో తన

లోక ప్రవేశార్హత, వసుమాలాధారణతో సారూప్యతా వరంతో అమరత్వం సిద్ధింప జేసి తన వజ్రంవంటి ఒక ఆయుధం మళ్ళీ తయారుచెయ్యటం ఎందుకని "వెండియు నాఖండలుఁడరిఖండన జయసాధన ప్రకాండము సమిదుద్దండ మొక దివ్యవైణవ దండము దయనొసఁగెను. (6-44) పై బహుమానాలవల్ల వసురాజు సద్బుద్ధిని వీడనివాడని తేలిపోయింది. కాబట్టి అతడే చెడుగును చెయ్యడు. ఇప్పుడు గిరికా మనోహరుడై వేడుకనున్నవేళ ఏ ధూర్తుడైనా ఆయనకు చెడుచెయ్యవచ్చు. అందు చేత తిరుగులేని రక్షణ శిక్షణల దక్షమైన వేణువండం మహేంద్రుడిచ్చాడు. ఉన్నతోన్నత విజయసాధకుడికి పొందదగిన అగ్రసిద్ధి అది. ఈ సమయజ్ఞత రామ రాజభూషణుడు ప్రదర్శించిన ఔచితీ శిఖరాగ్రము. ఇంక చేరదగినది లేదు.

మనం వాగ్విషయంగా మణిపూరంలో పశ్యంతి ద్విదళవికాసం కోలాహల పరంగా గుర్తించి ఉన్నాం. ఆ వసురాజు వసంతవిలాస దర్శనానికి జానపదుల ప్రేరణతో (వనపాలురు) కోలాహలం చేరటమూ చూసాం. అంటే మర్త్యుడైన వసురాజు ధర్మకర్మావలంబనంతో ఔన్నత్యం పొంది ఉపరిచర యోగ్యత గెలుచు కోటం గమనించాం. ఆ ఊర్ధ్వగమనంలో తర్వాతి గమ్యస్థానం హృదయం. అక్కడిది అనాహతచక్రం. వాయువు దాని అధిదేవత. ముఖ్యమైన వాక్కు "మధ్యమా" అనేది. ఇదేదో మధ్యవర్తి వ్యవహారంలా ఉంది. కనుక ప్రబంధ కథలో నర్మసచివుడు పాత్రకావచ్చు అనిపిస్తోంది. చూద్దాం. అసలీ పాత్రప్రాధాన్యం ఏమిటీ అంటే 1 నాదవిషయంగా స్వరూపనిర్ధారణ. "వల్లకీరవము సంగతిఁబాడెద రెవ్వరో" అందులో "మృదు పంచ షడ్జమళయ్య" ఉంది అని. 2 ఊహాపోహల విషయభేదనము. "స్వైరవిహారకీరలగు సారసరోచన లున్నచోటికిన్ భోరున లాతి వారు చొరఁబూనినచో రసభంగమంచు" గ్రహించటం. 3 కార్యనిశ్చయం. "వీణఁ బల్కించు నాయాలాపంబె గిరిందరీ ముఖరమై యాలింపఁగా నయ్యెకిన్" అనీ "ఆ చిగురుటాకుంబోడి నీకే తగున్" అనీ ఉన్నాయి. 4 యోగ్యకార్య నిర్వహణం. "ఇంక నేజపివేషంబునఁ జేరఁబోయి లలనా జన్మప్రకారంబు దేటపడంగాంచెదఁ బంపు" మని యజ్ఞెపోయి ఆ వృత్తాంతం రాబట్టటం. 5 సమర్థవిషయ సమావేశ దోహదం. "ఈ యజ్ఞననఁ బెఱల్లియాడు వసురాజేంద్రుడు వాలాయమున్" అని ఆశమాపి వారి ఉత్సుకత కనిపెట్టి ఒక పంతం కల్పించుకొని "నా సత్యసమాను జూడుమని....మర్థ్యాయనన్" సంధింపగ వేళ ఏర్పరచటం. కడపట "బాలాపాణి

గ్రహ శుభవేళా నిర్ణీతి కిపుడ విచ్చేయుము" అని వసురాజు నింటికిపంపటంలో ఉంది.

ఇప్పుడు మధ్యమావాక్కు కీచర్యల మూలతత్త్వం ఏమైనా ఉందేమోచూడాలి. "హృదాతష్టేషు మనసోజవేషు యద్బ్రాహ్మణాః సంయుజన్తే సఖాయః। అత్రా హత్వం విజహార్వేదాభిరోహబ్రహ్మణో విచరన్త్యుత్వే॥ (ఋ. 10-71-8) శ్రుతితో సఖ్యమొనర్చెడి వేదవిదులగు సఖులు, పరిపక్వమగు బుద్ధితో, గుణదోష నిరూపణము జేసి, వేదార్థముల నిశ్చయించి యా యర్థముల విషయమై ఏకభావము జెంది సమానఖ్యానముగల్గి యుందురు. ఊహాపోహకుశలురగు నా విద్వాంసులతో నొప్పెడి సమాజమున ఊహాపోహల అసమర్థుడు, అవిజ్ఞాతార్థస్వరూపుడునగు విద్వాంసు డున్నచో వానిని బరిహరింతురుగాని వానితో తత్త్వనిరూపక ప్రశ్న ప్రతివచనాదుల నొనరింపరు. అట్టి విద్వాంసులకు ఓహబ్రహ్మణః అనిపేరు. వారా సమాజమున సమానఖ్యానముగల సఖులతో ప్రశ్నప్రతివచనాదులు చేయుచు వేదార్థ నిర్ణయమునకై ప్రవర్తింతురు-అని అర్థము." (భా. ని. 635)

వసురాజు ఉద్యానం చేరగానే రథందిగి "మహీశుల ననిపి, బలమునచటనె నిలిపి యుపవనంబు సొచ్చి నిజహితయుతుడై" (1-50) అంటూ రామరాజభూష ణుడు అప్రతిభులను పరిహరించటం అందంగా బయటపెట్టాడు. అలాగే హిత స్వీకరణాన్ని తెలియజేసాడు. ఇక్కడకూడా "హితులతోగూడి" అన్నట్లు బహు వచనం తోపింపజేసి అప్పుడు "ఆయెడ నొక్క నర్మసచివాగ్రణి" (2-3) అంటూ అందులో ఊహాపోహల సమర్థుడొక్కడు నిలిచినట్లు స్పష్టంచేసాడు. అంటే "ఓహ బ్రాహ్మణ" యోగ్యత నర్మసచివుడిలో ప్రతిరూపిస్తున్నట్లు తెలుస్తోంది.

"మధ్యమావాక్కు జ్ఞానరూపమైనది. బుద్ధిసహితమైనది. ఋజురేఖాకృతి కలది. జ్యేష్ఠానామధారిణి. ఇచ్చట వాక్కు స్వరూపధారణము చేయును. (హిరణ్య గర్భరూప) అనగ మాతృకావర్ణస్వరూపమన్నమాట (మాతృకాత్వఉపపన్నా) ఇచట విశేష స్పందనమై స్ఫోటమైనది." (శ్రీచక్రవిలసనము. 201 పుట) అన్నది పై ఓహబ్రాహ్మణ వ్యాపారానుకూలంగానే ఉంది. అదే నర్మసచివుడి పాత్రలో లీనం అయింది.

మరొక విషయం "వాగ్దేవత యగు సరస్వతి అబ్దేవతగూడ నగునని పూర్వము వివరింపబడినది. ఈమె మధ్యమస్థానదేవత. మాధ్యమికవాక్కు - అనియు జెప్ప బడును. ఈమె వాగ్దేవతయై హృదయాంబర వీధి నిలచి బుద్ధిసమాయుక్తయై మాధ్య మిక వాగ్రూపిణి యగుచు వాక్ప్రేరయిత్రి యగును. (అథ తదేవ శబ్దబ్రహ్మ। తేనైవ వాయునా హృదయపర్యంత మభివ్యజ్యమానం, నిశ్చయాత్మికయా, బుద్ధ్యా యుక్తం, విశేషస్పంద ప్రకాశరూప నాదమయం సత్ మాధ్యమా వాగిత్యుచ్యతే॥.... అథహృదయగో బుద్ధియుఙ్మధ్యమాఖ్యః -సౌభాగ్యభాస్కరరాయః-లలితా సహస్రనామ వ్యాఖ్య) ఈ దేవియే యంతరిక్షమందంతట వ్యాపించి వాయుసమాయుక్తమై వృష్ట్యు దకముల గల్పించెడి మాధ్యమిక వాక్కు" (భా. ని. 561)

"మనోహి సరస్వాన్। వాక్ సరస్వతీ। ఏతౌ సారస్వతౌ వుత్సౌ"॥ (శ.బ్రా. 7-5-1-31) మనస్సు సరస్వాన్ అనియు వాక్కు సరస్వతి యనియు నీ రెండును సారస్వత ప్రవాహములనియు నిట జెప్పబడినవి. (భా.ని. 549) వసురాజు పక్షంగా మనస్సు సరస్వానుడుగా నర్మసచివుడైతే గిరికా పక్షంగా వాక్కు సరస్వతి మంజు వాణి అయినట్లు రామరాజభూషణుడు ఆ రెండు పాత్రలను కల్పించాడు. "మంజు వాణి-మాయాతపసి (నర్మసచివుడు) - భూషణకవి సృష్టించిన మహాద్భుత పాత్ర ములు" అని డా. వి. వి. ఎల్. నరసింహారావుగారు భూషణ కిరణావళిలో (101 పుట) అన్నమాట నిజమే. ఆ సృష్టికి మూలం ఈ మధ్యమావాక్కే. ఓహ బ్రాహ్మణ ప్రతిరూపాలే. కాబట్టి ఆ కల్పనకూడా పూర్తి వైదిక దృష్టితోనే చేసాడనటం నిర్వివాదం.

మధ్యమావాక్ స్థానమైన హృదయంలోది అనాహతచక్రం. దాన్ని గురించి షట్చక్ర నిరూపణగ్రంథంలో ఇలా ఉంది.

> తస్యోర్ధ్వే హృదిపంకజం సులలితం బంధూక కాంత్యుజ్జ్వలం
> కాద్యైర్ద్వాదశ వర్ణకై రుపహితం సిందూరరాగాన్వితైః
> నామ్నానాహత సంజ్ఞకం సురతరుం వాంఛాతిరిక్తప్రదం
> వాయోర్మండల మత్ర ధూమసదృశం షట్కోణ శోభాన్వితమ్.

ఇందులో సురతరు-వాంఛాతిరిక్త - అంటే పారిజాతమూ కోరినదానిని మించి వరా లిచ్చేది అనే రెండు లక్షణాలూ నర్మసచివుడిలో ప్రతిబింబిస్తాయి. పారిజాతం నిత్య

వసంత శోభాన్వితం. కనుక నర్మసచివుడు వసంతుడి ప్రతిరూపం అనిపిస్తాడు. "కనకవల్లి మతల్లి.... యొక జడదారియయ్యె" 2-79 సీసపద్యంచూస్తే గ్రహించవచ్చు. కాబట్టే ప్రథమాశ్వాసంలో 151-162 దాకా డజను పద్యాల వసంత వర్ణన అంతా రామరాజభూషణుడే నిర్వహించాడు గాని సచివుడిచే పల్లెత్తి మాటాడించలేదు. ఏమంటే ఆత్మోత్కర్ష దోషం వానికంటుతుందని. అలా ఉద్యానంలో పెదవి మెదపని వాడు కోలాహలం చూస్తూనే వాచాలత ఆవేశించినట్లు "చూ పెదనీకు నాదు చేచాయనె చూడు" అని మొదలుపెట్టి ఆ కొండమీది చెట్లని దేవభూజములంటాడు. అతడే దేవతరుప్రతీయమాన వసంతుడని మనచేత గుర్తింపచెయ్యటానికే రామరాజభూషణుడు ఆ పాత్రకసహజమైన అమాయక ప్రసంగం చేయించాడు. ఇక్కడ ఒక్కసారి తప్ప అతడు చూసిరమ్మంటే చక్కబెట్టుకు వచ్చే గడుగ్గాయె. ఇంక కోరిన దానిని మించి ఫలితం కలిగించటంమాట వేరే చెప్ప అక్కర్లేదు. "ఎచ్చటివారో.... నిచ్చటఁ బొడుచుండ గత మెయ్యదియో వివరించి క్రమ్మఱన్ వచ్చెదవే" అని అడిగితే "నరరాజకన్యలును గిన్నర రాజకుమారికలు, ఫణాధర విద్యాధర శోణాధరలును" బోల్పఁదగని సుందరియంటూ సంబంధం తీసుకువచ్చాడు. "ఆ చిగురు టాకుంబోడి నీకేతగున్" అని "కిన్నర విహంగయుగళిచే మున్ను విన్న, నన్ను తాసన్న శుభద ప్రసన్న పణితి మదికి సరిదాక" చేసాడు. ఆ రమణి నాతడు కడు రమణీయ వాగ్వైశారద్యం చూపి వర్ణించింది ఒక ఉగాది కవితాగానమె. అది చాలక మాయాముని వేషంగట్టాడు. చక్కగా నటించాడు. ఇక గిరిక పక్షంలో మంజువాణి మరో నాలుగాకులు ఎక్కువే చదివింది. అయినా ఆవిడ విశుద్ధవక్ర పై శారీవాక్కుకే ఎక్కువ ప్రాతినిధ్యం వహించినట్లుంది. ఆమె వాణిఁదాల్చు సుకవిగదా మరి :

మనం ఇంకోవిషయం కూడా గుర్తించాలి. వాగ్బీజానికి ఇప్పటి పరిణామం ఏమిటి ? అంటే "మధ్యమాయాం ముకుళితా" అని ఉంది. అంటే పశ్యంతిలోని దళద్వయం మీరి మొలకకి చిగురుమొగ్గ తొడగటం అనుకోవాలి. అంతేగాని అప్పటికే విచ్చుకునున్నదేదో ముడుచుకుపోవటంకాదు. ముడుచుకునే పుట్టటం. వికాసాని కెదురుచూడటం. దీన్నిబట్టి గిరికను ఆ భావప్రతిరూపంగా రామరాజభూషణుడు రూపొందించాడనటం సత్యం. చూడండి. వల్లకీరవము సంగతిఁబాడిన దెప్పుడో ఏమోగాని ఆ తరువాత మాయాయతి ప్రవేశం అయ్యింది. తరువాత వసురాజు దర్శనం అయింది, మాయాయతి పోయి నర్మసచివుడు వచ్చాడు మధ్యలో తన

జన్మవృత్తాంత కథనం నడిచింది. చివర్లో చెలుల చతురోక్తులు కురిసాయి. ఏమిటో మరి ఉలకదు పలకదు. మొదట్లో మునికో దణ్ణంపెట్టింది ఆఖర్న ఎలాగో తెర చాటుకి గెంతింది. ఆ తర్వాత మాతృసఖితో జారుకుంది. అప్పుడంతకీ మంజువాణియె ఆమె వాణి అయి కథనడిపింది. ఆవిడ వాంఛాతిరిక్తప్రదకదా! గిరిక అనాహత నాదప్రతిరూపరకదా! అలాగే ప్రవర్తించాలి.

మంజువాణి "వాణీదాల్చు సుకవిస్తోమం"లో ప్రధానురాలు. విద్యావాక్ స్వరూపం అయిన వేదవాణి కవి అనబడుతుంది. "సుపర్ణం విప్రాః కవయో వచోభి రేకం సంతం బహుధాకల్పయన్తి" ఋ. (10.114-5) మేధావులగు (విప్రాః) కవులు వివిధస్తుతి లక్షణములగు వాక్కులతో (వచోభిః) నొకే పరమాత్మను బహు ప్రకారముల గల్పించుచున్నారు. అని అర్థము.... వేదములే పరమాత్మ స్వరూపమును వివరించుటకై బహుకల్పనలతో భాసిల్లినవని తాత్పర్యము." (భా. ని 448) ఆ వేదములనే రామరాజభూషణుడు "వాణీదాల్చు సుకవిస్తోమంబు రప్పించి తద్ఘన విద్యామహిమల్ కరామలకము గ్గావించె" (3-32) అని గిరికకు శుక్తిమతి గురువులను ఏర్పరచినట్లు పరిచయం చేసాడు. కాగా మంజువాణి వాగగ్రవిద్యగా వారికి అధ్యక్ష్యం వహించింది. "బృహస్పతే ప్రథమం వాచోఽగ్రం యత్ప్రైరత నామధేయం దధానాః। యదేషాం శ్రేష్ఠం యదరి ప్రమాసీ త్ప్రేణా తదేషాం నిహితం గుహావిః॥" (ఋ. 10.71-1) ఓ బృహస్పతీ! ప్రథమమున—పుట్టిన తర్వాత ఇతర పదముల నుచ్చరించుటకు పూర్వము బాలురు "తత్, తాత" అని యేది యుచ్చరింతురో యది వాచోఽగ్రము వాగగ్రము అగును. అట్లుచ్చరించెడి దశయందున్న యీ బాలుర గాంచుము. శ్రేష్ఠము పాపరహితము (అరిప్రం) నై నిగూఢముగ (గుహానిహితం) వీరియందున్న వేదార్థజ్ఞానము వేదాభ్యాసకాలమున ప్రేమచే (ప్రేణా) నావిర్భూత మగును. వేదాభ్యాసకాలమున సరస్వతి (వేదవాణి) స్వార్థమును వీరికి ప్రకాశింపజేయును. (వేదాభ్యాసకాలే సరస్వతీ స్వార్థమేభ్యః ప్రకాశయతీత్యర్థః॥ సా.భా.) అని అర్థము." (భా.ని. 441)

ఇందులో బాలశిష్యురాలు గిరిక అనీ ఆ వాణి మంజువాణి అనీ తెలుస్తూనే ఉంది. 'తత్' పరమాత్మ నిర్దేశవాచకం 'తాత' (తండ్రి అని అర్థం) వస్తువాచకంగా ఆ పరమాత్మ ప్రజాపతి అని అప్రయత్నంగానే బాలురనోట వచ్చే తాలి పలుకులను

వాణి అర్థవంతం చేస్తూ ఉంటుంది. కాగా 'తత్' (అది) అన్న వస్తువు అనాహతంలో నిర్దేశింపబడిన శబ్దబ్రహ్మమే. "ద్వేబ్రహ్మణీహి మన్తవ్యే శబ్దబ్రహ్మపరంచయత్, శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరంబ్రహ్మాధి గచ్ఛతి." (త్రిపురాతాపిన్యుపనిషత్ ౫ వ అధ్యాయం) అలా ముందు శబ్దబ్రహ్మను సాధించుకుంటే పరం అయిన అర్థబ్రహ్మనూ అందుకోవచ్చు. ఈ బద్ద అర్థాలు రెండూ బ్రహ్మస్వరూపాలే. "శబ్దబ్రహ్మమయః శబ్దోఽనాహతస్యత్రదృశ్యతే। అనాహతాఖ్యం పద్మం తన్మునిభిః పరికీర్తితమ్" స్థానకరణ ప్రయత్నాల తాకిడిలేని శబ్దం అది. బయటికి వ్యక్తంకానిది కాని సంపూర్ణ వ్యక్తిత్వాన్ని సంపాదించుకొన్న మధ్యమావాక్కు అది. మన ప్రబంధంలో వ్యక్తంచేయనిది గిరిక వ్యక్తంచేసేది మంజువాణి. కాబట్టే మంజువాణి గిరికను గూర్చి జననాది వివరాలను సుందర ప్రబంధంగా మాయామునికి వినిపించింది. సుకస్తోమాధ్యక్షురాలయ్యింది. గిరికకు సంబంధించిన అన్ని వ్యవహారాల్లోనూ (పెళ్ళి అయ్యేదాకా) ఆమే ముందుకువస్తూ ఆ పీఠం తనదని నిరూపించుకుంటూ ఉంటుంది. పెళ్ళితో తనకా అవకాశం జారిపోయింది కనుకనే మంజువాణి పాత్రా మాయమయ్యింది. ఆమె మాయం గావటంలో వాగగ్రవిద్యగా నిలిచిపోగలిగిన ఔచిత్యం పాటింపబడింది.

తాండ్యబ్రాహ్మణం 6.9-12 లో "శ్రీర్వై వాచోఽగ్రం శ్రియమేవాస్మిన్ దధాతి" అంటుంది. "వాచః—అభివదనస్య, యదగ్రం—పురోభాగః, సశ్రీర్వై—శ్రీరేవఖలు: బహూనాం మధ్యే యస్యవాక్ప్రథమం ప్రవృత్తా సశోభతే। తథాసతి ఏతత్సాతేనాస్మిన్ యజమానే శ్రియమేవ దధాతి సా. భా. పలువురిమధ్య నెవడు మాటలాడునో యాతనివాక్కు వాచోఽగ్రము. అదియే మిగుల శోభించును. అట్టి వాక్కుకు 'శ్రీః' అని పేరు." (భా. ని. 442) అలాంటి సిరిగల మాటలో మంజువాణి అగ్రగామి ఔతూ ఉంటుంది. ప్రబంధంలో. మాయాముని వచ్చినప్పుడు "ఆ కంజనయన యనుంగుంజెలులలో సమంజస వచన చాతురీరంజిత యగు మంజువాణి" అన్న పరిచయంలోనె ఆమె అగ్రస్థానాన్నీ కవితావైశిష్ట్యాన్నీ మన ఊహ కందించటం జరిగింది. మంజువాణి ఎవరినీ (గిరికనుగాని ఆమె తలిదండ్రులనుగానీ) సంప్రశ్నించకుండానే "వసుధేశ్వరుండెన్నడు వచ్చు.... ఈ కన్నియ.... నెన్నడు గారవించు" (3-42) అని పెళ్ళిమాటలు మొదలుపెట్టింది. వసురాజు వచ్చాక "మృదు గంభీరత వచనరచనా పారీణత మంజువాణి పలికెన్" అని ఆమె

సుకవి అని గుర్తింపచేయబడింది మనకు. పెళ్ళికూతురుగా పరిగణించ తగినట్లే ఆమె గుణగణాలను మంజువాణి వర్ణించింది. ఆమె (గిరిక) తెరచాటుకు వెళ్ళినప్పుడు "పరిణయస్ఫూర్తి"తోచె నన్నదికూడా సంభాషణలో ఉన్నది ఆమే కనుక మంజువాణియె స్వయంగా ఆ పెళ్ళిమాట ఎత్తింది. గిరిక వలపువెతలో కుందువేళ "అనావిలగతిఁజేరి" "వనిత యావంత ఆవంత వలవదమ్మ" (3-128) "ఇంత తలకం బనిలేదు మనోజుధాటికిన్" (129) "కోర్కె నెమ్మితో నిమ్మనియేము.... కమ్మని వింటి జోదు పాదమ్ములు....భజింతు మమ్మరో" (130) అని దారిమాపించి అట్లు నడిపించినది. ఆపై రాయబారం స్వయంగా నెత్తిన వేసికొని స్వతంత్రంగా "కౌమ్మహారంబుపూని" వెళ్ళి వచ్చింది. అన్నింటినీ చక్కదిద్ది పక్కకు తప్పుకుంది. ఇలా మంజువాణి సుకవిస్తోమాధ్యక్షురాలుగా తీర్చిదిద్దిందంతా వాగగ్నివిద్యా ప్రతిరూపణంగా రామరాజభూషణుడు వైదికమార్గాన్నే స్థాపించాడు.

ఇంక "చత్వారి వాక్పరిమితాపదాని" అన్నదాన్లో "తురీయం వాచో మనుష్యా వదన్తి" అన్న వైఖరీ వాక్కే మిగిలింది. దాని స్థానం కంఠం. అక్కడిది విశుద్ధ చక్రం. ఇంతవరకూ ఉన్న అయిదు చక్రాలకీ ఈ వాక్స్థానాలు నాలుగింటికి సామరస్యం ఆలోచిస్తే ఇలా ఉండటం సమర్థనీయం. చూడండి :

| | | |
|---|---|---|
| మూలాధారాన్నుంచి స్వాధిష్ఠానానికి ఎదిగేటప్పుడు : | పరావాక్కు | బీజంనుండి మొలకరావటం. |
| స్వాధిష్ఠానంనుంచి మణిపూరకానికి సాగేటప్పుడు | పశ్యన్తివాక్కు | మొలక కంటిబీజం ద్విదళం అవటం. |
| మణిపూరకంనుంచి అనాహతం చేరేటప్పుడు | మధ్యమావాక్కు | బీజదళ వాసన నశించి చిగురుతొడగటం. |
| అనాహతంనుంచి విశుద్ధంద్వారా ముఖంలో అక్షరాకృతులందేటప్పుడు | వైఖరీవాక్కు | బాగా ఎదిగి వృక్షమై విస్తరించటం. |

కవిగా తదధ్యక్షురాలిగా గిరికాకుమారి జన్మవృత్తాంతాన్ని ఒక చిన్న అందమైన ప్రబంధంగా చెప్పినా అదంతా ఆ గిరికకు వసురాజు దక్కి భర్తకావటం మంజువాణి ఆంతర్యం. ఆ భావం ఆమెలో రూపుదిద్దుకోవటం శబ్దబ్రహ్మస్థితిగా మధ్యమా వాక్ప్రతిరూపంగానే ఉంది.

రాయబారానికి బయలుదేరటంతో ఆ మంజువాణి వైఖరీ వాక్ప్రతిరూపం అయింది. మధ్యమావాక్కుగా రూపొందిఉన్న అభిప్రాయం అక్షరరూపంలో శ్రోత కర్ణపుటాలకు చేరటమే రాయబారం. వాగర్థాలని సంయోజించటమే ప్రయత్నం. ఆ ప్రయత్నంగా భావాకాశ (అవకాశ) సంచారం అవసరమే మరి! మధ్యమా హృదయంనుండి కంఠం వరకూ నిట్టనిలువునా పైకిలేచిం తర్వాతనే ముఖంనుండి బయల్వెడలి శ్రోత కర్ణపుటాలవంక పయనించటం సాగేది. మంజువాణి ఆకాశ గమనం అలాగే సాగింది. "బడివాయకిల నగప్రతతితో తివ్వన నెగిరినప్లైతోచు.. నిఖిలభూములు జవనిక వాపదారుని నెడిరినప్లైతోచు" (4-59) అని ఆమే వివరించింది. అర్థానికి తగ్గ శబ్దాలకూర్పుకు సమ్యజ్ఞానపూర్వకంగా ధ్యానం అవసరం. ఆ ధ్యాననిష్ఠ "సంపూర్ణసమాధి" (4-64) అని అధిష్ఠానపురం ఆ రాత్రివేళ ఉన్న స్థితి వర్ణనలో సూచింపబడింది. తర్వాత తదేకార్థప్రమేయంగా ఉండి ఇతర వాక్ప్రపంచం నించి తిరోహితం గావటంగానే మంజువాణికి తిరస్కరణీ ప్రభావం కల్పింపబడింది. తదేకార్థావేశంగానే ఆమె మణిపుత్రిక నిల్చినట్లు చెప్పబడింది. ఆమె నవ్వటం వాగర్థసంపుటి చక్కగా కుదిరిన సంతోషమె. శ్రోతగా వసురాజు మధ్యమా ముకుళిత (గిరికా) నిశ్చయమై యున్న భావాన్నే వర్ణపదజాలం (మణిహారం) నుంచి గ్రహించినట్లు అందు కంగీకారసూచకంగా ఉంగిరం (ముద్రిక) ఇచ్చిపంపాడు. ఈ వాక్ప్రసారాన్ని రామరాజభూషణుడు మంజువాణి రాయబారంలో ప్రతిక్షేపించాడన్నది సుస్పష్టం. ఆయన ఆంతరంగిక సారస్వత యుక్తికి జేజేలు.

మూలాధారాది చక్రాల విశేషాలెన్నెన్నో చెప్తూ ఉంటారు. మనం వాక్కు వరకే తీసుకున్నా ఫలితాలుగా వచ్చే ముక్తుల ప్రసక్తికూడా కొంచెం చూడాలి. మొదటి రెండు చక్రాలనీ తామిస్రలోకాలని పరిహరించాలనటం చూసేఉన్నాం. పై వాటిమాట శ్రీ చక్రవిలసనం గ్రంథంలో 119, 120 పుటల్లో ఉంది. "మణిపూరక చక్రమును పూజించువారికి సార్ష్టి రూపమైన ముక్తి లభించును. సార్ష్టి రూపమైన ముక్తియనగా దేవీపుర సమీపమున వేరొక పురమును నిర్మించుకొని దేవికి సేవ చేయువాని స్థితి." వసుమహారాజు పెళ్ళికోసం ఇంద్రుడు నగరం నిర్మించి ఇవ్వటం ఈ సార్ష్టి ముక్తికి ప్రతిరూపంగానే రామరాజభూషణుడు కల్పించాడు. "అనాహత కమలమును పూజించువారికి సాలోక్యముక్తి లభించును. సాలోక్యముక్తి యనగా దేవియొక్క పట్టణమందే నివసించుచు సేవచేయుట." ఇంద్రుడో పట్టణం

నిర్మించినా, వివాహం జరిగినా అది కోలాహల నగంమీదే కనుక ఈ సాలోక్యము క్తి పెండ్లిలోనే ఇమిడిపోయి ఉంది." విశుద్ధచక్రమును పూజించువారికి సామీప్యముక్తి కలుగునట. సామీప్యముక్తి యనగా దేవ్యంగ సేవచేయుట." వసురాజామెను తన యంతఃపురమున జేర్చుకొని భోగమనుభవించుటలో అదీ నెరవేరింది. "ఆజ్ఞా చక్రమును పూజించువారికి సారూప్యముక్తి కలుగునట. సారూప్యముక్తి యనగా దేవీ సమాన రూపము నందుట" వైఖరీవాక్కుయొక్క స్వరూపమే ఇది. నోటవచ్చు శబ్దాలలో నిర్దేశించిన భావం ఇమిడి ఉండటం. అప్పటికా రెండూ అర్ధనారీశ్వర స్వరూపమే. ఆ తర్వాత శ్రోతకు ఆ మాటల్లో అదే అర్థబోధ కలగడం వేరు." సహస్రారకమలోపాసన చేయువారికి సాయుజ్యము. అనగా దేవీరూపమునందుట" చెప్పేవారు ఉద్దేశించిందీ వినేవారు గ్రహించిందీ అయినది ఒక్కటే భావము. దాన్ని అనుసరించి చేసే క్రియా ఒకటే. అదీ అద్వైతభావం.

మొత్తం గమనిస్తే వాగ్వ్యవహారంగా వాయుప్రేరణనంది, ప్రయత్నించి, మంచిచెడ్డల వివేచించి, సత్యధర్మ స్వరూపంగా నెలకొని శబ్దబ్రహ్మమై, వర్ణపద వాక్యాల వైఖరిగా బయటపడి శ్రోతకు బోధమై, ఆ బోధ ననుసరించి కార్యసిద్ధి జరగటంగా ఉన్న వాఙ్మయప్రయోజనాన్నే వస్తువుగా తీసుకుని తన ప్రబంధ (మూల, కల్పిత) పాత్రల నడిపించి రామరాజభూషణుడు పంచమవేద-వేద విహిత అర్థప్రకాశంతో (సత్క-వికల్పనా విశేషావహంచేసి సానబెట్టిన రత్నంగా) వసు చరిత్రను అనివారితమైంచి మనకందించి అక్షరకల్పుడయ్యాడు.

"వేదముద్రా మజానంతః కుతర్కగత మానసాః ।
ఆపాతతో భాషమాణాః తే హాస్యావై దికైరిహ ॥

'వేదసంప్రదాయమును దర్శింపక, తదనుభూతిలేక, యాపాతముగా జెప్పెడి యర్థములును, జేయబడెడి వాదములును కుతార్కిక వాదములగును. అవి శ్రుతి సంప్రదాయము నెరుగగోరువారికి గ్రాహ్యములు కావు. హాస్యాస్పదములుగ గన్పట్టును కాన నిపేక్షణీయములు' – అని ఋగ్వేదానుక్రమణిక యందిట్లు చెప్పబడినది" (భా. ని. అవతారిక XXVII) వేదానికి సంబంధించిన పంచమవేదం భారతానికీ అందులోంచి తీసుకుని వివరించిన వసుచరిత్రకూ కూడా ఇది చెల్లుతుంది.

"యత్రానందాశ్చ మోదాశ్చ ముదః ప్రముద ఆసతే।
కామస్య యత్రాప్తాః కామా స్తత్ర మా మమృతం
కృ ధీన్ద్రా యేన్ద్రో పరిస్రవ ॥ (ఋ. 9.113-11)

ఏ లోకమునందు ఆనందమోదాదులు విలసిల్లుచుండునో, మరియు నెచట కాముని యొక్క (అనగ కామ్యమానుడైన పరమేశ్వరునియొక్క) కామము లన్నియు ప్రాప్తములగునో, యచట నన్ను అమృత స్వరూపునిగ విలసిల్లజేయుము-అని యర్థము" (భా. ని. 14, 15 పుటలు) ఇందులో కామ్యమానుడైన పరమేశ్వరుడు కామేశ్వరుడనీ ఆ కామనచే తపించి అడ్డుగోడలను పగలగొట్టుకుపోయి ఆయనను అనుభవించింది కామేశ్వరి అనీ అంటారు. ఆ కామేశ్వరీ కామేశ్వరయోగమే ఆనందామృతసిద్ధి. యోగం అంటే చేరిక. వివరం చూడండి: "1. వేదవాక్కుతో పరమార్థమును సంయోజనముచేయుట 2. తత్సహాయమున బుద్ధీంద్రియమనః ప్రాణములను పరమార్థముతో సంయోజనము చేయుటయు యోగము." (భా.ని. 572 పుట)

మనిషిలో వక్స్పందన మొదలయ్యేది మూలాధార చక్రంలో అని తెలుసు గదా! ఆ వాక్కుని ప్రేరేపించే వాయువునే కామవాయువు అంటారు. దానివల్ల తేజరిల్లే శక్తి అది కామేశ్వరియే. "శక్తిః కుండలినీనామ బిసతంతు నిభా శుభా మూలకందం ఫణాగ్రేణ దష్ట్వాకమలకందవత్, ముఖేనపుచ్ఛాగ్ సంగృహ్య బ్రహ్మ రంధ్ర సమన్వితా" (యోగకుండల్యు పనిషత్ ౧ అధ్యా. చివర) మూలాధారచక్ర పద్మంయొక్క కర్ణికలో తామరతూడు రంధ్రంలో ఉండే దారంలా పాముకిమళ్ళే తోక నోట గరచుకొని బ్రహ్మరంధ్రంతోగూడినది కుండలినీశక్తి. రామరాజభూష ణుడు కుండలీ ప్రస్తావనచేసినట్లు డా. వి. వి. ఎల్. నరసింహారావుగారు "సరవి ప్రాణాయామ సంసిద్ధికై సారెసారెకుఁ గుండలి స్థానమంటు" అన్న 1-48 సీస భాగాన్ని ఉటంకించే ఉన్నారు. ఇప్పుడా కుండలి కామం ఈడేరిన కామేశ్వరి కావటం తెలుసుకోవాలి.

"అగ్నిం స్వాధిష్ఠాన గతాన్ని తేజోమయీం కుండలినీ మిచ్ఛద్వమ్। ఇచ్ఛా దండే నాహత్యోత్థాప యధ్వమ్। - అగ్ని అన స్వాధిష్ఠానగతమైన తేజోమయమైన కుండలిని కోరుడు. ఇచ్ఛాదండముచే కొట్టి లేపుడు. "యత్కుమారీ మంద్రయతే యద్యోషి ద్యత్పతివ్రతా అరిష్టయత్కించ క్రియతే అగ్ని స్త దనువేనతి। - ఎందు

వలన కుమారి మంద్రిస్వరముతో శబ్దించునో ఎందువలన ఆస్త్రీ ప్రతివ్రతయో ఎందు వలన శుభమును కొంచమైనను చేయునో అందువలన అగ్ని సాయపడును.

"కుః-పృథివీ తత్త్వం, మ్రియతే - లీయతే యస్మిన్ తత్కులకుండం. కుమారమ్, తత్సంబంధినీ కుమారీ—కులకుండలినీ, మందరియతే-మంద్రస్వరేణ నదతి. అవరోదనావస్థా । సాహిత్యాక్ కులకుండాదుత్థాప సద్యోత్పత్తి రూపత్వాచ్చ, సద్య ఉత్పన్నా కుమరీత్యుచ్యతే । - ఇచట కుమారియన కుః అనగా భూత త్త్వము. మూలాధారము. మ్రియతే అనగా లీనముచేయునది గాన ఆ కులకుండమే కుమార మగుచున్నది. దానికి సంబంధించినదే కుమారి. అనగా కుమారి మంద్రస్వరముతో శబ్దించుచున్నది. అందువలననే సాహిత్యార్థముచే రోదనావస్థయని యెరుగనగును. కులకుండమునుండి లేపబడుటచే అపుడే పుట్టినదై ఆ రోదనధ్వనితో కూడిన కుండ లిని కుమారి అని చెప్పబడుచున్నది.

యోషిత్తరుణీ తారుణ్యలక్షణా, సూర్యేణాహతా దుపరిభాగే సాహిత్యాత్పతి వ్రితా, పతిం బ్రహ్మరంధ్రస్థం - కామేశ్వరం; వ్రతయతి - భుంక్తే । వయోవ్రతం బ్రాహ్మణ స్యేత్యాది ప్రయోగాత్ । ఏవం కౌమార తారుణ్య సంభోగై రరిష్టం శుభం పీయూష వర్షణరూపమ్ । - యోషిత్ అనగా యౌవనవతి. తరుణ సూర్యునిచే అనాహతమునకు పైన ఆ కుమారి అనగా ఆ కుండలిని తరుణీ యగుచున్నది. సాహిత్యార్థమున పతివ్రతయని చెప్పనగును. పతి యనగా బ్రిహ్మరంధ్రిముననున్న కామేశ్వరుని, వ్రితయతి యనగా అనుభవించునది అని అర్థము. (వివాహ వయస్సు రాగా స్త్రీ పతిని పొంది పతివ్రిత యగుచున్నది. మూలాధారమున బాల్యావస్థలో నున్న కుండలిని అనాహతో పరిభాగము చేరి తరుణియై బ్రహ్మరంధ్రముచేరి పతి వ్రితయై కామేశ్వరుని అనుభవించును) వయోవ్రతం బ్రాహ్మణస్య అను ప్రయోగ మందు వ్రతశబ్దమునకు అనుభవించుట అని అర్థము గలదు. ఇట్లు కౌమార తారుణ్య సంభోగములచే, అరిష్టమనగా అమృతవర్షరూపమైన శుభమును వేటొకదానిని అది చేయుచున్నదో అది యంతయు స్వాధిష్ఠాన మందుండు అగ్నిసాయమున జరుగు చున్నది. (సాధించుచున్నది)" (శ్రీలలితా సహస్రనామ భాష్యం. 111 నామం. అనువాదం శ్రీ పొంగూరి సూర్యనారాయణ శర్మగారు)

ఈ ప్రకారం అంతా గిరికయందు ప్రతిబింబింపజేసి ఇట్లు అగ్ని అటు కామేశ్వరుడూ అయిన వసురాజుని ఆమె అనుభవించటంగా రామరాజభూషణుడు

కుండలినీశక్తి కామేశ్వరి అగుటనే అనువదించాడు. చూడండి "సతి సాహిత్య రహస్య మీశువలనన్ (స్వాధిష్ఠాన వరుణగర్భాగ్ని) సాధించి తోడ్తోన తత్ప్రతికిం బ్రిత్యుపదేశమిచ్చె (బ్రహ్మరంధ్రమందున్న కామేశ్వరునికి) నతుల ప్రౌఢిన్. (6-94) ఈ పద్యంలో కర్త- అతులప్రౌఢితో ప్రత్యుపదేశం చేసింది 'గిరిక' కనుక అనుభవమూ ఆవిడదే. కుండలినీ ప్రతిరూపంగా ఆమెను తీర్చిదిద్దేటప్పుడు 'అనుభవించుట' అన్న లక్షణాన్ని ఈ ప్రత్యుపదేశంలో స్థాపించి కథారామణీయకాన్ని కాపాడుకున్నాడు రామరాజభూషణుడు. అదే కాళిదాసు కుమారసంభవంలో ఒక ఉపమానం తెచ్చుకొని తంటాలుపడ్డా కొంత గందరగోళం తప్పదు చూడండి.
తమర్థ మివ భారత్యా సుతయా యోక్తు మర్హసి।

అశోచ్యాహి పితుః కన్యా సద్భర్త్రే ప్రతిపాదితా (6-79) ఋషిగణం శివుడికై కన్యావరణంకోసం హిమవంతుడితో అన్నమాటలివి. భారత్యా అర్థమివ— వాక్కుతోడ అర్థమును వలె, సుతయా—కొమారితతో యోక్తుం—కూర్చుటకు అంటారేమిటి! పెళ్ళికొడుకుతో పెళ్ళికూతుర్నికదా కూడుస్తారు లోకంలో. వరవిక్రయం నాటకంలో దాన్ని మార్చి కాళిదాసుగారిలా వ్రాయించిన శుభలేఖ ఏ పరిణామానికి దారితీసిందో చూడండి. సరే ఉపమానాన్నిబట్టి గ్రహించాలంటే వాక్కుతో అర్థాన్ని కూర్చటమా! భవభూతి ఉత్తరరామచరిత నాటకంలో "లౌకికానాంహి సాధూనాం అర్థం వాగనువర్తతే। ఋషీణాం పునరాద్యానాం వాచ మర్థోను ధావతి" అన్నదాన్లో ఋషుల వాక్కును అర్థం పరుగెత్తుకువచ్చి చేరుకుంటుంది అన్నదాన్తో సమర్థించుకుంటే కాళిదాసు ఋషులమాటకు గౌరవం దక్కుతుంది. అదీ పరిస్థితి. మరి రామరాజభూషణుడో! ఏ ఉపమాన సహాయ్యమూ లేకుండానే ప్రకరణౌచితంగా మధురార్థసంపన్నంజేసి అదే అర్థాన్ని సాధించాడు. అదీ అతని సాహిత్య రహస్యం. అతనివల్ల ఆంధ్రసారస్వతానికే ఉన్నతపీఠం.

అయితే ఈ తీరైన సతీపతుల నేర్పులు నన్నెచోడ కవిరాజ శిఖామణి పూర్వం ప్రస్తావించే ఉన్నాడు. 9-152 సీసం కడపటి ఆటవెలది "సతికిఁ తెలియఁ జూపెఁ-బతి వాని నన్నియు, మగువ వరుసఁ బతికి-మగుడఁజూపె, సతియుఁ బతియు నేర్పు-రతిభక్తిదలపోయ, రతులు నవములయ్యెఁ-బ్రతిదినంబు." అని. కాని అక్కడ వేద వాక్ప్రమాణబలసామర్థ్యం వెన్నుపట్టంలేదు." ఈశుఁడింపార ననేక

కాలముల నప్పటికప్పటి కొక్కఁ-భంగినా, గౌరియుఁ దాను నొంపొరులకంటె మనో భవకేళి లోలురై" (153) అన్న రతిభక్తి మాత్రం పుష్కలంగా ఉంది. దానికి "దేవతలెంత విహీనభాగ్యులో" (157) అని దేవతలె తలంచటం ఆ దంపతుల రాగ బంధం అంత బలంగల దనిపించినా "లోకవర్తన" ఉచితంగా లేదనే నిరసన వారి తలంపులోంచే తొంగిచూస్తోందికదా! ఆ అతివేలం అయిన రతిభక్తికి అడ్డుకట్ట వెయ్యాలసిన ఆవసరమూ ఉంది ఆ ప్రయత్నమూ జరిగింది. అటువంటి రతిని సాహిత్యరహస్యంగా పరిణమింపజేసిన వైదికభావగౌరవం రామరాజభూషణ ప్రశస్తి గన్న మూర్తికవిదే. వసుచరిత్రలో రతికి అడ్డూ అదుపూ అక్కర్లేదు. ఏమంటే

"భూనాథాగ్రణికి న్వధూమణికి సం-భోగాంత సౌఖ్యంబు బ్ర
హ్మానందానుభవంబుఁ దెల్పెననవ-ద్యంబై యవేద్యాంతరం
బై, నిర్లేపకలాపమై క్రమ విము-క్తానేక బంధాను సం
ధానంబై యపు నర్భవ ప్రభవ ఖే-దంబై విజృంభించుచున్" (6-95)

ఈ బ్రహ్మానందం అపునర్భవముక్తి నిచ్చేదిగా ఉండి ఎవరికీ ఏ ఇబ్బందీ కలిగించేది కాక విజృంభించింది. కామేశ్వర ప్రతిమానుడైన వసురాజు గిరికా కామేశ్వరికి దక్కటంతో కీర్తి జయమూ రాజ్యమూ కూడా గోత్రనందన, అగతనయ, అచల భూతి అని మించినవట. ఇంక "అఖండ భోగములతోడఁ, బ్రజలు గాంచిరి భూరి వైభవసమృద్ధి" (99) ఇప్పుడు మనం ఆశించేదే ఇది. దైవం అనుకూలించుగాక!

నమోస్తుతే వ్యాసవిశాలబుద్ధే ఫుల్లారవిందాయత పత్రనేత్ర!
యేన త్వయా భారత తైలపూర్ణ ప్రజ్వాలితో జ్ఞానమయ ప్రదీపః
హ్రదానా ముదధి శ్రేష్ఠో గౌర్వరిష్ఠా చతుష్పదాం।
యథైతా నీతిహాసానాం తథాభారత ముచ్యతే॥

మడుగుల్లో సముద్రమూ జంతువుల్లో గోవూ ఎలా శ్రేష్ఠాలో అలా ఇతిహాసాల్లో భారతం శ్రేష్ఠం అంటారు. అందులోంచి ఉపాఖ్యానం అనటానికూడా నోచనంత చిన్నదైన ఉపరిచరవసు మహారాజు వృత్తాంతాన్ని తీసుకుని వేదవాణీ ప్రతిరూపంగా "అవారిత సత్కవి కల్పనా విశేషావహం" అంటే ఇలా ఉండాలని లక్ష్యలక్షణ సమన్వయంచేసి "వసుచరిత్ర" మధుర ప్రబంధాన్ని ఆంధ్రులకందించిన రామరాజ భూషణుని భావాన్ని అందుకొని ఆనందించటమే మనం చూపించే కృతజ్ఞత.

నా తెలివికి తట్టక చూపులకి పట్టక వివరణలో గిట్టుబాటుకాక ఎన్నెన్ని విశేషాలు దారితప్పాయో జారిపోయాయో తేలిపోయాయో! భావి బుద్ధిమంతులూ సూక్ష్మ దృక్కులూ వాగర్థసద్యోజకులూ ఎవరికెంత సాధ్యమైతే అంతంత వసుచరిత్రలోని మాధుర్యతేజోబలాన్ని ఉద్ధరిస్తారని ఆశిస్తూ సెలవు తీసుకుంటున్నాను.

అస్యకావ్యస్య కవయో నసమర్థావిశేషణే!
విశేషణే గృహస్థస్య శేషాస్త్రయ ఇవాశ్రమాః॥

గృహస్థాశ్రమాన్ని తక్కిన మూడూ అతిశయించలేనట్లే నీ (భారత) కావ్యాన్ని మరేకవులూ అతిశయించలేరని బ్రహ్మ వ్యాసుడికి మాటఇచ్చాడట. కాలాంతరంలో ఆ మాట మరచిపోయి రామరాజభూషణుడనే మూర్తి కవిని ఆ భారతం గొప్పతనాన్ని స్థాపించటానికే అయినా ఇలా ఆంధ్రభూమిలో పుట్టించి వ్యాసుడికి తానిచ్చిన మాట సంస్కృత భాషలోనేసుమా ఆంధ్రభాషలో కాదన్నట్లు సమర్థించుకున్నాడంటే ఆశ్చర్యమూ మనకు గర్వమూకాదూ! చూడండి :

భారతమట్లు వైదిక సు-వాక్ప్రతిరూపణ విద్యగా సుధా
పారణఁజేయ మూర్తి కవి-భారతి నిట్లు జనింపఁజేసి 'నీ
తీరుకవుల్మరుండ' రను-దీవెన వ్యాసుని సంస్కృతంబునన్
జేరిచి యాంధ్రభాష మని-చెన్విధి యెంతటి వాగ్విధాతయో!

భీమవరం
7-6-1985

జొన్నవిత్తుల రామకృష్ణశర్మ
తెలకోవెల : బలుసుమూడి : భీమవరం.

# వసుచరిత్ర-ప్రబంధ దర్శనం

## అనుబంధం-3

వసుచరిత్ర పేరుమీద పంచమవేదం అనిపించుకుంటున్న శ్రీ మహాభారతంలో "ఉపరిచరవసు మహారాజు వృత్తాంతము" అని సంక్షేపంగా ఉన్నదాన్ని విశ్లేషిస్తూ కథాకల్పనలతోనూ నూత్నపాత్రల సృష్టిలోనేకాకుండా వేదార్థాభిహితంగా జేసి మూలానికి గౌరవం స్థాపిస్తూ ఔచిత్యవర్ణశోభితంగా సమతూకం ఏర్పరచికూడా మహాప్రబంధంచేసి రామరాజభూషణుడు ప్రదర్శించిన మహేంద్రజాలం చూసాం. మనం ఆ మహేంద్రజాలంలో చిక్కుకుపోయి ఆశ్చర్యమో ఆనందమో అనుభవిస్తున్నాం అనుకుంటూ శిల్పాకృతులంగా నిలిచిపోవటంకాక, కర్తవ్యతా నిర్ధారణకైన చైతన్యప్రేరణ ఏమైనా పొందగలమా అనేది ఇప్పుడు ప్రస్తావిస్తాను. అంతే ఇదేదో కొందఱనుకునే సాంఘికప్రయోజనమో, లేకపోతే సామాజిక స్పృహగానో తాత్కాలిక సంకుచిత భావోద్రేకాలని రెచ్చగొట్టే ఇంధనంకోసం అన్వేషణ కాదు సుమా! వ్యష్టి-పాత్రతాధర్మచైతన్యంతో, సమష్టి-సమగ్రతా పరిపోషణకోసం చెయ్యదగిన అర్థప్రస్థానం అందుకోవాలనే ప్రాకులాట ఇది.

రామరాజభూషణుడు వసుచరిత్రలో ఎక్కువ మక్కువ చూపించిన విషయం ఒకటి ఉంది. అది రూపప్రతిఫలన కల్పనం. చూడండి-

1. కావ్యారంభ పద్యంలోనే "నిజమంజీరాగ్ర రత్నస్వలీలాభివ్యక్తి" 1 ఆ. 1 పద్యం
2. "మునుకొని కలధౌతభిత్తి ముకురతల బహిర్జనితానుబింబనమ్ములు" 2 ఆ. 24 పద్యం.
3. "ప్రియుఁగాంచెఁగుచాంచలహారధారలోన్" 3 ఆ. 65 ప.
4. "ఈ చిగురుఁబోఁడి కుచార్పితహారనాయకోజ్జ్వలరుచిఁ గంటిరే" 3ఆ. 66 ప.
5. "మోమువాంచి తొయ్యలి భవదేకదర్శిత మదాకృతిఁ జూచెఁగదా!" 4 ఆ. 103 ప.

6. "భూరమణ పురాధిదేవత హిరణ్మయదర్పణ దీప్యమానమై" 5 ఆ. 67 ప.

7. "పట్టె మణీమయదర్పణంబు.......పార్థివ యీముకురంబు మేలొ నా మేలిమి
చెక్కుటద్దమిది మేలొ కనుంగొను మన్విధంబునన్ ॥ 5 ఆ. 95 ప.

8. "నానాభూషణ రత్నజాలములలో-నంబొల్చు నాత్మీయ కా
యానుచ్ఛాయలచేఁ గరంబలరె మే-నాపత్య సత్పుత్రి" 5 ఆ. 125 ప.

9. "వచ్చి నృపాలకేళి గృహ-వాటము నెచ్చెలి పిండు చాటునం
జొచ్చి మెఱుంగు దేరు తొగ-చుట్టపు డామొగరంబు మాటుగా
నచ్చపలాక్షి నిల్వ నది-యవ్వల భర్తకుఁ జూపె రాచసొ
మ్మెచ్చటనైన నిత్యశుచి-వృత్తులు మాటికొనంగ నేర్తురే." 6 ఆ. 76 ప.

10. "నవరత్న ప్రతిబింబ దంభమున న-న్నాళీకపత్రాక్షిఁ ద
త్సవయోరూప సఖుల్ భజింపఁగని ల-జ్జాయుక్తిమైఁబోలె నా
శివితానంబొక నేర్పున న్వెడల ని-ల్చెందాన వ్రీడావయ
స్య వధూటీలలితాంతరంగ చిరస ఖ్యాభ్యాస బంధంబునన్." 6 ఆ. [illegible]1 ప.

11. "సతచూడాపరికర్మ చంద్రతపనుల్-నక్షత్రదామంబునం
బ్రతిబింబింపఁగ నున్న కన్నెయతన్-మాంగల్యసూత్రంబు శా
శ్వత కళ్యాణగుణావహుండునిచె నా-చంద్రార్క నక్షత్ర సం
తతిపై మించు తదీయనిత్యగుణముల్-నాకుల్ ప్రశంసింపఁగన్." 6ఆ. 27 ప.

12. "అతివ సతీకరోన్నమిత-యై విభునౌదల సేసఁజల్లెఁ ద
త్ప్రతి నవమౌళి రత్నగత-భవ్యనిజాకృతిఁ జూచి కంటిరే
పతి శిరమెక్కె నీక్షణమె-బాలయటంచు ధరాధరో పరి
స్థితి సరిదాత్మసంభవకుఁ-జెల్లదెయంచు సఖుల్వచింపఁగన్" 6 ఆ. 28 ప.

ఇలా కథాసందర్భంగానే కాకుండా అవతారికలో సైతం కృతిభర్త అయిన తిరుమలరాయలు సిరుల నిరవొందుచుండటాన్ని వర్ణించే 14వ వచనంలో కూడా ముచ్చటగా ముమ్మారు ఈ ప్రతిబింబ కల్పనం కనిపిస్తుంది.

1. "కలశ కర్ణికాధిష్ఠిత రాజ్యలక్ష్మీ రతోత్సవఘానాడంబర సంబోధకాంబురుహ బింబానుబింబ వైభవుండును"
2. "చంద్రకాంతభిత్తి బింబి చంద్రాననా వదనంబులు తరంగభక్తి బహూకృత నవేందు బింబంబుల యందంబు పొందుపరుప."
3. "అభినవ స్ఫటికోపల సంస్థాపిత సోపానపార్శ్వ కరికరాకార రేఖా విశేషంబులు సప్రతిచ్ఛాయ సంజాయమాన సంక్రందన వేదండ శుండాదండ ప్రచారంబులం బచరింప."

ఇలా రూప-ప్రతిబింబ కల్పనచేసి ఏదో ఉత్ప్రేక్షాది అలంకార విధిమాత్రంగా రామరాజభూషణుడు వర్ణించాడనిపించదు. అయితే వాటిమూలంగా ఏమైనా ధ్వనింప జేస్తున్నట్లా అంటే దేన్ని ధ్వనింపచేస్తున్నట్లు? ఆలోచిస్తే ఏదో చైతన్యస్ఫూర్తి అనిపింపక మానదు. ఇలా చూడండి :

మనలో కాళ్ళూ చేతులూ లాంటి కర్మేంద్రియాలవల్లే చైతన్యం వ్యక్తం ఔతున్నట్లు అనుకుంటాంగాని నిజానికివస్తే చర్మచక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణాలైన పంచజ్ఞానేంద్రియాలు కలిగించిన స్పందనలను తృప్తిపరచటానికి ప్రయత్నించటమే ఆ కర్మేంద్రియాల పని. కాబట్టి జ్ఞానేంద్రియ చైతన్యమే ముఖ్యం. ఇప్పుడు వాటి చైతన్య (అదే వాటి జ్ఞాన) స్వరూపవిషయం కాస్త విమర్శించుకుందాం.

"ఇంద్రియములు లేకుండా మనస్సు ఏవిషయాన్నీ తెలుపుడుచేయలేదు. అదే వార్తికంలో భట్టపాదులు 'యథాచ మనస్స్వార్థం రూపాది చక్షురాదినా ప్రవృత్తి సుఖ దుఃఖాదౌ కేవలస్యైవ గమ్యతే' అని. మనస్సుతోగూడి నటువంటి చక్షురాదుల చేతను రూపజ్ఞానం కలుగుతుంది. శబ్దజ్ఞానం కలుగుతుంది. రసజ్ఞానం కలుగుతుంది. మనస్సులేనిదే దేనివల్లనుంచీ కలుగదు. అనే. దానినే శ్రుతి "యేదేవా మనోజాతా మనోయుజస్సుదక్షా దక్షపి తారస్తేనో ఽవన్తు తేభ్యో నమస్తేభ్యస్స్వాహా" అని తెలియ జేసింది.

"యేదేవాః—చక్షురాది ఇంద్రియములకు ఏ అభిమానదేవతలున్నారో : చక్షురింద్రియానికి అభిమాన దేవత సూర్యుడు........అందుచేత సూర్యునియొక్క సహాయంలేనిదే చక్షురింద్రియం ఏ వస్తువునీ చూపించలేదు. చక్షురింద్రియానికి అభిమానదేవత సూర్యుడు. అలాగే వాగింద్రియానికి అభిమాన దేవత అగ్ని. ప్రతి ఇంద్రియమునకు అభిమానదేవతలున్నారు. ఈ దేవతలుట

"మనోజాతాః—ఉత్పత్తికాలే మనసాసహ ఉత్పన్నాః, పుట్టేటప్పుడు మనస్సుతో కూడానే పుట్టారుట. యింద్రియాభిమాన దేవతలంతా. మనోయుజః— వ్యాపారకాలేపి మనసాసహ యుజ్యన్తే, వ్యాపారకాలంలోకూడా మనస్సుతో కలుస్తుంటారట వీళ్ళు. ఈ యింద్రియాధిదేవతలు మంచి దక్షతాకౌశలం కలవారు ఎందులో; తత్తత్ప్రమేయగ్రహణే, రూపాన్ని గ్రహించటంలో చక్షురింద్రియం అద్వితీయమైన ప్రామాణ్యంగలది. శబ్దాన్ని గ్రహించటంలో శ్రోత్రేంద్రియం. రసాన్ని గ్రహించటంలో రసనేంద్రియము. గంధగ్రహణంలో ఘ్రాణేంద్రియము....ఒక్కొక్క విషయము గ్రహించటంలో ఒక్కొక్క ఇంద్రియము అనితరసాధారణమైనటువంటి శక్తి కలిగి నటువంటిది. విలక్షణమైన ప్రాధాన్యం కలిగినటువంటివి. బుద్ధితోకూడ కలిసి పనిచేస్తుంది. కేవలం బుద్ధి ఓసి పనిచేస్తుందా అంటే "మహతాపి ప్రయత్నేన తమిస్రాయాం పరామృశన్ కృష్ణ శుక్ల వివేకంహినకశ్చి దధిగచ్ఛతి", ఎంత ధీమంతుడైనాకాని చీకట్లో పరామర్శచేసి ఇది తెలుపూ ఇది నలుపూ అనే విషయం నిర్ణయించగలడా. లేడే. అందుచేతను ఏం కావాలన్నమాట ! ఇతనికి బుద్ధితోపాటు ఇంద్రియంకూడా ఉంటేగాని రూపాదిగ్రహణం చెయ్యలేడు... అందుచేత కేవల బుద్ధీ పనిచేయదు. కేవల-మింద్రియమూ పనిచేయదు. ఇంద్రియములూ-బుద్ధీ రెండూ కావాలి." (శ్రీ రే. సూ. ప్ర. శా. గారి వేదార్థోపన్యాసములు పుట 42, 43 & 44)

దీన్నిబట్టి మనం గుర్తించాలిసింది చూద్దాం. మనకు ఇంద్రియాలూ వాటితో బుద్ధీకూడా ఉన్నాయి. చక్కగా వాటిని ఉపయోగించుకుంటున్నాంకూడా. అయినా సూర్యుడూ అగ్నిలాంటి అభిమాన దేవతల సహకారం తప్పకుండా కావాలి. ఈ అభిమానదేవతలంటే ఉదయిస్తూ అస్తమిస్తూ ఆకాశంలో తిరుగాడుతున్నట్లు కనిపించే ఏదో కాంతిబింబం (సూర్యుడు) లాంటివనేకాదు. ఆ బింబమే అయినా చూడటం అనే వ్యాపారంలో ఉపకారంచేసే సామర్థ్యం గలదన్నమాట. పిల్లిలాంటి వాటికి చీకట్లోనూ ఏదో చూపుకి సాయంచేస్తుంది. ఆ సాయంచేసేది ఏదైతే అదే ఆ అభిమాన దేవత అన్నమాట. అది ఒక మూలచైతన్యం. అది చూడబడే వస్తువు మీదనుంచి కంటిద్వారా మనలో ప్రవేశిస్తే మనలో ఉన్న బుద్ధి ఆ వస్తువు ఎలాంటి వర్ణపరిమాణరూపాదుల్లో ఉందో పసిగట్టేస్తుంది. ఇలా వస్తువుల మార్దవ కాఠిన్యాదులన్నీ, రూపవర్ణాదులన్నీ, వివిధ ధ్వనులన్నీ, రకరకాల రుచులన్నీ, వేర్వేరు వాసనలన్నీ

మనలో అవయవాలుగా కనిపిస్తున్న చర్మమూ, కళ్ళూ చెవులూ, నాలుకా, ముక్కూ అనేవాటిద్వారా మనస్సు (మెదడంటారేమో విజ్ఞానశాస్త్రజ్ఞులు) పనిగట్టడం జరుగుతుంది. వాటివల్ల కలిగే ఇష్టాయిష్టఫలంగా సుఖదుఃఖాదుల అనుభవం మనకి కలుగుతుంది. (ఆ ఇష్టాయిష్టమూలం ఏమిటో ఇప్పుడు చెప్పలేం) అందులో సుఖానుభవం కోసం కర్మేంద్రియాలైన కాళ్ళూ, చేతులూ, మాటా, విసర్జక సంగమావయవాల ద్వారా మనం ప్రాకులాడతాం. ఇది అందరికీ తెలిసిన విషయమే అనుకోండి. అయినా ఎందుకు గుర్తుచేస్తున్నానంటే సుఖానుభవయోగ్యత వ్యక్తి వ్యక్తికీ సర్వసాధారణం అయిఉన్నా ఆ సుఖసాధన సామగ్రి సేకరణకోసంఅయిన శ్రమపడటానికి ఎక్కువమంది సిద్ధపడరు. అలా శ్రమించి సేకరించి పెట్టుకున్న వాళ్ళెవరైనా ఉంటే సంగ్రహించటానికి ఎవరికివాళ్ళు సిద్ధంఔతారు. అది బలాబలాలని తేల్చుకోవటంగా తేల్తుంది. హింసకి దారితీస్తుంది. సర్వనాశనకారి ఔతుంది. మరి అలాంటిదాని కవకాశం లేకుండా వ్యక్తి ప్రయత్న-సామర్థ్య-యోగ్యతలకు అనుగుణం అయిన నియమాలు నిర్ణయిస్తే సామాన్య సుఖసంపత్తి వ్యక్తివ్యక్తికీ కూడా దక్కే వీలుంది. అలా వీలుకలిగించే నియమశాస్త్రం, అమలుపరిపించే సమగ్రదృష్టిగల వ్యవస్థా కావాలి. ఆ వ్యవస్థ వ్యక్తివ్యక్తిమీదా ఆదరాభిమాన సానుభూతులు కలిగి మానవసామాన్యమైన సుఖసంపత్తిని సమకూర్చుకోటంలో వారికి తోడ్పడాలి. అలాగే వ్యక్తి ఆ వ్యవస్థ నియమాలను పాటించటంమీద శ్రద్ధా భక్తిగౌరవాలుంచుకొని దాన్ని కాపాడుకోవాలి. ఆ వ్యక్తిని వ్యష్టిఅనీ వ్యవస్థని సమష్టి అనీ అంటాం. వ్యష్టి కోసం సమష్టిని రూపుమాపటంకంటె సమష్టికోసం వ్యష్టి త్యాగసహనాలు అలవర్చుకోటం (అదైనా అత్యవసర అవాంతర పరిస్థితులు వచ్చినపుడు మాత్రమే. అవేమీ తరచుగానూరావు ఎంతోమందికీ రావు) మంచిది అనేది నాగరికులుగా - అదే ఆర్యులుగా మనం గుర్తించాలి.

జ్ఞానేంద్రియ పంచకమూ మనస్సూ విడివిడిగా వ్యష్టి. ఇంద్రియపంచకం దేనికదే అద్వితీయమైన ప్రామాణ్యం కలది. ఆ అయిదింటి వేర్వేరు ప్రమాణాలనూ ఒకేరకమైన సర్వసామాన్య ఆదరాభిమాన సానుభూతులతో మనస్సు స్వీకరిస్తుంది. అలాగే ఆ ఇంద్రియాలూ శ్రద్ధాభక్తిగౌరవాలతో మనస్సుకి తమతమ ప్రామాణిక సంజ్ఞల నందిస్తాయి. అంటే ఆ ఇంద్రియాలని ఒక వ్యవస్థలో (జ్ఞానం) పాలిస్తుండే అధికారం మనసుకి ఉందన్నమాట. ఇంద్రియాల పాలనచేసే ఈ మనస్సుని

ఇంద్రుడు అని పిలవవచ్చు. వ్యక్తిగా ఇంద్రియసంజ్ఞ పొందినా మనస్సుకూడా వ్యష్టియే. అయినా వ్యక్తి వ్యక్తిగా ఉన్న ఇంద్రియ ఇంద్రియానికీ సహకరిస్తూ జ్ఞానం నిలుపటంలో సర్వసామాన్య తత్త్వం చూపించటంవల్ల సమష్టి ప్రతిరూపం ఔతుంది.

ఇక్కడ ఒక విషయం మనం గమనించాలి. రూపగ్రహణం చెయ్యటానికి చక్షురింద్రియమె ప్రమాణము. శబ్దగ్రహణం చెయ్యటంలో శ్రోత్రేంద్రియమే ప్రమాణము. అంతేకాని ఒక నెలరోజులపాటు చెవి విశ్రాంతి తీసుకుంటానని కాస్త కంటినే తన వినటంకూడా చూసుకోవలసిందంటే కుదరదు. ఏమయ్యా వినటాన్నీ చూడటాన్నీ గ్రహించేది ఒకే మనస్సుకదా ! కొంచెం సానుభూతి కలిగి చాలామంది వాడిస్తూండే మానవత్వంతో చూడమంటే - ఏమీ లాభంలేదు. మనసుకి ఆ అధికారం-లేదు. వినటానికి చెవియే కావాలంటుంది. చూడటానికి కన్నే కావాలంటుంది. అలా దాన్ని ప్రవర్తింపజేసేది ధర్మం. ఆ యా అవయవ నిర్మాణాల్లో ఆ యా పనుల కనుకూలంగా సమకూర్చబడ్డ నియమన శాస్త్రం అది. ఒకదాని కూర్పు మరోదానికి పట్టదు. ధర్మశాస్త్రం అంటే అది. యోగ్యతా సామర్థ్యాల తో బుట్టువు. ఇప్పటికి ఇది తెలిస్తేచాలు. అంటే యోగ్యతా సామర్థ్యాల గణనరూపం అయిన ధర్మశాస్త్రాను గుణంగా వ్యష్టి వ్యక్తి స్వప్రమాణ సుఖసంపత్తితో అందుకు అన్నివిధాలా ఆదరాభి మాన సానుభూతులు కురిపించే సమష్టిలో శ్రద్ధాభక్తిగౌరవాలతో ఇమిడిపోవాలి. అది పురుషోత్తమప్రాప్తి.

ఇపుడు చూడండి : ఇంద్రియాలూ-మనస్సు అనేవాటిల్లో కల జ్ఞానచైతన్యం వ్యష్టి-సమష్టి అనేవాటిల్లో ప్రతిఫలింపజేసుకుమాస్తే ఆర్య (పురుషోత్తమ) నిత్య చైతన్యం సంస్కృతిరూపంగా సర్వమానవ సుఖసంపద్విభూతితో ప్రకాశిస్తుందని స్పష్టం అయింది. ఈ చైతన్యస్ఫూర్తిని ధ్వనింపజెయ్యటానికే రామరాజభూషణుడు వసుచరిత్రలో అంతగా రూప-ప్రతిఫలన వర్ణనకి పూనుకున్నాడు. కథలో ఇంద్రుడి పాత్రకి ప్రాముఖ్యం పెంచటంలోకల రహస్యం ఇదే. ఇంద్రుడట వసురాజుకే కాకుండా ఇటు కోలాహలుడికీ ఆదరాభిమాన సానుభూతుల్ని వర్షించాడు. వాళ్ళు ఆయనని శ్రద్ధాభక్తిగౌరవాల పెనవేసుకుపోయారు. అందుకే కళ్యాణరూపం అయిన సర్వసామాన్య సంపద్విభూతి ప్రకాశించింది.

ఈ నిత్య చైతన్యం పుడుతూ గిడుతూ ఉన్న జీవుల్లో ప్రతిఫలిస్తూ ప్రవాహ రూపంగా గుర్తించటానికి కథలు కథలుగా మన పురాణాల్లో కనిపిస్తుంది. అందుకే ఆ కథల్లో ఒకటి అందుకుని సత్కవి ఏ కల్పనలు చేసినా ఆ కథనిబట్టి అందులోని చైతన్యాన్ని అర్థంచేసుకుని జీవులు వ్యష్టిగా శ్రద్ధాభక్తి గౌరవాలతో సమష్టి అయిన వ్యవస్థాబలంనించి ఆదరాభిమాన సానుభూతులు అందుకుంటూ ఆర్యత్వంతో తమదైన ఒక సంస్కృతిని శాశ్వతం చేసుకోవచ్చును అనేది రామరాజభూషణుడి సిద్ధాంతం. కూడా. "ఆద్యసత్కథల్ వావిరివుట్టు రత్నము"లని ప్రకటించటంలో తాత్పర్యం అదే. తన ఈ సిద్ధాంత విశ్వాసాన్ని "అవారిత సత్కవి కల్పనావిశేషావహ" అని ఊరుకోక మళ్ళీ అంటే విస్పష్టంగా "పూర్వవృత్తములు" "జాతిరత్నములు" అనటం చూస్తే అందులోకూడా అతడొక పూర్వవృత్తాన్ని ప్రతిఫలింపజేసాడేమో అనిపిస్తుంది. మరి పరిశీలిద్దాం.

రామరాజభూషణుడు వసుచరిత్రలో చేసిన కల్పన ముఖ్యంగా మూలకథలోనే ఉన్న ఇంద్రపాత్రని గిరికా వసురాజుల పెళ్ళికి సర్వనిర్వాహకుడిగా తీర్చిదిద్దటం. దీనికి ఆ కవికి ప్రేరణ ఎక్కడిది? పర్వత పుత్రిగా గిరిక పార్వతిని తలపుకి తేక మానదు. దానితో కుమారసంభవగాథ వెన్నుతట్టుతుంది. ఇంకేం మరి! సంభవం అయిన కుమారుడికి దేవసేన అనే కన్యతో పెళ్ళి జరిపించటంలో ఇంద్రుడిపాత్ర బయటకు వచ్చింది. దాన్నే వసుచరిత్రలో ప్రతిఫలింపజేసాడు రామరాజభూషణుడు. ఉత్సాహం ఉన్నవాళ్ళు ఒకసారి శ్రీ మహాభారతం అరణ్యపర్వం పంచమాశ్వాసంలో మార్కండేయుని ధర్మతనయుడు "మునినాథ మహాసేనుం, డనలునకుం గృత్తికలకు-హరునకు సుతుఁడై, ననిమిత్తమేమి తెలఁగో, వినవలతుం జెప్పవే సవిస్తరఫణితిన్" అన్న 176వ పద్యం మొదలు "గుహుఁడు దేవసేనఁ-గోరి పెండ్లియునైన. యా దినంబు షష్ఠి-యగుటఁజేసి, యర్చనీయమయ్యె-నాదివసంబు లో,కములకెల్లఁ గరము-గారవమున." అన్న 282వ పద్యం వరకు చదవండి. ఇక్కడ ఆ సందర్భంలో ఇంద్రుడిపాత్ర ప్రాధాన్యం మాత్రం పరిచయంచేస్తాను.

ఒకప్పుడు ఇంద్రుడు రక్కసులకు ఓడి దేవగణాలతో తొలగిపోయి 'మానస' మనే పర్వతంమీద ఓ స్త్రీ ఆర్తనాదం విని వెళ్ళి చూస్తే 'కేశి' అనే రాక్షసుడు 'దేవసేన' అనే కన్యను ఎత్తుకుపోతున్నాడు. ఇంద్రుడు ఆ రాక్షసుడ్ని నిరోధించి

ఎదుర్కొని యుద్ధంలో ఓడించేస్తే వాడు దేవసేనను వదిలి పారిపోయాడు. దేవసేన తను 'అరిష్టనేమి' అనే ప్రజాపతి కుమార్తెనని చెప్పింది. అప్పుడిం దుడు ఆమెయు తానును అప్పచెల్లెళ్ళ బిడ్డలని గుర్తించి చెల్లెలయిన దేవసేనకు వరం ఇస్తాను కోరుకోమన్నాడు. ఆమె ఒకప్పుడు తన తండ్రి "ప్రథితపౌరుషుఁడగు భర్తను" పొందగలవనటం చెప్పి "త్రిలోకరక్షణ వశంవదున్ భవ దిష్టమిత్రుఁడున్ ఘన గుణకీర్తనుండునగు కాంతునిఁగోరెద"నన్నది. అప్పుడింద్రుడు "మునులు వేల్చు హవ్యంబులు మోచికొని హవ్యవహనుండు సూర్యమండలంబు ప్రవేశించుచుండం గనుంగొని యిది సూర్యసోమాగ్ని సమాగమం బయిన రౌద్రనామక ముహూర్తంబు గావున సూర్యసోమాగ్ని తేజంబున జనియించినవాఁడు దీనికిఁ బ్రియుండు గావలయు నని మనంబున నిశ్చయించి" బ్రహ్మగారి దగ్గరకు తీసుకువెళ్ళి అడిగాడు. ఆయన "దీపిత విక్రమాస్పదుఁడు దీనికి వల్లభుఁడయ్యెడున్." "వాఁడ మీ యాపదలెల్లఁ బాపుటకునై ధృతిబూను"నని చెప్పిపంపాడు. ఇంద్రుడు ఆమెను తనదగ్గరే సురక్షితంగా కాపాడుతూ ఉన్నాడు.

అంతలో "ఆదిత్యనిభుఁడు విమల, ద్వాదశబాహుండు షడ్వ - దనుఁడఖిల దిశా,రోదోంతరంబు వెలుఁగమ,హోదారుండౌ కుమారుఁ-డుదయం బయ్యెన్." ఇట్లు శుక్లపక్షంబునం బాడ్యమియందు వీర్యనిషేకంబును, విదియయందు గర్భవ్యక్తియుఁ దదియయందు శరీరమాత్రావిర్భావంబునుం జతుర్దియందు సకలావయవ సంపూర్ణత యునై యుదయించిన కుమారుండు పంచమియందు సముత్థితాకారుండయి పేర్చి త్రిపురహరసాధనంబైన హరుకార్ముకం బమ్మహీధరంబునందు నిక్షిప్తంబై యున్న దానిం బుచ్చికొని....నిశితసాయకంబునం గ్రౌంచపర్వత విభేదనంబుసేసి పటుశక్తి పాతంబున శ్వేతశైల శృంగభంగంబు గావించి చెలంగి యాఱుమొగంబుల నొక్కపెట్ట యార్చినన్...." (207) "అమరులెల్ల నమరేంద్రుం గానంజని" (212) "వాని వధియింపుము చెచ్చెర విక్రమోన్నతిన్" (213) అని ప్రబోధించారు. ఇంద్రుడూ దండెత్తిపోయి పోరులో తట్టుకోలేక "హరిహయుం డగ్నిసంభవు నభయంబని కొలిచె నంత" (220) "షష్ఠదివసంబు ప్రాప్తంబయ్యె" (222) మహామునులు "ఇట్టి యవిజేయుఁడ వింద్రపదంబు నీక" అన్నారు. కుమారుడు ఇంద్రకార్య విధులు అడిగి తెలుసుకొని ఆ పదమును ఇంద్రునే ఉంచుకొమ్మని "ఏను నీచుట్ట మనై భుజాబలము సొంపున నీ కెలనంబు దీర్చెదన్" (228) అనిన కుమారుని

ఇంద్రుడు "సురసేనల కెల్లను నాయకుండవై .... జగద్భయనోదన మాచరింపవే" (229) అన్నాడు. అలా కుమార మహేంద్రులకు మైత్రి కుదిరింది. "అప్పుడింద్రుండు మున్నుదానవ్యర్ధవుని, యోగమున సురక్షితముగ నునిచినట్టి, దేవసేనయుఁ గన్యకా-తిలకమునకుఁ జెలువముగ నలంకారంబు-సేయఁబనిచి" (235) "ఇక్కన్నియ భవదర్థంబై పరమేష్ఠిచేత సృజియింపంబడియెం గావున నివ్వరవర్ణినిం బరిగ్రహింపు మనిన" (236) "దేవమంత్రి మంత్రానుగమంబొనర్ప" (237) "గుహుఁడు దేవసేనఁ-గోరి పెండ్లియునైన, షష్ఠీ దినంబు షష్ఠి-యగుటఁజేసి, యర్చనీయమయ్యె-నా దివసంబులో,కములకెల్లఁ-గరము-గారవమున." (238). ఇది కుమార కళ్యాణ కథ: అందులో ఇంద్రుని పాత్ర. ప్రతిబింబమే వసుచరిత్రలో రామరాజభూషణుడు తీర్చిదిద్దిన ఇంద్రపాత్ర ఆర్ష (భారత) సత్సంప్రదాయం ఆ కవికి ఎంత ముఖ్యమో చూడండి!

ఇక్కడికి రూప-ప్రతిఫలన విశేషాన్ని స్థూలంగా పరామర్శించుకొన్నాం. ఇప్పుడు కొంచెం సూక్ష్మవిశేషాలు చూద్దాం. రామరాజభూషణుడు వసుచరిత్రలో వర్ణించిన ప్రతిఫలన సాధనాలే రెండురకాలున్నాయి. రూపాన్ని తమలో పట్టి ప్రతిబింబాలు చూపించేవి ఒకరకం. ఒకవంక ఉన్నరూపాలని ఆవలివంక వారికి కనిపింపజేస్తూ పారదర్శకాలై నడుమ అడ్డుగా ఉండేవి ఇంకోరకం. రామరాజభూషణుడు ఈ ప్రతిఫలనాలవల్ల సాధించిన ప్రత్యేక ప్రయోజనం ఏమైనా ఉందేమో చూడాలి.

వెనుక మనం వ్యష్టి-సమష్టి గురించి తలపెట్టి ఉన్నాం. అందులో వ్యష్టి అయిన వ్యక్తి సాధించిన యోగ్యతా సామర్థ్యాల పరిమాణబల నిర్ధారకాలె ఈ ప్రతిఫలన సాధనాలు (అద్దాలు). సమష్టిలో అంతర్భవించే ఆదర్శం ఉన్న వ్యక్తియే వ్యష్టి. ఆ ఆదర్శంయొక్క స్థాయిని పట్టిచూపటమే ప్రతిఫలన సాధనాల పని. సమష్టిలో అంతర్భవించే వ్యష్టిగాకాక స్వార్థవ్యక్తిగా పనిగట్టి తనలో రూపాన్ని విఱవుకని ఆ వ్యక్తి రూపాన్ని చూపించే ప్రతిఫలకాలు ఒకరకం. అటువంటి వాటిల్లో సైతం సమష్టి ఆదర్శ ప్రతిరూపాన్నే పట్టిచూడటం వ్యక్తిలో వ్యష్టిగా ఉన్నతోన్నత ప్రమాణాలకు ఎదిగే సామర్థ్యాన్ని పరీక్షించటం అన్నమాట.

ప్రబంధంలో త్రైలోక్యాధిపత్య మహిమా సంపూర్ణ సమష్టి తత్త్వానికి ప్రతినిధి అయిన మహేంద్రుని ఆదరాభిమాన సానుభూతుల మైత్రిని గెలుచుకొన్న

భూలోక సమష్టి తత్త్వప్రతినిధి వసుమహారాజు. ఆయన ప్రతిరూపాన్ని చూచిన కుచాంచల హారధారలో పట్టిచూసిన కోలాహల పుత్రి అయిన గిరిక అంతవరకూ ఆయన కథాగాన శ్రవణాదుల (సమష్టితత్త్వ విద్యాభ్యాసనం) యోగ్యతగన్న వ్యక్తి. ఇప్పుడు రూపదర్శనాలావణ్యాల (సామర్థ్యబల ప్రమాణాని) కి ఎదిగి లక్షణవతువు (వ్యష్టి) గా- భార్య అనబడే ఉన్నతస్థాయి నందుకోటానికి తగిన వరుడుగని (సమష్టి ప్రతినిధిని గని తన యోగ్యత పరీక్షించుకోటానికి సంకోచించి) వలపు-మొలకల సిగ్గుపడి (ఆ ప్రమాణబల నిర్ధారకం)- ప్రతిఫలన సాధనం తన "కుచాంచల హారధార"లో ఆ ప్రియమూర్తి (సమష్టి తత్త్వప్రతినిధి అయిన) వసురాజు బింబాన్ని పట్టి చూసింది. సమయం మీరింతర్వాత ఆ రాజయోగం (సమష్టి ఆదర్శం) కోసం దేహత్యాగానికి (వ్యష్టివ్యక్తిగా అంతరించిపోయి సమష్టిలో అంతర్లీనం కావాలన్న ఆశయంకోసం) సిద్ధపడింది. అది "ఈ చిగురుఁబోఁడి కుచార్పిత హారనాయకోజ్జ్వల రుచిఁగంటిరే" (3-66) అన్న చెలుల మాటల్లో గ్రహించిన మంజువాణి- అదే హారాన్ని తీసుకువెళ్ళి వసురాజుకి అందించింది. అప్పటికే గిరికమీద మోహపడి మన్మథావస్థలో (వ్యష్టియొక్క ఉన్నత పరిమాణాన్ని అర్థంచేసుకుని తగిన పదవిని కట్టబెట్టే ఆలోచనలో) ఉన్న వసురాజు (సమష్టి తత్త్వప్రతినిధి) ఆ మణిహార దర్శనం (వ్యష్టి ప్రమాణ నిర్ధారక సూచన) వల్ల "మోముదాంచి తొయ్యలి భవదేక దర్శిత మాదాకృతిఁజూచెఁగదా" (4-103) అని గుర్తించి నిర్ణయాన్ని "నేనె తానసుట" (4-91) గా తలంచినది స్థిరపరచి "ఈ కుశహస్త మీ చెలియ కిప్పుడ పోయి యెఱుంగఁజెప్పి కామాశుగపీడితంబులగు ప్రాణము లూఱడిలఁజేయుము" (4-121) అని నిదర్శనంగా ఉంగరం (సమష్టి ప్రతినిధి అయిన తనతో సమాన ప్రతిపత్తి కల్పించబోతూ అభ్యంతర నిరాసకం అయిన అధికారముద్ర) ఇచ్చి పంపాడు. ఆ తర్వాత యథావిధిగా కళ్యాణయోగ పట్టం కట్టుకున్నారు. ఈ పరమాద్వైత తత్త్వాన్ని ధ్వనింపజెయ్యటానికే ప్రధానంగా బింబ-ప్రతిబింబ వర్ణనలు చేపట్టాడు రామరాజభూషణుడు. "మానుషాద్దైవ్యముపైమి" అన్న అగ్న్యాధాన మంత్ర తాత్పర్యమీ అద్వైతభావమే. మానుషత్వమునుండి దేవత్వము నందుచున్నాను అనే మంత్రార్థము. అదే మన సంస్కృతి.

ఈ ప్రతిఫలకాలని ప్రమాణబల నిర్ధారకాలని గుర్తింపచెయ్యటానికే రామరాజభూషణుడు వసురాజుని పెళ్ళికొడుకుగా అలంకరించినవేళ ఒక యువతి "పట్టె మణి

మయ దర్పణంబు....పార్థివ యీ ముకురంబు మేలో నా మేలిమి చెక్కుటద్దమిది మేలో కనుంగొను మన్విధంబునన్" (5-95) అని తారతమ్య పరిగణను వాద్యంచేసి మరీ సూచించాడు. ఆ అద్దంపట్టిన యువతి సమష్టి భావనకల వ్యష్టికాలేని స్వార్థ వ్యక్తిగా, అలంకరణ సరిచూసుకున్న తరువాత ఆ అద్దానికేమీ ప్రమేయం లేనట్లే అనామకురాలై మరుగున పడిపోయింది. సమష్టి వసురాజు ఆ వ్యక్తివంక చూపైనా పారనీయలేదు. కాగా వ్యష్టిభావన నిండిన గిరిక విషయంలో "నానాభూషణ రత్న జాలములలోనంబొల్చు నాత్మీయకా,యానుచ్ఛాయలచేఁ గరంబలరె మే - నాపత్య సత్పుత్రి" (5-125) అని అలంకారోపకరణాల్లోనైతం నిస్వార్థమైన వ్యష్టితత్వమే నింపుకొని సర్వాత్మనా సమష్టిలో సమైక్యత పొందే యోగ్యతను స్థాపించుకొన్నట్లు వర్ణించాడు. సరే వ్యష్టి యోగ్యతాసామర్థ్యాలు పరిగణింపబడ్డాయి. తగిన స్థానం లభించింది. పదవీస్వీకారం అయింది. కార్యారంభం దగ్గరకి వచ్చేసరికి బాధ్యతలు తలచుకొన్నప్పుడు యోగ్యులైనవారు ముందుగా కొంచెం గుంజాటన పడటం సహజం. అప్పుడు ఆ వ్యష్టికి సమష్టినుండి ఆదరాభిమాన సానుభూతుల వెన్నుతట్టే ప్రోత్సాహం కావాలి. ఆ ప్రోత్సాహం ఉందన్న ధైర్యం చిక్కితే వ్యష్టి సర్వాత్మనా సమష్టిని అల్లుకుపోవచ్చును.

గిరిక వసురాజు కేళిగృహాన్ని ప్రవేశించి "నెచ్చెలిపిండు చాటునంజొచ్చుట" "మెఱుంగు దేరు తొగచుట్టపు జామొగరంబు మాటుగా నిల్చు"ట వంటి సిగ్గులలో ప్రకటించింది వ్యష్టి కార్యారంభంలో బాధ్యతల స్మృతికి పొందే జంకే. కాగా నెచ్చెలి పిండు సమష్టి వసురాజు దృష్టిలో ఆమె నిలిపి తప్పుకుంది. అప్పుడు ఎదుట ఏదైనా పొరపాటుచేస్తే దాన్ని సవరించి బాధ్యతానిర్వహణచేసే సమష్టియొక్క సమర్థన దక్కగలదన్న ధైర్యం ఒక్కింత కలిగినా తన తప్పును సానుభూతితో సైరించునో లేదో అన్న జంకు పోలేదు. "నిల్చెందాన వ్రీడావయస్య." అప్పుడు మాటు చేసుకున్న చంద్రికాంత శిలా స్తంభం అవ్వలభర్తకుఁజూపినదే (ప్రోత్సహించవలసిన అవసరం ఉన్నదని తెలియజేసిన ప్రమాణబల నిర్ధారక ప్రతిఫలకమే) అయింది. అది గ్రహించి సమష్టి వసురాజు వ్యష్టి గిరికకు బెఱుకుపోగొట్టి సురిగిపోనీక యోగ్య స్థానాన్ని చేర్చాడు. అప్పుడుకూడా "అట్టి రమణుండు డివియనా - హార్యతనయ, విధుమణీ స్తంభమున నర-వెడలి బయలు,పడి పెనంగుచు మరలి కం-బమొకకేల, నూనియూ। తయుఁదక్కి పా-న్పొయ్యఁజేరె." (6-78) నట. ఎప్పటికప్పుడే

ప్రోత్సాహం అవసరం అని సూచించేదిగానే చంద్రికాంతమణి దర్పణ స్తంభం కర్తవ్యంగా పాలించింది చూడండి. ఆ ప్రోత్సాహం అగ్గలం అయేటప్పటికి సమష్టి అస్తిత్వాన్ని అధిగమించి వ్యష్టియే సమష్టిపరిణామం పొందింది. ఇక అంతా సమష్టియే కాని వ్యష్టిలేదు. ఈ అద్వైత తత్వాన్నే రామరాజభూషణుడు సాంప్రదాయిక వైదిక విధి ననువదిస్తూ సాహిత్యమార్గంలో (ప్రబోధం) వ్యక్తంచేసాడు. ఆ రెండు పద్యాలూ వ్రాస్తున్నాను చదవండి.

మ. సతి సాహిత్యరహస్య మీశువలనన్-సాధించి తోడ్తోన త
త్పతికిం బ్రత్యుపదేశ మిచ్చె సతుల-ప్రౌఢిన్ ధ్వనివ్యక్తిఁ ద
ద్ధృతికిం జొన్పుచు లోచనాంజనరస-ప్రోన్మేషము ల్తన్ముఖో
ద్గతము ల్సేయుచుఁ బ్రత్యలంకరణమౌ-ఖర్యంబు దీపింపఁగన్. (6-94.)

శా. భూనాథాగ్రణికి న్వమామణికి సం-భోగాంతసౌఖ్యంబు బ్ర
హ్మానందానుభవంబుఁ దెల్పెననవ-ద్యం బై యవేద్యాంతరం
బై నిర్లేపకలాప మై క్రమవిము-క్తానేకబంధాను సం
ధానంబై యపునర్భవ ప్రభవభే-దంబై విజృంభింపమన్ (6-95)

పై పద్యంలో సాహిత్యరహస్యం తర్వాతి పద్యంలో సంభోగాంతసౌఖ్యంఅంటే చూడండి శ్రుతి ఏమంటుందో:

"ఇంధోహవై నామైష యోఽయం దక్షిణేఽక్షన్ పురుష స్తం వా ఏత మింధగ్ం సంతమింద్ర ఇత్యాచక్షతే పరోఽక్షేణైన పరోక్షప్రియా ఇవహిదేవాః ప్రత్యక్షద్విషః। అథైతద్వామేఽక్షణి పురుషరూపమేషాఽస్య పత్నీ విరాట్ తయో రేష సగ్ంస్తావో యఏషోఽ న్తర్హృదయ ఆకాశోఽథైనయో రేత దన్నం యఏషోఽ న్తర్హృదయే లోహితపిండః" బృ. ఆ. ఉ. 4-2-2, 3.

"ఆదిత్య మండలాంతర్గత పురుషుడే ఆధ్యాత్మికముగ దక్షిణనేత్రమున విశేషముగ నభివ్యక్త మగుచుండును. దక్షిణాక్షిగత పురుషజ్యోతికి ఇంధః అని పేరు. దీప్తిగుణాతిశయముచే నీ జ్యోతి కిది ప్రత్యక్షనామము. ఈ ఇంధుని పరోక్షముగ ఇంద్రుడని వ్యవహరింతురు. వామనేత్రమునగల పురుషాద్ర ప్రకాశమునకు 'ఇంద్రాణి' యని పేరు. ఈ ఇంద్రాణియే విరాడ్రూపమునను, భోగ్య-అన్న రూప

మునను నొప్పును. భోక్తయగు నింద్రుడును, భోగ్యరూపయగు నింద్రాణియు హృదయపుండరీకాంతర్గత ఆకాశమున పరస్పర తాదాత్మ్యభావనతో మిథునీభావము జెంది వినోదించుచుందురు. ఈ మిథునము జాగరితమున వైశ్వానర నామమునను స్వప్నమున తైజసనామమునను బరగుచు జాగరస్వప్నావస్థలయందు పుత్రమిత్ర బంధు దర్శనాది రూపక్రీడల సలిపి సలిపి యలసి విశ్రాంతి జెందును. ఇట్టి విశ్రాంతికి సుషుప్తియని పేరు ఈ స్థితియందీ మిథునము 'ప్రాజ్ఞ' నామమున బరగుచు, స్వస్వరూపానందమున బ్రతిష్ఠితమైయుండి తిరిగి హృదయదేశమునుండి యూర్ధ్వముగ బ్రసృతమగు 'సంచరణీ' నాడీమార్గమున జాగ్రదవస్థ నొందుచుండును. (చూ. శం. భా.)

"పై శ్రుత్యర్థమునే శ్రీ శంకర భగవత్పాదు లిట్లు శతశ్లోకియందును వివరించిరి. "ఇందేంద్రాణ్యోః ప్రకామం సురతసుఖజుషోః స్యాద్రతాంతః సుషుప్తిః, తస్యామానందసాంద్రం పద మతిగహనం యత్స ఆనందకోశః। తస్మిన్నో వేద కించి న్నిరతిశయ సుఖాభ్యంతరే లీయమానో, దుఃఖీ స్యా ద్బోధితః సన్నితి కుశల మతి ర్బోధయే న్నైవ సుప్తమ్॥ శత శ్లోకి. ౮౯.

ఇట్లు శ్రుతి యగ్నీంద్రాదులయొక్క ప్రత్యక్ష పరోక్ష నామముల నుపదేశించి యా యా దేవతా తత్త్వమును దెలియజేయుటయే గాక, యతీంద్రియమగు 'భోక్తృ-భోగ్య' స్వరూపమునుగూడ వివరించుచున్నది.

"స్థూల శరీరాతిరిక్తుడగు జీవుడు భోక్త. అతని యుపభోగమునకైన వస్తుజాతమంతయు భోగ్యము. జగత్తు ఇట్టి భోక్తృ-భోగ్యాత్మకమని పూర్వమంత్రమున జెప్పబడినది. భోగ్యపదార్థము భోక్తచే గ్రహింపబడి, భోక్తతో నేకీభూతమగు నపుడు అది భోక్తృరూపముననే వ్యవహరింపబడుచుండును. కావుననే భోక్తృభోగ్యాత్మకమగు శరీరముతో తాదాత్మ్యముచెంది జీవుడు 'అహమ్'అని(భోక్తృరూపముననే) వ్యవహరించును. అనగా ప్రాణాగ్నియందు ఆహితమై, ఆహుతిరూపమై భోగ్యవస్తుజాతమంతయు ప్రాణాత్మకుడును, భోక్తయునగు జీవుని రూపముననే వ్యవహరింపబడుచున్నది. ఇట్టి జీవుడు జాగ్రద్దశయందు వైశ్వానరుడు, స్వప్నమున తైజసుడు, సుషుప్తియందు ప్రాజ్ఞుడు-అను రూపముల బరగి విలసిల్లుచుండునని శ్రుతి చెప్పుచున్నది. ఇంతియేకాదు. భోక్తయై ప్రసిద్ధుడైన జీవుడు 'ఇంద్ర-ఇంద్రాణీ దేవతా

మిథునరూపుడు' అనియు శ్రుతి చెప్పుచున్నది. అందును మరల ఇంద్రుడు భోక్తృ ఇంద్రాణి భోగ్యవిరాడన్నరూపిణి. ఈ దేవతా మిథునీభావమే జగద్యాత్రకు మూలము. భోక్తృ-భోగ్య రూపమగు ఈ దేవతామిథునమే భోక్తయగు జీవరూపమున ప్రసిద్ధమగుచున్నది." (భారతీనిరుక్తి 245, 246 & 247 పుటలు)

ఈ ఇంద్ర-ఇంద్రాణీ మిథునీభావమే వసురాజ గిరికా సంభోగమున రామరాజభూషణుడు ప్రతిఫలింపజేశాడు. ఆ సంభోగాంతసౌఖ్యము జగద్యాత్ర. అవిచ్ఛిన్నమై సంస్కృతిగా ప్రతిబింబిస్తూ నిలిచిపోయేది. దాన్ని స్థాపించే శాస్త్రవిద్య ఏదిఉందో అదే సాహిత్యరహస్యం. అద్వైతవిలసనం. పై మిథునీభావంలో ఉన్న ఇంద్రుడు చూడండి. "ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే, రూపం రూపం ప్రతిరూపో బభూవ" ఋ 6-47-15 "రూపం రూపం మఘవా బోభవీతి" ఋ.3-53-8. "రూపాణి బిభ్రతం పృథక్" వా. సం. 28-32 "అని యీ రీతిగా శ్రుతులు పరమేశ్వరుడు (ఇంద్రుడే) వివిధరూపములు ధరించుట పెక్కుచోట్ల వివరించినవి" (భా. ని. 585 పుట) ఇంకొంచెం వివరం చూడండి.

"త్రిహేంద్ర మగ్నిం జగతః ప్రతిష్ఠాం। దివ ఆత్మానగ్ం సవితారం బృహస్పతిం। చతుర్హోతారం ప్రదిశోనుక్లృప్తం వాచోవీర్యం తపసాన్వవిందత్ ।" తై. ఆ. 3-11-2 (మా.సా.భా.) "ఈ ఋక్కునందు వేదవాక్సారభూతుడగు (వాచోవీర్యం) పరమేశ్వరుడు ఇంద్రశబ్దముచే చెప్పబడినాడు. ఇట 'జగతః ప్రతిష్ఠాం' ఇత్యాది విశేషణములతోపాటు 'అగ్నిం, సవితారం, బృహస్పతిం' అని దేవతావాచకములుకూడ ఇంద్రునకు (పరమేశ్వరునకు) విశేషణములుగా నిర్దేశింపబడినవి. అనగా నీ పదములయొక్క ప్రవృత్తి నిమిత్తములద్వారా పరమేశ్వరునియందలి విభిన్న మహత్త్వముల దర్శింపవలెనని శ్రుతియుద్బోధించుచున్నది." (భా. ని. 120) కొంచెం ఇదికూడా చూడండి.

"ఇంద్రియేభ్యః పరాహ్యర్థా అర్థేభ్యశ్చపరం మనః। మనసస్తు పరాబుద్ధిః బుద్ధేరాత్మా మహాన్ పరః॥ మహతః పరమవ్యక్త మవ్యక్తాత్పురుషః పరః। పురుషాన్న పరం కించిత్ సాకాష్ఠా సాపరాగతిః॥ (కఠ. ఉ. 3-10.) ఇట స్థూలములగు ఇంద్రియములు మొదలుకొని (ఇంద్రియాలు, అర్థాలు లేక తన్మాత్రలు, మనస్సు, బుద్ధి, ఆత్మ, మహత్, అవ్యక్తం, పురుషుడు) సూక్ష్మ తారతమ్య క్రిము

మున నన్నిటికంటె పరమాత్మయే సూక్ష్మతరుడు, సర్వకారణ కారణము, సర్వ మహత్తరుడు-అని నిర్దేశింపబడినాడు. సర్వమహత్తరుడు సర్వవ్యాపకుడు నగుట చేతనే "పురుషుడు" అనియు నిర్దేశింపబడినాడు. పురుషుడనగా సర్వపూరణ స్వభావము కలవాడు. (పురుషస్సర్వపూరణాత్) "సహస్రశీర్షాపురుషః- పురుష ఏ వేదం సర్వమ్"-అనుచు నిట్టి పురుషు నుద్దేశించి ప్రవృత్తమైనదే పురుషసూక్తము." (భా. ని. 92) ఇంక విసిగించకుండా ఒక్కమాటతో వదిలేస్తాను. "మహాభాగ్యా ద్దేవతాయాః ఏక ఆత్మాబహుధాస్తూయతే" నిరుక్తి 7-1-4. మహాభాగ్య సంపన్న మగుటచే నొక్క ఆరాధ్యదేవత పెక్కుకీర్తుల పెక్కునామములచే స్తుతింపబడుచుండు నని యర్థము" (భా.ని. 111 & 112) కాబట్టి వసురాజు పెళ్ళికి వచ్చిన వాళ్ళల్లో త్రిమూర్తులు లేరు. "జితదర్పకత్వంబు చేర్చె శివుఁడు" 6-48 అన్న శివుడు దిక్పాల మాత్రుడేగాని గిరికావధువుయొక్క మేనత్తమగడుకాడు. ఇంద్రుడే వారి ప్రతి రూపుడు. అంతే.

చక్షురాది ఇంద్రియపరంగానూ సంస్కృతిని నిలుపుకోటంగానూకూడా మనం వివరించుకొన్న వ్యష్టి-సమష్టి సమన్వయం ముఖ్యంగా అందులోని చైతన్యం రామ రాజభూషణుడు రూప-ప్రతిఫలన కల్పనంలో ధ్వనింపజేసాడన్నది స్పష్టం అయింది కదా ! సమష్టిపరం అయిన అద్వైత (సర్వసమత్వ) భావం అదే సమష్టిభావాదర్శం గల వ్యష్టి తనలో అంతర్లీనం కాగల యోగ్యతను గుర్తించిన అనుభవం రాజన్యమౌళి (వసురాజు)-వనిత (గిరిక) ను దర్శించటంలో ప్రతిఫలింపజేసాడు. చూడండి.

వాఙ్మనసగోచరేతరా-ద్వైతరాగ, జలధి నపుడోలిఁదేలి రా-జన్యమౌళి
ఘనతరాశ్చర్య శాలియై-వనితరూప, మనితరాయత్త మగు నాత్మ-నభినుతించె.
(2-69)

ఆ అనుభవం అవాఙ్మానసగోచరం అయిన అద్వైతరాగం ట. అది అపార జలరాశికి ఈడైనది. ఆ సమగ్ర సర్వసమత్వభావాన్ని కేంద్రీకరించి వ్యష్టిని అనితరాయత్తమగు దృష్టిగాంచి మెచ్చినట్లుందిగదా ! ఆ వ్యష్టి (గిరిక) గానంచేసి నప్పుడు "ఒక్క కలస్వనంబు వినవచ్చెన్ మాధురీధుర్యమై" (2-13) దానివల్ల సమష్టి (వసురాజు) మొదట్లో పొందిన "ఆనందబ్రహ్మము" (2-14) కడకు "సంభోగాంత సౌఖ్యంబు బ్రహ్మానందానుభవంబు దెల్పె" (6-95) నట. ఎంతటి పరిణతాద్వైతము !

బాగుంది. అయితే గిరిక వ్యక్తి మొదటిసారిగా వ్యష్టిగా గుర్తింపబడటం కూడా ఇలాంటి ప్రతిఫలన పూర్వకంగానే వర్ణించాడా భూషణకవి? అంటే ఏమీ సందేహించనక్కరలేదు. నర్మసచివుడు గానం ఎక్కడిదో ఎవరిదో కనుక్కురావాలని తడాయ తనవాటిని వెదుకుతూపోయి "శారీశుకాదిఘోష ఘుమఘుమితంబైన కోన"లో "నిరుపమంబైన దివ్యమందిరము" గనినప్పటి కందపద్యం చూడండి:

కనుగొని మణిమందిరమున, మునుకొని కలధౌతభిత్తి-ముకురతల బహి
ర్వనితానుబింబనమ్ములు, వనితారత్నములు మెఱుగు-వల నెఱిగింపన్ (2-24)

మందిరంలోపలఉన్న వనితలను (బహువచనం సమష్టి తత్త్వప్రతిపాదకం) కల ధౌతభిత్తి ముకురతల బహిర్వనితాను బింబనమ్ములుగా ప్రతిఫలించటమేచూసాడు. వెంటనే సచివుడు తన ప్రతిబింబం వారికి కనపడకూడదని ("స్వైరవిహారధీరలగు-సారసలోచనలున్నచోటికిన్, ధీరుననాతివారు చొర-బూనినచో రసభంగమంచు నేఁ, జేరక పువ్వుఁదీవియల-చెంత" 2-55) "తరువుల పొంతఁబొంచి వసు-ధావర మిత్రుఁడు గాంచె వచ్చటన్....ఒక తన్విన్" (2-25). ఆ తన్వి వ్యక్తి గిరికయే. మరి అచ్చటన్ అంటే ఆ ముకురతలంలో "లలితాంగిరూపు కన్నారఁగఁ జూచి వచ్చితి" నన్నది గిరికా రూపప్రతిఫలన బింబమే. దీన్నిబట్టి సచివుడు గుర్తించిన వ్యక్తి తనతోడి వయస్యల గుంపు-సమష్టితత్త్వ-ప్రతిఫలనంలో వ్యష్టి అనటానికి సందేహం ఏముంది? ఆ నెచ్చెలిపిండు కూడా సమష్టి తత్త్వవిహితలె అనటాన్ని నిరూపించటానికే వాళ్ళప్రమేయం ఏమీ లేకపోయినా (తాత్కాలికంగా) వ్యష్టి సమూహంగా గుర్తించటానికే వాళ్ళప్రసక్తి వసురాజుముందు ఎత్తాడు సచివుడు. చూడండి "చిత్తజాకారయాచెల్వ-చెలుల చెల్వ, మలవియె నుతింప వారు వా-మాక్షివలనఁ, గలికి చూపులు నవవద్య-గతులు బొరయఁ, గదిసిన సురాహి రాజన్య-కన్యలొక్కొ" 2-53. ఇంత స్పష్టంగా ఆ వ్యక్తిని సమష్టిలో వ్యష్టిగా ప్రతిఫలింపజేసి రామరాజ భూషణుడు కల్పనావిశేషావహ ధీమంతుడైన సత్కవి అనిపించుకున్నాడు. ఇక్కడ ఒక చిన్న వివరణ: ఆ చెలులు వనదేవతా సమష్టివ్యవస్థలోని వ్యష్టికాగా, గిరిక మానవ సమష్టివ్యవస్థలో వ్యష్టి అని. "సురాహి రాజన్య కన్యలొక్కొ" అంటూ వాళ్ళు మానవ వ్యష్టి మాత్రులు కారని గుర్తించాడామిత్రుడు.

ఇంక గిరిక వ్యక్తి వ్యష్టిగా సమష్టి సహకారానికై తహతహ లాడటాన్ని ఆ వసురాజుకై ఆమె పరితపించటంలో కూడా "రమణానుబింబ భాగ్యములు నోఁచిన

చకచకిత మాణిక్యభిత్తికలు చూచి" (4-3) నట్లు వర్ణించి ప్రతిబింబనరీతి వదలిపెట్ట లేదంటే రామరాజభూషణుడు డీ విషయంలో ఎంత శ్రద్ధవహించాడో, పాఠకుల దృష్టినటు గుంజుతున్నాడో చూడండి. ఇలా కథాక్రమంలో ఉన్న రూప-ప్రతిఫలన వ్యాజంగా వ్యష్టి సమష్టిచేరికలో అద్వైతమూ, అందువల్ల జనించే ఆనందబ్రహ్మ-బ్రహ్మానందమూ రామరాజభూషణుడు వైదిక తత్త్వజ్ఞానపరంగా ధ్వనింపజేసి ధన్యుడయ్యాడు. మననీ ధన్యుల్ని చేసాడు. ఆంధ్రుల మహాభాగ్యం అది. వసుచరిత్ర కృతినందుకొన్న నాటి ఆంధ్రప్రభువు తిరుమల దేవరాయలు మరింత ధన్యుడు. విజయనగరంలో బహమనీ శాత్రవ జంఝూమారుతానికి రెపరెప కొట్టుకుంటున్న ఆంధ్ర సామ్రాజ్యదీపాన్ని పెనుగొండకు తరలించుకుపోయి సమష్టి స్నేహాభివృద్ధిగా మరోతరం జాజ్వల్యమానంగా ప్రకాశింప జెయ్యగలగటంలో రామరాజభూషణుడు తన కృతిలో చేసిన ఈ అద్వైత తత్త్వసంపూర్ణం అయిన ఆశీః ప్రభావంకూడా ఉండిఉంటుంది. ఈ రెండు పద్యాలూ చూడండి.

శా. శ్రీ భూపుత్రి వివాహవేళ నిజమం-జీరాగ్రరత్న స్వలీ
లాభివ్యక్తి వరాంఘ్రిరేణు భవ క-న్యాలీల యంచు న్మదిం
దా భావింప శుభక్రమా కలనచే-దద్రత్నముం గప్పుసీ
తాభామాపతి ప్రోవుతం దిరుమలేం-ద్రి శ్రీమహారాయనిన్.

ఇందులో రూప-ప్రతిఫలనం అందులోని లీలాభివ్యక్తివల్ల కలిగిన భ్రాంతి, శుభ క్రమాకలనవల్ల ఆ భ్రాంతి నివర్తికాగా వివాహకల్పిత సమష్టియోగ్యత స్పష్టంగానే ఉందికదా।

సీ. ఘనఘనాఘన లక్ష్మి-నెనయు కొప్పు రుగడ, నిరుగడఁ దరుణాబ్జ-కృతవసంత
మురుచిత్రకాగ్ని శి-ఖోన్మేష మిరువంక, నిరువంకఁగుండలి-స్ఫురిత కర్ణ
ముకిపోని మిన్కు లీ-నెడుపేరు లిరుదెస, నిరుదెసఁగసుల బం-ధురకరంబు
నెజిమించు చిఱుత వ-న్నియచేల మిరుమేన, నిరుమేనరతిమనో-హరవిభూతి

తే. యమర నన్యోన్యవేష భే-దానహిష్ణు, భావవిభవంబుఁ దెలుపుచుఁ-బరమమైత్రి
మగని స్త్రామేన విలిచిన-యగతనూజ, ప్రథన జయమిచ్చుఁదిరుమల-
రాయమణికి. (1-6)

ఇందులో శివపార్వతుల ఏకీభావంగా అద్వైతంకూడా స్పష్టంగానే ఉంది. భారత దేశంలోని వివాహవ్యవస్థా దంపతుల భర్తృమారిహితైక్యతా పూర్వకాద్వైత తత్త్వం అలా కొనసాగాలని ఆ క్రమంలో అలవడిన అదే తత్త్వం జాతీయ సమైక్యతకూ మన సంస్కృతికీ దోహదం కావాలని అందుకు తగిన స్ఫూర్తి వసుచరిత్ర-ప్రబంధంలోనుంచి పొందగలం అనీ మనవిచేస్తూ ముగిస్తున్నాను.

మ కవితామర్మము లంతుపట్టక కుసం-స్కారాక్షిదోషంబునన్
దృవిణస్థాపిత వర్గభావనఁ బ్రబం-ధవ్రాత మశ్లీల భో
గవికీర్ణవ్రజ మండ్రు గాని వసురాట్-గ్రంథంబు దర్శింప నా
తెవులు న్మాపి యనర్ఘ తేజ మిడు నెం-తే సంస్కృతిప్రాపణన్.

27-6-1985
గురువారం
క్రోధన ఆషాఢ శు. ౧౦.

జొన్నవిత్తుల రామకృష్ణశర్మ
తెలకోవెల : బలుసుమూడి : భీమవరం.



# కొద్దిగా దిద్దుబాట్లు

| పుట | పంక్తి | అక్షర సంఖ్య | పొరపాటు | సద్దుబాటు |
|---|---|---|---|---|
| 3 | 26 | 2 | వ్న | వ్య |
| 7 | 26 | 7 | ధా | రా |
| 9 | 9 | 5 | స్ర్య | గ్ర్య |
| 11 | 1 | 4 | శ్రి | శ్రీ |
| 13 | 2 | 13 | వ | సి |
| 15 | 9 | 11 | స్రో | శ్రో |
| 16 | 5 | 8 | శ్ణ | ర్ణ |
| 16 | 9 | 15 | — | యావలి |
| 26 | చివరి | 5 | ద్ద్మ | గ్ద్మ |
| 35 | 11 | 13 | ర్గో | ల్గో |
| 36 | 20 | 2[illegible] | అ | ఔ |
| 45 | 5 | 20 | — | హ |
| 67 | 19 | చివరి 3,4 లోపలి | — | నెకా |
| 101 | 1 | 4 | త్య | ద్య |
| 105 | 13 | 16 | ధం | ధాలు |
| 125 | 7 | 23 | ర్వ | రస్వ |
| 125 | క్రిందినుండి 3 | 4 | -ః | ర్ణః |
| 153 | 13 | 20 | డు | రు |
| 153 | చివరి | 17-18 | - - | తట్టడం |